రవీంద్రుని

# నాటకాలు

(ప్రథమ సంపుటము)

(విసర్జన, చిత్రాంగద, బ్రహ్మచారి సమితి)


అనువాదకులు :

బెజవాడ గోపాలరెడ్డి

అబ్బూరి రామకృష్ణరావు





సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

RAVINDRUNI NATAKALU (Plays of Rabindranath Tagore) Vol. I. Bisarjan, Chitrangada and Chirakumar Sabha—Translated from Bengali into Telugu—the first two Plays by B. Gopala Reddi and the third by Abburi Ramakrishna Rao, Sahitya Akademi, New Delhi, 1969. Price Rs. 8.


ప్రథమ ముద్రణ : 1969

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
వేంకట్రామ & కంపెనీ
విజయవాడ

Available at :
SAHITYA AKADEMI
New Delhi-1

Regional Office :
CALCUTTA-29

Regional Office :
MADRAS-34

ముద్రణ :
థామ్సన్ & కో. ప్రైవేట్ లి.
(మినర్వా ప్రెస్)
33, బ్రాడ్వే, మద్రాసు-1

వెల : రూ. 8

# రవీంద్ర నాటకాల సంక్షిప్తసమీక్ష

రవీంద్రుడి నాటకాల సంఖ్య తక్కువేమీ కాదు. సంఖ్యాశ్రేణీవైవిధ్యాన్నిబట్టిచూస్తే ఆయనకావ్యాల తర్వాతిస్థానం నాటకాలకే యివ్వాలి. ధారావాహికంగా సాగిన ఆయన నాటకరచనాచరిత్రను గమనిస్తే చిన్ననాటినుంచీ జీవితంలో యించుమించు చివరిరోజు వరకూ నాటకరచనమీదా, ప్రయోగమ్మీదా ఆయన వుత్సాహం మొక్కవోకుండా వున్నట్లు కనిపిస్తుంది. ఆ వుత్సాహం రచనకంటె ముందుగా నిర్వహణమీదా, నటనమీదా అని విదిత మవుతుంది. రవీంద్రుడు నాటకరచన మొదలుపెట్టకముందే తన అగ్రజులలో వొకరైన జ్యోతిరింద్రనాథ ఠాకూరు నాటకాలు రాయటం ఆరంభించారు. ఆ నాటకాల ప్రయోగాలు అప్పుడప్పుడు తమయింట్లోనే జరుగుతూవుండేవి. యింట్లోనేకాకుండా బయట రంగస్థలాలమీదకూడా ఆ నాటకాలను ప్రయోగించటంవల్ల ఆయనకు ఖ్యాతి లభించేది. అంతకుముందుకూడా రవీంద్రుడి పినతండ్రికొడుకులయిన గణేంద్రనాథ, గుణేంద్రనాథ ప్రభృతులు నటకుడైన రామనారాయణచేత నాటకాలు రాయించి యింట్లో చాలా ఆడంబరంగా ప్రదర్శించేవారు. యీవిధంగా నాటకరచన, నాటకప్రయోగాలప్రభావం మధ్య రవీంద్రుడు పెరిగినట్లు కనిపిస్తుంది. సాహిత్యవిషయాలంటే సదా ఆసక్తిగల యిలాంటి యువకుడు నాటకాలవైపుకి మొదట ప్రేక్షకుడుగానూ, తర్వాత నటుడుగానూ, చివరకు రచయితగానూ ఆకర్షితుడై వుంటాడని సులభంగా వూహించుకోవొచ్చు. జరిగింది కూడా అదే. కేవలం ప్రేక్షకుడుగావుండే ఆసక్తి చల్లబడిపోతున్న సమయంలో, జ్యోతిరింద్రనాథుడు రాసిన నాటకాల్లో వొకటి రెండు పాటల్నీ, సంభాషణల్నీ అదనంగా కూర్చటం మొదలుపెట్టాడు. నాటకంలోనే వొకపాత్ర ధరించి ప్రేక్షకుల సమక్షంలో ప్రవేశించాడు. యీ వివరాలు ఆయన ‘జీవనస్మృతి’ అనే గ్రంథంలో లభిస్తాయి. అయితే యీలోగా—అంటే యీ ప్రభావానికి ఫలితంగా ఆయన తొలిసారిగా యెప్పుడు నాటకం రాయటానికి పూనుకున్నదీ తెలుసుకోవాలనే కుతూహలం కలగటం సహజం. ‘జీవనస్మృతి’ గ్రంథాన్నిబట్టి, శాంతినికేతనంలో ఆరుబయట కణకణలాడే యెండలో కూర్చుని బాలకవి తొలిసారిగా ‘పృథ్వీరాజ పరాజయం’ అనే రౌద్రరసప్రధానమయిన నాటకాన్ని రాసినట్లు తెలుస్తుంది. ఆ నాటకం తర్వాత లభ్యం కాలేదు. రవీంద్రజీవితాన్ని రచించిన ప్రభాతకుమార ముఖోపాధ్యాయ, తర్వాతికాలంలో రవీంద్రుడు రాసిన ‘రుద్రచండ్’ నాటకం ‘పృథ్వీరాజపరాజయా’నికి రూపాంతరమేతప్ప వేరొకటి కాదని వూహించారు. లుప్తమైపోయిన యీ రచన వొదిలేస్తే ‘వాల్మీకి ప్రతిభ’ అనే గేయనాటికనే ఆయన ప్రథమ నాటకంగా యెన్నిక చెయ్యాలి. పైన సూచించిన ఆ యింటి వాతావరణంతో ‘వాల్మీకి ప్రతిభ’కు సంబంధం వుంది ‘విద్వజ్జన సమాగమము’ అనే పేరుతో మధ్యమధ్య వారి

పూజామంటపంలో గోష్ఠులూ, సమావేశాలూ జరుగుతూండేవి. ఆ సందర్భాల్లో వినోద కాలక్షేపం విధిగా కల్పించాలిసివుండటంవల్ల చిరకాలం చిత్తాకర్షకంగావుండే గేయనాటికలు రాయాలిసొచ్చింది. యీ నాటికల సృష్టికి ప్రధానశిల్పి రవీంద్రుడే అయినప్పటికీ, వాటిలో జ్యోతిరింద్రనాథ, అక్షయచౌధురీల రచనకూడా కలిసింది. ఆనాటి నాటకాల్లో చాలామటుకు కొంతకాలం గడిచేసరికి శుష్కించి, రసహీనాలై అంతరించిపోయాయి. యిరవైయేళ్ళ యువకుడు రాసిన నాటకాలుమాత్రం యిప్పటికీ వసివాడకుండానే వున్నాయి. వీటిని యెప్పుడు ప్రయోగించినా ప్రేక్షకులకు లోపం వుండదు.

మధుసూదనదత్తు తను మొదట బెంగాలీ కావ్యం రచించినప్పుడొక మిత్రునికి లేఖ రాస్తూ "పెద్దపులి రక్తాన్ని చవిచూసింది. యిహ వెనక్కిపోవటమంటూ వుండదు" అన్నాడు. తన మొదటి నాటకాన్ని కూర్చినప్పటి రవీంద్రుడి మనఃప్రవృత్తికూడా యించు మించు అలాంటిదే. ఆపైన కొద్దిసంవత్సరాలలోనే 'రుద్రచండ్', 'కాలమృగయా', 'ప్రకృతిర్ పరిశోధ్', 'నళినీ', 'మాయార్ ఖేలా' నాటకాలు రాసేశాడు. 'రుద్రచండ్' నాటకంలో నాయకుడు రుద్రచండుడనే దస్యుడు. నాగరక సభ్యత అన్నా, రాజపదవులన్నా ఆతడిలో సహించరాని అశాంతి కనిపిస్తుంది. ఆ నాటకంలో మరోరెండు ప్రధానపాత్రలున్నాయి. రుద్రచండుడి కూతురైన 'అమియా' అనే కన్నెపిల్లా, చాంద్ కవీ. నాటకమంతా మనకు జ్ఞాపకముండకపోయినా నష్టంలేదు. కాని ఆ బాలికనూ, కవినీమాత్రం మరచిపోవటానికి వీల్లేదు. యీ రెండుపాత్రలూ తర్వాత చాలానాటకాల్లో రూపాంతరాలు పొందుతూవొచ్చాయి.

'కాలమృగయా' తర్వాతికాలంలో 'వాల్మీకి ప్రతిభ'తో మిళితమైపోయింది.

'మాయార్ ఖేలా' గేయనాటిక. 'వాల్మీకి ప్రతిభ'లో సన్నివేశ కల్పనలోనూ, పాత్రచిత్రణలోనూ వొకవిధమైన బిగీ, జిగీ వున్నాయి. 'మాయార్ ఖేలా'లో ఆ ప్రయత్నమే మృగ్యం. స్వరవిన్యాసంతో హృదయావేగాన్ని కట్టివేయటమే దీని ప్రధానోద్దేశం.

రచనలో కొంతవరకు అపరిణతమే అయినా 'ప్రకృతిర్ పరిశోధ్' అనే నాటకంలో రవీంద్రుడు తొలిసారిగా తన జీవనతత్వాన్ని వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నించాడు. యీ నాటకంలో కనిపించే బాలిక 'రుద్రచండ్'లోవున్న 'అమియా'కు రూపాంతరమే.

ఇంతవరకొచ్చేసరికి రవీంద్రుడి జీవితంలో నాటకరచనకు సంబంధించిన అభ్యాస దశ ముగిసింది. నాటకీయగమనం, సన్నివేశకల్పనా, పాత్రపోషణా, నాటకవస్తూన్మీలనానికి సంగీతాన్ని సాధనంగా వుపయోగించటమూ, అంతేకాదు, వనదేవతా మాయామోహినుల గమనాగమనాల్లో నృత్యరీతీ—అన్నీ వున్నాయి యీ నాటకాల్లో. తర్వాత వివిధసమయాల్లో రాసిన నాటకాల్లో యీ సమస్తగుణాల వికాసమూ, పరిణతీ కనిపిస్తాయి గనక యీ దశను అభ్యాసదశ అన్నాను.

## ౨

'మాయార్ ఖేలా' రచించిన అనంతరం అతిస్వల్పకాలంలోనే ప్రకటించిన 'రాజా రాణీ', 'విసర్జన', 'చిత్రాంగద'లలో రవీంద్రుడి నాటకలేఖిని హఠాత్తుగా సంపూర్ణ యౌవనశక్తిని పొందింది. 'చిత్రాంగద' సమీక్షమాత్రం వేరొకచోట వివరించటానికలా వుంచి, తక్కిన రెండింటినిగురించీ చెప్పాలిసింది యిక్కడ చెప్పిముగిస్తాను. 'రాజారాణీ', 'విసర్జన' షేక్స్పియరు పద్ధతికి చెందిన అయిదంకాల ట్రాజడీలు. 'విసర్జన' అంతకు ముందే రూపొందిన 'రాజర్షి' నవలలో కొంతభాగానికి నాటకరూపం. చాలామంది 'విసర్జన' నాటకాన్ని రవీంద్రుడి అత్యుత్తమ విషాదాంతనాటకంగా భావిస్తారు. నా అభిప్రాయం వేరు. చిన్నచిన్న టెక్నికల్ లోపాలున్నప్పటికీ మానవసహజమైన ఆర్ద్రభావ పరిపూర్ణతనుబట్టి 'రాజారాణీ' నాటకమే వుత్తమమయినదని నా అభిప్రాయం. తర్వాత చాలాకాలానికి యీ టెక్నికల్ లోపాల్ని సరిదిద్దుకునే వుద్దేశంతో రవీంద్రుడు 'తపతి' అనే నాటకాన్ని రచించాడు. మనకొక కొత్తనాటకం లభ్యమయినమాట నిజమే. కాని, 'రాజారాణీ'లాంటి అత్యుత్తమ నాటకాన్ని పొందగలిగామా అన్నది సందేహమే.

యీసమయంలో రవీంద్రుడు మూడు ప్రహసనాల్ని రచించాడు. వాటిలో 'ప్రజాపతిర్ నిర్బంధ్', 'చిరకుమారసభా' అనే పేరుతో తర్వాతికాలంలో ప్రజాదరణ పొందింది. సాధారణంగా యిదే ఆయన అత్యుత్తమ ప్రహసనమని అంటారు. నాకు మాత్రం వ్యక్తిగతంగా 'వైకుంఠేర్ ఖాతా' అంటే యిష్టం. దీని రసపరిధి సంకీర్ణమైనప్పటికీ గభీరమైనది. దీనిలో పాత్రలసంఖ్య తక్కువే అయినా అన్నీ జీవంతో తొణికిసలాడేటట్లుగా స్పష్టంగా చిత్రించిన పాత్రలు. యిందులో హాస్యం అశ్రువుల్ని వొలికిస్తూ పోయిపోయి చివరిదృశ్యంలో అపురూపమైన ప్రహసనాన్ని సృష్టిస్తుంది. దాంతో కన్నీరూ, నవ్వూ వొకదానితో వొకటి కలిసిపోతాయి. బహుజనాదరాన్ని పొందటానికి నోచుకోని యీ ప్రహసనం రవీంద్రుడి ప్రతిభకు నిర్దుష్టమైన నిదర్శనం.

యీ కాలంలోనే రవీంద్రుడు మరోశ్రేణికి చెందిన నాటకాలు రచించాడు. వాటిని పద్యనాటకాలనవొచ్చు. యీ రచనల్లో కవిలేఖిని నాటకకర్త లేఖినితో మిశ్రితమైపోయింది. అయితే వాటి వైశిష్ట్యం యేమిటంటే—కవి తన బాధ్యతను సంపూర్ణంగా నిర్వహించినా నాటకకర్తగావున్న బాధ్యతను తేలికపరచుకోవటం జరిగింది. వీటిని చాలామంది పద్య నాటకాలంటారు. వారి అభిప్రాయంప్రకారం వీటికి సరియైన స్థానం పద్యకావ్యశ్రేణిలో. కాని యిది సముచితంగా కన్పించదు. వీటిలో కావ్యగుణాలెంత అధికంగావున్నా వీటి భావభంగి నాటకీయమే. యీ రచనలన్నింటిలో నాటకీయపరిణామం యేమీ లోపించలేదు. 'గాంధారి ఆవేదన', 'కర్ణకుంతీ సంవాదం', 'నరకవాసం', 'బిదాయ్ అభిశాప్' మొదలైన రచనల్ని, అలిఖితాలైన అయిదంకాల ట్రాజడీలలో చివరి అంకంగా భావించి చూడటానికి ప్రయత్నిస్తే వాటి యథార్థస్వరూపమూ, రసపుష్టి స్పష్టంగా బోధపడతాయి.

'సతి', 'మాలిని' నాటకాల్లో నాటకస్వరూపం ఆశించినదానికంటె యెక్కువ వ్యక్తమయినా వీటిలో వున్నది ప్రధానంగా కావ్యగుణమే.

'లక్ష్మీర్ పరీక్ష' అనే నాటకం వొక సార్థకమైన పరీక్ష. 'క్షణికా' కావ్యంలో వ్యావహారిక భాషద్వారా కవి సాధించదలచినదేదో సమర్థంగా సాధించగలిగారీ నాటకంలో.

## 3

యీసమయంలో రవీంద్రుడి ఆధ్యాత్మజీవితంలో వొకగొప్ప పరివర్తన ప్రారంభమయింది. ఆ ఛాయ సహజంగా ఆయన నానావిధ రచనలమీదా, నాటకాలమీదాకూడా పడ్డది. మానవజీవితంలో యతుక్రమప్రభావమూ, దానికి ప్రతిక్రియగా కలిగిన పరిణామమూ యీసారి ఆయన నాటకాల కుపకరణాలయిపోయాయి. 'శారదోత్సవ్', 'రాజా', 'అచలాయతన్', 'ఫాల్గుని' మొదలైన నాటకాలు జన్మించాయి. వొకప్పుడు తమయింట్లో వుత్సవాదుల ప్రోద్బలంవల్ల యెలా నాటకాలు రాయాలిసొచ్చిందో, యిప్పుడూ అలాటి ప్రోద్బలమే శాంతినికేతనంనుంచి ఆవిర్భవించింది. అందువల్లనే ఆ సమయంలో రాసిన నాటకాలు—'శారదోత్సవ్', 'అచలాయతన్', 'ఫాల్గుని' మొదలైనవి స్త్రీపాత్ర వర్జితాలు. ఆరోజులలో శాంతినికేతనంలో స్త్రీలను రంగస్థలమ్మీదికి రానిచ్చేవారు కారు. పైగా దేశంలో వాతావరణం కూడా స్త్రీపురుషులు కలిసి నటించటానికి అనుకూలంగా లేదు. ఇవికాక యీసమయంలో 'ప్రాయశ్చిత్త', 'డాక్ఘర్' నాటకాలుకూడా రచించారు.

'ప్రాయశ్చిత్త' నాటకం అంతకుముందు రాసిన 'బౌఠాకూరానీర్ హాట్' అనే నవలకు నాటకరూపం. దీంట్లో అతిప్రధానమైనది ధనంజయ బైరాగిపాత్ర. అది అహింసావాణితో సాక్షాత్కరించింది. గాంధీజీ ఆవిర్భావానికిపూర్వమే అవతరించిన ధనంజయ బైరాగి వేకువకు ముందుగానే లేచిన వేకువపిట్ట.

'డాక్ఘర్' రవీంద్రుడి రచనలన్నిటిలో సర్వాంగసుందరమైన గద్యనాటకం. చాలావరకు విచిత్ర కల్పనాకథలరీతిలో సాగిందీ రచన. దీన్ని మరోచోట సమగ్రంగా సమీక్షిస్తాను.

'రాజా' నాటకాన్ని సింబాలిక్ నాటకమని చెప్పాలి. 'రాజా', 'అచలాయతన్' నాటకాల్లో, భారతీయసాధనల్లో ప్రధానమైన రెండు సంప్రదాయాల్ని స్వీకరించటం జరిగింది. దాస్య, సఖ్య, మధురరససాధనల్లో—మధురరససాధన యెంత కఠినమైనదీ, 'సురంగమ', 'ఠాకూర్దా', 'సుదర్శన' పాత్రల్లో—ముఖ్యంగా 'సుదర్శన' మానసిక సంఘర్షణలో కనిపిస్తుంది. 'అచలాయతన్'లో జ్ఞాన, కర్మ, భక్తిమార్గాలస్వరూపం ప్రదర్శితమైంది. యీ మూడుమార్గాల సమన్వయమే జీవితపు యథార్థసిద్ధిగా నిరూపితమైంది. విశ్వప్రకృతిలో సాగుతూవున్న లీల, మానవప్రకృతిలోకూడా సాగుతూవున్నదని ఫాల్గుని నాటకంలో ద్యోతక మవుతుంది. వసంతమూ, యౌవనమూ—యివి సత్యాలు; శీతువూ,

వార్ధక్యమూ—యివి కేవలం భ్రమలు. 'శారదోత్సవ్'లో చెప్పదలిచిందేమిటంటే యీ జగత్తు అనంతసౌందర్యాన్నీ, అమృతాన్నీ కుమ్మరించి మానవుణ్ణి రుణగ్రస్తుణ్ణిగా చేసుకుంటుంది. మానవుడు దుఃఖంద్వారా ఆ అప్పు తీర్చుకోగలుగుతాడు. దుఃఖధనంతో సౌందర్యరుణాన్ని తీర్చుకోగలిగినపుడే ఆనందలాభం సాధ్య మవుతుంది.

వీటితర్వాత రవీంద్రుడి నాటకాల్లో చెప్పుకోదగినవి 'ముక్తధార', 'రక్తకరబి.' 'శారదోత్సవ' నాటకందగ్గిర్నుంచి 'ఫాల్గుని' నాటకంవరకూ, మానవుడికీ భగవంతుడికీ, మానవుడికీ ప్రకృతికీగల సంబంధం, కథావస్తువు. 'ముక్తధార', 'రక్తకరబి'లో కని పించే మానవుడు సామాజిక మానవుడు. యిక్కడ వ్యక్తికీ, సామాజిక వ్యవస్థకీ మధ్య సంఘర్షణ. అభిజిత్, రంజన్—వీరు వ్యక్తికి ప్రతినిధులు. వారికి క్రమంగా నిరోధింపబడ్డ ప్రవాహంతోనూ, యంత్రదానవుడితోనూ సంఘర్షణ యేర్పడింది. యిక్కడ కవి చెప్ప దలిచిందేమిటంటే యంత్రంతోనే యంత్రాన్ని పరాభూతంచేస్తే యంత్రానికే విజయాన్ని చాటించినట్లవుతుంది. యంత్రాన్ని ప్రాణంతో ఆఘాతపరిస్తే దానివల్ల ముందుగా ప్రాణానికి నష్టం సంభవించినా చివరికి యంత్రశక్తి శిథిలమైపోతుంది—అని. అభిజిత్ మరణించాడు. కాని, ముక్తధార అనకట్టకూడా భగ్నమయింది. రంజన్ మరణించాడు. అయితే యంత్ర పురి గోడకూడా కూలిపోయింది. రెండు నాటకాల్లోనూ జటిలమైన వొక ఆధునిక సమస్య పరిష్కృతమైంది.

## ४

'నటీర్‌పూజ' నాటకం 1926 సంవత్సరంలో ప్రకటితమైంది. అది వొక బౌద్ధ జాతకంనించి గ్రహించిన కథ. నాటకశిల్పం అత్యున్నతస్థాయిలో వున్నదికాని అంతకంటె వేరొక వైశిష్ట్యంకూడా కనిపిస్తుంది నాటకంలో. ఆతర్వాత రాసిన నృత్యనాటికల్లో కని పించే నిర్దుష్టభావాలు బీజరూపంగా యిందులో వున్నాయని నా విశ్వాసం. ఆయన జావాలో పర్యటిస్తున్నపుడు అక్కడ చూసిన నృత్యనాటక కళలో యీ భావాలకు అనుకూల క్షేత్రమూ, తగిన దృష్టాంతాలూ లభించటంవల్ల అవి స్థిరపడ్డాయి. రవీంద్రుడికి నృత్య నాటికల్నిగురించిన భావనలెన్నో వున్నాయి మనస్సులో. కాని, లేనివేవంటే నృత్యనాటిక కళను నిరూపించే దృష్టాంతాలు. జావాద్వీపం వీటిని అందించింది. రవీంద్రుడి తుదిజీవి తంలో సఫలత్వాన్ని పొందిన నాటకరచనాశక్తి అంతా నృత్యనాటిక రచనలోనే వినియోగ మయింది. 'చిత్రాంగద', 'చండాలిక', 'శ్యామా', 'తాషేర్‌దేశ్'—యీ నృత్యనాటి కలు రవీంద్రుడి సర్వతోముఖప్రతిభకు సమగ్రమైన దృష్టాంతాలు. నాటకప్రతిభ అన్నంత మాత్రాన యీ నూతన శిల్పకళలో వున్న సర్వాంగీణరూపం వ్యక్తం కాలేదు. యెందుకంటే యిందులో కావ్యమూ, సంగీతమూ, నాట్యమూ, నృత్యమూ చతురంగప్రవాహంగా మిశ్రిత మైనాయి. రవీంద్రుడి శిల్పకళా, బహుముఖమయిన ప్రతిభా, వీటి పరిపూర్ణప్రకాశమే యీ నృత్యనాటికల్లో మిళితమైనాయి అంటే అతిశయోక్తి కాబోదు.



వీలైనంత సంక్షిప్తంగా రవీంద్ర నాటకప్రవాహాన్ని సమీక్షించటమైంది. యీసారి ఫలశ్రుతికి సంబంధించిన ప్రాసంగికవిషయాల్నికూడా సంక్షిప్తంగా చెప్పి ముగిస్తాను.

రవీంద్రుడి నాటకాలప్పుడప్పుడు వ్యాపారరంగస్థలాలమీద ప్రదర్శిస్తూవొచ్చారు. 'చిరకుమారసభ', 'శేషరక్ష' లాంటి కొన్ని నాటకాలు తాత్కాలికంగామాత్రమే ప్రేక్షకుల ఆదరానికి పాత్రమయినాయి. అయినా వ్యాపారరంగస్థలాల నాటకప్రయోగపద్ధతికీ, రవీంద్ర నాటకాలకూ యెన్నడూ పొత్తు కలియలేదనే చెప్పాలి. యెందుకని? బహుశా ప్రేక్షకులు అలవాటుపడలేదేమో? అదీగాక వ్యాపారరంగస్థలాలమీద ప్రసిద్ధికెక్కిన నాటకాలన్నీ వృత్తిగా నటించే నటీనటుల్ని ఆశ్రయించివుండటంవల్ల ప్రసిద్ధికెక్కినవే. వాటిల్లోది వొకవిధమైన సామూహికశిల్పం. రవీంద్రుడి నాటకాలు యేకాంతంలో ఆవిర్భవించాయి. కాదా అంటే వారి కుటుంబవాతావరణంలో. యివి ఆయన తన వొక్కడి ప్రయత్నంవల్ల సృష్టించి ప్రయోగించినవి. అంచాత వీటిలోవున్న సహజసంపద ప్రధానంగా కావ్యసౌందర్యం.

నాటకంలోవున్న సాహిత్యమూల్యాన్ని అప్రధానంగా భావించే విమర్శకులెందరో వున్నారు. వాళ్ళ అభిప్రాయంలో కేవలం ప్రేక్షకుల్ని రంజింపచేయటమే నాటకాల యేకైకప్రయోజనం. యీ అభిప్రాయాన్ని ఆమోదించటానికి వీల్లేదు. నాటకం ముఖ్యంగా సాహిత్యం. దాన్ని ఆ దృష్టితో సమీక్షించటమే వుచితం.

ఆ దృష్టితోగనక చూస్తే రవీంద్రుడి నాటకాలు అమూల్యరత్నాలు. రవీంద్రుడికి పూర్వంకూడా గేయనాటకాలు లేకపోలేదు. అయినప్పటికీ ఆయన ప్రథమదశలో రాసిన 'వాల్మీకి ప్రతిభ', 'మాయార్ఖేలా' యిప్పటికీ ప్రేక్షకుల ఆదరాన్ని పొందుతూనే వున్నాయి. వినోదాన్ని కల్పించటంలోకూడా వాటి విలవ యేమాత్రమూ తగ్గలేదు.

'రాజా ఓ రాణీ', 'విసర్జన్' వంగసాహిత్యంలో అగ్రశ్రేణికి చెందిన ట్రాజెడీలు. వంగసాహిత్యంలో వున్న ప్రహసనాల సంఖ్యకూడా అంత తక్కువకాదు. కాని, 'చిరకుమారసభ' లాంటి నిష్కలంకమైన, సర్వజనోపభోగ్యమయిన ప్రహసనం మరోటి లేదు. దీని ఆకర్షణ యెంత విస్తృతమైనదో అంత సహజమయినది.

రవీంద్రుడి కావ్యనాటకాలు: చిత్రాంగద, గాంధారీర్ ఆవేదన్, కర్ణకుంతీసంవాద్, నరకవాస్ మొదలయినవి రవీంద్రసాహిత్య మిచ్చిన అమూల్యసంపద. యీ క్షేత్రంలో ఆయన కాయనే సాటి.

'శారదోత్సవ్', 'ఫాల్గుని' మొదలైన ఋతునాటకక్రమంలో 'డాక్‌ఘర్', 'రక్తకరబి' మొదలయినవాటిలో సింబాలిక్ పద్ధతిలో ఆయన వొక నూతన సంప్రదాయ

ప్రవర్తకుడైనాడు. కేవలం వంగసాహిత్యంలోనేకాదు బహుశా భారతీయ సాహిత్యమంతటి లోనూకూడా.

తుదివయస్సులో ఆయన రాసిన నృత్యనాటికలు ఆయన మౌలికసృష్టి. వీటిల్లో కూడా ఆయన వొక నవ్యమార్గాన్ని ప్రదర్శించాడు.

కావ్యాల్ని, కథానికల్ని వొదిలేస్తే రవీంద్రుడి ప్రతిభ నాటకాల్లో వెలిసిన కావ్యత్వంలో రవీంద్రుడి ప్రతిభ సంపూర్ణంగా వ్యక్తమవుతుంది. ఆ ప్రతిభయొక్క బహుముఖత్వం, నాటకాల శ్రేణీవైవిధ్యంలోనూ, నవ్యసంప్రదాయప్రవర్తకత్వంలోనూ స్పష్టమవుతుంది.

—శ్రీ ప్రమథనాథ బిశి

# విసర్జన—1890

రవీంద్రుడి 'రాజర్షి' నవల (1887) లో మొదటిభాగం ఆధారంగా 'విసర్జన్' నాటకం రూపొందింది. 'రాజర్షి' నవల కాధారమైన భావం స్వప్నానుభవంద్వారా లభించింది. రవీంద్రుడొకనాడు రైలుప్రయాణం చేస్తూండగా కల గన్నాడు. ఆ కలలో రక్త ప్రవాహాన్ని చూసి వొక బాలిక 'యింత రక్తమెందుకు?' 'యెందుకింత రక్తం?' అని ప్రశ్నించినట్లు కనిపించింది. ఆ ప్రశ్నను త్రిపురా రాజవంశపుకథతో జోడించటంతో 'రాజర్షి' నవల తయారయింది. తర్వాత ఠాకూరు భవనంలో వున్న యువకుల ప్రోద్బలం వల్ల ఆ నవలలో కొంతభాగం ఆధారంగా 'విసర్జన్' నాటకాన్ని రూపొందించటం జరిగింది. పదేపదే ప్రదర్శనలిచ్చే అవకాశం లభించటంతో నాటకంలో యెన్నో చిన్నచిన్నమార్పులు జరిగినమాట నిజమే. కాని, తన యితర నాటకాలమాదిరిగా యిదిమాత్రం పూర్తిగా రూపాంతరం పొందలేదు. సరిగ్గా అంతకు వొక సంవత్సరంక్రితం రాసిన నాటకం 'రాజా రాణి' వొక్క సంవత్సరంలో ఆ నాటకరచనాపద్ధతిలోనూ, నాటకీయనియమాలు పాటించటంలోనూ యెన్నోమార్పులూ, కూర్పులూ చేరాయి. యీ మార్పులవల్ల 'రాజారాణి' రచనలో సంక్రమించిన శైథిల్యంకాని, హక్కుల ప్రాబల్యంకాని 'విసర్జన్' లో అంతగా కనిపించవు. ప్రధాన స్త్రీపురుష పాత్రలపోషణకూడా సముచితస్థాయిలో వుంది. సన్నివేశాలన్నీ అప్రతిహతమైనగతితో నాటకనియమాల్ని పాటిస్తూ సాగిపోవటంవల్ల నాటకం అత్యున్నతస్థాయి నందుకుంటుంది. చాలామంది యీ నాటకాన్ని బెంగాలీ ట్రాజడీల కోవకు చెందినవాటిల్లో వుత్తమోత్తమదృష్టాంతంగా భావిస్తారంటే అది అర్థరహితం కాదు. రవీంద్రుడీ నాటకంలో గూఢార్థాన్ని వివరిస్తూ దీని మూలవస్తువు, ప్రేమపరాక్రమాలకు సంబంధించినదని పేర్కొన్నాడు. దేవతామందిరంలో బలియిచ్చిన పశువు రక్తపుమడుగును చూసి 'యింత రక్తమెందుకు?' అని ప్రశ్నిస్తుందొక బాలిక. యీ ప్రశ్న మహారాజైన గోవిందమాణిక్యుడి అంతర్దృష్టిని కప్పివున్న తెరను తొలగించేస్తుంది. రాజు హృదయంలో విశ్వజనీనమైన ప్రేమ ఆవిర్భవిస్తుంది. ఆయన ఆదేశంప్రకారం దేవతామందిరంలో పశుబలి నిషిద్ధ మవుతుంది. యీ సంఘటన ఆధారంగా నాటకం ట్రాజడీగా రూపొందింది. దేవమందిరానికి పురోహితుడైన రఘుపతి ప్రచండమైన వ్యక్తిత్వం కలవాడు. దేవతా ప్రతాపాన్ని తనదిగా చేసుకుని మహారాజుకి ప్రతిపక్షిగా నిలిచాడు. రాణి, మంత్రి, రాజభ్రాత, రాజ్యప్రజ, అందరూ పురోహితుణ్ణే బలపరిచారని వేరే చెప్పనక్కర్లేదు. వారి హృదయాల్లో ప్రేమ అంకురించలేదు. ప్రేమప్రతాపాల సంఘర్షణతో విభ్రాంతచిత్తుడైన గోవిందమాణిక్యుడి హృదయం విదీర్ణమై దీర్ఘనిశ్వాసంతో శోషిల్లింది. చివరికి రఘుపతి అహంకారం సడలిపోయి అతడి హృదయంలో ప్రేమ వుదయిస్తుంది. కాని, అందుకోసం మందిరసేవకుడు, రఘుపతి పెంపుడుకొడుకూ అయిన జయసింహుడు ప్రాణాల్ని విసర్జిం

చాలిసొస్తుంది. యీ విసర్జన ఫలితంగా పెనుతుఫాను వెలిసిపోయి మహారాజు, రాణీ, రఘుపతి, అపర్ణ— యీ భిక్షుకునే జయసింహుడు ప్రేమించాడు—వీళ్ళందరి హృదయాలూ నిర్మలవాతావరణంలో మిళితమైపోతాయి. నరరక్తపిపాసి అయిన దేవుడి పాషాణ ప్రతిమను రఘుపతి స్వహస్తాలతో త్రోసిపుచ్చి ఆ స్థానంలో ప్రేమను ప్రతిష్ఠిస్తాడు. నాటకంలో ప్రధానమైన పాత్రలు రెండు. రాణీ, రఘుపతులకు వ్యక్తిగత వేదనాఘాతాల మూలంగా యింత రక్తమెందుకు? అన్న ప్రశ్నకు తమతమ అంతరాల్లోనించే సమాధానం లభిస్తుంది.

## చిత్రాంగద—1892

మహాభారతంలో మణిపుర రాజపుత్రిక అయిన చిత్రాంగదా అర్జునుల కథ యీ నాటకంలో అతిసంక్షిప్తంగా సాధారణమైన ధోరణిలో నిబద్ధమైంది. మూలకథ అనే అస్థిపంజరం, రవీంద్రుడి లేఖినియొక్క యింద్రజాలంవల్ల అపూర్వలావణ్యాన్నీ, అమరత్వాన్నీ సిద్ధింపచేసుకున్నది. రెండింటినీ కలిపి చదివితే రవీంద్రుడి సృజనశక్తి పాఠకుల్ని విస్మయంలో ముంచేస్తుంది.

'చిత్రాంగద' నాటకంగా రూపొందినా వస్తుతః అది కావ్యమే. నాటకంలో ఆశించే కథాగమనపద్ధతీ, సంఘటనల పరంపరలో వేగమూ, లక్ష్యాభిముఖ్యమూ మొదలయినవి చిత్రాంగదలో కనిపించవు. అంచాత నాటకాన్నిగురించి అదివరకున్న భావాన్ని త్యజించి కావ్యరూపంగా భావించిచూస్తే దీని అసాధారణత త్వరగా బోధపడుతుంది. తరుణవయస్కుడయిన యీ కవి ప్రతిభవల్ల యింద్రియగ్రాహ్యమైన జగత్తు రూపరసవర్ణాలతో సుందరంగా, సత్యంగా పరిపుష్టమైపోయింది. పాఠకుడి కక్కడ యెంతో నెమ్మది నెమ్మదిగా ముందుకు సాగాలినొస్తుంది. లేదా యెక్కడ నీలసరోవరంలో జారిపడతామో—గట్టిగా చూస్తే వోవేళ చిత్రాంగద అర్జునుల ప్రేమకలాపదృశ్యం యెక్కడ కంటబడుతుందో ననిపిస్తుంది. యింద్రియగ్రాహ్యమైన జగత్తుకి యింతటి సముజ్వల వాస్తవప్రతిరూపం— వొక్క కాళిదాసు కావ్యాల్లోతప్ప—మరియేయితర భారతీయ కావ్యాల్లోనూ చిత్రితం కాలేదు. అయితే యీ కావ్యమంతటినీ సంపన్నం చేసినవి చిత్రాంగద పాత్ర—అంటే పాత్రలో కలిగిన పరివర్తనా, పరిణతీ చివరిదృశ్యంలో అర్జునుడికి ఆత్మపరిచయాన్ని కలిగించటం వుపలక్ష్యంగా ఆమె యిలా సగర్వంగా చెప్పుకుంటుంది.

ఈ వాణీ పౌరాణికయువతీ వాణికాదు. అచ్చమైన ఆధునిక యువతీవాణి. తర్వాతి రవీంద్ర సాహిత్యమంతటా యీ ఆధునికస్త్రీ కంఠస్వరమే వినిపిస్తూంటుంది. తొలిసారిగా చిత్రాంగదలో అది వ్యక్తమయిందన్న మాటలో సందేహం లేదు. యీ కారణంవల్ల కావ్య జగత్తుకు వెలుపల సామాజికేతిహాసక్షేత్రంలోకూడా దీనికొక విశిష్టమైన స్థానం వుంది. యీ కావ్యం 'చిత్ర' అనే పేరుతో ఆంగ్లభాషలోకి అనువదింపబడి పాఠకుల ఆదరాన్ని

పొందగలిగింది. బహుశా విదేశీపాఠకులు భారతీయ కవి రచనలో పౌరాణిక ప్రతిరూపాన్ని చూడబోయి ఆధునికరూపాన్ని చూడటంవల్ల విస్మితులై వుంటారు.

## చిరకుమారసభ—1900—1901

ఈ గ్రంథం 'చిరకుమారసభ' అనీ, 'ప్రజాపతిర్ నిర్బంధ్' అనీ మొదటి నుంచీ రెండుపేర్లతో వ్యవహరింపబడుతూవొచ్చింది. యీ ప్రహసనం మొదట్లో యెక్కువ సంభాషణలతో నవలరూపంతో వెలువడింది. తర్వాత 1925 సంవత్సరంలో వ్యాపార రంగస్థల నటులప్రోద్బలంవల్ల రవీంద్రుడు దీనికి సంపూర్ణమైన నాటకరూపాన్ని సమకూర్చగా, రంగస్థల ప్రదర్శనలద్వారా యిది ప్రేక్షకుల ఆదరాన్ని అమితంగా చూరగొన్నది. రవీంద్రుడి నాటకాల్లో వ్యాపారరంగస్థలమ్మీద జయప్రదంగా మొట్టమొదట ప్రదర్శించినది యీ నాటకమే అని చెప్పాలి. తర్వాత యీ నాటకం నిర్విరామంగా యెన్నో చోట్ల ప్రయోగించటం జరిగింది. యెప్పుడెక్కడ ప్రదర్శించినా దీనికి ప్రేక్షకులకొరత అంటూ వుండలేదు. అవకాశం దొరికినపుడల్లా దీన్ని విలాసనాటకసమాజాలిప్పటికీ ప్రదర్శిస్తూనే వున్నాయి.

యీ నాటకమింతగా ప్రజాదరాన్ని పొందటానికి కారణమేమిటి? దీంట్లో ప్రధానమైన సంఘటన సహజమై చిత్తాకర్షకమైన భావాలతో నిండివుండటమే. లేనిపోని ఆదర్శాల్ని పట్టుకుని ప్రాణులాడే కొందరు యువకులు దేశాన్నీ, సంఘాన్నీ వున్నతస్థితికి తీసుకుపోవాలనే సంకల్పంతో ఆజన్మబ్రహ్మచారులుగా వుండిపోవటానికి నిర్ణయించుకుంటారు. ఆ బ్రహ్మచారిసమాజంలో వొకప్పుడు సభ్యుడుగావుండి ప్రస్తుతం వివాహితుడైన వొకవ్యక్తి, అవివాహితలైన తన యిద్దరి మరదళ్లకీ పెళ్ళిసంబంధాలు చూడాలిసిన వొత్తిడితో నలిగిపోయి, బ్రహ్మచారులైన యువకులిద్దరికి చాటుమాటుగా నియమభంగాన్ని కలిగించటానికి ప్రయత్నిస్తాడు. ప్రేక్షకులకీ అపూర్వసంఘటన యెంత సహజసుందరమో, అంత సార్వజనీనకమైనదికూడాను.

చిరకుమార సమాజానికి సభాపతి అయిన వృద్ధ చంద్రమాధవబాబూ, ఆ సమాజంలో అంతకుపూర్వమే సభ్యుడుగా వుండిన అక్షయబాబూ, అతడి మామగారికి దూరపుజ్ఞాతి అయిన రసికదాదా మొదలైన పాత్రలపోషణ ప్రత్యేకంగా యెన్నతగ్గది. యింకోవిషయం యిందులోవున్న నిశితమైన ఉక్తిప్రత్యుక్తి చాతుర్యం. మరోవిశేష మేమిటంటే హాస్యరసాన్నీ, శ్లేషచమత్కారాన్నీ అడుగడుగునా కుమ్మరించటం. యివిగాక నాటకంలో అక్కడక్కడ వుపయోగించిన రవీంద్రసంగీతపు యింద్రజాల మహిమ చెప్పుకోతగ్గది.

వంగసాహిత్యంలో ప్రహసనాలకి కొదవలేదు. అన్నివైపులనించీ ఆలోచించి చూస్తే వాటిలో చిరకుమారసభకే ప్రథమస్థానమివ్వాలి. నీరసమైన రచనా, శోభావిహీనమయిన సంఘటనలూ, అనౌచిత్యంతో నిండిన సంభాషణలూ, అశ్లీలమూ మొదలైనవి

సాధారణంగా ప్రహసనాల్లో కనిపించే సహజదోషాలు. చిరకుమారసభలో యిలాంటి దోషాలేవీ లేవు. దాని విశిష్టత యితర ప్రహసనాల్లో వేటిలోనూ లేనంత అపూర్వమైనది. పైగా యెటువంటి లఘుసన్నివేశాల్లోకూడా రవీంద్ర జీవితతత్వం మిళితమై వుంటుంది. ప్రకృతి—అంటే యీ ప్రహసనానికి సంబంధించిన మానవప్రకృతి తన ఋణాన్ని తీర్చుకోకుండా అలాగే వుంచి సాధనచెయ్యబోతే, ఆ ప్రకృత్యధిష్ఠానదేవత యింద్రుడిలాగా ఊర్వశి మొదలైనవాళ్ళను పంపి ధ్యానభంగం చేయిస్తాడు. 'ప్రకృతిర్ పరిశోధ్' నాటకంలో గంభీరంగా వివరించిన యీ తత్వాన్నే యిక్కడ తేలికమాటల్లో వివరించటం జరిగింది. వస్తుతః రెండుతత్వాలూ వొకటే.

—శ్రీ ప్రమథనాథ బిశి

# ప్రథమాంకము

## ప్ర థ మ దృ శ్య ము

### మ ం ది ర ము

గుణవతి : తల్లిపిల్ల ఎట్టిదోష మొనర్చితిని! పొట్టకూటికై బిడ్డల నమ్ముకొను పేద రాలికి బిడ్డల నొసగుచున్నావు. లోకులవలని లజ్జచే బిడ్డలచంపు పాపిష్ఠురాండ్ర గర్భము లకు పాపమెరుగని పసికూనల పంపుచున్నావు.

నేను ఇచ్చో పసిడిమంచములపై అలరారుచున్న మహారాణిని. నూర్లకొలది దాస దాసీజనములకు, మహాసైన్యములకు, అనురక్తులైన ప్రజలకు కొరత లేదు.

కేవలము ఒక శిశుస్పర్శలాలసచే దహించుకొనిపోవుచున్న వక్షముతో, నా ప్రాణములోపల, మరొక ప్రాణాధిక ప్రాణమును అనుభవించవలెననెడి కోర్కెతో ఉవ్విళ్లూరుచున్నాను. ఒక చిన్న ప్రాణముకొరకు ఈ నావక్షమును, నా బాహుద్వయ మును, నా అంకమును, నా దృక్కుల వినియోగించి, ప్రేమతో కళకళలాడు చక్కని, ముద్దులగూటిని నిర్మింప కుతూహలము ఒదవుచున్నది.

తొలివెలుతురునందు రెండు క్రొత్తకన్నులు నన్ను వీక్షించగలవు; నా అంకమున మాటలురాని చిన్నారిముఖమున అకారణ ఆనందముతో తొలినవ్వులు పూయగలవు.

బిడ్డలతల్లివగు మాతా! ఏపాపముచే మాతృస్వర్గమునుండి నన్ను దూరపరచు చున్నావు?

రఘుపతి ప్రవేశము

ప్రభూ! ఐదుసంవత్సరములుగ తల్లిపూజ నియమముగ చేయుచున్నాను. తెలిసి, ఎట్టి తప్పిదమును చేసిఎరుగను. మహాదేవుని సముద్రైన నా భర్త పుణ్యమూర్తి. అయి నను, ఏపాపమును చూచి, మహామాయయగు దుర్గ నిస్సంతాననను శ్మశానమున నను త్రిప్పుచు వేపరించుచున్నదో తెలియకున్నది!

రఘుపతి: తల్లి లీలలు ఎవరు తెలిసికొనగలరు? ఆమె పర్వతరాజుతనయ. ఆమె యిష్టమే యిష్టము. సుఖదుఃఖములు ఆమె యిచ్ఛాప్రేరితములే. ధైర్యము పూనుము. ఈతూరి తల్లిపూజ నీ పేర కాగలదు. శ్యామ ప్రసన్నురాలు కాగలదు.

గుణవతి : ఈఏడు పూజకు బలిపశువుల నేను స్వయముగ సమర్పించెదను. తల్లి సంతానము నిచ్చిన, సంవత్సరము సంవత్సరము వంద దున్నలను, మూడువందల మేకపిల్లలను బలియిచ్చెదనని ప్రమాణపూర్తిగ మ్రొక్కుకొనుచున్నాను.

రఘుపతి : పూజాసమయము కావచ్చెను.

[ఇద్దరును వెడలుదురు]

గోవింద మాణిక్య, అపర్ణ, జయసింహుల ప్రవేశము

జయసింహ : మహారాజా, ఏమి ఆదేశము ?

గోవిందమాణిక్య : ఈ దరిద్రబాలికయొక్క ప్రేమంపుబొమ్మయగు చిన్నమేకపిల్లను బలియిచ్చుటకై తల్లివద్దకు బలాత్కారమున నీవు తెచ్చితివట ! ప్రసన్నయై దక్షిణహస్తముతో ఈ దానమును జనని గైకొనునా ?

జయసింహ : దేవపూజకొరకై పశువులను మన అనుచరులు ఎచ్చటెచ్చటనుండియో సేకరించుచుందురు.

ఏమి అమ్మాయీ, ఏల నీవు ఏడ్చుచున్నావు ? విశ్వమాత స్వయముగ దేనిని గైకొనెనో, దానికై ఏడ్చుట ఉచితమా ?

అపర్ణ : ఎవరు నీ విశ్వమాత ? ఆమె ఎవరో నా బిడ్డకు తెలియదు. తల్లిని పోగొట్టుకున్న బిడ్డ, తన్ను కబళించురాక్షసిని తెలిసికొనజాలదు. నేను అలసించివచ్చిన అది గడ్డిపరకల తినదు. అరచుచు అరచుచు నా త్రోవవైపు ఎదురుచూచుచుండును. దానిని చంకనిడి, మాధవా కవళమును అడుగుకొని, పంచుకొని తినుచున్నాము. నేను దాని తల్లిని.

జయసింహ : మహారాజా, నా పంచప్రాణము లొసగి దానిని బ్రతికించగలిగినను బ్రతికించి తెచ్చియిచ్చెడివాడను. కాని తల్లి దానిని స్వీకరించినది. తిరిగి దానిని ఎటుల తెచ్చియివ్వగలను ?

అపర్ణ : తల్లి దానిని స్వీకరించినదా ? కల్ల, కల్ల. పిశాచి దానిని గైకొనెను.

జయసింహ : ఛీ, ఛీ, ఆ మాటల నాలుకకు రానివ్వకుము.

అపర్ణ : తల్లీ, నిరుపేదల పెన్నిధిని పెరికి తీసుకొంటివా ? రాజు దొంగిలించినను, రాజుల పుట్టించిన రాజేశ్వరునికడ విచారణ జరుగునని వింటిని. తల్లీ, నీవు దొంగిలించిన, విచారణకర్తలే లేరా ? మహారాజా, నీవు చెప్పుము.

గోవిందమాణిక్య : బిడ్డా, నానోట మాట రాకున్నది — ఇంత వేదన, ఇంత రక్తము ఎందులకో నాకు ఎవరు తెలియపర్చగలరు :

అపర్ణ : ఇదిగో మెట్లపై పారుచున్న రక్తము ! ఇది నా బిడ్డ రక్తమేనా ? అయ్యో నా బిడ్డా ! అయ్యో, అయ్యో ! నాకొరకై అరచి ఎంత ఏడ్చితివో ! భయమొంది వణకి పోవుచున్న పక్షముతో, కదలిపోవుచున్న వ్యాకులనయనములతో నాకొరకై నల్గడల పరికించితివి కాబోలు. నే నున్నచోటినుండి నా ప్రాణములు పరుగెత్తుకొని పెల రాలేదో. అయ్యో !

జయసింహ : (ప్రతిమవైపు తిరిగి) పుట్టినది మొదలు నిన్ను పూజించినను నీ మాయను గ్రహించలేకున్నాను. విశ్వజననికి దయ రాలేదు.

అపర్ణ : (జయసింహుని చూచుచు) నీవు కఠినాత్ముడవు కావు — నీ కనుకొనలయందు నా దుఃఖమును చూచి కన్నీరు ఒలుకుచున్నది. రమ్ము, ఈ మందిరమును వదలి రమ్ము. అనుచితముగ నిన్ను అపరాధిని చేసినందులకై నన్ను క్షమింపుము.

జయసింహ : (ప్రతిమవైపు తిరిగి) ఓ గిరినందినీ, ఇదేమి, నీ మందిరమున కరుణా కాతర కంఠస్వరమున నేడు నూతన సంగీతము వినిపించుచున్నది ! భక్తుని హృదయము ఎన్నడు తెలియని వేదనచే వ్యాకుల మగుచున్నది !

ఓ శోభనాంగీ, ఈ మందిరమును వదలి ఎచ్చటికి పోగలను ? ఎచ్చట ఆశ్రయము పొందగలను ?

గోవిందమాణిక్య : (జనాంతికముగ) ప్రేమగలస్థానమున.

[ప్రస్థానము]

జయసింహ : కల్యాణీ, నా కుటీరమునకు రమ్ము. అతిథిని దేవీరూపమున నేను పూజింపగలనని శపథము చేయుచున్నాను.

[ఉభయుల ప్రస్థానము]

## ద్వితీయ దృశ్యము

### రాజసభ

రాజు, సేనాపతి, నక్షత్రరాయలు, సభాసదుల ప్రవేశము

అందరు : (లేచి) మహారాజునకు జయము, జయము.

రఘుపతి : బలిపశువుల సేకరించుటకై రాజభాండారమునకు ఏతెంచితిని.

గోవిందమాణిక్య : మందిరమున జీవబలి ఈ వత్సరమునుండి నిషేధము.

నయనరాయలు : బలినిషేధమా !

మంత్రి : నిషేధమా !

నక్షత్రరాయలు : బలినిషేధమా !

రఘుపతి : కలలో వినుచున్నానా !

గోవిందమాణిక్య : కలలో కాదు ప్రభూ. ఇంతకాలము కలలో నుంటిమి, నేడు మేల్కాంటిమి. బాలికమూర్తిని వహించి స్వయముగ జనని జీవరక్తము తనకు అసహ్యమని నాకు చెప్పి వెడలినది.

రఘుపతి : ఇంతకాలము ఎటుల సహించగలిగెను ? సహస్ర వత్సరములుగ రక్తమును పానమొనర్చి, నేడు ఏల ఈ అరుచి ?

గోవిందమాణిక్య : పాన మొనర్పలేదు. మీరు శోణితపాత మొనర్చునపుడు, దేవి పెడ మొగము పెట్టెడిది.

రఘుపతి : మహారాజా, నీవు చేయుచున్న పని ఎట్టిదియో, తెస్సగ ఆరసిచూడుము. శాస్త్ర విధులు నీ అధీనములు కావు.

గోవిందమాణిక్య : సకలశాస్త్రములకు మిన్నయైనది దేవి ఆదేశము.

రఘుపతి : ఎవనికి భ్రాంతియో, అతనికి అహంకారము కూడ. తెలియనేరని నరుడవు. నీవుమాత్రము దేవి ఆదేశమును వింటివా. నేను వినలేనా ?

నక్షత్రరాయలు : అవును, నీవు చెప్పుము. మంత్రీ ఇది ఎట్టి ఆశ్చర్యము ? మన పూజారి విననేరడా !

గోవిందమాణిక్య : దేవి అట్లు శాశ్వతముగ జగత్తున ఘోషించుచునేయున్నది. ఎవడు ఆ వాణిని వినియు వినకున్నాడో అతడు చెవిటివారిలో చెవిటివాడు.

రఘుపతి : పాషండుడ, నాస్తికుడవు నీవు.

గోవిందమాణిక్య : స్వామీ ! కాలము నష్టమగుచున్నది, మందిరకార్యమునకై ఇప్పుడు వెడలుము. మార్గమున పోవుచు, పోవుచు, నా త్రిపురరాజ్యమున జననిపూజ అను నెపమున జీవహత్య నొనర్చువానికి నిర్వాసనదండము విధింపబడునని ప్రచారము చేయుచు పొమ్ము.

రఘుపతి : ఇది స్థిరమాయెనా ?

గోవిందమాణిక్య : ఇదే స్థిరము.

రఘుపతి : (లేచి) అటులైన నాశన మయ్యెదవు. ధ్వంస మయ్యెదవు.

చంద్రపాలుడు : (పరుగెత్తుకొని వచ్చి) ఆ : ఆ :: ఆపు ఆపు.

గోవిందమాణిక్య : చంద్రపాలా, కూర్చుండుము.

స్వామి, చెప్పదలచినది చెప్పి, నీ మనోవ్యథను చులకన చేసికొమ్ము.

రఘుపతి : త్రిపురేశ్వరియు, త్రిపురరాజ్యపు ప్రజలలో నొకర్తెయని మది తలంచు చున్నావా ? నీ నియమములు ఆమెపైకూడ ప్రాబల్యము వహింపగలవా ? దేవిబలిని నీవు హరింపగలవా ? ఇది నీకు సాధ్యముకాని పని. తల్లి సేవకుడను నేను బ్రతికియేఉన్నాను.

[ప్రస్థానము]

నయనరాయలు : మహారాజ, దాసుల సాహసమును మన్నింపుడు ; ఏ అధికారమున ప్రభూ, అమ్మవారి బలిని—

చంద్రపాలుడు : శాంతింపుము — సేనాపతి.

మంత్రి : మహారాజా, ఒకేసారిగ స్థిరపరచితివా ? ఆజ్ఞ తిరిగి మరల్పబడదా ?

గోవిందమాణిక్య : చాలింపుము మంత్రీ, పాపమును వినాశనమొనర్చుటలో విలంబన ఉచితము కాదు.

మంత్రి : పాపమునకు ఇంత పరమాయువు ఉండగలదా ? శతశతవర్షములుగ దేవతా చరణతలమున ముదిమిచెందిన ప్రాచీనపద్ధతి ఎన్నడైన పాపము కాగలదా ?

[రాజు మౌనమున ఆలోచించుచుండును]

నక్షత్రరాయలు : అదే, మంత్రి, అది పాపము కాగలదా ?

మంత్రి : మన పితృపితామహులు భక్తిశ్రద్ధలతో, అణకువ మెలకువలతో సనాతనరీతుల పాలించుచు వచ్చిరి. వాటిని నేడు అవమానించిన, వారి నందరిని అవమానించినటులే యగును.

[రాజు ఆలోచించుచుండును]

నయనరాయలు : యుగయుగములనుండి వేలకొలది భక్తుల సమ్మతి, ఆదరణ పొందిన దానిని నాశనమొనర్చుటకు నీకెట్టి అధికారము కలదో, మహారాజా, లెస్సగ ఆలోచించి చూడుము.

గోవిందమాణిక్య : (నట్టూర్పులతో) తర్కమును విరమింపుము, మంత్రీ! పోయి నేటి నుండి బలిదానము నిషేధమనెడి నా ఆదేశమును ఎల్లెడల చాటింపుము.

[ప్రస్థానము]

మంత్రి : ఏమాయెను, ఎట్టి విపరీతము!

నక్షత్రరాయలు : అదే! మంత్రీ అదే, ఏమాయెను!! బౌద్ధుల సుందరులలో బలి లేదని వినియుంటిని. కడపటికి వారికిని హిందువులకును భేదమే లేకుండబోయినది.

చంద్రపాలా! నీవు ఏమనెదవు? ఏల మౌనముగ నున్నావు?

చంద్రపాలుడు : నేను అల్పుడను, పిరికివాడను, కొంత మందబుద్ధిని కూడ. సరిగ అర్థము చేసికొనకనే రాజాదేశముల పాలించుచుండెదను.

## తృతీయ దృశ్యము

### మందిరము

జయసింహ : తల్లీ! నీవును, నేనును మాత్రమే యున్నాము. ఈ మందిరమున దిన మంతయు మరెవ్వరును లేరు. నాలుగు ఝాముల దీర్ఘదినమంతయు ఎవ్వరును ఇచ్చటికి రారైరి. మధ్యమధ్య ఎవరో నన్ను పిలిచినట్లున్నది. నిసద్దనే ఉన్నను, ఏదో ఒంటరిగ నున్నట్లు తోచుచున్నది.

నేపథ్యమున పాట

బయలుదేరితి నేను ఒంటరిగ
ఇలయందు నాకుం
దారిచూపెకడ లెవరు తెల్పెదరు?

జయసింహ : తల్లీ, ఇది ఏమి మాయ! మానవుల ప్రాణము దేవతకు ప్రాణము నొసగుట! ఇప్పుడే కదలక మెదలక మాటలులేక ఉంటివే, ఇంతలో నీబిడ్డల కంఠస్వరమును జీవముతో మేల్కొని లేచితివే, తల్లీ!

పాట పాడుచు అపర్ణ ప్రవేశించును

బయలుదేరితి నేను ఒంటరిగ
ఇలయందు నాకుం

దారిపోకడ లెవరు తెల్పెదరు :
ఓ నా హృదయమా :
భయమువలదు నీ కేటికి బెదురు :
కుసుమసౌరభ మత్తమధుపము
చనువిధంబున, అతిముదంబున
నిర్భయమ్ముగ చనుము నీవిక
నీ తలంపులతో :

జయసింహ : కేవలము ఒంటరిగనా : దక్షిణసమీరములు వీవకపోయిన, పుష్పముల సౌరభములు ఏతెంచకపోయిన, వది సందేహములవలె, పదిదిక్కులు ఆవరించివేసిన, అప్పుడు సుఖమేది? మార్గమెచ్చట : ఒంటరియని ఎవరిని అనెదరో తెలియునా :

అపర్ణ : తెలియును. మదినింపి కూర్చొనియున్నవేళల, ఇచ్చివేసికొనుటకు కోరిక ఒదముచుండును, కాని గ్రహించువారు లేరు.

జయసింహ : సృష్టికి ముందు దేవత ఒంటరిగనుండిన చందమున :

అవును, అవును. ఈ జీవితము మిగుల అధికముగ నున్నదని తోచుచుండును. ఎంత అధికమో, అంత శూన్యమును, అంత అక్కరలేనిదియును అగుచుండును.

అపర్ణ : జయసింహా : నీవు ఒంటరివి కాబోలు. అందుకనే నిరుపేదలలో నిరుపేదగ నిన్ను కాంచుచున్నాను. నీ సర్వస్వమును గ్రహింపగలవారికై, నీవు వెదకుచున్నట్లున్నది. దీనదుఃఖితుల పకలద్వారముల తిరుగుచున్నావు.

ఇన్నిదినములుగ భిక్షము ఎత్తుచు తిరుగుచున్నాను. ఎంతెంతమంది మనుష్యుల చూచుచున్నాను, ఎన్నెన్నిముఖముల కాంచుచున్నాను. లోకులు, కేవలము భిక్షకొరకే యని తలచి, దూరమునుండి క్షుద్రదయాభరితులై పిడికెళ్లతో భిక్షము పెట్టెదరు ; కాని అట్టిదయను ఎచ్చటను పొందజాలకున్నాను.

జయసింహ : నిజమగు దాత, స్వయముగ, ఇలలో దరిద్రులవైపున దానరూపమున దిగి వచ్చును. ఆకసమునుండి వృష్టిరూపమున మేఘము మరుభూముల దిగివచ్చురీతి, దేవి మానవరూపమున, నేను ప్రేమించు ఆమెమూర్తితో అవతరించుచున్నది. దరిద్రులు, దాతలు, దేవతలు, మానవులు సమానమై పోయెదరు.

అదో నా గురుదేవుడు వచ్చుచున్నాడు.

అపర్ణ : అయిన నేను లోపలికి జరిగిపోయెదను. ఆ బ్రాహ్మణుని చూచిన నాకు ఎక్కువ భయమగుచున్నది. ఎంతటి కఠినమైన తీక్ష్ణదృష్టి : దేవీమందిర పాషాణసోపానమువలె కఠినమైన లలాటము :

జయసింహా : కఠినమా ? అవును కఠినము, ఏనాతవలెనే అందరి కదిలింపరాని, భరింప రాని కఠినతవలెనే కఠినము.

[అపర్ణ ప్రస్థానము] రఘుపతి ప్రవేశము

జయసింహా : (కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళు ముందుంచి) గురుదేవా !

రఘుపతి : వెడలుము, వెడలుము.

జయసింహా : నీరు తెచ్చితిని.

రఘుపతి : ఉంచుము. అక్కడ పెట్టి పొమ్ము.

జయసింహా : బట్టలు.

రఘుపతి : ఎవరికి కావలె బట్టలు ?

జయసింహా : అపరాధ మొనర్చితినా ?

రఘుపతి : నీ అపరాధముల సంగతి ఎవరు ఎత్తిరి ? ఘోరకలి ఘనీభవించి పీతెంచు చున్నది. బాహుబలము రాహుసమముగ బ్రహ్మతేజమును కబళింపగోరుచున్నది. యజ్ఞ వేదికపై సింహాసనము తలయెత్తుచున్నది. అయ్యో, అయ్యో, కలిదేవతలారా, మీరున్ను ముఖస్తుతిచేయు సభాసదులవలె నతశిరమున రాజాజ్ఞల నిర్వహించుచున్నారా ? చతుర్భుజీ, నాలుగుచేతులు జోడించి నిలిచియున్నావా ?

వైకుంఠమును చుట్టుముట్టి ఆక్రమించుకొనిరా దైత్యులు ? దేవతలందరు రసాతల మునకు పరుగెత్తిపోయిరా ? కేవలము రాక్షసులు, మానవులు కలసి విశ్వరాజత్వగర్వమును అనుభవించుచుండుటయా ? దేవతలు మిన్నకున్న బ్రాహ్మణులు బ్రతికియున్నారు. బ్రాహ్మ ణుల రోషయజ్ఞానలమున, సింహాసనము, రాజదండము సమిధలవలె భస్మమైపోగలవు.

(జయసింహునివద్దకు వెడలి ప్రేమతో) బిడ్డా, నేను నీపై కఠినముగ ప్రవర్తించి తిని. అందుచే నా చిత్తము క్షోభిల్లుచున్నది.

జయసింహా : ఏమాయెను ప్రభూ !

రఘుపతి : ఏమాయెనా ? అవమానింపబడిన త్రిపురేశ్వరినే అడుగుము. ఈ నోటితో నేమాయెనో యేమని చెప్పుదును ?

జయసింహా : ఎవరొనర్చిరి అవమానము ?

రఘుపతి : గోవిందమాణిక్య.

జయసింహ : గోవిందమాణిక్య ? ప్రభూ, ఎవరిని అవమానించెను ?

రఘుపతి : ఎవరినా ? నిన్ను, నన్ను, సర్వశాస్త్రములను, సర్వదేశములను, సర్వకాలములను, సర్వదేశకాల అధిష్ఠాత్రి మహాకాళిని, అందరిని, క్షుద్రసింహాసనమున కూర్చుండి అవమానించెను. తల్లి పూజాబలిని సాహసముతో నిషేధించెను.

జయసింహ : గోవిందమాణిక్యరాజులా ?

రఘుపతి : అవును, అవును. నీ రాజా గోవిందమాణిక్యమహారాజే. నీకు సకల శ్రేష్ఠుడు—నీ ప్రాణాధీశ్వరుడు !

కృతఘ్నుడా, బాల్యమునుండి ఎంత శ్రద్ధతో, ప్రేమతో నిన్ను నేను పాలించితిని, కాని నాకన్న నీకు గోవిందమాణిక్యుడే ప్రియతముడైనాడు.

జయసింహ : ప్రభూ ! పితృఅంకమున కూర్చుండి తెలియని చిన్నబిడ్డ, పూర్ణచంద్రునికై ఆకసమువైపు చేతులుచాచును.

దేవా, నీవు నా తండ్రివి, మహారాజా గోవిందమాణిక్య అట్టి పూర్ణశశి.

కాని, నేనేమి వదరుచున్నాను ! ఎట్టిమాటల వింటిని ! తల్లి పూజాబలిని రాజు నిషేధించెనా ? ఈ ఆదేశము నెవరు ఒప్పెదరు ?

రఘుపతి : ఒప్పకున్న, దేశమునుండి వెడలగొట్టబడుదురు.

జయసింహ : తల్లిపూజలేని రాజ్యమునుండి వెడలగొట్టబడుట శిక్ష కానేరదు. ఈ ప్రాణమున నేను బ్రతికియుండ జననిపూజ అసంపూర్ణము కానేరదు.

## చతుర్ధ దృశ్యము

### అంతఃపురము

గుణవతి, పరిచారిక ప్రవేశింతురు

గుణవతి : ఏమి అనుచున్నావు ? మందిరద్వారమునుండి రాణి పూజాబలిని తిరిగి పంపించెనా ? అతనికి మెడపై ఎన్ని తలలున్నవే ! ఎవరా దురదృష్టుడు !

పరిచారిక : చెప్పుటకు ధైర్యము రాకున్నది.

గుణవతి : చెప్పధైర్యము లేదా ? ఈమాట చెప్పుటకు ధైర్యమెచ్చటనుంచి వచ్చినది ? నాకంటె నీకెవరివలన భయము ?

పరిచారిక : మన్నించు తల్లీ.

గుణవతి : నిన్న సాయంకాలము రాణిగ నుంటిని ; వందిమాగధులు స్తవమొనర్చి వెడలిరి. విప్రులు ఆశీర్వదించిపోయిరి. భృత్యులు చేతులు జోడించి ఆజ్ఞల శిరసావహించి చనిరి. ఒక్కరాత్రిలో అంతయు తల్లక్రిందులాయెనా ! దేవి, పూజను పొందకున్న రాణీ మహిమ క్రిందైపోయెనన్నమాట ? త్రిపుర, స్వప్నరాజ్యమున నున్నదా ? బ్రాహ్మణ స్వామిని, అర్చకుని, త్వరగ వెళ్ళి పిలుచుకొనిరమ్ము.

[పరిచారిక ప్రస్థానము]

గోవిందమాణిక్యుని ప్రవేశము

గుణవతి : మహారాజా, తల్లి మందిరమునుండి నా పూజాబలి మరల్పబడెనని వింటిని.

గోవిందమాణిక్య : నాకును తెలియును.

గుణవతి : మీకును తెలియునా ? అయినను మీరు మారుపలుకక మిన్నకుంటిరా ? మీకు తెలిసియే పట్టమహిషికి అవమానమా !

గోవిందమాణిక్య : ప్రియా, అతనిని మన్నింపుము.

గుణవతి : మీది దయారసహృదయము ! కాని మహారాజా, ఇది దయ కాదు ; కేవలము కాపురుషత. దయచే దుర్బలులై, స్వయముగ మీచేతులతో శిక్షింపలేకున్న నేను దండించెద. చెప్పుడు, ఎవరా యపరాధి ?

గోవిందమాణిక్య : దేవీ ! నేనే ! అపరాధ మేమియు లేదు, నీకు వ్యథ కలుగచేసిన అపరాధము తప్ప.

గుణవతి : ఏమి చెప్పుచున్నారు, మహారాజా.

గోవిందమాణిక్య : నేటినుండి తల్లిపేరున జీవరక్తపాతము నా త్రిపురారాజ్యమున నిషేధమాయెను.

గుణవతి : ఎవరు నిషేధించిరి ?

గోవిందమాణిక్య : జనని.

గుణవతి : ఎవరు విన్నారు ?

గోవిందమాణిక్య : నేనే.

గుణవతి : నీవా : మహారాజా, విన్న నవ్వు వచ్చుచున్నది. తన నివేదన విన్నవించు కొనుటకై రాజద్వారమునకు వచ్చెనా, భువనేశ్వరి :

గోవిందమాణిక్య : దేవీ, నవ్వకుము. జనని స్వయముగ వచ్చి, బిడ్డల ప్రాణముద్వారా వేదన తెలియపర్చెను, నివేదన కాదు.

గుణవతి : మహారాజా, ఈ మాటలటుంచుడు. మందిరద్వారము వెలుపల నీ రాజ్యము. ఎచ్చట నీ ఆజ్ఞ సాగదో, అచ్చట ఆజ్ఞల నివ్వకుము.

గోవిందమాణిక్య : తల్లి ఆజ్ఞ. నా ఆజ్ఞ కాదు.

గుణవతి : ఎటుల తెలిసికొంటిరి ?

గోవిందమాణిక్య : క్షణదీపాలోకమున గృహకోణములనుండి అంధకారము వెడలి పోవును, అంతేయు చేయగలదు. కాని తన నీడను ఏవిధముగనైనను దీపము పోగొట్టు కొనజాలదు. మానవుని బుద్ధి ఆ దీపమువలెనే యెంత వెలుతురును ప్రసరించునో, అంత సంశయచ్ఛాయలతో అంటుకొనియుండును ; స్వర్గమునుంచి జ్ఞానము అవతరించినపుడు, ఒక్క నిముసమున సంశయములు విచ్ఛిన్నమైపోవును. నా హృదయమున సంశయము లేమియు లేవు.

గుణవతి : ఎవరి పాపపుణ్యములు వారివే యని వినియున్నాను. నీవు సంశయదూరుడ వైన కావచ్చును. నన్నుమాత్రము వదలుము, నా తల్లిమ్రోలకు చనెదను.

గోవిందమాణిక్య : దేవీ, జనని ఆజ్ఞ నుల్లంఘింపజాలను.

గుణవతి : నేను సంతియే. తల్లికడనే మ్రొక్కుకొంటిని. శాస్త్రప్రకారము, విధుల ననుసరించి ఆమె పూజచేసెదనని ప్రమాణము చేసితిని. పొమ్ము, నీవు పొమ్ము.

గోవిందమాణిక్య : మహారాజ్ఞీ, నీ యాదేశప్రకారమే.

[ప్రస్థానము]

రఘుపతి ప్రవేశము

గుణవతి : స్వామీ : మాతృద్వారములనుండి నా పూజ మరల్పబడెను.

రఘుపతి : మహారాణీ : మాతృపూజ మరల్పబడెను, నీదికాదు. ఎంగిలితిని, మనుగడ నేయు నిరుపేదలు, యాచించి సేకరించు పూజయు, పట్టమహిషీ, నీ పూజకన్న శ్రేష్ఠమైనను తక్కువ కానేరదు.

మాతృపూజ మరల్చబడెను, అదే సర్వవినాశనకరమగు మహాపాతకము. రాజ దర్పము క్రమముగ పొంగి, ఉబ్బి, భూలోకరాజ్యపు పొలిమేరలను దాటివెడలుచున్నది : దేవతామందిరద్వారముల లఘించి కూల్చున్నది. జనని భక్తులపై రెండుకండ్లను ఎఱ్ఱగ చేసి చూచుచున్నది.

గుణవతి : ఏమి కానున్నది స్వామి ?

రఘుపతి : అది మహామాయకే తెలియును.

తల్లి వాకిలిపై ఎవరి గద్దియనీడలు పడునో, వారి దంభవేదిక నీటిబుడగవలె టప్పని పగిలిపోవునని మాత్రము నాకు తెలియును.

యుగయుగములనుండి రాజపితృపితామహులు ఏ రాజమహిమను పెంచి, మిన్నుల చీల్చు కొండలంత వనిచేసిపోయిరో, అదొక చిటుకప్రొద్దులో, పోరుగాలులచే పడగొట్ట బడి, పిడుగులచే ప్రక్కలు ప్రక్కలై దుమ్ములో కలిసిపోగలదు.

గుణవతి : రక్షింపుము, రక్షింపుము, ప్రభూ.

రఘుపతి : ఓహో, నేనా నిన్ను రక్షింపగలిగినది ! స్వర్గమర్త్యలోకముల తవ శాసన ములచే నేలుచున్న ప్రబలరాజాధిరాజు పట్టపుదేవేరివి నీవు, దేవబ్రాహ్మణుల జయించి.— ఛీ, ఛీ, కలికాలపు బ్రాహ్మణుల లక్షతూరులు ఛీకొట్టినను పాపము లేదు ! ఏదీ, బ్రహ్మ శాపము ! తన్నుతాను పొడుచుకొను తేలువలె, వ్యర్థబ్రహ్మతేజము వారిపక్షములనే దహించుచున్నది. బ్రాహ్మణుల ఆడంబరము లన్నియు కల్లలు.

[జంధెము త్రెంపబూనును]

గుణవతి : దేవా, ఏమి చేయ సంకల్పించితివి ? దయయుంచి అన్నెము పున్నెమెరుగని దాని త్రెంపకుము, ఉంచుము.

రఘుపతి : బ్రాహ్మణుల అధికారమును తిరిగి యిమ్ము.

గుణవతి : ఇచ్చెదను. ప్రభూ, నడుపుము. మందిరమునకు పోయి పూజల కావింపుము. పూజకెట్టి యాటంకములు రానేరవు.

రఘుపతి : రాజాధీశ్వరీ ! నీ యాదేశానుసారమే జరుగవలె. నీ ఆదేశబలమున దేవత కృతార్థురాలైనది ; బ్రాహ్మణులు తమ తేజమును తిరిగి పొందగల్గిరి. కల్కి యవతరించు వరకును నీవే ధన్యురాలవు.

[ప్రస్థానము]

గోవిందమాణిక్యుని పునఃప్రవేశము

గోవిందమాణిక్య : అప్రసన్నురాలైన ప్రేయసీముఖము, లోకమున, అన్నికాంతుల, అన్నిసుఖముల మరుగుపరచివేయును. ఉత్సుకచిత్తమునకు పరిహాసము మరల మరల వచ్చుచుండును.

గుణవతి : పొమ్ము, పొమ్ము. ఈ గృహమునకు రాకుము. ఇచ్చో అభిశాపముల కొని తేకుము.

గోవిందమాణిక్య : ప్రాణేశ్వరీ, ప్రేమ అభిశాపముల నాశ మొనర్చును. దయ అకల్యాణముల దూరము గావించును. సతిహృదయమునుండి ప్రేమ దూరమైనపుడు పతిగృహమునకు అభిశాపము తగులును. దేవీ, అటులైన పోయెదను.

గుణవతి : పొమ్ము, తిరిగి ముఖమిట్లు చూపింపకుము.

గోవిందమాణిక్య : నీవు నన్ను స్మరించినపుడే, తిరిగి వచ్చెదను.

[ప్రస్థానోన్ముఖుడగును]

గుణవతి : (కాళ్ళపైబడి) క్షమింపుము, క్షమింపుము నాథా ! రమణి స్వాభిమానమును నెట్టివేసి, పోగల నిష్ఠురుడవైతివా ? ప్రాణేశ్వరా, ఫలించని ప్రేమ రోషపుఛద్మవేషమున కాన్పించునని తెలియదా ? నా పరువుప్రతిష్ఠల నేనే అవమానించితిని, క్షమింపుము.

గోవిందమాణిక్య : ప్రేయసీ, నీపై విశ్వాసము తెగిపోయినపుడు, జీవనబంధములు తెగిపోయినట్లే ; మనోహరీ, మేఘము క్షణకాలమనియు, సూర్యుడు శాశ్వతమనియు తెలియుము.

గుణవతి : మేఘము క్షణకాలముది. ఈ మేఘము తొలగిపోవును, విధిచే ఎత్తబడిన వజ్రాయుధము దించబడును. చిరదివసముల పద్ధతుల లోకమున ప్రకాశింపజేయుచు, చిరదివసముల సూర్యుడు తిరిగి ఉదయించగలడు ; సర్వలోకములు అభయదానమును పొందగలవు. ఈ రెండునాళ్ళ దుఃస్వప్నమును మరచిపోగలవు. బ్రాహ్మణులు నిజఅధికారముల తిరిగి పొందునటుల, దేవి నిజపూజల పొందునటుల ఆజ్ఞనొసగుము. రాజదండము, తిరిగి తన అప్రమత్త మర్త్యఅధికారములమధ్యకు మరలనిమ్ము.

గోవిందమాణిక్య : ధర్మహానికి బ్రాహ్మణులకు అధికారము లేదు. నిస్సహాయజీవముల రక్తముచే కాదు జననిపూజ. దేవతాధికారమును పాలించుటకు రాజులకు, విప్రులకు ఎల్లరకును అధికారము కలదు.

గుణవతి : భిక్ష, భిక్షను అడుగుచున్నాను. ప్రభూ, నీ చరణములకడ ఇది యొకటిరో ప్రార్థన చేయుచున్నాను.

చిరాగతములగు సంప్రదాయములు చిరప్రవాహితములగు ముక్తసమీరణములవలెనె రాజునకు లోబడిన విషయములు కావు. అయినను చేతులుజోడించి సమస్త ప్రజలపక్షమున నీ పట్టపురాణి భిక్షనొసగుమని ప్రార్థించుచున్నది.

ప్రేమపు అనునయముల సరకుగొనుము. ప్రేమ ఆకర్షణవశమున పొసగిన కర్తవ్యంపు త్రుటులను భగవంతుడును మన్నించగలడు.

గోవిందమాణిక్య : ఇది ఉచితమా, మహారాజ్ఞీ ! నీచస్వార్థముల, నిష్ఠురక్షమతాదర్పముల, అంధ అజ్ఞానతల, చిరరక్తపానముచే బలసి, ఉబ్బిన క్రూరవృద్ధప్రథలను, ఇంకను ఉన్న సహస్రారులతో ఒంటరిగ పోరు సల్పుచున్నాను.

అలసిన దేహముతో, గృహమునకు వచ్చి నాకచిత్తమునుండి అమృతపానము చేయగోర, అచ్చటను దయానుప చికిత్సించుచున్నది! గృహమున పుణ్యప్రేమ వీచుచుండును; దానితో రక్తధారల కలయికయా! ఓ చైత్యుడా ఆనకట్టల త్రెంచి, ఇట్టి రుధిరస్రవంతుల పారించుచున్నావు!

భక్తియందును, ప్రేమయందును, రక్తపుపూతలేనా! దయామయయగు రమణి ప్రాణమున క్రూరహింస శోణితంపుచిహ్నము వెడలుచున్నది. అట్లుండియు ఈ రక్తపాతమును నేను మాన్పకూడదా ?

గుణవతి : (ముఖమును కప్పుకొని) వెడలిపొండు, వెడలిపొండు.

గోవిందమాణిక్య : అయ్యో! మహారాణి, సతి విముఖమైనపుడు, కర్తవ్యము కఠినమగును!

[ప్రస్థానము]

గుణవతి : (ఏడ్చుచు లేచి) ఓ దురదృష్టవంతురాలా! ఇన్నినాళ్ళుగ ఎట్టి భ్రాంతిని చిత్తమున పోషించుచువచ్చితివి. నేడు ఇన్ని అనురోధములు, ఇన్ని అనునయములు, ఇన్ని గర్వంపుచాతుర్యములు వ్యర్థమగునని ఎట్టి శంకయు లేకుండెను.

ఛీ, ఏ అందచందములచే గొడ్రాలు మగనికి స్వాభిమానముల చూపగలదు? నీ స్వాభిమానములన్నియు భస్మము కానిమ్ము, నా కపాలము బూడిదయైపోనిమ్ము! రాణి గర్వములన్నియు ధ్వంసము కానిమ్ము. వలపులీలావిలాసములు, జిలిబిలిముద్దుల ఏడ్పులు, ఇకలేవు. తలవంపుల, ధూళితలమే నా స్థానమని ఇప్పటికి తెలిసికొంటిని. నిజతేజమున పడగను పైకెత్తు సర్పమును కానని గ్రహించితిని.

## పంచమదృశ్యము

### మందిరము

కొందరు గ్రామీణుల ప్రవేశం

నేపాల్ : ఎక్కడరా, నీ ఒసున్నారు గొర్రెలు, నూరు దున్నపోతులు, తెగిన బల్లి తోకైనా, చూపుమేరలో ఎక్కడా కనబడ్డం లేదు. మేళం, గీళం ఎక్కడికిపోయె. అందరు మొగాలు జారవేసినారు. సొమ్ము సెలవుచేసి జాతర చూద్దామని వచ్చినందుకు, మంచి గౌరిగింపే అయింది.

గణేష్ : ఒరే, చూడు, అమ్మోరుదేవళం ఎదురుగ్గా అల్లా మాట్లాడకు. అమ్మకు గొర్రెలు అందలేదు. ఆకలితో లేచి, మీలో ఒక్కొక్కరిని పట్టుకొని నోట్లో వేసుకొంటుంది.

హోరు : ఏం. పోయినేడు మీరందరు ఎక్కడుండినార్రా? పోయినేడు, మొక్కు పూర్తిచేసి, రాణిగారు జాతర చేయించినపుడు, మీ కాళ్ళలో ముళ్ళుగ్రుచ్చుకొన్నయా? అప్పుడొచ్చి, ఒకసారి చూచిపోయుంటే సరిపొయ్యేది. నెత్తురుతో నదంతా ఎర్రబడి పోయింది. ఈ నాయాళ్ళు ఏపొద్దు వచ్చారో, అమ్మోరికి తిండికూడా నిలిచిపోయింది. మీలో ఒక్కొక్కర్ని పట్టి ఆమెదెగ్గరపెట్తే, మనస్సులోని దిగులంతా పోతుంది.

కాను : ఒరే, అన్నా, ఎందుకురా ఊరికే కోప్పడుతావు? మనకు నోటితో చెప్పడానికి ఏముందిరా? మనం ఊరికే నిల్చొని వాళ్ళమాటలు వినాల్సిందే!

హోరు : నీవేమన్నా సరే; కొంచెంలో నాకు కోపంవచ్చేది నిజం.

అనాడు, వాడు నాయాలా అనేంతవరకూ వచ్చాటు. అంతకన్నా ఇంకొకమాట ఎక్కువ అనివుండినా, నా ఒంటిమీద చేయివేసియుండినా, ఇదో చెప్తుండా నేను వాణ్ణి—

నేపాల్ : జరిగేదేమో, జరగనీ చూస్తాం, ఎవరి ఎముకల్లో ఎంత బలముందో చూస్తాం.

హోరు : సరే, రారా. ఇక్కడి తలారి మా మామకొడుకు, తెలుసురా.

నేపాల్ : వాణ్ణి తీసుకొనిరారా. మీ మామనుకూడా వెంటబెట్టుకొనిరా. ఇద్దరిని గౌరి గించి పంపిస్తాము.

హోరు : మీరందరు విన్నారుగద.

గణేశ్, కాను : ఆరే కట్టిపెట్టండిరా, ఇంటికి నడవండి. ఈవేళ ఏమీ ఒంటికి తగల్లేదులే, ఇప్పుడు మీ చేర్లాటాలు కట్టిపెట్టండి.

**హారు :** ఇదేనా, చెల్లాట? మా మామను తిట్టడం, మా మామకొడుకు తలారిని తిట్టడం, యిదేనా తమాషా?

గణేశ్, కాను : కట్టిపెట్టండిరా, మీమీ అబ్బలతోసహా మీరే చావండి.

రఘుపతి, నయనరాయ్, జయసింహుల ప్రవేశము

**రఘుపతి :** తల్లిమీద భక్తిలేదా నీకు?

**నయనరాయలు :** ఇట్టిమాట చెప్పుటకు ఎవరికి సాధ్యము? క్షత్రవంశమున జన్మించితిని.

రఘుపతి : మంచిది, మంచిది, అటులైన నీవు తల్లి సేవకుడవు. మాలో చేరినవాడవు.

నయనరాయలు : ప్రభూ, మాతృభక్తులకు దాసుడను నేను.

రఘుపతి : మంచిది. నీ భక్తి అక్షయమగు నుండుగాక! భక్తి నీ బాహువులలో దుర్జయ శక్తిని సంపాదించుగాక. భక్తి నీ కత్తికి పదును పెట్టి, వజ్రాయుధపు తేజముతో దానిని నింపుగాక. నీ భక్తి, పదవిలో ప్రకాశించువారందరికన్న పైన, హృదయమునందున వాసము చేయుగాక!

నయనరాయలు : బ్రాహ్మణుని ఆశీర్వాదము వ్యర్థము కానేరదు.

రఘుపతి : అటులైన, సేనాపతీ, తల్లికార్యమునకై నీ సకల బలముల నొక్కుమ్మడిగ చేకూర్చుకొనుము. మాతృద్రోహుల నాశన మొనర్పుము.

నయనరాయలు : ప్రభూ. మీ ఆనతొప్పుననే. మాతృద్రోహి, ఎవడు వాడు?

రఘుపతి : గోవిందమాణిక్య.

**నయనరాయలు :** మన మహారాజా!

రఘుపతి : నీ సైన్యబలములతో అతనిపై దాడివెడలుము.

**నయనరాయలు :** ఛీ, పాపపు ఉపదేశము, ప్రభూ, నన్ను ఎట్టిపరీక్ష సలుపుచున్నారు?

**రఘుపతి :** నిజమే, పరీక్షయే. నీవు ఎవరి భృత్యుడవో, యీనాటి పరీక్షామూలమున తేలవలసియున్నది. చింతల విడలుము, శంకల మానుము. శాసించుటకు వ్యవధి లేదు. ప్రళయభైరవితో త్రిపురేశ్వరి ఆజ్ఞ సంచారిత మగుచున్నది. నేడు సకల బంధనములు విచ్ఛిన్నమైపోయెను.

నయనరాయలు : చింతలు లేవు. ఎట్టి శంకలును లేవు. దేవి యెచ్చట ఉండెనో, అచ్చటనే **అచలముగ ఉన్నాను.**

రఘుపతి : మంచిది.

నయనరాయలు : ఇట్టి ఆజ్ఞాభారమును నాపైనుంచుటకు, జననీసేవకులలో అంతటి నరాధముడనా ? నేను విశ్వాసఘాతుకుడను కావలెనా ? విశ్వమాత స్వయముగ నిలచి యున్న దే—హృదయవిశ్వాసములపైనున్న ఆమె స్థిరమగు ఆసనమును, తన నోటితో దానిని బ్రద్దలుచేయుమని దేవి నుడువునా ? అటులైన నేడు రాజు వెడలును, రేపు దేవి. పగిలిన గోడలమేడవలె మనుష్యత్వమే విరిగి కూలిపోవును.

జయసింహ : సేనాపతీ, ధన్యుడవు, ధన్యుడవు.

రఘుపతి : నిజముగ ధన్యుడవే నీవు. ఇదెట్టి భ్రాంతి నీది ? తల్లివద్ద ఏ రాజు విశ్వాస ఘాతుకుడో, అతనితో విశ్వాసబంధనములు ఏల ?

నయనరాయలు : ఈ వ్యర్థతర్కములతో ఏమి లాభము ? బుద్ధియొక్క మాయాజాలములలో పడుటకు కోరుటలేదు.

ఒకేమార్గమున్నదని తెలియును. అది విశ్వాసమార్గము. ఆ తిన్ననిమార్గమున మూర్ఖుడు, అధముడగు భృత్యుడు ఈ నయనరాయ్ శాశ్వతముగ వెడలుచుండగలడు.

[ప్రస్థానము]

జయసింహ : చింతయేల దేవా, ఇట్టి విశ్వాసబలముననే, మనము కార్యముల నిర్వహింతము. ఎవరివలన భయము మనకు ప్రభూ ! సైన్యబలములతో నేమి పని ? అస్త్రములచే ఏమగును ? ఎవరిపైనున్న భారమునకు తగిన బలము వారివద్దనేయున్నది. మనము నిజమగు మాతృసేవకులమైతిమేని, తప్పక తల్లిపూజ చేసియేతీరెదము. ప్రభూ ! రమ్ము మందిర ఢంకాను మ్రోగించెదను, పురవాసుల పిలిచివచ్చెదను. మందిరద్వారముల తెరచివైచెదను.

ఒరే రండు మీరు. రండు, రండు, భయమెరుగని తల్లిపూజ కాగలదు. నిర్భయముగ రండు. ఓ తల్లిబిడ్డలారా ! ఓ పురవాసులారా !

[రఘుపతి, జయసింహుల ప్రస్థానము]

పురవాసుల ప్రవేశము

అక్రూర : ఒరే, రండి, రారండి.

అందరు : మహామాయామాతకి జై.

హారు : రండిరా, తల్లికి యెదురుగ్గా, చేతులెత్తి ఆడెదాము,

సమరభూమిని మహంకాళి
సల్పుచున్నది నగ్న నర్తనకేళి

అనుసరింతము మనముకూడ
ఆ నాట్యపదక్రీడ

ముజ్జగముల ముంచి యిరుల
ముత్తిల్లును దిగ్వసన :
ప్రళయవహ్నిశిఖ విధంబు
రగుల తనదు రక్తరసన,

కలభముల్ గని దుముకుచున్నవి
ప్రాణాల విడనాడ,
అనుసరింతము మనముకూడ
ఆ నాట్యపదక్రీడ.

విడినజుట్టు విరియబారు
నభస్స్థలి నల్లగిల్ల,
చంద్రసూర్య చక్రంబులు
దాగును భయంబువల్ల.

అసితదేహము పయిన రక్తము
అరుణవంతము చూడ
అనుసరింతము మనముకూడ
ఆ నాట్యపదక్రీడ.

భ్రుకుటి భుగ్నత, మహాందోళి
త మగుచున్నది త్రాసచే భువనాళి,
సమరభూమిని మహంకాళి
సల్పుచున్నది నగ్న నర్తనకేళి.

అందరు : తల్లికి జై.

గణేశ్ : ఇక అంతుగొందులు లేవు.

కాను : ఒరే, దక్షిణాదివాళ్ళు ఇప్పుడు ఎచ్చటికి పోయ్యారురా :

గణేశ్ : తల్లి ఐశ్వర్యము, నాయాళ్ళు, సహించలేకపోయ్యాయి. వారు పరుగెత్తి పోయారు.

హారు : కేవలము తల్లి ఐశ్వర్యమే కాదు, వాళ్ళను ఎట్లా చీవాట్లుపెట్టినానంటే, వాళ్ళు యిక ఈతట్టు ముఖముపెట్టరు ; అన్నో, మా మామకొడుకు తలారిపేరు చెప్పేటప్పటికి వాళ్ళ మొగాల్లో నెత్తురు లేదు.

అక్రూర : మా నితాయి ఆనాడు వాళ్ళను బాగా చీవాట్లుపెట్టి, కోపపడి పంపించాడు. ఆ ఎలుకమొఖమువాడు, నాయాలు గబగబ ఏదో జవాబుచెప్పటానికి వచ్చినాడు. ఒరే మీరు దక్షిణాదిన ఉండేవాళ్ళు, ఉత్తరాదిసంగతి నీకేమి తెలుసురా ? ఉత్తరము చెప్పడానికి వచ్చావు కాని, ఉత్తరము సంగతి నీకేమి తెలుసురా : అని మా నితాయి అనేటప్పటికి మేమంతా నవ్వుతా ఒకరిమీద ఒకరు విరగపడ్డాం.

గణేశ్ : ఇట్లాంటివాటిల్లో వాడు గట్టివాడే. కాని నితాయితో మాటలు పెట్టుకొనేశక్తి లేదు వాడికి.

హారు : నితాయి మా మేనత్త మొగుడు.

కాను : వినండి. ఒకసారి నేనడిగేది వినండి, నితాయి మళ్లా నీ మేనత్త మొగుడు ఎప్పుడయ్యాడురా !

హారు : మీరంతా నా మాటలన్నీ పట్టిచూడడానికి మళ్ళినారా : బలే, మేనత్త మొగుడు కాకపోతే కాకపోయె. దాంట్లో నీకొచ్చిన సంతోషమేముంది ? మా మేనత్త మొగుడు కాలేదని, మీ మేనత్త మొగుడు అయ్యాడా ?

రఘుపతి, జయసింహుల ప్రవేశము

రఘుపతి : సైన్యము వచ్చుచున్నదని వింటిని. జయసింహా, అస్త్రములతో నీవిచ్చట నిలువుము.

మీరు రండిరా, ఇచ్చట నిలవండి : మందిరద్వారమును కాపాడవలసియున్నది. నేను మీకు అస్త్రముల తెచ్చియిచ్చెదను.

గణేశ్ : అస్త్రములేల స్వామీ ?

రఘుపతి : తల్లిపూజను ఆపుచేయుటకు రాజసైన్యములు వచ్చుచున్నవి.

హారు : సైన్యములు వచ్చుచున్నవా ? ప్రభు, అటులైన ప్రణామములు.

కాను : మేము కొద్దిమందిమి ; సైన్యములు వచ్చిన ఏమిచేయగలము ?

హారు : ఏదో చేయటానికి అందరికి చేతనవుతుంది, కాని సైన్యములు వస్తే, యిచ్చట స్థలమేది ? యుద్ధము తర్వాత సంగతి, యిచ్చట నిలబడ్డానికి స్థలమేది ?

అక్రూర : మాటలు కట్టిపెట్టండిరా, చూతలేమా, స్వామి కోపంతో వణికిపోతున్నాడు.

స్వామీ, అనుమతి యివ్వండి, మా ఊరిలో అందరిని పోయి పిలుచుకొనివస్తా.

హారు : అది మంచిదిరా. అట్లనే మా మేనమామ కొడుకును నేనూ పిలిచివస్తాను. కాని ఇక ఏమాత్రం ఆలస్యంచేసినా మంచిది కాదు.

[అందరు ప్రస్థాన ఉద్యుక్తు లయ్యెదరు]

రఘుపతి : (కోపమున) ఒరే, నిలువుడు, అచట.

జయసింహ : (చేతులు జోడించి) ప్రభూ, వారిని పోనిమ్ము. మూర్ఖులు ప్రాణములు పోవునని భయపడినవారు, మొదటనే చచ్చిపోవుచున్నారు.

మాతృసైనికుడను నేనున్నానుగా. సహస్ర సైనికులబలము నా దేహమున గలదు. అస్త్రముల ఉంచివేయుడు. భీరువుల పోనిండు.

రఘుపతి : (స్వగతము) ఆ కాలము పోయినది. అస్త్రములు కావలె, అస్త్రములు కావలె. కేవలము భక్తికాదు. (ప్రకాశముగ) జయసింహా బలిని తెమ్ము. పూజ ప్రారంభించెదము.

[బయట వాద్యములు మ్రోగును]

జయసింహ : సైనికులుకారు ప్రభూ, రాణిపూజ ఏతెంచుచున్నది.

అనుచరులు, పురవాసులు ప్రవేశము

అందరు : ఒరే భయములేదురా, సైన్యములేవిరా ? తల్లిపూజ వస్తుంది.

హారు : మన మిచ్చట నున్నామని తెలిసిపోయిందిరా, సైన్యాలు మరి యీ దిక్కుకు రావు.

కాను : స్వామీ, రాణిగారు పూజాద్రవ్యములు పంపినారా ?

రఘుపతి : జయసింహా, శీఘ్రముగ పూజ ఏర్పాట్లు కావింపుము.

[జయసింహుని ప్రస్థానము]

పురవాసుల నృత్యగీతములు

గోవిందమాణిక్యుని ప్రవేశము

గోవిందమాణిక్య : ఇచ్చటినుండి వెడలిపొండు, బలిని తీసుకొనిపొండు. రఘుపతీ, విని లేదా నా ఆదేశమును ?

ఘు పతి : వినలేదు.

గోవిందమాణిక్య : అటులైన, నీవు ఈ రాజ్యపువాడివి కావు.

రఘుపతి : కాను నేను. నేనున్న చోటికి, రాజదండము వచ్చిన రాజహస్తములనుంచి అది జారి క్రిందపడిపోవును. మట్టిలో మకుటము జీరాడగలదు. ఎవరురా అక్కడ. తీసుకురా తల్లిపూజను.

[వాద్యములు మ్రోగును]

గోవిందమాణిక్య : నిశ్శబ్దముగ నుండుడు. (అనుచరులతో) సేనాపతి ఎచ్చటనున్నాడో, పిలిచి తీసుకొనిరండు. అయ్యో, రఘుపతీ, కడపటికి సైన్యములతో ధర్మమును చుట్టుముట్టి కాపాడవలసివచ్చెనే ! సైనికదళముల పిలువ సిగ్గగుచున్నది. బాహుబలము దుర్బలతను స్మరణకు తెచ్చును.

రఘుపతి : అవిశ్వాసీ, కలియుగమున బ్రాహ్మణతేజము పోయినదనే నిజముగ నీవు నమ్ముచున్నావా— అందుకనేనా యీ దుస్సాహసము ? పోలేదు.

ఏ దీప్తఅనలము నా హృదయమున మండుచున్నదో, అది నిశ్చయముగ నీ సింహాసనమును అంటగలదు. లేకున్న చిత్తంపుచిచ్చునందు సర్వశాస్త్రములను, సర్వబ్రాహ్మణ గర్వములను, సమస్త ముప్పదికోట్ల మిథ్యలను కాల్చి బూడిదచేసెదను.

మహారాజా, రాజాధిరాజా నేడుకాదు. మరొకదినమున అని నేడే జ్ఞప్తి యుంచుకొనుము.

నయనరాయలు, చంద్రపాలుల ప్రవేశము

గోవిందమాణిక్య : (నయనరాయనివైపు) జీవబలిని నిషేధించుటకై సైన్యముతో ఇచ్చట నిలువుము.

నయనరాయలు : ఈ అధమకింకరుని మన్నింపుము. దేవతామందిరమున రాజభృత్యులు అసమర్థులు. రాజప్రతాపము సాగినంతదూరము మేమును నీడలవలె వెంట పోగలము.

చంద్రపాలుడు : నిలువుము, సేనాపతి. దీపశిఖ ఒకచోట నున్నను, దీపకాంతి బహుదూరము చనును. రాజాభిలాష పోయిన స్థలముననే మనము వెడలుదుము.

గోవిందమాణిక్య : సేనాపతీ, నా ఆజ్ఞలు నీ తర్కవితర్కములకు గురికాజాలవు. ధర్మాధర్మములు, లాభనష్టములు నావిగా నున్నవి. కార్యము మాత్రము నీవు చేయవలసి యున్నది.

నయనరాయలు : ఈ మాట నా హృదయము ఒప్పుటలేదు.

మహారాజా, భృత్యుడను నిజమే, అయినను నేను మానవుడనుకూడ. బుద్ధి కలదు, ధర్మము కలదు, ప్రభువు ఉన్నాడు, దేవతయు గలదు.

గోవిందమాణిక్య : అటులైన అస్త్రముల పెట్టివేయుము. చంద్రపాలా, నిన్ను సేనాపతిగ నియమించుచున్నాను. రెండు పదవులను నీవే నిర్వహించుము. జాగరూకతతో సైన్యములతో మందిరమును కాపాడుము.

చంద్రపాలుడు : మహారాజా, మీ ఆదేశప్రకారమే.

గోవిందమాణిక్య : నయన్, నీ అస్త్రముల చంద్రపాలున కొసగుము.

నయనరాయలు : చంద్రపాలునకా ? ఏల మహారాజా ? ఈ అస్త్రములను పూర్వము మీ రాజపితామహుండు మా పితామహునకిచ్చెను ; తిరిగి తీసికొనదలచిన, నీవే తీసికొమ్ము. స్వర్గమునందున్న ఓ పితృపితామహులారా, మీరే సాక్షులు. యజ్ఞముచేయువాని హోమమునువలె, ఇన్నిదినములుగ ఏ రాజవిశ్వాసమును బహుయత్నమున పాలించిరో, అట్టి మీరే చూడుడు. ఈ అస్త్రముల స్వంతదారునికి, వీటిని ఎట్టి కళంకములేకనే నేడు ఇచ్చివేయు చున్నాను.

చంద్రపాలుడు : సోదరా : ఒకమాట.

నయనరాయలు : ఛీ. ఊరకుండుము.

మహారాజా : సెలవు పుచ్చుకొనుచున్నాను.

[ప్రణామపూర్వకముగ ప్రస్థానము]

గోవిందమాణిక్య : రాజకార్యముల స్వల్పస్నేహములకు తావులేదు. దేవతయొక్క కార్యభారము తుచ్ఛమానవులపై — అయ్యో, ఎంత కఠినము.

రఘుపతి : ఇదేరీతి బ్రాహ్మణశాపము ఫలించగలదు. నిన్ను నమ్మియున్నవారి హృదయములు క్రమముగ దూరము కాగలవు. నిలుచున్న స్థానముకూడ బద్దలుకాగలదు.

జయసింహుని ప్రవేశము

జయసింహ : ఏర్పాట్లన్నియు పూజకై కానింపబడినవి. బలి ఆలస్యముగ నున్నది.

గోవిందమాణిక్య : బలి ఎవరికొరకు ?

జయసింహ : మహారాజా : నీవును ఇచ్చట నున్నివా : అటులైన నివేదన ఆలకింపుము. రెండు చరణములకడ ఒకే అనురోధము. ప్రభూ, నీ గర్వయుత ఆదేశమును ఉపసంహరించుకొనుము. మానవుడపై వేనిని మరుగుపరచి నిలువకుము.

రఘుపతి : ఛీ. జయసింహా, లెమ్ము, లెమ్ము, ఎవరి చరణములకు వంగి నమస్కరించు చున్నావు ? నేను గురువగు నతనికి ఈ ప్రపంచమున నా ఈ చరణములే ఏకైక శరణ్యములు. మూఢుడా, ఇటు చూడుము, గురుచరణములబట్టి క్షమాభిక్షను అడిగికొనుము.

రాజాదేశముతోనా దేవిపూజను మనము చేయుట? కరాళకాళీదేవి నీ దృష్టిలో ఇంత లెక్కలేనిదాయెనా? నిలిపివేయుము, పూజను. ఆపివేయుము, బలిని—రాజదర్పము ఎన్నాళ్ళుండునో చూచెదముగాక! జయసింహా! వచ్చివేయుము.

[రఘుపతి, జయసింహుల ప్రస్థానము]

గోవిందమాణిక్య: ఈ పృథ్వియందు వినయమనున దెచ్చట నున్నది? మహాదేవి! నీ పదతలముల సంచరించువారును, తామెంత క్షుద్రులో తెలిసికొనజాలకున్నారే! అయ్యో, నీ మహిమను హరించి గైకొనుచున్నారు, వారి దేహములలో ఇంత అహంకారము ప్రవహించుచున్నది.

[ప్రస్థానము]

# ద్వితీయాంకము

## ప్రథమ దృశ్యము

### మందిరము

**రఘుపతి, జయసింహ, నక్షత్రరాయలు**

**నక్షత్రరాయలు :** గురుదేవా, నన్నేల పిలిపించితిరి ?

**రఘుపతి :** నిన్నరాత్రి దేవి స్వప్నమున కాన్పించి 'నీవు రాజువయ్యెద' వని చెప్పినది.

**నక్షత్రరాయలు :** నేను రాజునయ్యెదనా ! ఆహా, ఏమి చెప్పుచున్నారు స్వామీ ! రాజునయ్యెదనా ! ఈ మాటను క్రొత్తగ వినుచున్నానే !

**రఘుపతి :** నీవు రాజువయ్యెదవు.

**నక్షత్రరాయలు :** నాకు నమ్మకము కుదురుటలేదు.

**రఘుపతి :** దేవి స్వప్నము యథార్థము. రాజ్యాభిషేకమును నీవు పొందగలవు సందేహము వలదు.

**నక్షత్రరాయలు :** సందేహము వలదా ? ఒకవేళ పొందకున్న ?

**రఘుపతి :** నా మాటలో అవిశ్వాసమా ?

**నక్షత్రరాయలు :** అవిశ్వాసము కొంచెమైనను లేదు. కాని దురదృష్టవశాత్తు ఇది కాకున్న ?

**రఘుపతి :** అన్యథా ఎన్నటికిని కానేరదు.

**నక్షత్రరాయలు :** అన్యథా కాదా ; చూడుడు, స్వామీ, కడపటివరకు మాట నిశ్చయమే కదా ! రాజునై మంత్రిని దూరముగ నెట్టివేసెదను, వాడు నా తండ్రి తాతయని కాబోలు, అతనిదృష్టి ఎప్పుడును నామీదనే యుండును. అతడంటేనే నాకు భయమెక్కువ. నిన్ను మంత్రిని చేసెదను. తెలిసినదా స్వామీ.

**రఘుపతి :** మంత్రిపదవిని కాలితన్నెదను.

నక్షత్రరాయలు : సరే, జయసింహుడు మంత్రియగును. కాని స్వామీ, అన్నియు నీకు తెలిసియేయుండిన, ఎప్పుడు రాజునయ్యెదనో చెప్పుము చూచెదము.

రఘుపతి : దేవి రాజరక్తము కోరుచున్నది.

నక్షత్రరాయలు : రాజరక్తమును కోరుచున్నదా ?

రఘుపతి : తొలుత రాజునెత్తురు తెమ్ము, తర్వాత రాజువయ్యెదవు.

నక్షత్రరాయలు : ఎచ్చట దొరకును.

రఘుపతి : గృహముననున్న గోవిందమాణిక్యుని రక్తమే కోరుచున్నది.

నక్షత్రరాయలు : గోవిందమాణిక్యుని రక్తమే కోరుచున్నదా ?

రఘుపతి : స్థిరముగ నుండుము. జయసింహా, తత్తరపడకుము.

తెలిసినదా—వినుము—రహస్యముగ అతనిని వధించి, ఆ వేడి రాజరక్తమును దేవిచరణములకడకు తెమ్ము.

జయసింహా, స్థిరముగ నుండలేకపోయిన, మరొకచోటికి పొమ్ము.

తెలిసినదా, నక్షత్రరాయా, దేవి ఆదేశము రాజరక్తమును కోరుచున్నది—శ్రావణపు కడపటి రాత్రిలోపల. మీరిద్దరు రాజభ్రాతలు కలరు—జ్యేష్ఠుడు చంపకూడనివాడైన—నీ రక్తము కలదు. మహాకాళి దప్పికగొన్నప్పుడు, విచారించుటకు సమయము లేదు.

నక్షత్రరాయలు : అంతయు తలక్రిందులాయెనే. స్వామీ, రాజత్వమున పని ఏమి ? రాజరక్తము రాజదేహమున ఉండనిమ్ము. నే నున్నట్లుగనే ఉండుట మేలు.

రఘుపతి : వేరుమార్గము లేదు, మరే ఉపాయమును లేదు, రాజరక్తము తెచ్చియే తీర వలయును.

నక్షత్రరాయలు : స్వామీ, ఏమిచేయవలెనో తెలియపరచుము.

రఘుపతి : సిద్ధముగ నుండుము. నేను చెప్పినపుడు ఆలస్యములేక కార్యమును నిర్వహింపుము. కార్యసిద్ధి కానంతవరకు, నోరుమూసికొని ఉండుము. ఇప్పటికి పొమ్ము.

నక్షత్రరాయలు : ఓ తల్లీ, కాత్యాయనీ.

జయసింహ : ఇదేమి వింటిని ! దయామయీ తల్లీ, ఇదెట్టి మాట ! ఇది నీ ఆనయేనా ! సోదరునిచే సోదరహత్య ! ! విశ్వజననీ !

గురుదేవా ! ఇట్టి ఆజ్ఞను తల్లి ఆజ్ఞయని చెప్పివేసితివా ?

రఘుపతి : మరే ఉపాయమున్నదో చెప్పుము.

జయసింహా : ఉపాయమా ? దేని ఉపాయము ప్రభూ, ఛీ, ఛీ, జననీ ! నీహస్తమున ఖడ్గములేదా ? నీరోషమున వజ్రానలములేదా చండీ ? నీకోరిక ఉపాయముల వెదకుటయా ?

దొంగలవలె పాతాళమునకు దారిచూపు సొరంగమార్గముల త్రవ్వుటయా ! అబ్బా, ఇదెట్టి పాపము.

రఘుపతి : పాపపుణ్యములు నీకే తెలియును కాబోలు !

జయసింహా : సర్వము నీవద్దనే నేర్చితిని.

రఘుపతి : అటులైన రమ్ము, బిడ్డా, ఇంకొక పాఠము నేర్పెదను. పాపపుణ్యములు లేనేలేవు. ఎవరు సోదరులు ? ఎవరు తమవారు ? ఎవరు ఇతరులు ?

హత్యాకార్యము పాపమని ఎవరు చెప్పిరి ? ఈ జగత్తే గొప్ప హత్యారంగము. ఒక్కొక్క రెప్పపాటుకాలములో లక్షలకొలది ప్రాణములు పెద్దనిదుర చెందుచున్నవి. అది ఎవరి లీల ? ఈ ధరణీధూళి హత్యలచే నిండి నిబిడీకృతమైయున్నది. ప్రతిఅడుగున నూర్లకొలది కీటకములు రాళ్ళక్రింద నలిగిపోవుచున్నవి. అవి జీవములుకావా ?

వృద్ధమహాకాలము, విశ్వపత్రములమీద జీవుల క్షణిక ఇతిహాసముల నిరంతరము రక్తాక్షరములతో వ్రాయుచున్నది.

అరణ్యములో హత్య, మానవనివాసములలో హత్య, విహంగనీడములలో హత్య, కీటకగహ్వరములలో, అగాధసాగరసలిలములలో, నిర్మలాకాశమున ఎటుచూచినను హత్యయే. జీవితముకొరకు హత్య, వినోదముకొరకు హత్య, అకారణమున హత్య, అనిచ్ఛావశమున హత్య !

సమస్తవిశ్వము హత్యచే ప్రేరితమై, ఎగడుపిరితో, ప్రాణముల నొడ్డి, పులిచే తరుమబడిన జింకవలె, ఒక్క నిముసమైనను నిలుపనేరక సదా పరుగిడుచున్నది.

కాళస్వరూపిణియగు మహాకాళి తృషాతీక్ష్ణమగు లోలజిహ్వను చాచి నిలిచియున్నది. పిండబడిన ద్రాక్షాఫలములనుండి రసమువలె, విశ్వముయొక్క నాలుగు దిశలనుండి ప్రవహించి, చిరరక్తధార ఆమె అనంతకపాలపాత్రము సంపు వచ్చిపడుచున్నది.

జయసింహా : నిలుపు, నిలుపు. మాయావినీ, పిశాచినీ, మాతృహీనమగు ఈ ప్రపంచమునకు మాతృధర్మవేషమున రక్తపానపులోభమున ఏతెంచితివా ? కాపులేని గూండ్లలో ఆకొన్న పక్షిపిల్లలు తల్లికొరకై ఎదురుచూచుచున్నతరి, పేరాశతోనున్న టక్కరివాయసము

దగ్గరకువచ్చెన, తల్లియని భ్రమసి సంతసమున గొంతులుచాచి, కండ్లుతెరచని పిల్ల అరచి, అరచి, కఠినమగు చుంచుపొడుపులతో తమ కోమలప్రాణముల పోగొట్టుకొనును. అట్టి వాయసప్రవృత్తియా నీది! ప్రేమ మిథ్య, స్నేహము మిథ్య, ఇక ఉన్నది అనాది, అనంత హింసమాత్రము సత్యమా? అటులైన మేఘములనుండి, ఆశీర్వాదముగ వృష్టిధారలు దగ్ధ ధరణీవక్షముపై ఏల పడుచున్నవి? మరుభూములపై కనికరముతో కరిగి పాషాణముల నుండి దయామయమగు స్రోతము ఏల ఏతెంచవలయును? కోటి కంటకముల శిరోభాగమున పుష్పము ఏల వికసించవలెను?

ప్రభూ! నన్ను మోసగించి పరీక్షింపదలచియున్నావు కాబోలు! మాతృభక్తి, రక్తమువలె హృదయమును చీల్చుకొని, పొంగివడునో లేదో చూడదలచితివా? మాతృపదముల నా హృదయమును బలియిచ్చితివే!

స్నేహపరిహాసవశమున, అదో నా తల్లి నవ్వుచున్నది. చూడుము— అవును, నీవు రాక్షసివే, పాషాణివే, అవును, ఓ నాతల్లీ, నీవు రక్తతృషార్తినివే. తీసికొందువా, తల్లీ నా రక్తమును—ఈ నీ జీవితముకొరకు నీ బిడ్డల జీవితముల తుదముట్టింపదలచితివా, అటులైన నా గుండెలోనే ఈ కత్తితో పొడుచుకొనెదను. ఈ తెగిన నాళములగుండ స్రవించు రుధిరము, నీకంత రుచికరమా! ఓ నా తల్లీ, నీవు నిజముగ రాక్షసివే, పాషాణివే.

గురుదేవా, నన్ను పిలుచుచున్నావా? నీ మోసమును నేను తెలిసికొంటిని. భక్త హృదయముల చీల్చి ఈ రక్తమును కోరుచున్నావా? నీవొసగిన వేదనపై జనని స్నేహ హస్తము పడినది. ఇప్పుడు దుఃఖముకన్న సుఖము నూరింతలు. కాని రాజరక్తమా! ఛీ, ఛీ భక్తిపిపాసినియగు తల్లినా, నీవు, రక్తపిపాసిని చేసినది.

రఘుపతి: అటులైన బలిదానము నిలిపివేయనిమ్ము.

జయసింహా: నిలిపివేయనిమ్ము.

కాదు, కాదు, గురుదేవా, నీకు మంచిచెడ్డలు తెలియును. సరళభక్తివిధానము, శాస్త్రవిధానముకాదు. తమకాంతితో, కండ్లు చూడనేరవు, అందుననే కాంతి ఆకాశము నుండి రావలసియున్నది. ప్రభూ, క్షమింపుము, క్షమింపుము ఈ దాసుని. ఈ మూఢుని సాహసమును క్షమింపుము.

ప్రభూ చెప్పుము. సత్యముగ మహాదేవి రాజరక్తమును కోరుచున్నదా.

రఘుపతి: అయ్యో, కుమారా, అయ్యో, కడపటికి నాయెడలనే అవిశ్వాసమా!

జయసింహా: అవిశ్వాసమా? ఎన్నడును లేదు. నిన్నువదలిన, నా విశ్వాసము ఎచ్చట నిలువగలదు! వాసుకి శిరచ్యుతమగు వసుధవలె, శూన్యమునుండి శూన్యమునకు దొరలి,

వినాశముపొందును. రాజశక్తమును కోరను, మహామాయా, ఆ శక్తమును నేను తెచ్చెదను. భ్రాతృహత్యమాత్రము జరుగనివ్వను.

రఘుపతి : దేవతా ఆజ్ఞ పాపము కానేరదు.

జయసింహా : పుణ్యమైనదానిని నేనే సంపాదించుకొనెదను.

రఘుపతి : అటులైన, బిడ్డా, సత్యము చెప్పెదను. ప్రాణముకన్న అధికముగ నేను నిన్ను ప్రేమించుచున్నాను— తల్లికన్న ఎక్కువ మమతతో శిశుకాలమునుండి నిన్ను నేను పెంచితిని. నిన్ను పోగొట్టుకొనజాలను.

జయసింహా : నా ప్రేమచే పాపమును సంభవింపనివ్వజాలను. నాదెడలిప్రేమపై శాపము పడునటుల చేయజాలను.

రఘుపతి : మంచిది; మంచిది; ఈ విషయము తర్వాత చూచెదము.— రేపు స్థిరము కాగలదు.

[ఉభయుల ప్రస్థానము]

## ద్వితీయ దృశ్యము

### మందిరము

అపర్ణా : పాట

ఓ పురవాసీ, ఓహో పురవాసీ
ఉపవాసిని, నేను, నిలంబడి ద్వారము ముందు

జయసింహా, ఎచ్చట జయసింహుడు. ఈ మందిరమున ఎవ్వరును లేరా!

ఎవరది! అచలమూర్తివై నీవు ఇచ్చట నిలచియున్నావా— మాటలు ఏమీ పలుకక, ప్రపంచములోని శ్రేష్ఠమగు వస్తువుల హరించుచున్నావా? పేదలమగు మేము దేనికొరకై ఏడ్చుచు, త్రోవత్రోవన తిరుగుచు చచ్చుచుందుమో, అది తానేవచ్చి నీ పదములకడ ఆత్మ సమర్పణ కావించును. దానితో నీకెట్టి ప్రయోజనము? లుబ్ధుడి ధనమునువలె, ఏల దానిని మందిరముక్రింద రాసులుగచేసి ఉంచుకొనుచున్నావు? ఈ దరిద్రప్రపంచముయొక్క సర్వ వ్యవహారములనుండి మరుగుపరచి దాచుచున్నావు.

జయసింహా, ఈ పాషాణురాలు నీకెట్టి సుఖము నివ్వగలదు, నీవద్ద ఏమి మాటలు చెప్పగలదు— ప్రాణపు గోపనపాత్రయందు ఏ సాంత్వనసుధను రాత్రింబవళ్లు చేర్చిఉంచు

చున్నది. చిత్తమున ఉపవసించుచున్న జయసింహా, ఎవరి మూయబడిన ద్వారముకడ కూర్చొనియున్నావు.

పాట

ఓ పురవాసీ, ఓహో పురవాసీ!
ఉపవాసిని, నేను, నిలంబడి ద్వారము ముందు
కనుదాన సుఖోత్సవముల్ ప్రతిసౌధమునందు
మధురంబగు వేణురవంబు నిరంతరము విందు.

రఘుపతి ప్రవేశము

రఘుపతి: ఎవతివే నీవు ఈ మందిరమున.

అపర్ణా: నేను బిచ్చమెత్తుకొనుదానను. జయసింహుడేడి?

రఘుపతి: మోసపుదానా, ఇచ్చటనుండి దూరముగ పొమ్ము. దేవి సామీప్యమునుండి జయసింహుని లాగివేయకోరుచున్నావా, ఉపదేవివై నీవు?

అపర్ణా: నావలన దేవికి ఎట్టి భయము! నా సర్వస్వము మ్రింగివేయునేమో యని నేనే ఆమెను చూచి భయపడుచున్నాను.

(పాడుచు, పాడుచు ప్రస్థానము)

వలదు నాకే వస్తుజాలము
ఉండబోనిట అధికకాలము
ఎచటనుండిటు ఎగిరివచ్చితినో, అటకు ఆడుచు పోదు
కనుడు మీరలు కడుసుఖమ్ముల
నవనవంబగు నుత్సవమ్ముల
ఇంట నవ్విక యింతకూడా మ్లానవంతముకాదు.

# తృతీయదృశ్యము

## మందిర సమ్ముఖమార్గము

జయసింహ: ఆలోచనాజాలములు దూరమైపోవుగాక, సందేహములు విచ్ఛిన్నమైపోనీ. ంతానరకమునకన్న, ఎంత క్రూరమైనను, కఠినమైనను కార్యమే మేలు. కార్యమునకు

అంత మున్నది, తలంపులకు ఎచ్చటను పొలిమేరలు లేవు — అవిరెపలె ఒక్క నిమునమున వేయిరూపములు దాల్చుచుండును. నాలుగువైపుల దారి డొంకల వెదకినకొలది, అవి దాగి, గాన్పించకపోవుచుండును.

అనేకములకన్న ఏకము లెస్స. గురుదేవా, నీవు సత్యము, నీ ఆదేశము సత్యము, నీవు కనబరచినదియే సత్యపథము, హత్య పాపముకాదు, భ్రాతృహత్య పాపముకాదు. రాజహత్య పాపముకాదు!—అదే సత్యము, అదే సత్యము. పాపపుణ్యములు లేవు; అదే సత్యము. ఈ ఆలోచనలన్నియు వృథా, ఈ విచారవివేకములన్నియు వృథ.

సోదరులారా! మీరందర రెచ్చటికి పోవుచున్నారు? నిశిపురమున తిరునాళ్ళ కాబోలు—తరుణ రమణీమణుల నాట్యము జరుగునా? నేనును వచ్చెదను—ఈ ధరలో ఎన్నెన్ని సుఖములు కలవు! తటముల ఒరసిపారు నదీతరంగములవలె, మధుర అంగముల నృత్యభంగిమల అందచందములు నల్గడల వెలయుచుండ, నిశ్చింతగ ఆనందసుఖమున అందరును నాల్గుదిశలనుండి పరుగిడుచున్నారు. తన్మయత్వపరచు కలగానము చెలరేగుచున్నది. హాసములు, పరిహాసములు, సర్వత్ర ఉత్సాహపరచుచున్నవి. ధరణీ శోభయు ఉజ్జ్వలమూర్తిరూపమున ప్రదర్శిత మగుచున్నది. నేనును వెడలుచున్నాను.

పాట

ఏవారు గయికొందురన్నా, నన్నిప్డు
సమర్పించుకో గోరినాడ;
మనసున్ కరగించి, పనుల కేమర
పించి, కొనిపొండు మీతోకూడ ॥

ఏ అందాల సంతకు అరుగుచుంటిరో జగత్ పథాన మీరు,
వెన్కబడ్డాను నా భారమును మోయుచును నేను
దివారాత్రములు మీ సుఖపు నవ్వులతీరు
చూచినంతట నా చిత్తము ఎట్టెట్టులో ఔను
అదో వరదవచ్చి తృటిన్ కందికిం గొట్టునట్లు
కొల్లగొట్టికొనిపొండు నన్, తెంచి నాదు యిక్కట్లు
పడియుండనిమ్ము నా మనోభారమునంతా
యిలువాకిల నీడ ॥ ఏ ॥

ఎంతెంత రాకపోకలు, ఏమిటా తిరునాళ్ళ
ఇందరిలో ఎవరున్నారు నన్నెరింగినవాళ్ళ
ఇంతటి ప్రజాసమూహములో నన్ను పేరు
పెట్టి పిలువగలిగినవారెవ్వరున్నారు!—

ఒకతూరి నాముంగల తామె ఎవరో వచ్చి
నిలంబడినన్ నగుపెదవుల అరవిచ్చి
నేనామెను చూచినమాత్ర ముహూర్తము
లో గుర్తించగలాడ ॥ ఏ ॥

దూరమున అపర్ణ ప్రవేశించును

అదెవరు, అపర్ణయా! దూరముగ ఏల నిలువబడియున్నావు? జయసింహుడు పాట పాడుట నిశ్శబ్దముగ వినుచున్నావా?

అంతయు మిథ్య, బృహత్ ప్రవంచన, అందుననే నవ్వుచున్నాను. పాటలు పాడుచున్నాను. అందుననే అదో చూడుము, ఎట్టిచింతలులేక ప్రజలు మార్గములవెంబడి చనుచున్నారు. అందుననే, చిన్నవిషయములకై ఇంత కౌతుకహాసములు, ఇంత కుతూహలము, అందుననే ఇంతటిశ్రద్ధతో యువతీమణులు అలంకరించుకొనుచున్నారు. సత్యమగునెడల, ఇటుల జరిగియుండెడిదా? సహజముగనే యింతటి ఆనందము ఇచ్చట చెలరేగెడిదా?

అటులైన, వేదనచే విదీర్ణమైన పృథ్వియందు, విశ్వవ్యాప్తమగు వ్యాకులక్రందనములు అణగిపోయి, అనంతకాలముగ నిశ్శబ్దమైపోయెడివి. నిక్కముగ మురళి వేదనచే విలపించునెడల, దానిసంగీతమున వ్రక్కలై నీరవమైపోయెడిది.

కనుకనే మిథ్యయనియే ఇంతటి హాసము. శ్మశానపు అంకమున కూర్చొనియే ఆటలు, వేదన ప్రక్కన పరుండియే పాటలు. క్రూరవ్యాఘ్రి ఖరనఖములలో తగుల్కొనియే ప్రతిదివసపు కర్మకాండలు జరిగిపోవుచునేయున్నవి. సత్యమేయైయుండిన, ఇటుల జరిగెడిదా!

ఓ అపర్ణా, నీవును నేనును లేశమైనను సత్యములు కాము. అది తెలిసికొనియే సుఖముగ నుండుము. విషాదవిస్మయమున మనోహర నేత్రముల తెరిచి ఏల చూచుచు నిలచియున్నావు? రమ్ము చెలీ, ఇద్దరము కలసి — శూన్యనభస్థలమున రెండు లఘుమేఘ ఖండములవలె — ప్రపంచమార్గమును దాటి శాశ్వతముగ వెడలిపోదము.

రఘుపతి ప్రవేశము

రఘుపతి : జయసింహా!

జయసింహ : నిన్ను గుర్తించలేకున్నాను. నేను అదృష్టవంతుడనై నా మార్గమున దేలిపోవుచున్నాను. మార్గమున వేలకొలది జనులు పోవుచందముననే పోవుచున్నాను. నిలుమని చెప్పుటకు నీ వెవ్వరవు? నీవు వెడలిపొమ్ము. నేనును పోయెదను.

రఘుపతి : జయసింహా !

జయసింహా : అదిగో, సమ్ముఖమున సరళమార్గము పోవుచున్నది—చేతులలో భిక్షాపాత్రతో, వెంట నా చెలి భిక్షుకురాలితో వెడలిపోయెదను.

ఈ ప్రపంచ రాజమార్గము ఊహింపరాని జటిలమని ఎవరు నుడివిరి? ఎటు వెడలినను, దినావసానమున, జీవితపు అంతిమక్షణమును చేరగలను. ఆచారవిచారముల, తర్కవితర్కముల జాలములు ఎచ్చటనో అంతర్ధానము కాగలవు. ధరణి అంకమున క్షుద్రమును, పరిశ్రాంతమునగు నరజన్మమును సమర్పించెదను. మూడు, నాలుగుదినముల నా యీ వ్యాపకతను; మూడు నాలుగుదినముల తప్పిదంపుభ్రాంతుల, భయముల, సుఖదుఃఖముల, క్షీణహృదయపు ఆశల, దుర్బలతావశమున భ్రష్టము భగ్నము నగు ఈ జీవిత భారములను, గభీరవిశ్రామ అనంతకాలపు హస్తములలోనికి తిరిగి యిచ్చివేసెదను. ఇదేమో ప్రపంచము. శాస్త్రపక్షులతో, గురువుతో, ఏమి ప్రయోజనము?

ప్రభూ, తండ్రీ, గురుదేవా, ఏమి చెప్పితిని! ఇంతవరకు స్వప్నములో నుంటిని. ఇదో ఆ మందిరము. ఇదో ఆ మహావటవృక్షము, అటల, కఠిన, దృఢనిష్ఠురమగు సత్యమువలె నిలిచియున్నది దేవా, ఏమి చేయవలయునో మరువలేదు. ఇదో చూడుము, (కత్తిని చూపి) నీ ఆదేశస్మృతి లోపలను, వెలుపలను పదనుపెట్టుచున్నది. ప్రభూ, ఇంకను ఏమైన ఆదేశము ఉన్నవా?

రఘుపతి : మందిరమునుండి, ఆ బాలికను దూరమొనర్చుము; మాయావినీ, నీ ఐంద్రజాలము నా కెరుకయే. ఆమెను దూర మొనర్చుము.

జయసింహా : దూర మొనర్పవలెనా? నావలెనే నిరుపేద, మందిరమున ఆశ్రయము పొందినది. నావలెనే స్నేహితులు లేరు ఆమెకు. అకంటకమగు పుష్పమువలె నిర్దోషము, నిష్పాపము, శుభ్రము, సుందరము, సరళము, కోమలము; మరియు వేదనచే విలపించుచున్నది; ఆమెను దూరమొనర్చియే తీరవలయునా? అట్లనే కానించెద గురుదేవా!

అపర్ణా! వెడలిపొమ్ము. దయాదాక్షిణ్యములు, ప్రేమస్నేహములు అన్నియు మిథ్యలు. అపర్ణా చచ్చిపొమ్ము. ప్రపంచమున మరేమియు లేకపోయినను దయామయమగు మృత్యువున్నది. వెడలిపొమ్ము, అపర్ణా.

అపర్ణ : జయసింహా! ఈ మందిరమును వదలి నీవు వచ్చివేయుము. ఇద్దరము వెడలిపోవుదము.

జయసింహా : ఇద్దరమును వెడలిపోవుదమా! ఇది స్వప్నము కాదుకదా! ఒకతూరి స్వప్నమున ఈ జగత్తు స్వప్నమని తలంచియుంటిని. కావుననే సుఖముగ నవ్వితిని,

పాటలు పాడితిని. కాని ఇది సత్యమే. ఇక సౌఖ్యము సంగతి నెత్తకుము. స్వతంత్రపు ఆశను చూపింపకుము. సత్యంపు కారాగారమున నేను బందిని !

రఘుపతి : జయసింహా ! తియ్యని తలంపులకు ప్రొద్దులేదు. ఆ బాలికను దూరముగ పంపివేయుము.

జయసింహ : వెడలిపొమ్ము ! అపర్ణా.

అపర్ణ : ఏల పోవలెను ?

జయసింహ : ఇదె నీ నారీస్వాభిమానమా ?

అపర్ణ : ఇంక స్వాభిమాన మేమియున్నది ? జయసింహా ! నీ వేదన నా సకల వ్యథల కన్నను సమస్త గర్వములకన్నను అధికము. నాకు స్వాభిమాన మేమియు లేదు.

జయసింహ : అటులైన నేను పోయెదను. నీవిచ్చట ఉన్నంతకాలము నీ ముఖము నేను చూడజాలను. వెడలిపొమ్ము, అపర్ణా.

అపర్ణ : కర్కశ బ్రాహ్మణుడా, నీ బ్రాహ్మణత్వము పాడైపోను ! శూద్రనారిని ; అయినను, నీ బంధనములలో జయసింహుని బంధింపజాలవని నిన్ను శపించుచున్నాను.

[ప్రస్థానము]

రఘుపతి : బిడ్డా, తలయెత్తుము ; ఒకసారి మాటలాడుము. ప్రాణప్రియుడైనవాడా, ప్రాణాధికుడా ! నా ప్రాణమున, అగాధసముద్రమువలె, ప్రేమలేదా ? ఇంకను చెప్ప వలెనా ? నేను ఆజన్మస్నేహితుడనుగానా, రెండు నిముసముల మాయాపాశము భిన్నమై పోయిన, ఇంత క్లేశమా ?

జయసింహ : చాలును, ప్రభూ ! ఇక ప్రేమ విషయము చెప్పకుము. మనమున కర్తవ్యము మాత్ర మున్నది. స్నేహప్రేమలు తరులతాపత్రపుష్పములవలె ధరణిపై కాన్పించును, వెడలిపోవును. నవనవ స్వప్నములవలె శుష్కించి అదృశ్యమైపోవును. క్రింద, అనంతహృదయభారసమముగ, శుష్క, కఠిన పాషాణపంక్తి శాశ్వతముగ నుండును.

[ప్రస్థానము]

రఘుపతి : జయసింహా, ఎన్నోమిషలతో, శక్తులతో ప్రయత్నించినను నీ భావమును నేను లేశమైన గ్రహించలేకున్నాను.

[ప్రస్థానము]

## చతుర్థదృశ్యము

### మందిర ప్రాంగణము — జనులు

గణేష్: ఈసారి తిరునాళ్ళకు అంతమంది ప్రజలు రాలేదు.

అక్రూరుడు: ఈ సూరు మరి ఎల్లా వస్తారు ఎక్కువమంది ప్రజలు, ఇదేమో హిందువుల పరిపాలనగా లేదుగా! ఇదేదో తురకోళ్ళ ప్రభుత్వంగా మారిపోయింది! రాణిగారి బలి కూడ ఆపబడింది. ఇక తిరునాళ్ళకు ప్రజలను రమ్మంటే, ఎవరు వస్తారు?

కాను: అన్నా, రాజుకు ఇంతమాత్రం బుద్ధికూడా లేకపోయిందిరా. ఏదైనా భూతం పట్టిందేమో!

అక్రూరుడు: ఏదైనా పట్టియుంటే, సాహెబుల భూతమే పట్టివుండాలి, లేకపోతే బలిని ఎందుకు ఎగరగొట్టేస్తారు.

గణేష్: కాని ఏమైనాచెప్పు, ఈ రాజ్యానికి ఇక శుభము లేదు.

కాను: పురోహితస్వామి స్వయముగ చెప్పివేసినాడు, మూడునెలల్లోపల మహా జాడ్యాలతో దేశము నాశనమైపోతుందని.

హారు: మూడునెల లెందుకురా, ఇప్పుడు చూచేరకంగాఉంటే, మూడుదినాలుకూడా పట్టదు. చూడరా, మా మాధవుడు రెండున్నర సంవత్సరాలనుంచి జబ్బుతో మంచముపై పడి ఉండినాడు; కాని బతికే ఉండినాడు. బలిని నిలిపివేశారో లేదో, వాడు అమాంతంగా నీలుక్కుపోయాడు.

అక్రూరుడు: లేదురా, వాడు చచ్చి మూడునెలలైంచెరా!

హారు: మూడునెలలైందో, లేదోలే, కాని ఈపదే చచ్చిపోయినమాట నిజమేకదా!

క్షాంతమణి: ఒరే, అదెందుకు, మా బావకొడుకు చచ్చిపోతాడని ఎవరు అనుకున్నారు! మూడునాళ్ళ జ్వరము. వైద్యుని మాత్ర లోపలికి పోయిందో లేదో, కళ్ళు తేలవేశాడు.

గణేష్: మొన్న మొన్న మా ఊరిప్రక్క ఊళ్ళో, నిప్పు అంటుకున్నది? ఒక్క గుడిసెన్నా కుదురుగ్గా లేదు. అన్నీ బూడిదైపోయినాయి.

క్షాంతమణి: ఇన్నిమాటలు ఎందుకు? చూడరాదూ. ఈ ఏడు ధాన్యము చౌకైనంత ఎప్పుడూ కాలేదు. ఈతూరి రైతుల నొసట ఏమిరాసిందో ఎవరికి తెల్సు.

హారు: అదుగోరో, రాజు వస్తున్నాడు. పొద్దున్నే ఇటువంటి రాజుమొకము చూశాను; ఈవేళ ఎట్లాగ గడస్తదో. పో, పా, ఇక్కడనుంచి జరిగిపోతాము.

[అందరు ప్రస్థానము]

చంద్రపాలుడు, గోవిందమాణిక్యుల ప్రవేశము

చంద్రపాలుడు : మహారాజా, మిక్కిలి జాగరూకతతో నుండుము. నాల్గువైపుల కన్నుల, చెవుల తెరచియున్నాను, రాజుయొక్క మంచిచెడ్డలు ఏవియు నాకడ మరుగుపడ జాలవు. మహారాజా, నీ ప్రాణహత్యకొరకై గుప్త ఆలోచనలు జరుగుచుండుట స్వయముగ వింటిని.

గోవిందమాణిక్య : ప్రాణహత్య ! ఎవరు చేయుదురు ?

చంద్రపాలుడు : చెప్పుటకు సందేహించుచున్నాను. సత్యమగు కత్తికన్న, నిష్ఠురమగు వార్త అధికమగు వేదనను రాజహృదయమున కలిగించునేమోయని భయమగుచున్నది.

గోవిందమాణిక్య : నిస్సంకోచముగ చెప్పుము. అట్టి అఘాతమును సహించుటకై రాజ హృదయము సదా ఆయత్తముగనే యున్నది. ఇట్టి ఆలోచనలు ఎవరు చేయుచున్నారు ?

చంద్రపాలుడు : యువరాజు నక్షత్రరాయలు.

గోవిందమాణిక్య : నక్షత్ర ?

చంద్రపాలుడు : స్వకర్ణములతో వింటిని, మహారాజా. రఘుపతి, యువరాజు గోపనముగ మందిరమున కలసి, అన్ని విషయముల స్థిరపరచుకొనిరి.

గోవిందమాణిక్య : ఆజన్మబంధముల త్రెంచుటకు, రెండు నిముసములలో స్థిరపరచి వేసిరా ? అయ్యో, విధీ !

చంద్రపాలుడు : దేవతకడకు నీ రక్తమును తెచ్చియిచ్చుటకు.

గోవిందమాణిక్య : దేవతకడకా ! అటులైన నక్షత్రుని దోషము లేదు. దేవతపేరున మానవులు మానవత్వమును పోగొట్టుకొనెదరని తెలిసికొంటిని. భయములేదు, పొమ్ము నీ పనికి నీవు పొమ్ము. నేను సావధానముగ నుండెదను.

రక్తముకాదు, పువ్వులతెచ్చితిని. మహాదేవీ, భక్తిమాత్రమే, హింసకాదు, భీభత్స పరచు భీషణ స్వప్నము కాదు.

తల్లీ, జననీ, ఈ జగత్తున దుర్బలులు మిక్కుటముగ అసహాయులు. బాహుబలమే మిక్కిలి నిష్ఠురము, స్వార్థము మిక్కిలి క్రూరము, లోభము మిక్కిలి దారుణము ; అజ్ఞానము మిక్కిలి అంధము, గర్వము ఇంకు గొంకులు లేక క్షుద్రుల కాళ్ళక్రింద నలిపి, నులిమివేయుచు వెడలుచుండును. స్నేహము, ప్రేమ క్షీణవృంతములు ప్రేలాడుచుండు చోటున, స్వార్థస్పర్శచే ఒక్క నిముసములో ఊడిపడిపోవుచుండును.

తల్లీ, నీవును ఖడ్గమెత్తిన, నాలుక చాచిన, అంతయు అంధకార మగును. ఇక సోదరుడు సోదరుడుగా నుండజాలడు. పతియెడల సతి హానియగును. బంధువులే శత్రువు లయ్యెదరు, మానవవాస గృహములు శోణితమున పంకిల మగును. హింసయే పుణ్యమగును, దయ నిర్వాసిత మగును.

ఇక వలదు. ఇక వలదు, ఛద్మవేషము వదలుము. ఇంకను సమయముకాలేదా? ఇప్పటికిని నీ ప్రళయరూపము మిగిలి ఉండవలయునా? ఇదో నాల్గువైపులనుండి, నా శిరస్సునుద్దేశించి వేచియున్న ఖడ్గములన్నియు, మాతా, నీ చతుర్భుజములనుండియేనా? అటుల కాగలదా? అల్లే కానిమ్ము. బహుశా, నా రక్తపాతముచే హింసానలము ఆరిపోగలదు కాబోలు. ఇంతటి హింసను ధరణి సహింపజాలదు.

రాజహత్య! సోదరులచే సోదరహత్య! సకల ప్రజల హృదయములయందు వేదన తగులగలదు! సకల సోదరుల ప్రాణములు ఘోరున ఏడ్వగలవు, నా రక్తముచే హింసయొక్క మాతృవేషము ఊడముట్టగలదు, రాక్షసి ఆకారము ప్రకాశింపగలదు. ఇది నీ దయావిధానమేయైన, అటులనే కానిమ్ము.

జయసింహుని ప్రవేశము

జయసింహ : చండీ, చెప్పుము; నిజముగ రాజరక్తము కావలెనా? ఇప్పుడే చెప్పుము, నీ నోటితోనే చెప్పుము, మానవభాషలో చెప్పుము, వెంటనే చెప్పుము, నిజముగ రాజరక్తము కావలెనా?

నేపథ్యమున : కావలెను.

జయసింహ : అటులైన మహారాజా, నీ ఇష్టదేవతల ప్రార్థనల పూర్తిచేయుము. నీకాలము సమీపించినది.

గోవిందమాణిక్య : ఏమయ్యెను జయసింహా!

జయసింహ : నిజకర్ణములతో నీవు వినలేదా? నిజముగ రాజరక్తము కావలెనాయని అడిగితిని. దేవి స్వయముగ 'కావలెను' అని చెప్పినది.

గోవిందమాణిక్య : దేవి కాదు జయసింహా, వెనుకనుండి రఘుపతి చెప్పెను. పరిచిత మగు స్వరము!

జయసింహ : చెప్పినది రఘుపతియా? వెనుకనుండియా? వలదు, వలదు, ఇక వలదు. కేవలము సంశయములనుండి సంశయములకు దుముకుచుండజాలను. తీరమునకు రాగానే, ఎవరో నన్ను తిరిగి లోతుగనున్న ప్రవాహములోనికి నెట్టుచున్నట్లున్నది. అదే అవిశ్వాస మను దైత్యుడు. ఇక వలదు. గుడుపు కానీ, దేవికానీ, ఇదేమిటి!

కత్తిని క్రిందపడవేయును

పువ్వుల గైకొనుము తల్లీ, తీసికొనుము తల్లీ, పువ్వుల తీసికొనుము తల్లీ! పదముల తాకెదను, నీ కానుక కేవలము పువ్వులతోనే కానిమ్మా. ఇక రక్తము వద్దమ్మా! ఇక రక్తము వద్దు. ఇవికూడ రక్తమువలె ఎఱ్ఱగనున్నవమ్మా, ఈరెండు దాసాని పువ్వులు. బిడ్డల రక్తపాతముచే, బాధపడుచున్న భూదేవి ప్రేమవేదనవలె, పృథ్వియొక్క మాతృవక్షమును, చీల్చుకొని లేచి వికసించినవి. గ్రహించి తీరవలయును, వీనిని నీవు గ్రహించి తీరవలయును. నీ రోషమునకు నేను వెరచుటలేదు. రక్తమును ఇవ్వను. నీ కండ్లను ఎఱ్ఱచేయుచున్నావా! నీ ఖడ్గమును ఎత్తుము; నీ శ్మశానదళముల తెమ్ము. నేను మాత్రము భయపడను.

[గోవిందమాణిక్యుని ప్రస్థానము]

అయ్యో! ఇదేమాయెను! దేవి; గురువు—మరిఉన్న సర్వస్వము ఒక్కక్షణములో త్యజించితినే! ఇక జగతిలో మిగిలినదేది?

రఘుపతి ప్రవేశము

రఘుపతి: అంతయు వింటిని. అంతయు చెడిపోయెను. ఒరే కృతఘ్నుడా! ఏమి చేసితివిరా!

జయసింహ: ప్రభూ! శిక్షింపుము.

రఘుపతి: అంతయు ధ్వంసము చేసితివి. బ్రాహ్మణశాపమును సగముమార్గమునుండి మరల్పివేసితివి. గురువాక్యము నుల్లంఘించితివి. దేవి ఆదేశమును వ్యర్థ మొనర్చితివి. నీ బుద్ధినే అన్నిటికన్న అధికమైనదానిగ చేసితివి. ఆజన్మపుప్రేమఋణమును ఈరీతిగ గదా! నీవు తీర్చునది?

జయసింహ: తండ్రీ. శిక్ష నొసగుము.

రఘుపతి: ఎట్టిశిక్ష నొసగగలను?

జయసింహ: ప్రాణశిక్షను.

రఘుపతి: కాదు, దానికన్న గురుశిక్ష కావలెను. దేవి చరణముల స్పర్శింపుము.

జయసింహ: స్పర్శించితిని.

రఘుపతి: పలుకుము. నేను శ్రావణ అమావాస్యనాటికి దేవి చరణములకు రాజరక్తము తెచ్చియిచ్చెద!

జయసింహ: నేను శ్రావణ అమావాస్యనాటికి దేవి చరణములకు రాజరక్తమును తెచ్చి యిచ్చెద.

రఘుపతి: పొమ్ము.

# తృతీయ అంకము

## ప్రథమ దృశ్యము

మందిరము

కొంతమంది ప్రజలు, రఘుపతి, జయసింహులు

రఘుపతి : మీరందరు ఇచ్చటికేల వచ్చిరి?

అందరు : మేము అమ్మవారిదర్శనంకోసం వచ్చాం.

రఘుపతి : నిజమే, దర్శనముకోసము వచ్చితిరా? మీకింకా రెండుకళ్లు ఉండడము మీ అబ్బలపుణ్యము. అమ్మవారు ఎక్కడ. అమ్మవారు ఈ రాజ్యమును వదలి వెళ్ళి పోయినది.

అందరు : ఎంతటి ఆపత్తు! ఇదేమి మాట! స్వామి, మేమేమి చేశాము?

నిస్తారిణి : మా చెల్లెలి బిడ్డకు జబ్బుగా ఉంది. అందుకని కొన్నిదినాలు పూజచేయడానికి రాలేకపోతిని.

గోవర్ధన : నేను రెండుపొటేళ్ళను అమ్మవారికి ఇస్తామనే అనేక దినములుగ అనుకొంటున్నాను. ఇంతలోకే రాజు బలిని ఆపివేశాడు. నేనేమి చేసేది?

హారు : ఇడుగో మా గన్ధమాదనుడు మొక్కుకొని, చెల్లుబడి చేయలేదు, కాని అమ్మవారుకూడ వాడికి తగిన శాస్తిచేసింది. వాడి పిత్తకోశం పెరిగి మద్దెలమాదిరి అయిపోయింది. నేటికి ఆరుమాసాలనుంచి మంచంలో పడివుండాడు. మంచిదే అయింది. వాడు మనకు అప్పుసొప్పు యిచ్చేవాడని, తల్లిని మోసం చేయడమా!

అక్రూర : ఒరేయి ఊరుకోండిరా, ఊరక అల్లరిచేయకండి. అయ్యో, స్వామీ, అమ్మవారు ఎందుకు వెళ్ళిపోయింది? మేమేమి తప్పుచేశాము?

రఘుపతి : అమ్మవారికొరకు ఒక్కబొట్టు నెత్తురు ఇవ్వలేకపోతిరే, ఇదేకదా మీభక్తి?

చాలమంది : రాజుగారి ఆజ్ఞ. మే మేమి చేసేది?

రఘుపతి : రాజు ఎవడు ? తల్లి సింహాసనము, అయితే రాజు సింహాసనమునకు క్రిందనా : అయితే, ఈ తల్లిలేని దేశంలో, మీరాజుతోనే ఊరేగండి. చూస్తాము మీ రాజు ఎట్లా రక్షించునో.

[అందరూ గొణగొణమని వారిలోవారు మాట్లాడుదురు]

అక్రూర : ఊరుకోండిరా. బిడ్డలు తప్పుచేస్తే, తల్లి దండించాలగాని, ఒకేసారి వదలి పోవడం తల్లికి తగినపనేనా ? చెప్పండి, ఏమిచేస్తే, తల్లి తిరిగివస్తుంది.

రఘుపతి : మీ రాజు రాజ్యమువదలి వెళ్ళిననాడు, తల్లి ఈ రాజ్యములో అడుగుపెట్టును.

[మౌనముగ ఒకరొకరు ముఖములు చూచుకొందురు]

రఘుపతి : ఇదో మీరు చూడండి. ఇట్లారండి. అనేక ప్రాంతములనుండి ఎక్కువ ఆశతో అమ్మవారిని చూచుటకు వచ్చితిరి, ఒకసారి ఇట్లా చూడండి.

[మందిర ద్వారోద్ఘాటన. ప్రతిమ పశ్చాద్భాగము కాననగును]

అందరు : అదేమిటి ? అమ్మవారి ముఖము ఏ ప్రక్కన !

అక్రూర : ఒరే, తల్లి పెడమొగము పెట్టిందిరా.

అందరు : తల్లీ, తిరిగి నిలబడవమ్మా తల్లీ. తిరిగి నిలబడు. ఒక్కసారి తిరిగి నిలబడు. తల్లి ఏది, తల్లి ఏది ? మేము నిన్ను తిరిగి తెస్తాము, అమ్మా మేము నిన్ను వదలము. మాకు మా రాజు వద్దు. రాజు పోతేపోనీ, చస్తేచావనీ.

జయసింహ : (రఘుపతివద్దకు వచ్చి) ప్రభూ ! నేను ఒక్కమాట కూడ పలుకకూడదా ?

రఘుపతి : పలుకకూడదు.

జయసింహ : సందేహమునకు ఎట్టి కారణము లేదా ?

రఘుపతి : లేదు.

జయసింహ : అంతయు నమ్మియే తీరవలయునా.

రఘుపతి : అవును.

[అపర్ణ ప్రవేశము]

అపర్ణ : (ప్రక్కకు వచ్చి) జయసింహా, రమ్ము జయసింహా, ఈ మందిరమును వదలి శీఘ్రముగ రమ్ము.

జయసింహ : సత్రము బద్ధలగుచున్నది.

[రఘుపతి, అపర్ణ, జయసింహుల ప్రస్థానము]

రాజు ప్రవేశించును

ప్రజలు : మహారాజా, రక్షింపుము. మమ్ము రక్షింపుము, తల్లిని తిరిగి వచ్చేటట్లు చేయండి.

గోవిందమాణిక్య : బిడ్డలారా, వినుడు. తల్లిని తిరిగి తెచ్చుటయే నా హృదయపూర్వక మగు అభిలాష.

ప్రజలు : మహారాజుకు జై! మహారాజుకు జై!!

గోవిందమాణిక్య : ఒకతూరి మిమ్ముల అడిగెదను, మీరు తల్లిగర్భమున జనించలేదా? తల్లులారా, మాతృస్నేహసుధను మీ కోమలహృదయముల మీరు అనుభవించినవారలే.

చెప్పండి చూస్తాను. తల్లిలేదా! అన్నిటికన్న మాతృప్రేమ పవిత్రము, ప్రాచీనము; సృష్టియొక్క తొలిక్షణమునసే, మాతృప్రేమ మాత్రము ఒంటరిగ మేల్కొని, లేచి కూర్చుండి తరుణవిశ్వమును ఒడిలో గైకొని తన నేత్రములతో చూచుచుండెను.

నేడును ఆ పురాతన మాతృప్రేమ ధైర్యమూర్తియై నిలిచియున్నది. ఎన్నెన్ని ఉపద్రవముల, ఎన్నిశోకముల, ఎన్నివ్యథల, ఎన్ని అనాదరముల సహించినది. కండ్ల ఎదుటనే అన్నదమ్ములలో ఎంత రక్తపాతము, ఎంత నిష్ఠురత, ఎంత అవిశ్వాసము! నోట మాటలేక వేదనను సహించియు, దుష్టులకొరకు ఒడిచాచి, నిరపాయులగువారికై సమస్తహృదయమును సమర్పించి, తల్లి ఇప్పటికి కూర్చొనియున్నది. ఆ పరిమితిలేని ప్రేమ, అనాథప్రపంచమును చిరమాతృహీనమొనర్చి వెడలునంతటి అపరాధము మనమేమి చేసితిమి? బిడ్డలారా, తల్లులారా చెప్పుడు, నిర్భయముగ చెప్పుడు, అంతటి అపరాధమును చేసితిమా?

కొందరు : తల్లిపూజను నిషేధించితివి. తల్లి బలి ఆగిపోయెను.

గోవిందమాణిక్య : బలిని నిషేధించితిని; ఆ ఆగ్రహమునయా విముఖయగుట; మహా జాడ్యములు, దుర్భిక్షములు, అనావృష్టులు, అగ్నిదహనములు, రక్తపాతములు కలుగు చుండుట!

మన తల్లి అటువంటి తల్లియేనా? అనుక్షణము శిశువునకు స్తన్యమిచ్చి, రక్షించి పాలించు తల్లి, ఆ బిడ్డ రక్తపానపు ఆశతోనా, యింత ప్రేమ చూపించుట! ఇట్టి మాతృ అవమానమునకు మనమును స్థానమొసగిననాడు, అజన్మ మాతృప్రేమ స్మృతిలో విపరీత వేదన తగులలేదా?

తల్లి ముఖము మనస్సునకు రాలేదా? రక్తము కావలె, రక్తము కావలెనని తల్లి గర్జించుచున్నదా? నిస్సహాయ దుర్బలములగు జీవములు ప్రాణభయమున గజగజ వణకి పోవలయునా—దయాహీనులగు స్త్రీపురుషులు రక్తమత్తతతో చిందులు త్రొక్కుటయా! ఇదంతయు తల్లికి సంబంధించినదేనా? బిడ్డలారా! ఇదేనా మన తల్లియొక్క ప్రేమపు చిత్రము.

ప్రజలు: మూర్ఖులము మేము, మాకేమీ బోధపడదు.

గోవిందమాణిక్య: బోధపడదా! ఏదియు తెలియజాలని రెండునాళ్ళ బిడ్డకూడ తల్లిని తెలిసికొనునే! భయముకలిగిన తల్లివద్ద భయములేదని, ఆకలిగొన్న మాతృస్తనములలో క్షీరము లున్నవని, నొప్పిగలిగిన తల్లిముఖము చూచి యేడ్చుటకును సహితము ఆ బిడ్డకు తెలియునే!

తల్లిని మరచిపోవునంతటి ఏమరుపాటున, భ్రాంతిలో ఉన్నారా! మీరలు. మాత దయామయి అని తెలిసికొనలేకపోతిరా! జీవజననిపూజ జీవరక్తముతో కాదు, ప్రేమతో నని తెలిసికొనజాలకపోతిరా? భయమున్నచోట్ల తల్లిలేదని, హింసగలతావున మాత లేదని, రక్తము కారుచోట తల్లి కన్నీరును కార్చునని తెలిసికొనలేకపోతిరా?

ఓ బిడ్డలారా! తల్లి ముఖమున ఎంత వేదన, ఎంత విలపించు దయను కాంచితినో, కరుణాయుతమై తళతళ మెరయు ఆమె నేత్రములలో ఎంత తిరస్కారపూరితమైన దూషణను తిలకించితినో, మీకెట్లు జూపగలను? నేనే చూపగలిగితినేని, ఆ క్షణముననే మన తల్లిని మన తల్లియేయని మీరు తెలిసికొనెడివారలు.

దయామయి, మందిరద్వారముకడకు, మాతృసింహాసనమునుండి దిగి కళంకచిహ్నములను అశ్రుజలములతో కడిగి తుడిచివేయుటకు దీనవేషమున రాగా, నా అపరాధముచే రోషపూరితయై తల్లి నిష్క్రమించినదని మీరు అభిప్రాయపడుచున్నారే!

అపర్ణ ప్రవేశించును

ప్రజలు: నీవే గమనించి చూడుము, బిడ్డలపై తల్లి విముఖయైయుండుట.

అపర్ణ: (మందిరద్వారముపై నెక్కి) తల్లి విముఖ యాయెను! రమ్మా! తల్లీ మేము చూచునట్లు ఎదురుగా ఒకతూరి రమ్మా మాతా! (ప్రతిమను త్రిప్పి) ఇదో చూడుడు, తల్లి ముఖమును త్రిప్పినది.

అందరు: తల్లి తిరిగినది! జయము, జయము, మాతా! జయము.

[అందరూ కలసి పాడెదరు]

నిలువజాలకపోతివమ్మా
నిలువజాలకపోతివి

ఒడిలోని పెద్దల
వదలజాలకపోతివి
దోషముల్ తండోపతండం
బులను సల్పినవారము
క్షణిక రోషము కలిగియుంటివి
కడకు మోమును త్రిప్పి మాకున్
అభయపాదము లవంకున్ తీ
యంగజాలకపోతివి ॥ ని ॥

[అందరి ప్రస్థానము]

జయసింహ, రఘుపతుల ప్రవేశము

జయసింహ: సత్యము చెప్పుము, ప్రభూ, నీదేనా ఈ పని?

రఘుపతి: సత్యమేల చెప్పనేరను? సత్యము వచింప వెరచువాడనుకాను. ఇది నా పనియే. ప్రతిమ ముఖమును త్రిప్పినది నేనే. ఏమి చెప్పదలచితివో చెప్పుము. గురువుకు గురువైనావు, నీవు నన్నేమి భాషింపవలయునో భాషింపుము, ఏమి ఉపదేశము చేయవలయునో చేయుము.

జయసింహ: నాకు చెప్పుట కేమియు లేదు.

రఘుపతి: ఏమియును లేదా? నన్నడుగుట కెట్టి ప్రశ్నయు లేదా? మనమున సందేహము జన్మించిన దాని మీమాంసకై గురూపదేశమును కోరవా? ఓహో, ఇంత దూరమై పోతివా? మనస్సున ఇంతటి విచ్ఛేదము ఘటించెనా!

మూఢుడా, వినుము. సత్యముగ దేవి విముఖ మాయెను, కాని అట్లని ప్రతిమ ముఖము తిరుగజాలదు. మందిరమున మనము జరిపించు రక్తపాతమును దేవి పానము చేయును, కాని ప్రతిమాముఖమునకు ఆ రక్తము ఎక్కజాలదు. దేవత అసంతృప్తి ప్రతిమాముఖమున కనబడజాలదు. కాన మూర్ఖులకు తెలియపరచుటెటుల?

కండ్లు చూడనేరని వస్తువుల చూచుటకు కండ్లు కోరుచుండును, అందుననే మిథ్యతో సత్యమును తెలియపరచవలెను. మూర్ఖా, నీ, నా హస్తములలో సత్యము లేదు. సత్య ప్రతిమ సత్యముకాదు, మాటలు సత్యములు కావు, వ్రాయబడినవియు సత్యములు కావు. మూర్తి సత్యముకాదు. చింతలు సత్యములు కావు. సత్యము ఎచ్చట నున్నది? అది ఎవరికిని తెలియదు. ఎవరును దానిని పొందనేరరు.

ఆ సత్యమే కోటిమిథ్యారూపముల నాలుగువైపుల బద్ధమై పడియున్నది. అందుననే సత్యము మహామాయ యను నామమును వహించుచున్నది; దాని అర్థము మహా

మిథ్య యని. సత్యమను మహారాజు రాజ అంతఃపురమున కూర్చొనియుండును. శత మిథ్యలు దాని ప్రతినిధులై, నల్గడల ఆధిపత్యము చెలాయించుచుండును.

తలపై చేతులుపెట్టుకొని కూర్చొని మరల మరల ఆలోచించుము. నాకు అనేక పనులున్నవి. ప్రజల మనస్సులు మరల తిరిగిపోయినవి.

జయసింహ : ఏ తరంగము తీరమునకు కొనితెచ్చునో, అదే తిరిగి అగాధమధ్యమునకు లాగికొనిపోవును. సత్యము లేదు, సత్యము లేదు, సత్యము లేదు. అంతయు మిథ్య, మిథ్య, మిథ్య. దేవి ప్రతిమలో లేదు ; మరి ఎచ్చట నున్నది ? ఎచ్చటను ఆమె లేదు. దేవి లేదు. మిథ్యవగు నీవు ధన్యవు, ధన్యవు, ధన్యవు.

# ద్వితీయ దృశ్యము

ప్రాసాదకక్ష్యము—గోవిందమాణిక్య, చంద్రపాలుడు

చంద్రపాలుడు : ప్రజలు కుట్రలు పన్నుచున్నారు. మొగల్ సేనాపతి అస్సాంవైపు యుద్ధమునకై వెడలెను. దగ్గరనేయున్నాడు, మూడు నాల్గుదినముల ప్రయాణములోనే. నిన్ను సింహాసనమునుండి దూరమొనర్చుటకై మొగల్ సేనాపతికి ప్రజలు వర్తమానమును పంపెదరట !

గోవిందమాణిక్య : నన్ను దూరమొనర్చుటకా ? నాయెడ ఇంత అసంతృప్తియా ?

చంద్రపాలుడు : మహారాజా ! ఈ సేవకుని అనునయమును మన్నించుము. ఈ కఠిన ప్రజలకు పశురక్తము అంత ప్రీతికరమైన, వారికి పశువుల నిమ్ము. వారి రాక్షసప్రవృత్తి పశువులమీదనే పోనిమ్ము.

ఎప్పుడు ఏమి జరుగునో యని సర్వదా భయమగుచున్నది.

గోవిందమాణిక్య : భయమగుచున్నదని తెలియును, చంద్రపాలా, రాజకార్యముల భయముగలదని తెలియును. ఈ అపార జలరాశియందు సుడిగుండములు మెండుగ నున్నను, తరణి తీరమునకు కొనిపోవలసియేయున్నది. ప్రజలమాత మొగలులకడకు పోయెనా ?

చంద్రపాలుడు : ఇంతలో పోయియుండును.

గోవిందమాణిక్య : చంద్రపాలా, నీవును వెడలుము, మొగలుల శిబిరముకడ, దగ్గర దగ్గరగా ఉండి, ఎప్పుడు ఏమి జరుగుచుండునో, వార్తల పంపుచుండుము.

చంద్రపాలుడు: మహారాజా, ఇప్పుడు నాగరూపులతో నిండినది, ప్రత్యేక లోపల, బయటను శత్రువులు గలరు.

చంద్రపాలుని ప్రస్థానము, గుణవతి ప్రవేశము

గోవిందమాణిక్య: ప్రియా, ఈ ప్రపంచము మిగుల శుష్కము, మిగుల శూన్యము గదా! లోపల, బయటను శత్రువులు, నీవు వచ్చి క్షణకాలము నవ్వుచు నిలువబడుము; ప్రేమతో నా ముఖమువైపు చూడుము.

ఘోరనిశీథపు శిరోప్రాంతమున, నిర్నిమేషచంద్రుని మాదిరి, ప్రేమరహిత అంధకారములు, పతంత్రములు, విపత్తులు, విద్వేషములన్నిటిపైనను నీవు ఆవిర్భవింపుము. ప్రాణేశ్వరీ, ఏల నిరుత్తరవయి నిలచియున్నావు? అపరాధ విచారణములకు ఇదియేనా తరుణము? మరణోన్ముఖుడగువాని తృషార్తహృదయము ఎడారియందు జలములకోర, సుధాపాత్రను హస్తముల నిడి అతని దప్పికను తీర్చకనే వెడలిపోయెదవా!

[గుణవతి ప్రస్థానము]

వెడలిపోయెను.

అయ్యో, నా భరింపరాని జీవితము!

నక్షత్రరాయలు ప్రవేశము

నక్షత్రరాయలు: (స్వగతము) ఎచ్చటికి పోయినను, అందరును "రాజువయ్యెదవా, రాజువయ్యెదవా?" అని అనుచున్నారు. ఇది పెద్ద ఆశ్చర్యకర వ్యవహారముగ నున్నది. ఒంటరిగ కూర్చొనియున్నను, రాజువయ్యెదవా, రాజువయ్యెదవా, యని ఎవరో అడుగుచున్నట్లు వినుచుందును. రాజువయ్యెదవా, రాజువయ్యెదవా యని మాత్రము పలుకగల రెండు రామచిలుకలు నా చెవులలో నివాసముచేయుచున్నవా యనునట్లుండును. మంచిదే అట్లనే అయ్యెదను, కాని, నాయనా, రాజరక్తమును మీరు తెచ్చియిస్తారా?

గోవిందమాణిక్య: నక్షత్ర! (నక్షత్ర నివ్వెరపడిపోవును) నక్షత్ర! నన్ను నీవు చంపెదవా? చెప్పుము, సత్యము చెప్పుము, నన్ను చంపెదవా? అహర్నిశలు ఈ విషయమే నీ హృదయమున తాండవమాడుచున్నదా? ఈ విషయమును మనస్సున ఉంచుకొనియేనా నాతో నవ్వుచు మాట్లాడుచున్నావా, పాదముల ప్రణామముల చేయుచున్నావా, నా యాశీర్వాదముల గ్రహించుచున్నావా? మధ్యాహ్నభోజనవేళల ప్రక్క ప్రక్క కూర్చొని నాతో భోజనముచేయుటయు, ఈ మాటను మనస్సున ఉంచుకొనియేనా?

గుండెలో కత్తిని పొడిచెదవా? సోదరా! నీ చరణములు తొలుదొలుత ఈ కఠిన మర్త్యభూమిపై అడుగిడినపుడే, నా ఈ వక్షమున నిన్ను అదిమి ఎత్తుకొంటిని. జనని నీ శిరముపై తుదిసారి ప్రేమహస్తమునుంచి, ధరాధామమును శూన్యమొనర్చి వెడలిన

నాడు, నిన్ను ఈ వక్షమునకు అదిమి ఎత్తుకొంటిని— నేడు అట్టి నీవె ఆ వక్షముననే కత్తితో పొడిచెదవా ?

పితృపితామహులనుండి ప్రవహించుచు వచ్చి చిరదినములుగ సోదరుల నాళనాళముల యందు స్రవించి, మన ఇద్దరి శరీరములలో పారుచున్న రక్తధారను, నేడు ఆ నాళముల ఛిన్నమొనర్చి భూతలమున వర్షింపజేసెదవా ? ఇదో ద్వారమును మూసివేయుచున్నాను, ఇదో నా కరవాలము, నా అనాచ్ఛాదిత వక్షమున నీ మనస్సులోని అభిలాషలు పూర్ణమగు నటుల వ్రేయుము.

నక్షత్రరాయలు : క్షమింపుము, అన్నా క్షమింపుము.

గోవిందమాణిక్య : రా వత్సా ! తిరిగి రా, ఈ వక్షమునకు తిరిగిరమ్ము. క్షమించమని కోరుచున్నావా ? ఈ మాట విన్నతోడనే క్షమించుట పూర్తి ఆయెను. నిన్ను క్షమించుటకు నేను అశక్తుడను.

నక్షత్రరాయలు : ఈ దుర్బోధన రఘుపతిది. అతని బారినుండి నన్ను రక్షించుము.

గోవిందమాణిక్య : వత్సా, నీకు ఎట్టి భయమును లేదు.

## తృతీయ దృశ్యము

### అంతఃపురమున గది

గుణవతి : అటుల కాలేదు. కొన్నినాళ్ళు కఠినముగ నుండిన, ప్రేమ తృష్ణచేతనే లొంగివచ్చునని ఆశించితిని. ఇంతటి అహంకారము మనమున ప్రబలియుండెను. పెడ ముఖము పెట్టియుంటిని, మాటలాడకుంటిని, కంటతడి పెట్టక నిలిచితిని, కేవల శుష్క రోషమున, నిర్లక్ష్యమున అశ్రద్ధతో కొన్నినాళ్ల గడిపితిని. స్త్రీల రోషము పురుషులకడ, శోభామయమే యగును. అది రత్నదీప్తివలెనే వెచ్చదనములేనిదని వినియున్నాను. ఛీ, ఛీ, అట్టిశోభ !

ఈ రోషము వజ్రాయుధమువలె తీవ్రమైయుండిన, ప్రాసాదముపై పడెడిది, రాజ సుషుప్తిని భగ్నమొనర్చెడిది, రాజ అహంకారముల చూర్ణమొనర్చెడిది, రాజమహిమను పూర్ణమొనర్చెడిది.

నేను రాణిననెడి మిథ్యావిశ్వాసమును ఏల కలుగజేసితివి, ఓ హృదయాధీశ్వరీ ! ఇట్టి మంత్రమును అనుదినము నా కర్ణములలో ఏల ధ్వనింపనిచ్చితివి. నేను రాజుచే కొన

ఒడిన భాసినను, అతని దాసినిమాత్రమే, రాణినికాను అని నాకేల తెలియకపోతివి? అట్లు తెలిపియుండిన, నేడు హఠాత్తుగ సంభవించిన ఈ అఘాతమును, ఈ పతనమును సహింప వలసివచ్చెడిదికాదు.

ధ్రువుని ప్రవేశము

ఎక్కడికి పోవుచున్నావురా?

ధ్రువుడు: రాజు నన్ను పిలిచినాడు.

[ప్రస్థానము]

గుణవతి: ఈ బాలుడే రాజహృదయరత్నము.

ఒరే బాలకా, నా బిడ్డలకై నియమితమైన ఆసనమును దొంగిలించి తీసికొంటివి. నాకు బిడ్డలు పుట్టలేదని, వారి తండ్రిప్రేమపై భాగముకొరకు ప్రాకులాడుచున్నావు. రాజ హృదయపు సుధాపాత్రనుండి నీవే మొదటి గుక్కను పుచ్చుకొంటివి, రాజకుమారులు వచ్చినపుడు నీ ఎంగిలి ప్రసాదమునా వారు పొందుట, ఒరే రాజద్రోహి.

తల్లీ! మహామాయా, ఎంతటి నీ ఉపేక్ష! ఎంత సృష్టి, ఎన్ని లీలలు నీవి! నీ లీలావిలాసములలో ఒక్క బిడ్డను నాకు ప్రసాదింపుము. జననీ అనుగ్రహింపుము. నా ఒడిని నింపు, ఇంతటి చిన్న శిశువునే కనికరింపుము. నీవు దేనిని మిక్కిలిగ ప్రేమిం చెదవో, దానినే నీకు సమర్పించెదను.

నక్షత్రరాయని ప్రవేశము

నక్షత్రా, ఎచ్చటికి చనుచున్నావు? తిరిగిపోవుచున్నావేల? నీ కంతటి భయమెవరి వలన? నేను స్త్రీని, నిరస్త్రను, బలహీనను, నిరపాయను, అసహాయను నేను అంతటి భయంకరముగ కాన్పించుచున్నానా?

నక్షత్రరాయలు: వలదు. వలదు. నన్ను పిలువకుము.

గుణవతి: ఏల, ఏమాయెను.

నక్షత్రరాయలు: నేను రాజుకాను.

గుణవతి: కాకపోయిన కాకపోయెదవుగాక; అట్లని ఇంతటి విరవీగుట యేల?

నక్షత్రరాయలు: చిరకాలము రాజు బ్రతకవలయును. నేను యువరాజుగనే ఉండి చచ్చెదను.

గుణవతి: అట్లనే చావుము. శీఘ్రముగనే చావుము. నీ మనోరథము పూర్ణమగును గాక. బ్రతికియే యుండుమని నీ కాళ్లపైబడి వేడుకొంటినా?

సక్షత్రరాయలు : సరే, వచ్చితిని. ఏమి చెప్పదలచితివో, చెప్పుము.

గుణవతి : నీ మకుటమును దొంగిలించిన చోరుని తొలగదీయుము. బోధపడెనా ?

సక్షత్రరాయలు : అంతయు బోధపడెను. ఆ చోరు డెవడో మాత్రము బోధపడలేదు.

గుణవతి : అదుగో, ఆ బాలకుడు ధ్రువుడు. రాజు ఒడిలో పెరుగుచున్నాడు. దినదినము పొడుగై కిరీటమువైపు పెరుగుచున్నాడు.

నక్షత్రరాయలు : అది నిజమే. ఇప్పటికి అంతయు బోధపడినది. ధ్రువుని శిరస్సుపై నిజముగ మకుటమును కాంచితిని, అది అంతయు ఆట అని తలచితిని.

గుణవతి ; కిరీటముతో ఆటలు! పెద్ద చావుతో ఆటలుసుమా! ఈ ఆటల ఈతూరి నిలిపివేయుము — లేకపోయిన ఈ ఆటల ఆటబొమ్మవు నీ వయ్యెదవు.

నక్షత్రరాయలు : అది నిజమే. ఇది అంత మంచి ఆటకాదు.

గుణవతి : నేడు అర్ధరాత్రమున, గోపనముగ అతనిని తీసుకవెళ్ళి దేవి చరణముల నా పేరున నివేదించుము. అతని రక్తముచే దేవి రోషానలము చల్లారగలదు. ఈ రాజ వంశముననే సింహాసనము స్థిరముగ నుండగలదు. పితృలోకము నీ మంగళగీతముల పాడగలదు. బోధపడినదా ?

నక్షత్రరాయలు : బోధపడినది.

గుణవతి : సరే పొమ్ము. చెప్పినది చేయుము. జ్ఞప్తి యుంచుకొనుము ; నా పేరున నివేదింపుము.

నక్షత్రరాయలు ; అట్లనే కాగలదు. కిరీటముతోనా ఆటలు! సర్వమును నాశనము కాగలదు! దేవికి సంతోషము, రాజ్యరక్షణ, పితృలోకము — బోధపడుటకు ఇక ఏమియు మిగిలిలేదు.

# చతుర్థదృశ్యము

మందిర సోపానముల జయసింహ

జయసింహ : దేవీ, ఉన్నావా ? నిలిచి ఉన్నావా ? ఈ నీమరజనియొక్క కట్టకడపటి భాగముననైనను ఒక్క క్షణమాత్రముగనైన ఉంటివేని, అచ్చటినుండి మిక్కిలి చిన్న స్వరముననైన పలుకుము, 'వత్సా, ఉన్నాను' అని నాతో చెప్పుము

లేదు, లేదు. లేదు, దేవిలేదు. లేదా? దయచేసి, జయసింహునిపై దయచేసి, సత్యమై రమ్ము. నా ఆ శైశవభక్తి, నా ఆజన్మప్రేమ నీకు ప్రాణ మొసగజాలదా? ఇంతటి మిథ్యవా నీవు?

జయసింహా, నీ అసువులను ఎవరికి అర్పించితివి? సత్యశూన్యము దయాశూన్యము మాతృశూన్యము సర్వశూన్యమగు స్థానమున సర్వము పారవైచితివే!

అపర్ణ ప్రవేశము

అపర్ణా! మరల వచ్చితివా? మందిరము వెలుపలికి వెళ్ళగొట్టితిమి, అయినను నీవు అనుక్షణము, దరిద్రుని మనమున సుఖంపు దురాశవలె, ప్రక్క-ప్రక్క- నల్గడల, చుట్టిచుట్టి తిరుగుచున్నావే! సత్యము మిథ్యల మధ్యగల ప్రభేదము ఇదే. మిథ్యను మందిరమధ్యమున బహుయత్నమున ఉంచుచున్నాము, అయినను అది ఉండియు ఉండకున్నది, సత్యమును మందిరము వెలుపలికి అనాదరమున వెళ్లగొట్టినను, తిరిగితిరిగి వచ్చుచుండును.

అపర్ణా, వెళ్ళకుము. ఇక నిన్ను వెడలగొట్టను. రమ్ము, ఇచ్చట ఇద్దరము కూర్చుందము. చాల రాత్రి అయినది. తరు అంతరాళముల కృష్ణపక్షశశి ఉదయించుచున్నది. చరాచరము లన్నియు సుప్తిమగ్నములు. మన మిద్దరము మాత్రమే జాగరణ చేయుచున్నాము.

అపర్ణా, విషాదమయీ, మాయాదేవత నిన్నుగూడ మోసగించి వెడలిపోయెనా? దేవతచే ఏమి ఆవశ్యకము? మన క్షుద్రసుఖమయ ప్రపంచమునకు ఆమెను పిలిచి తెచ్చుటేల? ఆమెకు మన వ్యథలు ఎట్లు అర్థముకాగలవు? పాషాణమువలె ఊరక చూచుచుండును. మన సోదరుల మన ప్రేమనుండి వంచితమొనర్చి, ఆ ప్రేమను ఆమెకు అర్పించుచున్నాము, కాని దానివల్ల ఆమెకుగల ప్రయోజనమేమి?

ఈ సుందర ఆనందమయమగు పృథ్వినుండి చూపుత్రిప్పి ఆమెపైపు చూచుచుందెదము. కాని ఆమె ఎటుచూచుచుండును? ఆమెవద్ద స్వల్పము, తుచ్ఛమేయైనను, అది మన మాతృధరణికదా! ఆమెకు పురుగులతో సమానమేయైనను వారు మన సోదరులు గదా! అవహేళనమున అంధరథచక్రములక్రింద నలిగి ముక్కలైపోయినను, అట్లు నలిగి ఉపేక్షింపబడినవారు, మనకు అత్యంతము కావలసినవారలేగదా!

రమ్ము, చెలీ, నిర్భయముగ దేవతాహీనులమై, ఇంకను దగ్గరదగ్గర కలసిమెలసి ఉందెదము.

రక్తము కావలెనా? స్వర్గపు ఐశ్వర్యముల త్యజించి ఈ దరిద్రధరాతలమునకు బిందులకొరకే వచ్చితివా? అచ్చట మానవులు లేరు, ఎట్టిజీవులును లేదు, రక్తము లేదు,

వ్యధపొందుటకు ఏదియులేదని స్వర్గము అరుచియాయెనా! మానవక్షుద్రపరివారము నివాసముల నిర్మించుకొన్న భూప్రదేశమునకు నిర్భయ, విశ్వాససుఖమున వేటకై బయలు దేరితివా?

అపర్ణా, చెలీ, దేవిలేదు.

అపర్ణ: జయసింహా, అటులైన ఈ మందిరమును విడిచి వచ్చివేయుము.

జయసింహ: వచ్చెద, వచ్చెద, అట్లనే వచ్చెద, వదలి వచ్చెద. అయ్యో, అపర్ణా, అందుననే వచ్చివేసెద.

జన్మించిన నాటినుండి నివసించిన రాజ్యమున, ప్రభువుకు చెల్లించవలసిన ముడుపులన్నియు పూర్తిగ చెల్లించిన పిదపనేగదా పోగలుగుదును. ఆ మాటలన్నియు అటుండనిమ్ము.

చూడుము, గోమతీ నదీ శీర్ణజలరేఖ వెన్నెలలో పులకితమగుచున్నట్లున్నది. దాని కలధ్వని ఒకేమాటను నూరుసారులు నొక్కి చెప్పుచున్నట్లున్నది. ఆకసమున అర్ధచంద్రుని పాండుముఖకాంతి బడలి వాడియున్నది. బహురాత్రిజాగరణమున కాబోలు, చంద్రుని చక్షువులపై నిద్రాభారముచే పద్మములు సగము సగము మూసికొని వచ్చుచున్నవి. జగత్తంతయు సుందరముగ మనోహరముగ నున్నది.

అపర్ణా, ఇట్టి రాత్రిమధ్యను, దేవిలేదు. దేవిమాట సరే. అపర్ణా, సుఖముతో సుధతోనిండిన ఏవేని విషయములు తెలియునా? అవి మాత్రము చెప్పుము. వేనిని వినిన ముహూర్తమున అతలమున మగ్నమై జీవితతాపముల మరచిపోగలనో, మరణము ఎంత మధురతామయమో యిందుగనే దానిరుచిని పొందునట్టి విషయముల, అపర్ణా, నీ మధుకంఠమున, ఆ నీ మధుభార నిమీలితనేత్రముల నా ముఖమువైపు నిగుడ్చి చెప్పుము.

ఈ జనహీన స్తబ్ధరజనియందు, ఈ సమస్త జగత్తుయొక్క నిద్రామధ్యమున, చెప్పుము అపర్ణా, వేటిని విని, 'నాలుగువైపుల మరేమియులేదు, కేవలము ప్రేమ తేలుచున్నది—పూర్ణిమ సుప్తరాత్రమున రజనీగంధపుష్ప పరిమళమువలె,' అని మదిని హత్తుకొను మాటల పలుకుము.

అపర్ణ: అయ్యో, జయసింహా! ఏమియు చెప్పజాలక యున్నాను. ఎన్నో విషయములు మనమున ముకుళించి యున్నవి కాబోలు!

జయసింహ: అటులైన ఇంకను దగ్గరకు రమ్ము, మనస్సునుండియే మనస్సునకు ఆ విషయముల ప్రవహింపనిమ్ము.

ఇదేమి చేయుచున్నాను, అపర్ణా, అపర్ణా! వెడలిపో మందిరమును వదలి! ఇది గురు ఆదేశము.

అపర్ణ: జయసింహా, అంత నిష్ఠురుడవు కావలదు. నా తే నా తేను మరిల్లనెను. నేను ఎంత ఓర్చుకొని సహించుచున్నానో దేవునకే ఎరుక.

జయసింహా: అటులైన నేను పోయెదను. ఒక్క నిముసము ఇచ్చట ఉండజాలను.

(కొంచెము దూరముపోయి, తిరిగి) అపర్ణా, నేను నిష్ఠురుడనా? జయసింహుని నిష్ఠురుడు, కఠినుడు అనునదియే నీ మనమున మిగిలియుండెనా? ఎన్నడును హాసపదముతో నేను మాటలాడియుండలేదా? ఎన్నడును దగ్గరకు పిలిచియుండలేదా? నీ కన్నీటిని చూచి కన్నీరు నేను ఎన్నడును కార్చలేదా? అపర్ణా, అవి యన్నియు మనస్సునకురావా? జయసింహుడు నిష్ఠురుడు, పాషాణ హృదయుడని మాత్రమేనా నీ మనమున మేల్కొనియుండుట? దేవియని మనము పిలుచు పాషాణమూర్తివలెనే, నేనును పాషాణుడనా?

అయ్యో, చెలీ, నీవే నేనైయుండిన, నా అంతర్దాహము ఎంత దుస్సహమైనదో నీవు తెలిసికొనియుండెడిదానవు.

అపర్ణ: బుద్ధిహీనము, వ్యాఘితము, క్షుద్రమగు ఈ నాకే హృదయమును మన్నించుము. ఇక వచ్చివేయుము. జయసింహా, రమ్ము, ఇద్దరము ఈ మందిరమును విడిచి వెడలెదము.

జయసింహా: క్షమించుము, అపర్ణా. కరుణించుము. దయచేసి నన్ను వదలి వెడలి పొమ్ము. ఈ జీవితమున ఒకే కార్యము మిగిలియున్నది. అదే ప్రాణములపై ప్రభువై ఆధిపత్యము చెలాయింపనిమ్ము. దాని స్థానమును నీవు లాగికొని ఆక్రమింపకుము. (వడివడిగ వెళ్ళిపోవును)

అపర్ణ: నూరుతూరులు సహించితిని, కాని నేడేల సహింపజాలకయున్నాను? నేడేల ప్రాణము బద్దలైపోవుచున్నది?

## పంచమదృశ్యము

### మందిరము

నక్షత్రరాయలు, రఘుపతి, నిద్రించుచున్న ధ్రువుడును

రఘుపతి: ఏడ్చి, ఏడ్చి నిద్రపోయెను. జయసింహుడును ఇంత చిన్నతనమున తల్లిదండ్రులు లేనివాడుగా నా ఒడిలోనికి వచ్చెను. ఆనాడు ఇటులనే క్రొత్తగ నల్గడల చూచి ఏడ్చెను. అచ్చటనే, దేవిచరణములకడనే అటులనే కొనఊపిరితో రొప్పి, రొప్పి, ఏడ్చి అలసి సాయంత్రమువరకును నిద్రించెను. ఇతనిని చూడగా, అతని ఆ శిశుముఖము, శిశుక్రందనములు మనస్సునకు వచ్చుచున్నవి.

నక్షత్రరాయలు : స్వామీ, ఇక ఆలసించకు, రాజుకు ఎప్పుడు ఈ వార్త తెలియునో యని భయమగుచున్నది.

రఘుపతి : ఈ వార్త అతని కెటుల తెలియగలదు. నాలుగు ప్రక్కలు నిశీథపు నిద్రలచే పరివేష్టితములు గదా :

నక్షత్రరాయలు : ఒకసారి ఎవరో ఛాయను చూచితినా యనినట్లున్నది.

రఘుపతి : నీ భయపు ఛాయనే.

నక్షత్రరాయలు : ఎవరి ఆక్రందన స్వరమును వింటినా యనునట్లున్నది.

రఘుపతి : నీ హృదయంపు స్వరమునే. మన నిరానందము దూరమైపోవలయును. రమ్ము మద్యపానము చేసెదము. తలంపు మనస్సున ఉన్నంతవరకు పెద్దదిగ కాన్పించును ; కార్యరూపమున పెట్టునప్పటికి చిన్నదై పోవును. ఎంతయో పెద్దదగు ఆవిరి ఘనీభవించినపుడు ఒక్క బిందు జలము మాత్రమగును.

ఏమియులేదు, ఒక్క నిముసపుపని. ప్రదీపపు శీర్షశిఖను ఆర్పుటకు ఎంతకాలము పట్టును ? నిద్రనుండి ఒక క్షణికకాలమున గాఢతమమగు దీర్ఘనిద్రలోనికి ఆ ప్రాణరేఖ కలిసిపోగలదు. శ్రావణ నిశీథమున సౌదామిని మెరసి అంతర్ధాన మగునటుల, దాని పిడుగు మాత్రము శాశ్వతముగ రాజదంభమున గ్రుచ్చుకొనిపోగలదు.

రమ్ము, రమ్ము, యువరాజా, నోట మాట, నవ్వు లేక ఒక మూల వాడినటుల ఏల కూర్చొనియున్నావు, ఏదో పెద్దగండము వచ్చినటుల. రమ్ము ఈ ఆనందసలిలముల పానము చేసెదము.

నక్షత్రరాయలు : చాల ఆలస్యమాయెను. నేటికి బలిని నిలిపివేయుము. రేపు పూజ జరుగగలదు.

రఘుపతి : ఆలస్యమైనది నిజమే. రాత్రి తెల్లవారనున్నది.

నక్షత్రరాయలు : అదో, కాలి చప్పుడులు వినబడుచున్నవి.

రఘుపతి : ఏవి, నాకు వినవచ్చుటలేదు.

నక్షత్రరాయలు : అదో వినుము. అదో చూడుము వెలుతురు.

రఘుపతి : రాజుకు తెలియవచ్చెను. ఇక ఒక క్షణమైనను ఆలసింపకూడదు. జై మహాకాళీ (ఖడ్గము నెత్తును)

గోవిందమాణిక్యరాయలు, అతని సిబ్బంది వడివడిగ ప్రవేశింతురు, రాజనిర్దేశ ప్రకారము సిబ్బంది రఘుపతిని, నక్షత్రరాయలను పట్టుకొనును.

గోవిందమాణిక్య : కారాగారమునకు గొంపొండు. విచారణ జరుగగలదు.

# చతుర్థ అంకము

## ప్రథమ దృశ్యము

### విచారణ సభ

గోవిందమాణిక్య, రఘుపతి, నక్షత్రరాయలు, సభాసదులు, సిబ్బంది

**గోవిందమాణిక్య :** (రఘుపతిని చూచుచు) చెప్పుటకు ఇంకేమైన కలదా ?

**రఘుపతి :** లేదు.

**గోవిందమాణిక్య :** అపరాధమును ఒప్పుకొనుచున్నావా ?

**రఘుపతి :** అపరాధమా ? నిజమే అపరాధము చేసితిని. తుదకు దేవీపూజను చేయలేక పోతిని. పొగరున మూఢుడనై అకారణముగ ఆలసించితిని. దేవి దానికై శాస్తి నొసగు చున్నది. నీవు నిమిత్తమాత్రుడవు.

**గోవిందమాణిక్య :** అందరును వినవలయును. ఇదే నా నిర్ణయము. పవిత్ర పూజామిషచే దేవివద్ద రాజాజ్ఞను తిరస్కరించి ఏ మోహాంధుడు జీవబలి నొసగునో, లేక దానికై ప్రయత్నముల చేయునో, అతనికి నిర్వాసన దండము నొసగుచున్నాను. రఘుపతీ, అష్ట వర్షములు నిర్వాసనమున నీవు గడపవలసియుండును. నలుగురు సైనికులు నిన్ను తీసి కొనివెళ్ళి రాజ్యమునకు వెలుపల వదలివచ్చెదరు.

**రఘుపతి :** ఈ జగత్తున దేవివద్ద తప్ప మరి ఎవరివద్దను మోకాళ్ళను వంచి ఎరుగను. నేను విప్రుడను ; నీవు శూద్రుడవు. అయినను చేతులు జోడించి, మోకాళ్ళను వంచి నేడు నిన్ను ప్రార్థించుచున్నాను. రెండు దినముల గడువు. శ్రావణమాసపు కడపటి రెండు దినములు నాకు గడువు నివ్వకోరుచున్నాను. భాద్రపద శుక్ల ప్రథమ ప్రత్యూషముననే పీ ఈ అభిశప్త, దగ్ధరాజ్యమును వదలిపోయెదను. తిరిగి ముఖము చూపను.

**గోవిందమాణిక్య :** సరి, రెండు దినముల గడువు నొసగుచున్నాను.

**రఘుపతి :** మహారాజా, రాజాధిరాజా, మహిమాసాగరా, నీవు కృపావతారుడవు. ధూళి తుల్యమగు అధముడను, దీన దురదృష్టవంతుడను నేను.

[ప్రస్థానము]

గోవిందమాణిక్య : నక్షత్రా, నీ అపరాధమును అంగీకరింపుము.

నక్షత్రరాయలు : మహారాజా, దోషిని నేను. క్షమాభిక్ష కోరుటకు సాహసములేక యున్నది.

[పాదములపై పడును]

గోవిందమాణిక్య : చెప్పుము, నీవు ఎవరి కుతంత్రములకులోనై ఈ కార్యమున పాల్గొంటివి ? స్వభావముగ కోమల హృదయుడవు. ఇంతటి దారుణ కార్యమునకు నీవు ఒడిగట్టజాలవు.

నక్షత్రరాయలు : ఇంక ఎవరిపై దోష మారోపింపగలను ? ఈ పాపముఖముతో మరెవరి నామమును ఉచ్చరింపను. నేనొక్కడనే అపరాధిని. నా పాప కుతంత్రములకు నేనే లోనై, తప్పుచేసితిని. నీ తెలివిమాలిన తమ్ముని నూరుతప్పులు మన్నించితివి. ఈ తూరియు మన్నించుము.

గోవిందమాణిక్య : నక్షత్రా, చరణముల వదలిపొమ్ము. మాట వినుము. క్షమించుట నాకు చేతనైన పనియా ? విచారణకర్తయు శాసనబద్ధుడు, నేరస్థునికన్న పెద్ద బంది. ఒక అపరాధమునకై ఒకనికి శిక్షనొసగి, మరొకని విడుచుట, దేవునికే లేని శక్తి అది. మరి నే నెచ్చట :

అందరు : క్షమింపుము, క్షమింపుము, ప్రభూ ! నక్షత్రుడు నీ సోదరుడు.

గోవిందమాణిక్య : మౌనముగ నుండుడు. ఈ ఆసనమున కూర్చొనియున్నంతవరకు, సోదరుడు, ఆత్మీయుడు నాకు ఎవ్వరును లేరు. అపరాధము సప్రమాణమాయెను. త్రిపుర రాజ్యసీమల వదలి, తీర్థస్నానముకొరకై బ్రహ్మపుత్రానదీతీరమున ఉన్న రాజగృహమున నక్షత్రరాయలు అష్టవర్షములు నిర్వాసనమున గడపవలయును.

[సిబ్బంది నక్షత్రుని పట్టి తీసికొనిపోవ నుద్యుక్తులగుదురు. రాజు సింహాసనమునుండి దిగివచ్చి]

వీడ్కోలు కౌగిలింత యిచ్చి పొమ్ము. సోదరా, ఈ శిక్ష నీకుమాత్రమే కాదు, ఇది నాకును శిక్ష. నేటినుండి రాజగృహము సూదులవలె, ముళ్ళవలె నన్ను గ్రుచ్చుచుండగలదు. నా ఆశీర్వాదములు నీతో సదా ఉండగలవు. దూరమున నున్నంతకాలము దేవతలు నిన్ను రక్షించుచుందురు గాక !

[నక్షత్రుని ప్రస్థానము]

(సభాసదులవైపు చూచి) సభాగృహమును అందరును వదలిపొండు, కొంచెము సేపు నేను ఒంటరిగ నుండెదను.

[అందరును నిష్క్రమింతురు]

వేగముగ నయనరాయల ప్రవేశము

నయనరాయలు : మహారాజా, విపత్తులు వరుసగ వచ్చుచున్నవి.

గోవిందమాణిక్య : రాజు మానవుడు కాడా ? అయ్యో విధీ, దీనాతిదీనులతో సమానముగ అతని హృదయము విలపించుచున్నది. అందరివలె దుఃఖముల నిచ్చెదవు కాని, కన్నీరు కార్చుటకు తీరికనైన నొసగవా ? ఏమి ఆపద, తోడనే చెప్పుము.

నయనరాయలు : మొగల్ సైన్యములతో చంద్రపాలుడు వచ్చుచున్నాడు, త్రిపురరాజ్యమును నాశనము చేయుటకొరకు.

గోవిందమాణిక్య : నయనరాయ్, ఇది నీకు ఉచితముకాదు. నిజమే, చంద్రపాలుడు శత్రువే. కాని అతనిపేరున ఇంతటి అపవాదమా ?

నయనరాయలు : అల్పులగు ప్రజలకు పెక్కు శిక్షల నొసగితివి కాని నాయెడ నేటి నీ అవిశ్వాసము అన్నిటికన్న పెద్దది. దేవి శ్రీచరణములనుండి పతితుడనైతిని, అట్లని అంత అధఃపాతమునకు పోతినా ?

గోవిందమాణిక్య : అన్నియు బాగుగ చూచి తెలిసికొని, మరల చెప్పుము.

నయనరాయలు : మొగలులతో కలసి చంద్రపాలుడు నిన్ను రాజ్యచ్యుతని చేయుగోరు చున్నాడు.

గోవిందమాణిక్య : ఈ వార్త నీ కెట్లు తెలిసినది ?

నయనరాయలు : ప్రభూ, నన్ను నిరస్తునిచేసిననాడు, అస్త్రహీన లజ్జచే దేశాంతరమునకు వెడలితిని ; అస్సామువారికిని మొగలులకును విరోధము సాగుచున్నదని వింటిని. అందుచే అచ్చటి రాజసన్నిధానమునకు సైనికపదవిని కోరుటకు వెడలితిని. మార్గమున త్రిపురవైపునకు మొగల్ సైన్యములు, వారివెంట చంద్రపాలుడు వచ్చుచుండుట కాంచితిని. విచారణపై వారి ఒడంబడిక తెలిసికొంటిని ; రాజసమ్ముఖమునకు పరుగెత్తి వచ్చితిని.

గోవిందమాణిక్య : ఈశ్వరా, ప్రపంచమునకు హఠాత్తుగా ఏమాయెను. రెండుమూడు దినముల క్రిందట ధరణి ఎచ్చటనైన రంధ్రముపడి, నాగవంశమంతయు తండోపతండము లుగ రసాతలమునుండి బయటకువచ్చి, పృథ్వికి నాలుగువైపుల అడుగడుగున పడగల ఎత్తుచున్నట్లున్నది. ప్రళయకాలము అరుగుదెంచెనా ?

ఇది విస్మయమునకు సమయముకాదు. సేనాపతీ, సైన్యభారమును వహింపుము.

## ద్వితీయ దృశ్యము

మందిర ప్రాంగణము — జయసింహుడు, రఘుపతి

రఘుపతి : గర్వము, తేజము, బ్రాహ్మణత్వము అన్నియు అడుగంటెను. వత్సా, ఇక నేను నీకు గురువునుకాను. నిన్న నేను గురుగౌరవమున నిస్సంకోచముగ ఆదేశముల నొసగితిని. నేడు అనునయములతో భిక్షనడుగుటకు మాత్రము నాకు అధికారము గలదు.

దేని బలమున ఐశ్వర్యజ్యోతిని, రాజప్రతాపమును తిరస్కరించి తుచ్ఛమొనర్చు చుంటినో, ఆ అంతరదీప్తి ఆరిపోయినది. జారిపోయినది. జారిపడిపోయిన నక్షత్రము కన్న మట్టిదీపము శ్రేష్ఠతరమైనది. కుతూహలభరితులై ఆ ఖద్యోతముకొరకు మట్టిలో వెదకి తిరుగులాడినను దొరకదు. దీపము అనుదినము ఆరును ; అనుదినము వెలుగును. తారలు ఒకసారి ఆరిన ఇక శాశ్వతముగ అంధకారము.

నేనును చిరదీప్తిహీనుడను. దేవతయొక్క అతిక్షుద్రదానమగు ఈ పరమాయువు అతిసామాన్యమైనది. దానిలో రెండునాళ్ళు, రాజద్వారమున మోకరించి భిక్ష నడిగితీసి కొంటిని ; జయసింహా, ఆ రెండుదినములును వ్యర్థము కాకుండుగాక ! ఆ రెండుదినములు తమ కళంకముల కడిగి, తొలగదీసి, గతించనిమ్ము. వాటి నల్లటిముఖము రాజరక్తముచే ఎర్రవడుగాక.

వత్సా, ఏల మాటాడవు ? ఇక గురు ఆదేశముకాదు. అయినను బాల్యమునుండియు నిన్ను పెంచి పోషించినదానికై ఎట్టి అనురోధమును తగదా ? పితృహీనునకు నేను తండ్రి వలె ఉండలేదా ; ఇన్ని మాటలతో దానిని స్మరణకు తేవలసివచ్చెనే యనునది విషాద కరము. కృపాభిక్షను సహించవచ్చును, కాని ప్రేమభిక్షను కోరు అభాగ్యుడు యాచకు లలో అధమయాచకు డగును.

వత్సా ! ఇంకను నిరుత్తరుడవే ! జానువులు మరల ఒకతూరి వంగనిమ్ము. నా ఒడిలోనికి వచ్చినపుడు నీవు ఇంతవాడవు, నా మోకాళ్ళ ఎత్తునను లేకుంటివి. అట్టి నీకడనే ఈ మోకాళ్ళు వంగనిమ్ము. పుత్రా, భిక్షను కోరుచున్నాను.

జయసింహ : తండ్రీ, ఈ విదీర్ణవక్షమును, ఇంకను వజ్రముచే కొట్టకుము. దేవి రాజ రక్తమునుకోరిన, అటులనే తెచ్చియిచ్చెద. కోరినదంతయు ఇచ్చెదను. ఋణ మంతయు తీర్చివేసిపోయెదను. అటులనే జరుగగలదు ; అటులనే జరుగగలదు.

[ప్రస్థానము]

రఘుపతి : అటులనే కానిమ్ము. దేవి కోరుచున్నదనియా నీవు యిచ్చునది ? నేనన్న లక్ష్యములేదు కాబోలు ! హా కృతఘ్నుడా ! దేవి నీకేమి చేసిపెట్టినది ? శిశుకాలము

నుండి దేవి నిన్ను అనుదినము పాలించినదా? నీకు రోగమువచ్చిన, సేవచేసినదా? ఆకొన్న అన్నమిడెనా? జ్ఞానపిపాసను తీర్చెనా? కడపటికి దేవి, హృదయమును విస్తరించి కృతఘ్నతయొక్క వ్యథను గైకొనెనా? అయ్యో కలికాలము. సరే కానీ.

## తృతీయ దృశ్యము

ప్రాసాదములోని ఒక గది — గోవిందమాణిక్య, నయనరాయలు

**నయనరాయలు :** విద్రోహి సైనికుల మరల్చి తీసుకవచ్చితి. యుద్ధపువేషములతో సన్నద్ధులైయున్నవారలు, మహారాజా, ఆజ్ఞానొసగుము. ముందుకు వెడలుటకు ఆశీర్వదించుము.

**గోవిందమాణిక్య :** రమ్ము, సేనాపతీ! స్వయముగ రణక్షేత్రమునకు నేను వెడలెదను.

నయనరాయలు : ఈ దాసునిమేన ప్రాణమున్నంతవరకు, నెమ్మదిగ నుంచుము. మహారాజా, విపన్ముఖమున పడి—

గోవిందమాణిక్య : సేనాపతి, అందరి విపద—అంశములో నేనును భాగస్వామిని కాగోరుచున్నాను. నా రాజఅంశము, అందరికన్న ఎక్కువగ నుండవలెనుగదా! సైనికులారా, రండు, నన్ను మీమధ్యకు తీసికొనుడు. మీ నృపతివి దూరముగ సింహాసనాపీఠమున నిర్వాసితమొనర్చి, సమర గౌరవమునుండి వంచిత మొనర్పకుడు.

చారుని ప్రవేశము

చారుడు : నిర్వాసన మార్గమునుండి కుమారనక్షత్రరాయని మొగలుసేనలు పట్టి తీసుక వెళ్ళిరి. రాజపదవికి అతనినే నిర్ణయించిరి. సైన్యములతో రాజధాని వైపుననే వచ్చుచున్నాడు.

గోవిందమాణిక్య : తీరిపోయినది. ఇక భయములేదు యుద్ధము నిలిచిపోయినదన్నమాట.

[ప్రతీహారి ప్రవేశము]

ప్రతీహారి : శత్రుశిబిరమునుండి ఉత్తరము వచ్చినది.

గోవిందమాణిక్య : నక్షత్రుని వ్రాత ఇది. శాంతి సమాచారముగ నుండవచ్చునని తలచెద— ఇదెట్టి దయజూపు సమాచారము! ఇది నక్షత్రుని భాషకానేరదు. నేను రాజ్యమును

పీడి వదలిపోవలయునట; లేకున్న సువర్ణత్రిపుర రక్తస్రోతమున తేలి పోగలదట, దేశ మును దగ్ధము చేసెదరట. త్రిపురారమణులు మొగల్ అంతఃపురమున బానిసలయ్యెద రట! ఇదిగో, ఇదిగో, ఈ చేవ్రాలు అతనివ్రాతయే "మహారాజ నక్షత్రమాణిక్య" మహారాజ!

చూడుము. సేనాపతి – రాజుచే దండితుడు రాజునకే నిర్వాసనదండము విధించి, వెడలగొట్ట చూచుచున్నాడు! భగవంతుని లీలలు ఎట్టివి?

నయనరాయలు: నిర్వాసనమా? అబ్బా, ఎంత సాహసము. యుద్ధము పూర్తికాకనే?

గోవిందమాణిక్య: ఇవి మొగలు సైన్యములుకావు. త్రిపురరాజపుత్రుడు రాజగుటకు అభిలషించుచున్నాడు. అందులకు యుద్ధమేల?

నయనరాయలు: రాజ్యమునకు శుభ—

గోవిందమాణిక్య: రాజ్యమునకు శుభమే కాగలదు. ఎదురెదురుగ యిద్దరు సోదరులు నిలిచి, ఒకరొకరి భ్రాతృవక్షముల లక్ష్యమొనర్చి ప్రాణహంతకములగు అస్త్రముల సంధించుటలో రాజ్యమునకు శుభము కాగలదా? రాజ్యమున సింహాసనము మాత్రము కలదు. గృహస్థుల గృహములు లేవా? సోదరులు లేరా? భ్రాతృత్వబంధనములు లేవా దానిలో?

చూడనీ, మరల చూడనీ, ఇది అతనిచేతి వ్రాతయేనా? నక్షత్రుని స్వంతరచన కాదు. నేను "బందిపోటు దొంగను. దేవద్వేషిని. ముందు వెనుక తలంపులేనివాడను. ఈ రాజ్యమునకు అమంగళకరుడను!" కాదు. కాదు. ఇది అతని రచనకాదు— రచన యెవరిదైనను, అక్షరములు అతనివి. వాని చేతులతో వ్రాసినది నిజము. ఏ సర్పవిషము నైనను, నిజ అక్షరముఖములదానితో నింపి నా వక్షమున విసరెను.

దైవమా, ఇది నీ శాస్తియేనా – కాదు, కాదు. నిర్వాసనమా! అట్లనే కానిమ్ము. అతని నిర్వాసనశిక్షను అతనికి మారుగ నేనే నీరవముగ వినమ్రశిరమున సహింపగలను.

# పంచమ అంకము

## ప్రథమ దృశ్యము

### మందిరము — బయట తుఫాను

పూజోపకరణముల గైకొని రఘుపతి

రఘుపతి : ఇన్నిదినములకు దేవి మేల్కొన్నదని తలచెద. ఇవి ఆమె రోషహుంకార ములే! శాపముల ఉచ్చరించుచు, నగరముపైగా పరుగెత్తుచు వెడలిపోయెను తిమిరరూపిణి. అదో, వారు నీ ప్రళయసఖీగణము కాబోలు, దారుణక్షుధచే విశ్వమహాతరువును బలవత్తర ముగ కదలించుచున్నారు! నీ దీర్ఘ ఉపవాసము నేటితో తీరిపోగలదు. భక్తులను సంశయ ములలో త్రోసి, ఇన్నిదినములు ఎచ్చటనుంటివి దేవీ? నీ ఖడ్గమును నీవు ఎత్తకున్న, మేము ఎత్తగలమా? నీ చండీమూర్తిని చూడచూడ ఎంత ఆనందమగుచున్నది! చిత్తము సాహసముతో నిండుచున్నది. సంశయములు తొలగిపోయెను. గౌరవము పోగొట్టుకొన్న వారు, తలవంపులైనవారు, నూతనతేజమున శిరముల నెత్తుచున్నారు. అదిగో కాలిచప్పుడు వినబడుచున్నది; అదే నీ పూజ వచ్చుచున్నది. జయము, జయము మహాదేవికి.

అపర్ణ ప్రవేశించును

మాయావినీ, దూరముగ వెడలుము. పొమ్ము. జయసింహుడు కావలెనా నీకు? ఓసీ, సర్వనాశనకారి, మహాపాతకి!

[అపర్ణ ప్రస్థానము]

ఇదేమి అకాలవ్యాఘాతము! ఒకవేళ జయసింహుడు రాకున్న! ఎప్పటికిని అటుల కానేరదు. అతడు ఎన్నడును సత్యభంగ మొనర్చువాడుకాడు. జయము మహా కాళికి, సిద్ధిధాత్రికి, జయము భయంకరికి—ఏదైన ఆటంకములు సంభవించిన—కడపటికి పట్టుబడిన—అతని కావలివారలచేతులలో ఆసువుల పోగొట్టుకొనిన! మాతా, అభయా జయము. భక్త సహకారిణీ జయము. జయము మాతా జాగ్రత్తదేవీ, సర్వజయా జయము, జయము. శత్రుపక్షము నిశ్శంకకౌతుకమున చూచి నవ్వునటుల నీ భక్తవత్సలుల దుర్నామము ప్రపంచమున వెల్లడికాకుండునుగాక. నీ సంతానమునకు మాతృఅభిమాన గర్వము చూర్ణమైపోయిన, తల్లియని పిలుచుటకైన ఎవరును అవసరములేదా? అదిగో పదధ్వని. వాస్తవముగ జయసింహుడే, నృముండమాలినీ, పాషండదళినీ, మహాశక్తి జయము, జయము.

జయసింహుడు వడివడిగ ప్రవేశించును

జయసింహా, రాజరక్తము ఏది ?

జయసింహ : ఉన్నది, నన్ను వదలుము. స్వయముగ నన్నే నివేదింపనిమ్ము. దయామయీ, జగత్పాలినీ, మాతా రాజరక్తము నీకు కావలయునా ? నీ తృష్ణ ఇక దేనితోను తీరజాలదా ? నేను రాజపుత్రుడ. నా పూర్వపితామహులు రాజ్యముల ఏలిరి. ఇప్పుడును నా మాతామహవంశమువారు రాజ్యము ఏలుచున్నారు— రాజరక్తము నా దేహమున గలదు. ఈ రక్తమునే సమర్పించెదను. ఇదే క్షడపటి రక్తము కానిమ్ము. మాతా ! రక్తతృషాతురా, నీ అనంత పిపాస ఈ అంత్యరక్తముతో తీరిపోవునుగాక.

[వక్షమున కత్తితో పొడుచుకొనును]

రఘుపతి : జయసింహా. జయసింహా, అహా ! ఎంత నిర్దయ ! ఎంత నిష్ఠురము ! అంతయు నాశనము చేసితివిగదా ! జయసింహా, కృతఘ్నుడా, గురుద్రోహీ, పితృమర్మఘాతకా, స్వేచ్ఛాచారీ, జయసింహా ! కులిశకఠినాత్మకా ! ఓరే జయసింహా, ఏకమాత్ర ప్రాణమా, ప్రాణాధికా, జీవనమంథన ధనమా ? జయసింహా ! ఓ నా వత్సా, గురువత్సలా ! తిరిగిరమ్ము, తిరిగిరమ్ము, విన్నుతప్ప మరేమియు కోరను. అహంకారము అభిమానము, దేవత, బ్రాహ్మణులు, అందరు పోయిన పోగాక ? నీవు రా. జయసింహా

అపర్ణ ప్రవేశించును

అపర్ణ : నన్ను పిచ్చిదానిని చేయుచున్నావు జయసింహా, ఎచ్చట జయసింహుడు ?

రఘుపతి : అమృతమయీ, తల్లీ, రమ్ము. నీ సుధాకంఠమున పిలువుము. వ్యగ్రస్వరమున పిలువుము. హృదయపూర్వకముగ పిలువుము. జయసింహుని పిలువుము. నీవు అతనిని నీవద్దకే తీసుకపొమ్ము, నేను కోరను.

[ప్రతిమ పాదతలమున శిరమునుంచి అపర్ణ మూర్ఛిల్లును]

తిరిగి యిమ్ము, తిరిగి యిమ్ము, తల్లీ, తిరిగి యిమ్ము నా జయసింహుని.

## ద్వితీయ దృశ్యము

### ప్రాసాదము

గోవిందమాణిక్య, నయనరాయలు

గోవిందమాణిక్య : ఇప్పటికిని ఆనందధ్వనియా ! లజ్జలేవి రాజభవనము ఇంకను దీపమాలలచే శోభిల్లుచున్నది, రాజధానీ బహిర్ద్వారమున ఉత్సవతోరణములతో కూడిన విజయ

స్తంభములు పులకిత నగరపు ఆనంద ఉన్మాదమున ఎత్తబడిన రెండు బాహువులవలె వెలయుచున్నవి.

ఇంకను ప్రాసాదమునుండి వెడలిపోకపోతిని—సింహాసనమును వదలకపోతిని. ఇన్నాళ్ళు రాజుగ ఉండియు ఎవరికిని ఎట్టి ఉపకారము చేయజాలకపోతినా? ఎట్టి దుష్కృత్యములను శాసనములచే నిరోధించజాలకపోతినా? నిర్వాసితమగు రాజా, ఛీ, ఛీ, నిన్ను నీవే విచారణ చేసికొని, నీ శోకమున నీవు అశ్రువుల రాల్చుచున్నావు.

మర్త్యరాజ్యము పోయెను, అయినను నేను రాజునే. నా హృదయసింహాసనముపై నేడు మహోత్సవము సలుపబడునుగాక.

గుణవతి ప్రవేశము

గుణవతి: ప్రియతమా, ప్రాణేశ్వరా. ఇంకేల నాథా, దేవీ నిషేధమును ఈసారి విన్నావుగదా! ప్రభూ, రమ్ము, నేటిరాత్రి కడపటిపూజ నొనర్చి సీతారాములవలె నిర్వాసనమునకు వెడలెదము.

గోవిందమాణిక్య: ఓ ప్రాణేశ్వరీ, నేడు శుభదినము నాకు. రాజ్యము పోయెను. కాని నిన్ను తిరుగ పొందగలిగితిని. మనోహరీ, రమ్ము దేవి మందిరమునకు ఇద్దరము వెడలెదము. కేవలము ప్రేమతో, కేవలము పుష్పములతో, సమ్మిశ్రిత అశ్రువులతో, వీడ్కోలు విశుద్ధ విషాదముతో వెడలెదము. నేడు రక్తము వలదు, హింస వలదు.

గుణవతి: భిక్షను మన్నింపుము, నాథా.

గోవిందమాణిక్య: చెప్పుము, దేవీ.

గుణవతి: పాషాణుడవు కావలదు. రాజ్యగర్వమును వదలివేయుము. దేవతయొద్ద పరాభవమును అంగీకరింపగోరనిచో, నా ఆవేదనచూచియైన నీ హృదయము నీరగుగాక! ప్రభూ, నీవు యెన్నడును నిష్ఠురస్వభావుడవు కావు. ఎవరో నిన్ను పాషాణునిగ మార్చిరి: నా సౌభాగ్యమునుండి నిన్ను వేరుచేసి, ఎవరో నన్ను రాజరహితరాణినిగ చేసివైచిరి.

గోవిందమాణిక్య: ప్రాణేశ్వరీ, ఒక్కపరి మాత్రము నన్ను విశ్వసించుము. నావైపు చూచి, తెలిసికొనకనే తెలిసికొనగలవు. నా అశ్రువుల చూచి, తెలిసికొనుము. నన్ను ప్రేమించు ప్రేమతో తెలిసికొనుము—ఇక రక్తపాతము వలదు. దేవీ, పెడముఖము పెట్టకుము, ఇక నన్ను వదలకుము. ఆశనిచ్చి నిరాశనొనర్చకుము. మన్నించి పోదలచిన పొమ్ము.

[గుణవతి ప్రస్థానము]

వెడలిపోయెను, ఎట్టి కఠినము, నిష్ఠురము యీ ప్రపంచము—ఎవరక్కడ ?— ఎవరును లేరు ? పోయివచ్చెదను, సింహాసనమా, వీడ్కోలు. నా పైతృకక్రోడమగు పుణ్యప్రాసాదమా, నిర్వాసిత పుత్రుడు నీకు ప్రణామములనొనర్చి, సెలవుపుచ్చుకొను చున్నాడు.

## తృతీయదృశ్యము

### అంతఃపురములోని గది — గుణవతి

గుణవతి : మ్రోగింపుడు, వాద్యముల మ్రోగింపుడు, నేటిరాత్రి పూజకాగలదు. నేడు నా ప్రతిజ్ఞ పూర్తికాగలదు. బలిని తెండు, జపా పుష్పముల తెండు. నిలిచి ఉన్నారా ? ఆజ్ఞల వినరా ? నేనన్న మీకు లెక్కలేదా ? రాజ్యము పోయినదని, నా దాసదాసీజనములు నా ఆదేశములు వినునంతటి రాణిత్వమును మిగిలి లేదా ? ఇదో ఈ మురుగుల తీసుకొండు. ఈ రత్నపుకంఠెను తీసుకొండు. ఉన్న ఆభరణములన్నిటిని తీసుకొండు. త్వరగ వెళ్ళి, దేవిపూజకై ఏర్పాట్లుచేయుడు. మహామాయా, ఈ దాసురాలిని నీ చరణములకడ నుంచుకొనుము.

## చతుర్థదృశ్యము

### మందిరము — రఘుపతి

రఘుపతి : చూడు, చూడు, మూఢ అజ్ఞానివలె జడపాషాణ ప్రతిమ ఎటుల నిలిచియున్నదో ! మూగ, కుంటి, గ్రుడ్డి, చెవుడు ! నీకడ సమస్త వ్యథితవిశ్వమును ఏడ్చిఏడ్చి చచ్చుచున్నది. నీ పాషాణ చరణములకడ, మహత్తరహృదయములు జారి తమంతట తామే బ్రద్దలగుచున్నవి. ఆహో, హో, హో, ఏ రాక్షసుని క్రూరపరిహాసమో ఇలలో కూర్చొని కాపురము చేయుచున్నది. ప్రాణులు నిన్ను తల్లీయని ఎంత పిలిచిన అంత ఘోరతరమైన అట్టహాసములచే నవ్వుచున్నది కఠిన అపహాసము. ఇమ్ము. తిరిగి జయసింహుని నాకు తిరిగి ఇమ్ము. రాక్షసీ, పిశాచీ, తిరిగి ఇమ్ము.

ప్రతిమను ఊపి

వినగలుగుదువా ? చెవులున్నవా ? ఏమిచేసితివో తెలుసుకొంటివా ? ఎవరి రక్తము నీవు పానముచేసినది ? ఏ పుణ్యచరిత్రుని రక్తమో తెలుసునా ? స్నేహదయాప్రీతులతో నిండిన ఏ మహాహృదయరక్తమో ?

ఇట్లనే చిరకాలముండుము, ఈ మందిర సింహాసనముననే సరళభక్తియెడల గుప్త ఉపహాసములచేయుచు ఉండుము — నీకు అనుదినము పూజల నొసగుచుందును, పదతలమున ప్రణామము చేయుచుందును, దయామయీ, మాతా అని నిన్ను పిలుచుచుండెద. ఉపకారమును మరెవరివద్దను బయటపెట్టను. నా జయసింహుని మాత్రము నాకు తిరిగి యిమ్ము — ఎవరివద్ద మొరపెట్టి విలపించుచున్నాను! అటులైన దూరము, దూరదూరము, దూరముగ గెంటివేయుము. ఈ హృదయదళినీ పాషాణిని. భూదేవివక్షము రేటిప యగుగాక!

దూరి గోమతీ నదీజలములలో ప్రతిమను పారవేయును.
దివిటీలతో, వాద్యముల మ్రోగించుచు గుణవతి ప్రవేశము

గుణవతి : జయము, జయము మహాదేవికి. దేవి ఏది?

రఘుపతి : దేవి లేదు.

గుణవతి : గురుదేవా, దేవిని మరల రప్పించుము: తెప్పించి అనుగ్రహింపుము. ఆమె రోషమును శాంతింపచేసెదను. తల్లిపూజకై పూజను సమకూర్చితిని. రాజ్యమును, పతిని అన్నింటిని వదలి, నా ప్రతిజ్ఞను పాలించితిని, దయ ఉంచి, దయచేసి నేటి ఒక్కరాత్రి కొరకైనను దేవిని మరల్చి తెమ్ము. దేవి ఎచ్చట!

రఘుపతి : ఎచ్చటను ఆమెలేదు. పైనలేదు, క్రిందలేదు, ఎచ్చటను ఆమె లేదు, ఎచ్చటను ఎప్పుడును ఆమె లేనేలేదు.

గుణవతి : ప్రభూ, ఇచ్చట ఉండెను గదా దేవి?

రఘుపతి : ఆమెనా దేవి అనుట? ప్రపంచమున ఎచ్చటనైన నిజముగు దేవియున్న, ఈ పిశాచిని దేవియని పిలుచుట ఎన్నడైన ఆ దేవి సహించగలదా? హృదయమును చీల్చి నిష్ఫలరక్తమును క్రూరపాషాణమూర్తి పదములకడ అర్పించుటలో మహత్వమేద్ది? ఆమెయా దేవి? పుణ్యరక్తమును పానమొనర్చి, ఆ మహారాక్షసికడుపు బద్దలై చచ్చిపోయినది.

గుణవతి : గురుదేవా, నన్ను బాధపెట్టకుము. మరల సత్యముగ చెప్పుము. దేవి లేదా?

రఘుపతి : లేదు.

గుణవతి : దేవి లేదా?

రఘుపతి : లేదు.

గుణవతి : దేవి లేదా? అయిన ఎవరున్నారు?

రఘుపతి : ఎవ్వరు లేరు. ఏమియు లేదు.

గుణవతి : తీసుకపొమ్మ. పూజను తీసుకపొమ్ము. తిరిగి పొమ్ము. తిరిగి పొమ్ము. త్వరగా చెప్పుము, ఏ మార్గమున మహారాజు వెడలెను.

అపర్ణ ప్రవేశము

అపర్ణ : తండ్రీ.

రఘుపతి : జననీ, జననీ, నా ప్రియజననీ, తండ్రి ! ఇట్లు పిలుచుట నిందాపూర్వకముగ కాదుగద ! తండ్రి ! మాతా, జననీ, ఈ పుత్రఘాతుకుని తండ్రియని ఎవరు పిలుచుచుండెనో, అతడు ఆ సుధాలిప్తమగు నామమును నీ కంఠమున నిడి చనెను, ఇంత మాత్రము దయచూపెను. ఆహా ! మరల పిలువుము తండ్రి అని.

అపర్ణ : తండ్రీ, రమ్ము, ఈ మందిరము వదలిపోదము.

పుష్ప, అర్ఘ్యములతో, గోవిందమాణిక్యుని ప్రవేశము

గోవిందమాణిక్య : దేవి ఏది ?

రఘుపతి : దేవి లేదు.

గోవిందమాణిక్య : ఇదేమి రక్తధార !

రఘుపతి : ఇదే కడపటి పుణ్యారక్తము, ఈ పాపమందిరమున ! జయసింహుడు నిజ రక్తము నొసగి హింసారక్తశిఖను ఆర్పివేసెను.

గోవిందమాణిక్య : జయసింహా, ధన్యుడవు. ధన్యుడవు. ఈ పూజాపుష్పాంజలిని నీకే సమర్పించుచున్నాను.

గుణవతి : మహారాజా.

గోవిందమాణిక్య : హృదయేశ్వరీ, ప్రియతమా.

గుణవతి : నేడు దేవిలేదు, నీవే నాకుగల ఏకైకదైవము.

[ప్రణమిల్లును]

గోవిందమాణిక్య : పాపము శమించెను. దేవి నేడు నా దేవి రూపమున తిరిగి వచ్చినది.

అపర్ణ : తండ్రీ, వచ్చివేయుము.

రఘుపతి : పాషాణము బ్రద్దలైపోయెను —నా జనని ఈసారి ప్రత్యక్షప్రతిమను చూపించినది—జననీ, అమృతమయీ—

అపర్ణ : తండ్రీ వచ్చివేయుము.



# అనంగ ఆశ్రమము

## చిత్రాంగద, మదనుడు, వసంతుడు

**చిత్రాంగద :** నీవేనా పంచశరుడవు?

**మదనుడు :** సమస్త నరనారీ హృదయముల వేదనాబంధనములచే ఆకర్షించి తెచ్చు మనసిజుడను నేనే.

**చిత్రాంగద :** ఏ వేదనయో, ఏ బంధనమో ఈ దానికి తెలియును. నీ పదములకడ ప్రణమిల్లుచున్నాను.

ప్రభూ, నీవు ఏ దేవుడవు?

**వసంతుడు :** నేను ఋతురాజును. జర, మృత్యువు అను దైత్యద్వయము నిమిషనిమిష మునకు విశ్వకంకాళమును బహిర్గత మొనర్ప యత్నించుచుండును. నేను వారి వెనువెనుక వెంటాడి, అడుగడుగునను వారిని ఓడించుచుందును రాత్రింబవలు అదే సంగ్రామము.

నేను అఖిలజనుల అనంత యౌవనమును.

**చిత్రాంగద :** భగవాన్, నీకు ప్రణామములు. దేవదర్శనముచే దాని చరితార్థ యాయెను.

**మదనుడు :** కళ్యాణీ, ఎందులకై ఈ నీ కఠోరవ్రతము? తపోవ్రత తాపమున యౌవన కుసుమమును శుష్కింపజేసి మలిన మొనర్చుచున్నావు! అనంగపూజకు ఇది విధానము కాదు. ఇంతకును ఎవరు నీవు? భద్రాంగీ, ఏమిటి నీ కోరిక?

**చిత్రాంగద :** అనుగ్రహించిన నా వృత్తాంతమును వినిపించెదను ప్రార్థనను తదుపరి తెలియపరచెదను.

**మదనుడు :** వినుటకై ఆతురపడుచున్నాము.

**చిత్రాంగద :** నేను చిత్రాంగిదను. మణిపుర రాజకన్యను. తపస్సుచే సంతుష్టుడై, మా పితృవంశమున ఎన్నడును పుత్రిక జన్మించకుండునటుల దేవదేవుడు ఉమాపతి వర

మొసగెను. నేను ఆ మహావరమును వ్యర్థ మొనర్చితిని. అమోఘమగు అట్టి దేవవాక్యము కూడ మాతృగర్భమును చొచ్చి, నా దుర్బల ప్రారంభమును శైవతేజమున పురుషునిగ మార్చజాలకపోయెను. అట్టి కఠినమగు నారిని నేను.

మదనుడు : అవును, అవును, వినియేయున్నాము. అందుననే నీ తండ్రి పుత్రసమాన ముగ నిన్ను పాలించుచున్నాడు. ధనుర్విద్యను రాజదండనీతిని నేర్పించుచున్నాడు.

చిత్రాంగద : అందుచే పురుషవేషమున స్వేచ్ఛగ తిరుగుచు, యువరాజరూపమున రాజ కార్యముల నిత్యము నిర్వహించుచుండెదను. లజ్జాభయములు, అంతఃపురవాసములు నాకు లేవు. హావభావములు, విలాసచాతుర్యములు నాకు తెలియవు.

ధనుర్విద్యను నేర్చితిని. దేవా, నీ పుష్పధనువును నయనాంచలముల ఎటుల వంచి, ఎక్కుబెట్టవలయునో మాత్రము నేను నేర్చుకొనలేదు.

వసంతుడు : సునయనా ! ఆ విద్యను ఏ నారియు నేర్చుకొనదు. నయనములు తమ కార్యమును తామే చేయగలవు. ఎవని వక్షమున అవి నాటునో, వానికే అవి అర్థమగును.

చిత్రాంగద : ఒకనాడు పూర్ణానదీ తీరమునందలి సాంద్రారణ్యమునకు ఒంటరిగి మృగా న్వేషణార్థము వెడలితిని. తరుమూలమున అశ్వమును బంధించి, మృగపదచిహ్నముల అనుసరించుచు, దుర్గమ కుటిలవనపథమున ప్రవేశించితిని.

ఝిల్లీ మంద్రస్వన ముఖరితమును, నిత్య అంధకారయుతమును, లతాగుల్మములచే గహనగంభీరమునగు మహారణ్యమున కొంతదూరము ముందుకు పోగా, సంకీర్ణపథమును విరోధించి, భూతలమున శయనించియున్న, మలినవస్త్రధారియైన ఒక పురుషుని హఠాత్తుగ కాంచితిని. అవజ్ఞాస్వరమున లేచి జరిగిపొమ్మని గద్దరించితిని. అతడు కదలలేదు, తిరిగి చూడలేదు.

పొంగి పొరలుచున్న రోషమున, ధనురగ్రభాగముతో అతనిని కొట్టితిని; భస్మ సుప్తమగు అగ్ని, ఘృతాహుతిని పొంది శిఖారూపమున రెప్పపాటు కాలములో భగ్గున పైకిలేచు విధమున, సరళదీర్ఘదేహముతో ఒక్కముహూర్తమున శరవేగమున లేచి, నా సమ్ముఖమున అతడు నిలువబడియెను.

క్షణకాలమే నా ముఖమువైపు చూచెను—అతని రోషదృష్టి, అంతలోనే అంతర్ధాన మాయెను; నా బాలకమూర్తిని చూచి కాబోలు, మనోహర కౌతుక గుప్త మృదుహాస రేఖ అతని అధరప్రాంతమున నాట్యమాడెను.

పురుషుల విద్యను నేర్చి, పురుషుల వేషమును ధరించి, పురుషులతోడ కలసి మెలసి యుండి, ఇన్ని దినములుగా ఏ విషయమును మరచియుంటినో, దానిని—నేను ఒక నారినను విషయమును—అతని ముఖమును తిలకించి, తనలో తాను నిమగ్నమైయున్న ఆ అటలమూర్తిని, వీక్షించి ఆ క్షణముననే మనస్సునకు తెచ్చుకొంటిని..

ఆ ముహూర్తముననే ప్రథమ పర్యాయము పురుషుని నా సమ్ముఖమున కాంచితివి.

మదనుడు : ఆ శిక్షణ నాది, శుభాంగీ; ఒక దినమున జీవిత శుభపుణ్యక్షణమున, స్త్రీలకు స్త్రీలమను చైతన్యమును, పురుషులకు పురుషులమను భావమును నేనే కలుగజేయుచున్నాను. తదుపరి ఏమాయెను ?

చిత్రాంగద : సభయ విస్మయకంఠమున 'ఎవడవు నీవు' అని అడిగితిని. 'నేను పార్థుడను, కురువంశజాతుడను' అను ప్రత్యుత్తరమును వింటిని.

చిత్ర ప్రాయముగ నిలువబడి యుంటిని, నమస్కరించుటకును మరచితిని. ఇతడా పార్థుడు? నా ఆజన్మ విస్మయుడు? సత్యపాలనకొరకు ద్వాదశ వత్సరములు అర్జునుడు అరణ్యవాసము చేయుచు బ్రహ్మచర్యమును పాలించుచున్నాడని విని యుంటిని.

ఇతడేనా ఆ పార్థవీరుడు? "నిజ భుజబలమున పార్థకీర్తిని నిష్ప్రభ గావించెదను, అవ్యర్థమగు లక్ష్యమును సాధించెదను, పురుషుని ఛద్మవేషమున అతనితోడి సంగ్రామమును కోరి, నా ప్రతాప పరిచయ మొసగెద" నని ఎన్నెన్నిసారులు నా బాల్యదురాశచే మనస్సున తలచితిని. అయ్యో, తెలివితక్కువదానా, నీ దుస్సాహసము ఎచటికి పోయెను? అతడు నిలిచియుండిన భూమిపై నేనొక తృణదళమునై యుండియుండిన, నాకున్న శౌర్య పరాక్రమములను ధూళిలో కలిపి, అతని ఆ చరణతలముననే దుర్లభ మరణమును పొందెడిదానను. ఏమి ఆలోచించుచుంటినో జ్ఞప్తిలేదు. వీరుడు వనాంతరాళమునకు నెమ్మదిగ వెడలిపోవుటను చూచితిని. ఉలికిపడి లేచితిని, ఆ క్షణముననే చైతన్యము ఉదయించెను. నన్ను నేను వందసారులు దూషించుకొంటిని. ఛీ, ఛీ, మూఢురాలా, సంభాషింపక పోతివి, మంచిచెడ్డల తెలిసికొనకపోతివి, క్షమాభిక్షను కోరకపోతివి, అనాగరికవలె తత్తరపడి నిలిచియుంటివి.

వీరుడు అవహేళనమున వెడలిపోయెను. ఆ ముహూర్తముననే నేను మరణించి యుండిన, బ్రతికిపోయెడిదానను.

మరునాడు ఉదయమున పురుషవేషమును దూరముగ పారవైచితిని. రక్తాంబరమును ధరించితిని. కంకణ కింకిణీ కాంచీ భూషితనైతిని. అలవాటులేని అలంకారములు లజ్జచే మిక్కిలి సంకోచమున నా అంగముల కప్పుచుండినవి.

రహస్యముగ ఆ వనమునకు చని, అరణ్యములోని శివాలయమున అతనిని చూచితిని.

మదనుడు : యువతీ, తర్వాత విషయమును చెప్పుము. నావద్ద ఎట్టి సిగ్గును పడవద్దు. నేను మనసిజుడను. సకల మనోరహస్యములు నాకు తెలియును.

చిత్రాంగద : తర్వాత నే నేమి అడిగితినో, ఎట్టి ఉత్తరముల వింటినో సరిగ జ్ఞప్తిలేదు. భగవాన్, ఇక నన్ను ప్రశ్నించకుము. లజ్జ వజ్రాయుధమువలె విరిగి నా శిరముపై బడినను, నన్ను నూరువ్రక్కలుగ చేయజాలకపోయెను. నారినైయుండియు, అట్టి పురుష ప్రాణము నాది.

నేను దుఃస్వప్న విహ్వలవోలె, ఇంటికి ఎటుల తిరిగివచ్చితినో నాకు ఎరుక లేదు. 'బ్రహ్మచర్య వ్రతధారిని నేను, పతియోగ్యుడను కాను, వరాంగనా' అను అతని కడపటి మాటలు, తప్తశూలములై నా కర్ణముల పొడువ నారంభించెను.

పురుషుని బ్రహ్మచర్యమా! ఛీ, ఛీ, దానినిగూడ కదలించి సడలించలేకపోతినే! మీనకేతూ, ఎందరెందరు ఋషులు, మునులు నారీపదములకడ తమ చిరార్జిత తపఃఫలముల అర్పించిరో నీకు తెలియును.

క్షత్రియుని బ్రహ్మచర్యమా!

ఇంటికి వెళ్ళి, ఉన్న ధనుశ్శరములనెల్ల విరిచి పారవైచితిని. ఇంతకాలము నాకు గర్వధనముగ నుండిన కిణాంకితమగు ఈ నా కఠినబాహువును నిష్ఫలాక్రోశభరితనై దూషింప దొడగితిని. నారినై పురుషుని మనమును జయించలేకపోయిన, నా విద్య యంతయు వృథయని, ఇన్నాళ్ళకు తెలిసికొంటిని.

సామాన్య అబల కోమల మృణాల బాహుద్వయము ఈ నా బాహువులకన్న శతాధికమగు బలమును కలిగియున్నది.

తన త్రస్త నేత్రపాతమున పురుషుల పరాక్రమశక్తిని, తపస్తేజమును పరాభూత మొనర్చు, ముగ్ధ మూఢ క్షీణతనులత, పరావలంబిత, లజ్జాభయలీనాంగి యగు సామాన్య లలన ధన్యురాలు.

అనంగదేవా, నా దంభములనెల్ల ఒక్క నిముసమున అణచివేసితివి. విద్య, బలము, సమస్తము నీ పదనతము చేసికొంటివి. ఇప్పుడు నీ విద్యను నాకు నేర్పుము.

నిరస్త్రినికి అస్త్రమువలె ప్రబలనగు నాకు అబలల బలమును ప్రసాదింపుము.

మదనుడు : నేను నీకు సాయమొనర్చెదను. శుభాంగీ, విశ్వవిజయియగు అర్జునుని జయించి, బందినిచేసి, నీ సమ్ముఖమునకు కొనితెచ్చెదను. రాణివై, నీ ఇష్టానుసారము అతనిని శిక్షచే బహూకరింపుము. ఆ విద్రోహిని శాసనబద్ధుని కావింపుము.

చిత్రాంగద : నాకు సమయము చిక్కిన, ఒంటరిగ నెమ్మది నెమ్మదిగ, దేవతల సహాయమును కోరకనే, వాని హృదయముపై ఆధిపత్యము సంపాదించెడిదానను.

వానితోకూడ నివసించుచు, సమరస్థలిని సారథినై, మృగయావినోదమున అనుచర రూపమున వెంబడించి, శిబిరముకడ రాత్రి ద్వారరక్షికనై మేల్కొని, భక్తవేషమున

పూజించి, భృత్యవేషమున సేవించి ఆర్తత్రాణ మహావ్రతమున క్షాత్రసహచరినై సహాయ మొనర్చెడిదానను.

ఎప్పుడో ఒకనాడు, కుతూహలమున నా వైపు తేరిచూచుచు 'ఎవడు ఈ బాలకుడు ? నా పూర్వజన్మ సుకృతమువలె, ఈ జన్మమున నా సహవాసియై, చిరదాసుడైనాడు' అని మనస్సున తలంచు నతడు. క్రమక్రమముగ వాని హృదయద్వారమును తెరచి, అచ్చో శాశ్వత స్థానమును సంపాదించెడిదానను.

ఈ నా ప్రేమ ఆక్రందనముకొరకు మాత్రమే కాదని నాకు తెలియును. మౌన ధైర్యమున, చిరమర్మవ్యథను మ్లానహాసతలమున దివాకాంతిలో కప్పియుంచి, నిశీథమున నయననీరములచే పాలనయొనర్చు ఆజన్మ విగత భర్తృకయగు రమణిని కాను నేను.

నా కోరిక ఎన్నడును నిష్ఫలము కానేరదు. నన్ను నేను ఒకసారి ప్రకాశింప చేయగలిగితినేని, నిశ్చయముగ అతడు నాకు లోబడిపోగలడు.

అయ్యో, దురదృష్టమా ! ఆనాడు ఎట్టి దృశ్యమును కాంచితిని ! లజ్జచే కుంచిత శంకిత కంపితయగు నారి, వివశవిహ్వలయగు ప్రలాపవాదిని నీ కంటబడియెను. కాని నా నిజగుణము అట్టిదేనా ? మార్గమున, గృహమున, ఎల్లఎడల కేవలము క్రందనాధి కారిణులగు వేలకొలది స్త్రీలకన్న నేనేమియు అధికమైనదానను గానా ?

కాని అయ్యో, నా పరిచయ ప్రకటన బహుయత్నమున బహుదినములకే సాధ్య మగును. అది జీవిత పరమావధియే కావచ్చును; జన్మజన్మాంతరముల వ్రతమే కావచ్చును. అందుకనే మీ ద్వారముకడకు వచ్చితిని, కఠోర తప మొనర్చితిని.

భువనవిజయి దేవా, మహాసుందర ఋతురాజా, జన్మదాతయగు విధాతృని వినా దోషశాపమగు ఈ వీరనారీ కురూపమును కేవలము ఒక్కదినమునకైనను తొలగింపుడు. నన్ను అపూర్వసుందరినిగా మార్చివేయుడు. అట్టి ఒక్క దినమును నా కొసగుడు, తదుపరి దినము లన్నియు నా కైవసమగును.

తొలుత అతనిని నేను చూచినప్పుడు, ఒక్క ముహూర్తమున అనంత వసంత ఋతువు నా హృదయమున ప్రవేశించినట్లుండెను. ఆ యౌవన సమీరణోచ్ఛ్వాసమున సమస్త శరీరము చూచుచు, చూచుచుండగనే, లక్ష్మీచరణశయనమగు కమలమురీతి, అపూర్వపులకభరితమై, ప్రస్ఫుటించుటకై మిక్కుటమగు అభిలాష పొడమెను. వసంతా, వసంతసఖా ! ఆ నా వాంఛను ఒక్క దినము మాత్రము పూర్తిచేయుడు.

**మదనుడు :** తథాస్తు.

**వసంతుడు :** తథాస్తు. ఒక్క దినము మాత్రమేల ! వసంత పుష్పశోభ ఒక వత్సర కాలము నీ తనులతను పరివేష్టించి వికసితమై యుండగలదు.

౨

# మణిపురము

## అరణ్య శివాలయము

### అర్జునుడు

**అర్జునుడు :** ఎవతెను నేను చూచినది? అది సత్యమా లేక మాయయా! నిబిడ నిర్జన వనమున నిర్మలమగు సరసి—నిర్మానుష్యమగు రహస్య ప్రదేశము :

నిస్తబ్ధ మధ్యాహ్నముల అచ్చటికి వనలక్ష్మీగణము వచ్చి స్నానముచేయుచుండునా యనునట్లున్నది. గభీర పూర్ణిమా రాత్రముల, ఆ సుప్త సరోవర స్నిగ్ధఘాసతటముల సుఖమున శంకారహితలై, విగళిత వసనములతో వారు విశ్రమించి శయనింతురా ఏమి? అబ్బో, ఆ వనాంతరాళమున, అపరాహ్ణ వేళావసానమున, నా శైశవజీవిత విషయముల తలపోయుచుంటిని. ప్రపంచ మూఢలీలలు, సుఖదుఃఖముల అధోగతులు, జీవితపు అసంతోషములు, అడిఆసలు, ఈ మర్త్యమానవుల అనంత దారిద్ర్యములు నా హృదయ వీథిని గంతులిడుచుండినవి.

ఇంతలో, దట్టంపుచెట్ల చీకట్లనుండి, మెల్లమెల్లగ బయటికి వచ్చి, సరోవర సోపాన శిలాపటమున ఎవరువచ్చి నిలువబడినది? ఎట్టి అపూర్వ రూపమది! కోమల చరణతలమున ధరాతలము ఎటుల నిశ్చలమైపోయెను? పూర్వగిరి శుభ్రశిరమున, అకలంక, నగ్న శోభను వికసింపజేసి, చూచుచు చూచుచుండగనే ఉషఃకాల స్వర్ణమేఘము ఆకసముతో కలిసిపోవు రీతి, ఆమె వసనములు, ఆమె అంగలావణ్యముతో సుఖావేశమున కరిగిపోవుటకై కోరుచుండెనా! అని అనిపించెను.

సరోవర తీరమునకు మెల్లగ దిగి, కుతూహలమున నిజముఖచ్ఛాయను ఆమె చూచుకొనెను. చకితయై నిలువబడిపోయెను. ఒక క్షణకాలము పిదప, చిరునవ్వు నవ్వుచు, వామహస్తమును విలాసపూర్వకముగ వంచి, అలక్ష్యభావమున కబరిని విప్పి జారవిడిచెను. ముక్తకేశములు వికీర్ణములై చరణములకడ దొర్లుచుండినవి.

చీర చెరగును సడలించి, తన అనిందిత బాహువుల చూచుకొనెను. ప్రేమ కరుణ రసావలిప్తములైన ఆ కోమల బాహులతలు తాకిననే కంది వసివాడునట్లుండెను. శిర మును వంచి పరిస్ఫుట దేహతటమున ఉన్ముఖ యౌవన వికాసమును కాంచెను. నవీన ధవళతనువున లజ్జాజనితమగు ఆ రక్తిమదీప్తిని తిలకించెను. సరోవర జలముల పద యుగళమును ముంచి, తన చరణకాంతుల వీక్షించెను.

ఆమె విస్మయమునకు పరిమితి లేకపోయెను. తన్ను తాను తొలిసారి తిలకిం చెనా యనునట్లుండెను. కోరక వయస్సును కన్నులు మూసికొని గడపిన శ్వేత శతదళము, ఒకనాడు ప్రభాతమున పూర్ణశోభను ప్రథమ పర్యాయము పొంది, కంఠమును వంచి నీల సరోవర జలముల మొదటిసారి తన్ను చూచుకొని, అచ్చెరువుతో దినమంతయు చూచు కొనుచు గడుపురీతి, ఆమెయు తన అపూర్వ సౌందర్యముచే సవిస్మయానందమున పర వశయై యుండెను.

క్షణకాలము తర్వాత, ఏదో ఒక దుఃఖమున ముఖమునందలి మందస్మితము తొలగి పోయెను. నేత్రద్వయము మ్లానమాయెను. విడిన జుట్టుముడిని కట్టివేసెను. చీరచెరగుతో ఒంటిని కప్పెను. సువర్ణసంధ్య మ్లానముఖియై, అంధకారనిశీథి వైపునకు మృదుపదము లతో తరలురీతి, నిట్టూర్పుల విడచుచు, మెల్లమెల్లగ ఆమె వెడలిపోయెను.

భూదేవి తన భాండారమును తెరచి, తన పూర్ణైశ్వర్యమును మానవులకు దానమొస గెనా ఏమి అని నేను తలపోయుచుంటిని. నా అభిలాషల సంపూర్ణతలపై మెరపువలె మెరసి అంతర్ధానమాయెనే యని విచారించుచుంటిని.

మృగరాజమగు కేసరి, సింహవాహిని యగు దుర్గయొక్క భువనవాంఛితములగు అరుణ చరణకమలములకడ పడియుండు రీతి, యుద్ధములు, హింసలు, ఆడంబరములు, పురుషుల పౌరుష గౌరవములు, వీరతయొక్క నిత్యకీర్తితృష్ణలు, సమస్తమును ఆ పూర్ణ సౌందర్యముకడ శాంతించి, చల్లారి భూమిపై దొర్లాడి, ధూళిలో కలిసిపోవుచున్నట్లున్నవి గదా యని తలచితిని.

మరల ఒకసారి, ఆమెను— ఎవరు తలుపు తట్టినది ?

[ద్వారము తెరచి]

ఏమి ! ఆ సౌందర్యమూర్తియే ! హృదయమా శాంతింపుము. వరాననా, నాచే నీకెట్టి భయమును లేదు. నేను క్షత్రకుల సంజాతుడను ; భయభీత దుర్బలుల భయ హారిని.

చిత్రాంగద : ఆర్యా, నీవు నా అతిథివి. ఈ మందిరము నా ఆశ్రమము. ఎటుల అభ్యర్థ నల చేయుదునో, ఏ సత్కారములచే సంతోషపరచగలనో తెలియకున్నది.

**అర్జునుడు :** సుందరీ, నీ దర్శనమే అతిథి సత్కారము. నీ శిష్టవాక్యములే నాకు సౌభాగ్యరాశి. అపరాధముగ భావింపకున్న, ఒక్క ప్రశ్నను అడుగగోరుచున్నాను, నా చిత్తము మిక్కిలి కుతూహలపడుచున్నది.

**చిత్రాంగద :** నిర్భయముగ అడుగవచ్చును.

**అర్జునుడు :** శుచిస్మితా, ఏ కఠిన వ్రతముకొరకై నిర్జన దేవాలయమున, హతభాగ్యులగు మర్త్యజనుల వంచన మొనర్చి, ఇట్టి రూపరాశిని అలక్ష్యముగ నష్ట మొనర్చుచున్నావు ?

**చిత్రాంగద :** గుప్తమగు నొక అభిలాషను సాధించుటకై, ఏకాగ్రచిత్తమున శివపూజ కావించుచున్నాను.

**అర్జునుడు :** అయ్యో, జగత్తునకే కామధనమవు నీవు దేనిని కామించుచున్నావు ? చంద్రముఖీ, ఉదయశిఖరమునుండి అస్తాచలమువరకు నేను తిరిగియున్నాను. సప్తద్వీపముల మధ్య ఎచ్చటెచ్చట ఏవేవి చూడదగియున్నవో, ఊహింపరాని ఉత్కృష్టములగువాటిని, అపరూపమగు సౌందర్యముగలవాటిని సమస్తమును నేను స్వయముగ వీక్షించియున్నాను. దేనిని కోరుచున్నావో, ఎవరిని కోరుచున్నావో నాకు తెలియజేసిన, నావద్దనుండి వివరముల బడయగలవు.

**చిత్రాంగద :** నేను ఎవనిని కోరుచున్నానో, అతడు త్రిభువనపరిచితుడు.

**అర్జునుడు :** ఈ ధరణియందు అట్టి నరుడు ఎవడు ? అమరకాంక్షితవగు నీ మనోరాజ్యమున ఎవని యశోరాశి దుర్లభమగు ఆసనాధికారమును వహించెను ? అతని పేరును వినిపింపుము, విని కృతార్థుడ నయ్యెదను.

**చిత్రాంగద :** సర్వశ్రేష్ఠమగు రాజవంశమున అతని జన్మము; సర్వశ్రేష్ఠుడగు వీరు డతడు.

**అర్జునుడు :** మిథ్యాఖ్యాతి, ఈ నోట ఆ నోట, మాటలలో పెరుగుచుండును ; సూర్యుడు ఉదయించనంతవరకు, క్షణస్థాయి యగు నీహారము ఉషస్సును మోసగించి కప్పియుంచు రీతి.

సరళహృదయా, మిథ్యను ఉపాసింపకుము. ఓ దుర్లభసౌందర్య సంపన్మూర్తీ ! భూమిపై సర్వశ్రేష్ఠ కులమున, సర్వశ్రేష్ఠుడగు వీరుడెవడో చెప్పుము, వినెదను.

**చిత్రాంగద :** పరకీర్తి సహింపనివాడవు, ఎవరు నీవు, సన్యాసీ ! ధరణిపై కురువంశము రాజవంశచూడామణి యని ఎవరికి తెలియదు ?

**అర్జునుడు :** కురువంశమా ?

చిత్రాంగద : ఆ వంశమున, అక్షయ యశుడు, వీరేంద్ర కేసరి యగువాని పేరు విని యున్నావా ?

అర్జునుడు : నీ నోటితోనే చెప్పుము, వినెదను.

చిత్రాంగద : భువనవిజయి, గాండీవధన్వి, అర్జునుడు.

సమస్త జగత్తునుండి ఆ అక్షయ నామమును అపహరించి, నా కన్యాహృదయమును నింపి, యత్నమున దాచి, ఉంచుకొనియున్నాను. బ్రహ్మచారీ, ఏల ఈ నీ అధైర్యము ?

అటులైన, అది అంతయు అబద్ధమా ? ఆ అర్జునుని యశస్సు మిథ్యయా ? ఇప్పుడే చెప్పుము. అది మిథ్యయేయైన, హృదయమును చీల్చి, పెకలించి దానిని పారవైచెదను. అది శూన్యమునుండి శూన్యమునకు, నోటినుండి నోటికి ఎగురుచు, దుముకుచు తిరిగిన తిరుగనిమ్ము. దానిస్థానము నారీ హృదయాసనమున కాదు.

అర్జునుడు : వరాంగనా, ఆ అర్జునుడు, ఆ పాండవుడు, ఆ గాండీవధన్వి, ఆ అదృష్టశాలి నీ చరణములవద్ద శరణాగతుడు. అతని పేరు, అతని ఖ్యాతి, అతని శౌర్య పరాక్రమములు సత్యములైనను, అసత్యములైనను, క్షీణపుణ్యులై, హృతస్వర్గులగు హతభాగ్యులనువలె, అతనికి స్థానదాన మొసగిన దుర్లభలోకమునుండి గెంటివేయకుము.

చిత్రాంగద : నీవు పార్థుడవా ?

అర్జునుడు : దేవీ, నేను పార్థుడను ; నీ హృదయద్వారమున ప్రేమార్థుడైన అతిథిని.

చిత్రాంగద : ద్వాదశవర్ష వ్యాపకమగు బ్రహ్మచర్యమును అర్జునుడు పాలించుచున్నాడని వింటిని. ఆ వీరుడు వ్రతభంగ మొనర్చి, కామినిని కామించుచున్నాడా ? సన్యాసీ, నీవేనా పార్థుడవు ?

అర్జునుడు : నీవు నా వ్రతభంగ మొనర్చితివి, చంద్రుడు ఉదయించి, ఒక్క నిముషమున యామినీ యోగనిద్రాంధకారమును భంగ మొనర్చునటుల.

చిత్రాంగద : ఛీ, పార్థ, ఛీ. నేనెవ్వతెను ; నా దగునది ఏమియున్నది, ఏమి చూచితివి, నా విషయమై నీకేమి తెలియును ? దేనికొరకు, నిన్ను నీవు మరచుచున్నావు ? ఒక్క క్షణమున సత్యభంగ మొనర్చి, ఎవరికొరకు అర్జునుని అనర్జునుని కావించుచున్నావు ? నాకొరకు కాదు. ఈ రెండు నీలోత్పల నయనములకొరకు.

ఈ నిందిత నవనీత బాహుపాశములలో సవ్యసాచి అర్జునుడు, తన హస్తద్వయమ్ముతో సత్యబంధనముల ఛిన్న మొనర్చి, వచ్చి పట్టుబడుచున్నాడు.

ప్రేమ, మర్యాద ఎచ్చటికి పోయెను? నారీ సన్మానము ఎచ్చట కూలిపోయెను? అయ్యో నా ఈ తుచ్ఛదేహము నన్ను అతిక్రమించినది; క్షీణస్థాయియగు ఛద్మ వేషము, మృత్యువెరుగని అంతరాత్మకన్న పైచెయ్యి అయినది; ఇప్పటికి తెలిసినది నీ వీరత్వము, నీ ఖ్యాతి మిథ్యలని.

అర్జునుడు : ఖ్యాతి మిథ్యయని, పరాక్రమము మిథ్యయని నేడు నేను తెలిసికొంటిని. నేడు నాకు సప్తలోకములు స్వప్నమువలె తోచుచున్నవి. కేవలము నీ వొక్కదానవే సత్యము. నీవే సర్వస్వము. నీవే విశ్వసంపద. సకల దైన్యముల మహావసానమగు నారివి నీవు, సకల కర్మముల విశ్రామ రూపిణివి నీవు.

అకస్మాత్తుగ నిన్ను చూడగనే, ఏదో ఆనంద కిరణముచే ప్రథమ ప్రత్యూషమున, అంధకార మహార్ణవమున, సృష్టి శతదళము వికసించి దిశదిశలకు ఒక్క ముహూర్తమున ఏల వ్యాపించెనో తెలిసికొంటిని. మిగత అన్నిటిని నెమ్మది నెమ్మదిగ కొంచెము కొంచెముగ, బహుదినములలో తెలిసికొనవచ్చును. నీవైపు నేను చూడగనే నీ సమస్తమును నేను వీక్షింపగలిగితిని. కాని అంతు మాత్రము కానలేకయున్నాను.

ఒకసారి మృగయాశ్రాంతమున, తృషిత తాపితుడనై మధ్యాహ్నమున కుసుమ విచిత్రమగు మానససరోవరతీరమునకు వెడలితిని. ఆ సురసరస్సలిలముల తిలకించిన తోడనే, అనంత అతలత నా కన్నులకు గోచరించెను. ఎంత లోతునకు చూచినను స్వచ్ఛ జలము.

మధ్యాహ్న రవిరశ్మిరేఖలు స్వర్ణనళినుల సువర్ణ మృణాలములతో చెలిమిచేసి, అగాధ అసీమలకు జారి దిగిపోవుచుండినవి. జలముల కదలికచే లక్షకోటి అగ్నియుతము లగు నాగములపోలె వంకరటింకరగ అవి కంపించిపోవుచుండినవి.

సూర్య భగవానుడు సహస్రాంగుళుల నిర్దేశించి, జన్మశ్రాంత కర్మక్లాంత మర్త్య జనులకు అనంత శీతలమగు సుందర మరణము ఎచ్చట నున్నదో చూపుచున్నట్లు తోచెను. ఆ స్వచ్ఛ అతలతను నీలో నేను కాంచగలిగితిని.

నీ దివ్యకాంతిలో, కీర్తి క్లిష్టమానవుల పూర్ణనిర్వాపణమని నాలుగు దిక్కులనుండి దేవతాంగుళులు నాకు చూపుచున్నట్లున్నవి.

చిత్రాంగద : నేనుకాదు, నేనుకాదు, అయ్యో పార్థా, అయ్యో, ఇది ఏ దేవతల మోసము! వెడలిపో, మరలిపో, వీరుడా మరలి వెడలిపొమ్ము.

మిథ్యను ఉపాసింపకుము. మిథ్యా పదములకడ నీ శౌర్య పరాక్రమ మహత్వముల అర్పించకుము. వెడలిపొమ్ము.

3

# తరుతలమున చిత్రాంగద

అయ్యో, అయ్యో, దానిని మరల్చగలనా! తృష్ణార్తమై కంపితమై విస్ఫులింగ నిశ్వాసముల విడచు హోమాగ్ని శిఖవలె నున్న ఆ వీరహృదయవ్యాకులతను మరల్చి కాంచగలనా! ఆ నయనదృష్టి అంతర్బాహువై నన్ను ఈడ్చి తీసికొనిపోవుటకు వచ్చుచున్నదా యనునట్లున్నది. అతని ఉత్తప్త హృదయము సర్వాంగములను బద్ధలుచేసి, పైకి పరువెత్తికొనివచ్చుటకు కోరుచున్నది; దాని ఆక్రందన ధ్వని ప్రతి అంగమునందును వినబడుచున్నట్లున్నది! ఈ తృష్ణను మరల్చగలనా?

[వసంత, మదనుల ప్రవేశము]

అనంగదేవా, ఎట్టి సౌందర్యానలముచే నన్ను చుట్టుముట్టితివి? దగ్ధమగుచున్నాను, అది దగ్ధముచేసి నన్ను చంపుచున్నది.

మదనుడు : తన్వీ, నిన్నటి వివరముల వచింపుము. నాచే వదలబడిన పుష్పబాణములు ఎచ్చట ఏ కార్యమును సాధించినవో వినవలెనని అభిలాష పెంపొందుచున్నది.

చిత్రాంగద : నిన్నటి సంధ్యవేళ, తృణరాశి పరచిన సరసీతీరమున, వసంతము కురిసిన పువ్వులతో పుష్పశయ్యను అమర్చితిని. శ్రాంతదేహముతో, పరధ్యానచిత్తముతో పరుండియుంటిని. బడలిన తలను ఎడమచేతిపై ఉంచి, గడచిన నాటి మాటలను తలపోయుచుంటిని. ఏ పొగడ్తను అర్జునుని వదనమునుండి వినియుంటినో, దానిని మనస్సునకు తెచ్చుకొనుచుంటిని. ఆనాటి సంచితామృతమును బిందు బిందువుగ పీల్చి పానముచేయుచుంటిని.

గత జన్మ విషయమునువలె, పూర్వేతిహాసమును మరచుచుంటిని. నేను రాజకన్యను కాదని, నాకు పూర్వాపరములు లేవని భ్రమించితిని.

ధరాతలమున ఒకదినము ప్రస్ఫుటించియే జన్మించిన పితృ మాతృ హీనమగు అరణ్యపుష్పమువలె, దాని పరమాయువు ఒక్క అరపొద్దు మాత్రమే; ఇంతలోనే భ్రమర గుంజనగీతికల, వనవనాంతర ప్రమోద మర్మరస్వనముల విని ఆనందపడవలసియున్నది.

తదుపరి, నీలాంబరమునుండి నేత్రముల నెమ్మదిగ వ్రాల్చి, కంఠమును వంచి, వాయు స్పర్శమున వాడి తునియలై, ఎట్టి పరితాపము, ఎట్టి రోదనము లేకనే రాలి పడిపోవలసి యున్నది. ఇంతటి అల్పకాలముననే ఆద్యంతములు లేని కుసుమగాథ పూర్తికావలయును.

వసంతుడు : ఒక్క ప్రభాతమున అనంత జీవితము ప్రస్ఫుటించగలదు, సుందరీ.

మదనుడు : సంగీతమున క్షణకాల తానమున అనంతభావములు జన్మించి చిత్తమును రసవత్తరముగ చేయుచందమున ! తర్వాత ? చెప్పుము.

చిత్రాంగద : అటుల తలపోయుచుండ దక్షిణవాయువులు సర్వాంగములను నిద్రా తరంగములచే జోకొట్టుచుండినవి. సప్తవర్ణ వృక్షశాఖలనుండి వికసించిన మాలతీలత, అలసత్వమున అచంచలమైన, నా గౌరదేహముపై నిశ్శబ్ద చుంబనముల నంపుచుండినది. పుష్పములు కొన్ని కేశములమీదను, కొన్ని పాదములకడను, కొన్ని ఉరోజములపైనను తమ తమ మరణశయ్యల పరచుకొనుచుండినవి.

నిశ్చలముగ కొంతకాలము గడచెను. నా గాఢనిద్రయందు ఎప్పుడో ఎవరి ముగ్ధ నయన దృష్టిపాతమో, దశాంగుళులరీతి, నా నిద్రాలస తనువును ఆనంద పరవశత్వమున స్పర్శించుచున్నటుల నాకు తోచినది. ఉలికిపడి మేల్కొంటిని.

సన్యాసి, పదప్రాంతమున నిర్నిమేషముగ స్థిర ప్రతిమామూర్తివలె నిలువబడి యుండుటను కాంచితిని. పూర్వాచలమునుండి నెమ్మది నెమ్మదిగ జరుగుచు, ద్వాదశి శశి పశ్చిమదిశకు వంగినదై, నగ్నమగు అనాచ్ఛాదితమగు నా అమ్లాన, నూతన శుభ్ర సౌందర్యముపై తన సమస్త హిమాంశురాశిని క్రుమ్మరించుచున్నట్లుండెను.

పుష్ప పరిమళములచే పాదపతలములు పూర్ణములైయుండెను. ఈలపురుగులు జోకొట్టుచుండ, నిశీథిని నిద్రాముద్రితయై యుండెను. స్వచ్ఛ సరోవరమున చంద్ర కర చ్చాయలు అకంపితములై పడుచుండినవి. వాయువులు సుప్తములై యుండినవి.

నిగనిగలాడు వెన్నెల వెలుగులను తలపై దాల్చి చిగురుల చిక్కదనముచే మెత్తనగు నున్నని చీకట్లకుప్పలు క్రింద ఒప్పుచుండ, అరణ్యము స్తంభితమై యుండినది. అటులనే, చిత్రాంకితునివోలె, దీర్ఘకాయ వనస్పతి సమముగ దండధారి బ్రహ్మచారి ఛాయా సహచరుడై నిలువబడి యుండెను.

ప్రథమమున నిద్రాభంగము కాగానే, నల్గడల నేను పరికించినపుడు, ఎప్పుడో ఏదో ఒక విస్మృతప్రదోషమున జీవితమును విసర్జించి, ఏదో ఒక అపరూపమగు మోహనిద్రా లోకమున, గ్రుడ్డివెన్నెలలో నిర్జన వైతరిణీతీరమున స్వప్నజన్మమును వహించితినా యనునట్లుండెను.

లేచి నిలువబడితిని. మిథ్యలగు లజ్జాసంకోచములు, సడలి జారిపోయిన వస్త్రము వలె, పదములకడ రాలిపడిపోయినవి. 'మనోహరీ, ప్రాణప్రియా' అను మాటల వింటిని. ఆ గంభీర ఆహ్వానమున నా ఒక్క దేహమున జన్మజన్మలు, శతజన్మలు ఒక్కసారిగ మేల్కొనెనా యనునట్లుండెను.

'స్వీకరింపుము, స్వీకరింపుము, సర్వము స్వీకరింపుము, జీవనవల్లభా' అని నే నంటిని. రెండుచేతుల చాచి యిచ్చితిని. వనాంతరాళమున చంద్రుడు అస్తమించెను. అంధకారమున అవని మునిగిపోయెను. ఆ అనిర్వచనీయ పులకమున స్వర్గమర్త్యములు, దేశకాలములు, సుఖదుఃఖములు, జీవన మరణములు అచేతనములై పోయినవి.

ప్రభాత ప్రథమ కిరణములచే, విహంగముల ప్రథమసంగీతముచే మేల్కొని, ఎడమచేతిపై భారము ఊని నెమ్మది నెమ్మదిగ శయ్యాతలమున కూర్చుంటిని. వీరవరుడు సుఖసుప్తమగ్నుడై యుండుట కాంచితిని.

రజనీ సమ్మోద శిథిలావశేషమగు ప్రభాత చంద్రకళవలె, అతని అధర ప్రాంతమున శ్రాంత హాసరేఖ కాన్పించుచుండెను. మర్త్యలోకమున, నవోదయ పర్వతమున, నవకీర్తి సూర్యోదయము ప్రకాశమును పొందుచున్నదా యనునటుల అతని ఉన్నత లలాటఫలకమున అరుణకాంతి పడి శోభిల్లుచుండెను.

నిట్టూర్పు విడిచి, పడకను వదలితిని. నిద్రిత ముఖమును రవి కరములనుండి మరుగుపరచుటకై మాలతీ లతాజాలముల అనువుగ వంచి అమర్చితిని. నాల్గువైపుల ఆ పూర్వపరిచిత ప్రాచీనపృథ్వియే తిరుగ కంటబడియెను.

నేను, నవప్రభాతమున పారిజాత వికీర్ణతృణముల వనప్రదేశమున నిజచ్ఛాయా త్రస్తమగు హరిణివోలె ఎచ్చటనుండియో పరుగెత్తుకొని వచ్చితి ననునట్లు మరల నాకు తోచసాగెను. వితాన తలమున ఏకాంతమున కూర్చుండి కరపుటములచే ముఖమును కప్పి, ఏడవవలెననుకొంటిని — కాని ఏడ్పు రాలేదు.

మదనుడు : అయ్యో, మానవ నందినీ, స్వర్గసుఖ దివసముల స్వహస్తములతో పగుల గొట్టి, పిండి తెచ్చిన రసముతో ధరణియొక్క ఒక్క రాత్రమును నింపి, యత్నమున నీ అధర సమ్ముఖమున అందిచ్చితిని. నందన వన గంధముచే ఆమోదితమును, మధురమును, రతీదేవిచే చుంబితమును శచీదేవిచే ప్రసాదితము నగు సుధను నీచే పానము చేయించితిని. అయినను ఏడ్పా !

చిత్రాంగద : ఎవరిచేత, దేవా, నీవు పానము చేయించినది ! ఎవరి దప్పికను తీర్చితివి ! ఏ అంగముల వ్యాపించి ఆ చుంబనము ఆ ప్రేమసంగమములు, వీణా ఝుంకారమువలె, ఇప్పటికిని ఒక కదలికను కలిగించుచున్నవో, ఆ అంగములు నావి కావు.

బహుకాల సాధనమున, ప్రథమ మిలన సుఖము ఒక క్షణకాలము మాత్రము పొందగలుగుదుము. అట్టి సుఖమునుండి నన్ను వంచనచేసి, ఎవరు సంగ్రహించి తీసికొంటిరి! ఆ చిరదుర్లభ మిలనసుఖ స్మృతిని వెంటనిడుకొని, అతిస్ఫుట పుష్పదళసమముగ, ఈ నా మాయాలావణ్యము రాలిపడిపోవును. అంతరమున దరిద్రయగు రమణి, రిక్తదేహమున చిరకాలము రాత్రింబగళ్లు కూర్చుండి గడపవలసియుండును.

మీనకేతూ, ఏ మహారాక్షసిని, ఛాయవలె, అంగసహచరినిగ చేసి బంధించితివో కదా! ఎట్టి అభిశాపమిది! లోల ఓష్ఠములకడకు శాశ్వతముగ తృష్ణాతురమగు చుంబనము వచ్చెను. ఆ పిశాచి పానముచేసి తన తనివి తీర్చుకొనెను.

శ్రద్ధాసక్తియుతములగు ఆ ప్రేమదృష్టులు అంగములపై ఎచ్చటపడిన అచ్చట అభిలాషయొక్క అరుణ చిహ్నరేఖల చిత్రించినట్లుండును; అట్టి దృష్టి, రవిరశ్మిసమముగ, శాశ్వతరాత్రులు తపస్సుకావించుచుండిన కుమారీ హృదయపద్మమువైపులకు పరుగెత్తుకొనివచ్చెను; ఆ రాక్షసి నన్ను మైమరపించి, తనే గ్రహించి దాచుకొనెను.

మదనుడు: అటులైన నిన్నటిరాత్రి వ్యర్థమాయెనా ఏమి? ఆశాతరణి తీరసమ్ముఖమునకు వచ్చి, తరంగ ఆఘాతములచే మరల మరల వెనుకకు పోవలసివచ్చెనా ఏమి?

చిత్రాంగద: నిన్నరాత్రి ఎద్దియు మనస్సున లేకుండెను. సుఖస్వర్గము పట్టుబడుటకై ఎంతో దగ్గరకు వచ్చెను, కాని నా ఆత్మవిస్మరణసుఖమున దానిని పొందితినో లేదో నాకు తెలియదు. నేటి ఉదయమున లేవగనే, నిరాశాజనితమగు దూషణావేగమున నా హృదయము లోలోపల బద్దలగుచుండెను.

రాత్రి విషయములు ఒకటొకటిగ నా మనస్సునకు వచ్చుచుండెను; లోపలను బయటను ఒక సవతి నన్ను క్రమ్మియున్నదను చైతన్యము, విద్యుద్వేదనాయుతమై నాకు కలుగుచుండెను. ఇక దానిని నేను మరువజాలకున్నాను.

సపత్నిని స్వహస్తములతో బహు జాగరూకతతో అలంకరించి, నా ఆకాంక్షల తీర్థధామమగు శయనాగారమునకు అనుదినము పంపవలసివచ్చుచున్నది. విశ్రాంతిలేక, కూడనేయుండి, ప్రతిక్షణము ఆమె పొందు ఆదరముల నేను కండ్లార చూడవలసియున్నది. దేహసౌందర్యమున, హృదయము ఈర్ష్యానలమున దగ్ధమైపోవుట యను శాపమును నరలోకమున మరెవ్వరైన పొందిరా! అతనూ, నీ వరమును నీవు తిరిగి తీసికొనుము.

మదనుడు: అటులనే నేను తీసికొనిన, ఛలాచ్ఛాదనను త్రోసివైచి, రేపటి ఉదయము ఏ లజ్జతో పార్థ సమ్ముఖమున, హేమంతపు కుసుమపల్లవహీనమగు హిమశీర్ణలతవలె నిలువబడెదవు? ప్రమోద ప్రథమ ఆస్వాదము నొసగి, నోటనుండి సుధాపాత్రను లాగి

తీసికొని, భూమిపై శ్రద్ధలుచేసిన, అకస్మాత్తుగ సంభవించిన ఆ నిరాశాఘాతమున ఉలికి పడి లేచి, ఎట్టి ఆక్రోశముతో నిన్ను అతడు చూచునో ఊహించుకొనుము.

చిత్రాంగద : అదైనను మేలు. ఈ ఛద్మరూపిణికన్న అప్పటి నేను నూరింతలు శ్రేష్ఠమైనదానిని. అట్టి నన్ను నేను ప్రకాశింపజేసెదను. అది అతనికి అందముగ అగుపడక పోయిన, తిరస్కారమున అతడు వెడలిపోయిన, వక్షము చితికి చీలి నేను చచ్చిపోయినను, నేను నేనుగానే యుందును. అదైనను మేలు, ఇంద్రమిత్రమా!

వసంతుడు : నామాట వినుము. పుష్పములకు పుష్పించు పని పూర్తియైనపుడు, ఫలము ప్రకాశమును పొందును. తాపక్లిష్టములగు లఘులావణ్య దళములు యథాకాలమున తమకు తామే రాలి పడిపోవును నిజగౌరవముననే అది అప్పుడు, బహిర్గతమై ఒప్పారగలదు.

అటులనే నిన్నుగాంచి, నూతన సౌభాగ్యమని ఎన్ని, ఫల్గునుడు నిన్ను స్వీకరించి ఆదరించగలడు.

బిడ్డా, తిరిగి వెళ్ళుము, నీ యౌవనోత్సవములకు తిరిగి చనుము.

౮

# అర్జునుడు, చిత్రాంగద

చిత్రాంగద : ఏమి చూచుచున్నావు, ప్రాణేశ్వరా?

అర్జునుడు : పుష్పవృంతముల పట్టి కోమలాంగుళులు మాలను అల్లుచుండుట చూచుచున్నాను. "నిపుణత" "చారుత" అను ఇద్దరు అక్కచెల్లెండ్రు కలిసి, దినమంతయు చంచలోల్లాసమున నీ అంగుళుల అగ్రభాగమున ఆటలాడుకొనుచున్నారా యనునట్లున్నది. అదే చూచుచున్నాను. తలపోయుచున్నాను.

చిత్రాంగద : దేని విషయమై తలపోయుచున్నావు?

అర్జునుడు : అట్టి సుందరకరములతో పట్టి, అట్టి అరుణస్పర్శరసముచే రసవంత మొనర్చి, ప్రాణేశ్వరీ, ఈ నా ప్రవాసదివసముల అల్లిఅల్లి ఒక మాలను ఆయత్తపరచు

చున్నావు. ఆ అక్షయ ఆనందహారమును శిరమున ధరించి, గృహమునకు తిరిగి పోయెదను.

చిత్రాంగద : ఈ ప్రేమకు గృహము కలదా ?

అర్జునుడు : గృహము లేదా ?

చిత్రాంగద : లేదు. గృహమునకు గైకొనిపోయెదవా ? గృహ విషయము వచింపకుము. గృహము శాశ్వతకాలముది. శాశ్వతమైనదానిని గృహమునకు తీసికొనిపొమ్ము. అరణ్య పుష్పములు శుష్కించినపుడు గృహమునకు తీసికొనిపోయి ఎక్కడో పారవేసెదరు ? ఎచ్చటనో అనాదరమున పాషాణముల మధ్య అవి తలదాచుకొనును.

అరణ్య అంతఃపురమున అనుదినము అంకురములు అంతమొందుచున్నవి; పల్లవ రాసులు పడిపోవుచున్నవి; కేసరములు రాలిపోవుచున్నవి. కుసుమ దళములు వాడివత్త లగుచున్నవి. క్షణిక జీవనములు అనుక్షణమునను పుట్టి, పెరిగి, పూచి, పగిలి, పడిపోవు చున్నవి—దినాంతమున, నా ఆట పూర్తికాగానే, నేనును కానన సమాప్త సుఖసహస్రముల తోడ, అచ్చటనే రాలిపోయెదను. బహుశా అప్పుడు, ఎవరి మనమునను, ఎట్టి ఖేదమును ఉండదు.

అర్జునుడు : ఇంతేనా ?

చిత్రాంగద : ఇంతే. వీరవరా ! అందుచే విచారమేల ! విశ్రామ దినముల ఏది బాగుగ తోచునో, దానిని అప్పుడే పూర్తిగ అనుభవించుట లగ్గు. సుఖమును ఒక క్షణము అధిక ముగ బంధించియుంచిన, అదే దుఃఖముగ మారి పీడించును. ఎంత ఉన్నదో, అంతే తీసికొనుము. ఎంతకాలముండునో అంతకాలమే ఉంచుకొనుము. అభిలాషయొక్క ప్రాతఃకాలమున ఎంత కోరితివో, తృప్తియొక్క సంధ్యాకాలమున అంతకన్న ఎక్కువ ఆశించకుము.

దినము అంతమాయెను. ఈ మాలను కంఠమున వహింపుము. ప్రాణప్రియా, నా శ్రాంతతనువును ఆ నీ బాహువులపైకి చేర్చుకొనుము. మిథ్యలగు అసంతోషముల మరచి, సుఖ సమ్మిళనమున, అధరములకు సంధి కూర్చుము. ప్రణయ సుధామయములగు చిరపరాజయములతో ఒకరినొకరిని బాహుబంధముల బందీకృతుల కావించుకొనుదము రమ్ము, విజయా.

అర్జునుడు : ప్రణయేశ్వరీ, అదో వినుము, వనమునకు వెలుపల, దూరగ్రామమునుండి ఆరతి శాంతిశంఖారవములు మ్రోగుచున్నవి.



# మదనుడు, వసంతుడు

**మదనుడు :** మిత్రమా, నేను పంచశరుడను. ఒక శరమున నవ్వు, ఒక శరమున కన్నీరు, ఒక శరమున ఆశ, ఒక శరమున భయము కలుగజేయుచున్నాను. ఇంకొక శరముతో విరహ–మిలనములు, ఆశా–భయములు, సుఖదుఃఖములు ఒక నిముసమున సృష్టించి, ప్రజల వశపరచుకొనుచుందును.

**వసంతుడు :** నేను అలసియున్నాను. మిత్రమా, విశ్రాంతి నొసగుము. అనంగా, నీ రణరంగమును పూర్తిచేయుము. రాత్రిం దినములు జాగరూకతతో నుండి నీ హుంతాశనమును ఎంతకాలము వ్యజన మొనర్చుచుండగలను. మధ్యమధ్య, కన్నులకు నిద్రవచ్చుచుండును. రెక్కలు వ్రాలిపోవుచుండును. తప్తదీప్తిరాసులు భస్మముచే మ్లానమగుచుండును. ఉలికిపడి, మేల్కొని తిరుగ నూతన శ్వాసములచే ఊది, నవ ఉజ్వలతను కలుగజేయుచుందును. చెలికాడా, ఈతూరి నాకు సెలవు ఇమ్ము, నేను వెడలి పోయెదను.

**మదనుడు :** నీవు ఎల్లపుడును అర్భకునివలె అస్థిరుడవని నాకు తెలియును. ఎప్పుడును జంకుకొంకులు లేక, అడ్డంకులు లేక, భూలోకమున స్వర్గలోకమున ఆటలాడుచుందువు.

అత్యంత యత్నమున బహుకాలముగ దేనిని సుందర మొనర్చి ప్రదర్శించుచున్నావో, ఒక్క నిముసమున దానిని ధూళితలమున పారవైచి, వెనుకకుకూడ తిరిగిచూడక, వెడలి పోయెదవు.

ఇక ఎక్కువ దినములు లేవు, ఆనందచంచలములగు దినములు లఘువేగమున నీ పక్ష సమీరణములచే కోలాహలమున, చ్యుతపల్లవముల రీతి ఎగిరిపోగలవు. సంతోషమున, తెలియకనే వత్సరము పూర్తికానున్నది.

౬

# అరణ్యమున అర్జునుడు

అర్జునుడు : ప్రభాతమున నిద్రనుండి మేల్కొనగనే, స్వప్నలబ్ధమగు అమూల్యరత్నము నాకు ప్రాప్తించెనా యనునట్లున్నది. ఈ ధరయందు దానిని ఉంచుకొనుటకు నాకు స్థానము దొరకకున్నది; పొదిగి, అలంకరించి ఉంచుకొనుటకు తగిన కిరీటము ఎచ్చటను లేదు. అల్లి మాలగా వేసికొనుటకు తగిన సూత్రమును లేదు.

పోనీ, పారవేసిపోవుదమన్న, అట్టి తెలివితక్కువ నరాధముడను కాను. అందుచే దానిని హత్తుకొని, రాత్రింబవళ్లు, క్షత్రియుని బాహువు, కర్తవ్యహీనమై, దానికి బద్ధమై పడియున్నది.

[చిత్రాంగద ప్రవేశము]

చిత్రాంగద : ఏమి ఆలోచించుచున్నావు?

అర్జునుడు : వేట విషయమై ఆలోచించుచున్నాను. అదో చూడుము, పర్వతములపై వ్రాలి, వర్షధారలు వచ్చుచున్నవి. అరణ్యమున చిక్కని ఛాయలు మూగుచున్నవి. కొండ వాగు తటాలున పోకిరియై పరువెత్తుచున్నది. తన జిలిబిలి పలుకుల చిరునవ్వుల పొగరున ఒడ్డులు చేయెత్తి చేయు అడ్డగింపులనుకూడ సరకుగొనక ఏగుచున్నది.

ఇట్టి వర్షాదినముల, అన్నదమ్ము లైదుగురమును కలిసి, చిత్రక అరణ్యమున వేటకై వెడలెడి విషయము మనస్సునకు వచ్చుచున్నది. దినమంతయు, ఎండలేక, నిగనిగలాడు మబ్బుల చీకట్లలో ఉత్సాహముగ గడిపెడివారము. ఉరుముచు గంతు లిడుచున్న మబ్బులతోపాటు మా హృదయములును పొంగి నాట్యమాడుచున్నట్లుండెడివి.

సరసర పడు వర్షధారలచేతను, జరజర పారు వాగుల రొదలచేతను, నెమ్మదిగ జాగ్రత్తగ మేము వేయు కాలి అడుగుల చప్పుడులను జింకలు వినెడివికావు. చిరుతలు, పులులు త్రోవ అడుసులపై, తమ ఐదు గోళ్ళగుర్తు గీతలపెట్టి తమ ఇంటి విలాసముల తెలిపెడివి. నెమలి కేకలచే అడవులు మారుమ్రోగెడివి.

వేట పూర్తికాగానే, సోదరులము పందెముల వేసికొని, వర్షసౌభాగ్యగర్వమున, ఉబుకుచున్న వరదలుగల సంతరణా నదిని ఈదుచు దాటెడివారము. అటులనే, వేటకై బయలుదేరవలయునని ఉన్నది.

చిత్రాంగద : ఓ నా వేటకాడా, ఏ వేటను నీవు ప్రారంభించితివో, తొలుత దానిని పూర్తి చేయుము. ఈ స్వర్ణమాయామృగము నీకు పూర్తిగా దొరికిపోయినదని స్థిరపరచుకొంటివా ? పొరపాటు, అటుల కానేరదు.

ఈ అరణ్యమృగము తన్ను తానే పట్టిఉంచుకొనలేకయున్నది. ఎప్పుడో ఒకనాడు, కలవలె, ఒక్క గంతువేసి అది పారిపోగలదు. క్షణిక ఖేలనముల అది సహింపగలదు కాని శాశ్వత దివస పాశముల అది వహింపజాలదు.

అదో చూడుము, చూడుము : వాయువు వర్షము కలిసి ఎట్టి ఆటలాడుచున్నవో : నల్లని వాన, గాలి వీపుపై నిముసమునకు వేయి అంబులవేసి కొట్టుచున్నది. అయినను గాలి, పోకిరి జింకవలె, మదించినదై, గాయము పడకనే, గెలువ వీలులేనిదై ఎగురుచు దుముకుచు పోవుచున్నది.

నాథా, నీ మధ్యను నా మధ్యను అట్టి ఆటయే—నేటి ఈ వర్షదినమున జరుగుచున్నది. నీ పూర్తి అభిలాషతో ఒక చంచల వస్తువును వేటాడుచున్నావు. అంబుల పొదిలోనున్న అన్ని బాణముల, అన్ని అస్త్రముల ఏకాగ్రచిత్తమున, అధికమగు ఆసక్తితో వర్షించుచున్నావు.

ఒక్కొక్కప్పుడు చీకటి, ఒక్కొక్కసారి వెలుగు మెరయుచు నవ్వుచు ఆ వేటకు వన్నెలు పెట్టుచు గడచిపోవుచున్నవి. ఒక్కొక్కసారి నిగనిగలాడు వర్షధారలు, ఒక్కొక్కప్పుడు తళతళలాడు మెరపుతీగెలు నీ వేటకు అందచందముల నొసగుచున్నవి. కాని మాయామృగి, మేఘాచ్ఛన్నమగు జగత్తున విశృంఖలముగ సదా పరుగెత్తుచు తిరుగులాడుచున్నది.

౭

## మదనుడు, చిత్రాంగద

చిత్రాంగద : మన్మథా, నా ఒడలంతట ఏమి పూసితివో తెలియకున్నది. తీవ్రమగు సారాయమువలె, అది నా రక్తముతో కూడి, ప్రవహించి నన్ను ఉన్మాదపరచుచున్నది.

తన గమన గర్వమున మత్తయగు హరిణిమాడ్కి, పొంగుచున్న ఆవేశముతో, పృథ్విని లంఘించి, ముక్తకేశములతో నేను పర్విడుచున్నాను. విల్లు తాల్చిన ఆ నల్లని వేటకానిని, నిరాశునిచేసి, విసిగి వేసారించి వన వనమున, పథ పథమున త్రిప్పుచున్నాను.

నిర్దయ విజయసుఖమున, కౌతుక హాసముల నవ్వుచున్నాను. ఈ ఆటకు అడ్డంకుల కలిగించి, అంతమొందింప భయమగుచున్నది. ఒక్క నిముసమునకైనను అది స్థిరము కాదేమో యను సందేహ దుఃఖమున హృదయము బ్రద్దలగుచుండును.

మదనుడు : ఈ ఆటను అంత మొందింపకుము. ఇది నాయొక్క ఆట. చిటుకు చిటుకు మని నేను నా పూబాణముల రువ్వుచుండ, పటపట హృదయములు పగిలిపోవుచుండుము. నా వేట నేడు ఈ అరణ్యములో, ఈ తొలకరి వానలలో సాగుచున్నది.

ఇప్పటి రీతినే అతనిని అలయునటుల చేయుచుండుము. అతనిని కాళ్ళకడ కూల బడి మ్రొక్కునటుల చేయుము. దృఢపాశముతో అతనిని బంధింపుము. దయ చూపకుము. నీ నవ్వులచే అతనిని చీల్చివేయుము.

అమృత విషంబులు పూసిన వాడి వాక్యబాణములచే అతని చిత్తమును గ్రుచ్చు చుండుము. వేటకానికి దయాపదతి కూడదు.

౮

## అర్జునుడు, చిత్రాంగద

అర్జునుడు : ఎట్టి గృహమును లేదా నీకు, ప్రియా, ప్రియ పరిజనము నీ విరహమున ఏడ్చుచున్నట్టి భవనము ? అనుదినము నీ ప్రేమపూరిత సేవలచే సుధామయమగుచున్న ఆనందపురము ఎద్ది ? ఎచ్చటి ప్రదీపముల ఆర్పి ఈ అరణ్యములకు ఏతెంచితివి ? నీవు లేమి, నీ శైశవస్మృతులు ఏడ్చుచున్నట్టి స్థానము ఎచ్చటను లేదా ?

చిత్రాంగద : ప్రశ్న ఏల ? అటులైన, ఆనందము, అడుగంటిపోయెనా ? ఏమి చూచు చున్నావో, అదే నేను. అంతకన్న నా పరిచయ వివరములు ఏమియు లేవు.

ప్రభాతమున కింశుక పల్లవాగ్రమున ఊగుచున్నదే శిశిరబిందువు, దానికి ఊరు పేరు లున్నవా ? దాని పరిచయమును ఎవరైన అడుగుదురా ? నీవు ఎవరిని ప్రేమించుచున్నావో, ఆమెయు అట్టి నామధామహీనమగు నీహారకణమువంటిదే.

అర్జునుడు : ఈ పుడమియందు ఎట్టి బంధనములును దానికి లేవా ? కేవలము ఒక్క బిందువు స్వర్గమునుండి భూతలమునకు ఏమరచి పడెనా ఏమి ?

చిత్రాంగద : అవును. అది యథార్థము. ఒక్క క్షణమునకు మాత్రము అరణ్యకుసుమములకు ఆత్మ పరిచయ ప్రకాశమును ఒసగుచున్నది.

అర్జునుడు : అందుననే, ఎల్లప్పుడును నా ప్రాణము ఏదో పోగొట్టుకొన్నట్లు కష్టపడుచుండును. ఎందునను తృప్తిపొందజాలకయున్నాను. శాంతియు నాకు దూర మగుచుండును.

దుర్లభమగు ఓ నా స్వర్గమా, ఇంకను దగ్గరకు జరిగిరమ్ము ; నామ ధామముల, గోత్ర గృహముల, మనోవాక్కాయముల సహస్రబంధన పాశములయందు చిక్కి, పట్టుబడి, నీ పరిచయమును ఇమ్ము. నాలుగు వైపులనుండి నిన్ను చుట్టుముట్టి, తాకనిమ్ము. నిర్భయముగ నీపై నిర్భరుడనై బ్రతుకనిమ్ము.

నామము లేదా ? అటులైన నా హృదయమందిరమున, ఏ నామముతో అల్లి నా ప్రేమ మంత్రముల జపింపగలను ?

గోత్రము లేదా ? అట్టిచో, ఈ కమలమును ఏ మృణాళముపైనుంచి ఆరాధింపగలను ?

చిత్రాంగద : వద్దు వద్దు. నీవు దేనిని బంధింపగోరుచున్నావో, అది ఎట్టి బంధనముల ఎన్నడును తెలియనిది. అది కేవలము మేఘస్వర్ణకాంతి, ప్రసూన పరిమళము, తరంగ గమనమునకు ఈడు జోడై చంచలమైనది.

అర్జునుడు : అట్టిదానిని ప్రేమించు నతడు దురదృష్టవంతుడు ప్రియా, ప్రేమహస్తములచే గగన కుసుమములను ఇవ్వబోకుము. సుఖదుఃఖముల, సుదిన దుర్దినముల నా డెందమున ఉంచుకొని పూజించుటకు తగిన స్థిర సౌభాగ్య సంపత్తిని అనుగ్రహింపుము.

చిత్రాంగద : ఇంకను ఒక ఏడును గడవలేదు, ఇంతలో అలసటయా ? అయ్యో, అయ్యో, ఇప్పుడు తెలిసినది : దైవాశీర్వాదమున పుష్పమునకు స్వల్ప ఆయుర్దాయము మాత్రమే. గత వసంతకాలమున, మరణించిన పుష్పములతోబాటు, ఈ మోహనతనువును రాలి పడిపోయియుండిన, ఆదరమున మరణించియుండెడిది.

విజయా, ఇక ఎక్కువ దినములు లేవు. మిగిలియున్న కొద్దిదినములలో కుతూహలమున తనివితీర దాని ఆనందమధువును అడుగంట పానము చేయుము. అటుపై గత సాయాహ్నమునసే చ్యుతవృంతమగు మాధవీ పుష్పమునెడ ఆశచే తృషిత భృంగముభంగి, మరల మరల తిరిగి తిరిగి స్మృతియొక్క మనోహర మాయాదిశలకు రావద్దు.

## ౬

## వనచరులు, అర్జునుడు

**వనచరులు :** అయ్యో, అయ్యో. ఎవరు మమ్ముల రక్షింపగలరు ?

**అర్జునుడు :** ఏమాయెను ?

**వనచరులు :** వానలచే కొండవాగులవలె, ఉత్తర పర్వతములనుండి, వేగముగ, పల్లెటూర్ల కొల్లగొట్టుటకై, బందిపోటు దొంగలు వచ్చుచున్నారు.

**అర్జునుడు :** ఈ రాజ్యమున రక్షకు లెవరును లేరా ?

**వనచరులు :** దుష్టుల శిక్షించుచు రాజకన్య చిత్రాంగద ఉండినది. ఆమె భయమున రాజ్యమున యమభయము తప్ప, మరెట్టి భయములును లేకుండినవి. ఇప్పుడు అజ్ఞాత భ్రమణ వ్రతమున, తీర్థ పర్యటనకు వెళ్ళినదని వినుచున్నాము.

**అర్జునుడు :** ఈ రాజ్యమును రక్షించునది రమణియా ?

**వనచరులు :** అనురక్త ప్రజలమగు మాకు ఏకదేహమున ఆమె తల్లియు, తండ్రియు. అనురాగమున ఆమె రాజమాత, శౌర్యమున యువరాజు.

[ప్రస్థానము]

చిత్రాంగద ప్రవేశము

**చిత్రాంగద :** నాథా, ఏమి ఆలోచించుచున్నావు ?

అర్జునుడు : ఎందులకో తెలియదు కాని, రాజకన్య చిత్రాంగదనుగూర్చి మనమున తల పోయుచున్నాను. అనుదినము, శతముఖములనుండి నవనవ అపూర్వగాథల ఆమె విషయమై వినుచున్నాను.

చిత్రాంగద : కుత్సితురాలు, కురూపి ! చక్కగ దిద్దిన ఇట్టి వంకర కనుబొమలు ఆమెకు లేవు ; ఇట్టి సొగసైన నల్లని కనుగ్రుడ్డులును ఆమెకు లేవు.

కఠిన సబల బాహువులతో గురితప్పక అంబుల విసరుటకు ఆమె నేర్చినది కాని ఇట్టి సుకోమల నాగపాశములచే విజయుని వీరతనువును బంధింపజాలదు.

అర్జునుడు : కాని ఆమె ప్రేమమున పడతి, పరాక్రమమున పురుషుడు అని విన్నాను.

చిత్రాంగద : ఛీ, ఛీ అదే ఆమె దురదృష్టము. నారి కేవలము రమణియేయై, ధరణీ శోభయేయై, కాంతియై, ప్రేమయై, సుమధుర ఫలముమాత్రమేయై, శతరూపములగు హాస భావ విలాసభంగిమములతో నిండి, అనుక్షణము కొల్లగొట్టబడుచు, క్రమ్మబడుచు, కులుకుచు, కనలుచు, నవ్వుచు, ఏడ్చుచు, సేవలచేతను అందచందముల చేతను బుజ్జగింపుల చేతను ఓదార్పబడుచు, ప్రియుని తన కనుసీడలక్రిందనే ఉంచుకొనిన, ఆమె జన్మము సార్థకము కాగలదు.

కీర్తినొసగు కర్మలు, శౌర్య పరాక్రమములు, శిక్షణములు, దీక్షలు ఆమెకు ఎందుకును కొరగావు. ధనంజయా, రేపు ఆమెను ఈ వనపథపార్శ్వమున ఈ పూర్ణానదీతీరమున, ఈ దేవాలయమున చూచితివేని, నవ్వి పెడమొగముపెట్టి వెడలిపోవుదువు.

అయ్యో, నేడు నారీ సౌందర్యమున ఎంతటి అరుచి పెంపొందినది ! రమణియందు పౌరుషత్వపు స్వాదమును అన్వేషింప అభిలషించుచున్నావే !

నాథా రమ్ము, ఇదో చూడుము శైలగుహాముఖమున, గాఢచ్ఛాయలయందు లేతలేత ఎర్రని పచ్చని చిగురుల కోసి, కొండవాగు తుంపరలలో తడిపి, వాటిచే మన మధ్యాహ్న శయ్యను అమర్చితిని. దట్టముగ అలమియున్న చిగురుటాకుల మధ్య కూర్చొని, అలసిన గొంతులతో, "వేళ వెడలుచున్నది" "వేళ వెడలుచున్నది" అని విలపించుచున్నట్లున్నవి పావురములు.

నీడలమధ్య దారిచేసికొని సరసర పారుచున్నది వాగు ; అచ్చటచ్చట రాతిబండలపై తడిసిన నల్లని నాచు చిక్కగ రాసులుగ క్రమ్మి నిగనిగలాడుచు, రాతికండ్లవలె ఒప్పారుచుండ, వాటిపై చిరుత కెరటములు తమ కదలిపోవు సన్నని పెదవులతో ముద్దిడుచున్నవి. రమ్ము, నాథా ఆ రహస్య విరామస్థానమునకు పోదము రమ్ము.

అర్జునుడు : ప్రియా, నేడు కాదు,

చిత్రాంగద : ఏల నాథా ?

అర్జునుడు : పల్లెటూర్ల పాడుచేయుటకై బందిపోటు దొంగలు వచ్చుచున్నారని వింటిని. భయమున అలజడి పడియున్న ప్రజలను రక్షింప పోయెదను.

చిత్రాంగద : ప్రభూ, వారికెట్టి భయమును లేదు. తీర్థయాత్రా కాలమున రాజకన్య చిత్రాంగద నలుదిక్కులను జాగ్రత్తగనుండు కాపలావారిని నియమించిపోయెను. విపత్తు నకుగల మార్గముల నన్నిటిని జాగరూకతతో బంధించి వెడలెను.

అర్జునుడు : అయినను, ప్రియా, స్వల్పకాలమునకై కర్తవ్యసంధానము కావించి వచ్చుటకు అనుమతి నిమ్ము. క్షత్రియుని బాహువు పెక్కునాళ్లగ సోమరితనమున పడియున్నది. తలిరుబోడీ, కీర్తి క్షీణించిన ఈ బాహుద్వయమును తిరిగి నవీన గౌరవమున నింపి నీ శిర స్థలమున ప్రేమపూర్వకముగ నుంచగలను—అప్పుడే అవి యోగ్యోపధానములు కాగలవు.

చిత్రాంగద : ఒకవేళ నేను నిన్ను పోనివ్వకపోయిన ? నిన్ను కట్టి ఉంచివేసిన త్రెంచు కొనిపోయెదవా ? అటులైన పొమ్ము, కాని తెగిపోయిన తీగ తిరిగి అతుకుకొనదని మాత్రము జ్ఞప్తియుంచుకొనుము. తనివితీరకయున్న, వెడలుము, నేను వద్దు అనను. తనివితీరకయున్న, చంచలయగు సుఖలక్ష్మి ఎవరికొరకును ఆగి వేచియుండదని మనస్సు నందుంచుకొనుము. ఆమె ఎవరియొక్క సేవాదాసి గాదు. ఆమె ప్రసన్నయైయున్నంత కాలము, స్త్రీపురుషులు అత్యంత భయమున, కండ్లలో కండ్లు పెట్టుకొని రాత్రింబవళ్లు ఆమె సేవచేయుచుందురు.

సుఖముల కళికను జాగరూకతతో ఉంచిపోయిన వారు, కర్మక్షేత్రమునుండి సంధ్యా కాలమున తిరిగి వచ్చిచూచునప్పటికి, దాని దళములు విచ్చి భూమిపై రాలిపోయియుండు టను కాంచి, అయ్యో, పడిన శ్రమ యంతయు వృథాయాయెనే, అని విచారింతురు. శాశ్వత జీవితము మధ్య సజీవములగు అతృప్తి, క్షుధాతురతలు రేగి పీడించుచుండును.

రమ్ము నాథా, కూర్చుండుము. ఏల నేడు ఇంత అన్యమనస్కుడవు ? ఎవరి విషయమై ఆలోచించుచున్నావు ? చిత్రాంగదనుగూర్చియా ? ఆమెకు నేడింత భాగ్యమేల ?

అర్జునుడు : ఆ వీరాంగన ఎందులకై దుష్కర వ్రతమును పూనినదో యని ఆలోచించు చున్నాను. ఆమెకు ఏమి కొరత ?

చిత్రాంగద : ఆమెకు ఏమి కొరతయా ? ఆ అభాగ్యురాలికి ఉన్నది ఏమి ? ఆమె శౌర్య పరాక్రమములు, అభ్రభేదియగు కఠిన దుర్గమువలె, అవరుద్ధమగు రమణీ హృదయ మును నలుదిక్కులనుండియు మూసి ముట్టడించియున్నవి. నారి సహజముగనే అంత ర్వాసిని. రహస్యముగ తనలో తాను నివసించుచుండును. హృదయ ప్రతిబింబము, దేహ

శోభయందు ప్రకటితమై ప్రకాశింపకున్న, ఎవరు ఆమెను చూచి అర్థముచేసికొనగలరు? ఆమెకు ఏమి కొరతయా?

అరుణ లావణ్యరేఖలనుండి శాశ్వతముగ నిర్వాసన మొనర్పబడిన ఉషాదేవిపోలె, ఆ మానిని పరాక్రమశైల శృంగములపై సర్వదా ఏకాంతమున నుండ, నూరుపొరల చీకట్లు ఆమెను క్రమ్మి కప్పియుండ, ఆమెకు ఏమి కొరతయని అడిగెదవా? ఆమె విషయము ఆపివేయుము. ఆమె జీవిత చరిత్రము పురుషులకు శ్రుతిమధురము కాదు.

అర్జునుడు : చెప్పుము, ఆమె విషయమై చెప్పుము. క్రమక్రమముగ విన కుతూహలము వృద్ధి యగుచున్నది. నా హృదయము మధ్య ఆమె హృదయమును అభిభూత మొనర్చుకొనుచున్నాను.

అర్ధరాత్రమున ఏదో అపరూపమగు దేశమును ప్రవేశించిన ఒక బాటసారివలె ఉన్నాను. నదులు, గిరులు, వనభూములు నిద్రానిమగ్నములు; శుభ్ర సౌధ కిరీటినియగు విశాల నగరము ఛాయానసమముగ, అర్థస్ఫుటముగ కాన్పించుచున్నది. సాగర గర్జనలు వినబడుచున్నవి. ప్రభాత రోచిస్సుల విచిత్ర విస్మయమున నల్గడల అన్నియు ఒక్కసారి వికసించి కాన్పించును.

ఉత్సుక హృదయమున, ఆమెకొరకై నేను నిరీక్షించియున్నాను. చెప్పుము, చెప్పుము ఆమె విషయముల వివరింపుము.

చిత్రాంగద : ఇంకేమి వినెదవు?

అర్జునుడు : వామకరమున అశ్వరజ్జుల అలక్ష్యముగ పూని, దక్షిణకరమున ధనుశ్శరమును వహించి, ఆనందోత్సవముల జరిపించు పురముయొక్క విజయలక్ష్మిపోలె, ఆర్త ప్రజలకు విశిష్ట అభయదానముల నొసగుచు పోవుచున్నట్లు నేను ఊహించి చూచుచున్నాను.

రాజుల మహిమలు ప్రవేశించుటకు సంకోచించు దరిద్ర సంకీర్ణద్వారములకు, మాతృరూపిణియై చని, తన అనుగ్రహముల అందరికిని పంచుచున్నది. ఆడసింహమును నల్గడల బిడ్డలు పరివేష్టించియున్నరీతిని, ప్రజలు చుట్టుచేరియుండ భయమున శత్రువులెవరును దగ్గరకు రా వెరచుచున్నారు.

వీరకేసరిపై కూర్చుండియున్న దయామయి జగద్ధాత్రివలె, లజ్జారహితయై, భయవిహీనయై, ప్రసన్న స్మితహాసములతో తిరుగుచున్నది.

రమణీ కమనీయ బాహుయుగళముపై అసంకోచ బలము అనల్పముగ చేరియుండ, గలగల ధ్వనించు కంకణ కింకిణీ భూషితయగు నారి ఆమెవద్ద పేలవముగ కాన్పించుచుండును.

కమలముఖీ, ప్రియా, పెక్కునాళ్లుగ పనిలేకయుండిన నా ప్రాణము, దీర్ఘశీత సుషుప్తినుండి లేచిన భుజంగమువలె అశాంతమై పరువులిడుచున్నది.

రమ్ము రమ్ము, ఇద్దరమును రెండు పొగరు గుఱ్ఱముల నెక్కి మహావేగమున మెరయు జంటచుక్కలవలె ప్రక్కప్రక్కన పరువెత్తిపోదము రమ్ము. ఈ అవరుద్ధ వాతావరణమును వదలి, పువ్వులవాసనలనెడి పులిసిన కల్లుచే కైపెక్కి తూగుచు ఊగుచుండు అరణ్యముయొక్క అంధ గర్భమునుండి బయటికి పోవుదము రమ్ము.

చిత్రాంగద : కౌంతేయ, లలితమును, కోమల భీరువును, స్పర్శక్లేశ కాతరమ్మును, శిరీష పేశలమును అగు ఈ రూపమును ఈసడించి చీల్చి చింపి, కట్టుకొన్న కోకనువలె కాళ్ళ వద్ద పారవేసిన, ఆ లోటును నీవు భరించగలవా ? కామినీ ఛద్మకళలను, మాయామంత్రములను విడనాడి, నా సరళ, ఉన్నత, బలిష్ఠ, అంతర శక్తితో లేచి నిలువబడిన, నిత్యము జంకుకొంకులచే వంకరటింకరగ దోగాడు తీగ మెత్తదన మేమియులేక, గాలి ఊపులచే వంగుచు ఎగురుచు దుముకుచు పర్వతమున తళతళలాడు లేతచెట్టువలె ఎగసి కాన్పించిన, అది మగవారి కండ్లకు అందముగ అగుపడునా ?

ఆపివేయుము, ఆపివేయుము దానికన్న ఇదియే మేలు. నా యౌవనము రెండునాళ్ల బహుమూల్య ధనము. జాగరూకతతో అలంకరించి, ఎదురుచూచుచు కూర్చొనియుందును. తగిన సమయమున నీవు విచ్చేసిన, నా సుధచే దేహపాత్రమును పై అంచువరకు నింపి పానము చేయించెదను. సుఖస్వాదముచే వెగటు పుట్టెనేని, ఏదో పనిని వెతుకులాడుచు పోవగోరెదవు, ప్రాతబడిన, నీ వొసగిన స్థానమున ప్రక్కన పడియుండెదను.

శర్వరి నర్మ సహచరి, దివసపు కర్మసహచరియైన, దక్షిణహస్తమును అనుసరించు వామహస్తమువలె, సర్వదా ఉద్యతురాలనైయుండిన, అది వీరుని ప్రాణమునకు రుచికరముగ తోచునా ?

అర్జునుడు : నీ రహస్యమును నేను తెలిసికొనజాలకయున్నాను. ఇన్నాళ్లుగ నీతో కలిసి ఉన్నాను కాని నీ మంచిచెడ్డల నేను పొందజాలకయున్నాను. నీవు గుప్తముగ ఉండి సదా నన్ను వంచన మొనర్చుచున్నట్లున్నది. నీవు దేవివలె ప్రతిమాంతరాళమున నిలువబడి, అమూల్యచుంబన రత్నములను, ఆలింగన సుధలను దానమొసగుచున్నావు. నీకై ఏమియు కోరవు; ఏమియు తీసికొనవు.

అంగహీన, ఛందోహీనమగు ప్రేమ ప్రతిక్షణమునను అంతరమున సంతాపమును రాజవేయుచుండును. నా విద్యుల్లతా ! మధ్యమధ్య ఒక్కొక్క మాటయందు నీ గుట్టు జాడ తెలియుచుండును. దానికడ ఈ సౌందర్యరాశి ఏదో మట్టిబొమ్మవలె, నిపుణముగ చిత్రింపబడిన బొమ్మల తెరవలె కాన్పించుచుండును. అప్పుడప్పుడు నిన్ను నీరూపము పట్టి ఉంచలేక గజగజ వణకిపోవుచున్నట్లుండును.

సర్వదా మెరయుచున్న చిరునవ్వుల క్రీనీడలలో నిండుకన్నీరు వాసముచేయుచు మధ్యమధ్య బుసబుస పొంగి ఒక్క నిముషమున గట్టుల త్రెంచుకొని పొరలి పడుచున్న ట్లుండును.

సాధనయొనర్చు యోగికి ప్రథమమున భ్రాంతి మనోహర మాయారూపముతో, కాన్పించి, తదుపరి భూషణవిహీన దేహములో లోపలను బయటను దివ్యదీప్తిని ప్రసరింప జేయుచు సత్యమును దర్శనమొసగును. నీలో ఉన్న సత్యమును నాకు ప్రసాదింపుము. నాలో ఏదైన సత్యమున్న దానినే నీవును గ్రహింపుము. శ్రాంతిహీనమగు అట్టి మేలనము శాశ్వత దినములది.

మనోహరీ, ఏల ఈ కన్నీరు? కరములచే ముఖమును కప్పి ఏల ఈ వ్యాకులత? ప్రియతమా, వేదన కలుగచేసితినా? అటులైన ఊరకొనెదను. దాని సంగతి ఇక వద్దు, నా పుణ్యఫలముల మనోహరమూర్తి ఈ యౌవన యమునయొక్క ఆవలిగట్టునుండి, వసంత సమీరములలో, మధ్యమధ్య వినబడు ఆ సంగీతమే నా పరమభాగ్యమని తలచు చున్నాను.

ప్రియా, ఈ నా వేదనయే సుఖములకన్న అధిక సుఖము. ఆశలకన్న అధిక మగు ఆశ, హృదయముకన్న గుడుతరమైనది. అందుననే అది హృదయవ్యథగ తోచు చుండును.

౧౦

# మదనుడు, వసంతుడు, చిత్రాంగద

మదనుడు : నేటిదే కడపటి రాత్రి.

వసంతుడు : నేటిరాత్రి పూర్తియగుసరికి, నీ అంగశోభ తిరిగి అక్షయవసంత భాండార మునకు చేరుకొనును. విజయుని చుంబనస్మృతి మరచి, నీ ఓష్ఠరాగము ఒక కోమల లతను ఆశ్రయించి, రెండు నూతన కిసలయముల రూపమున నన లెత్తును. నీ అంగ వర్ణము శతశ్వేత ప్రసూనములలో నూతన తనువును తాల్చును: అవి ఈ క్రొత్త అవ తారమున గతజన్మ విషయమును, స్వప్నమునువలె వదలివేయును

చిత్రాంగద: అనంగదేవా, వసంతరాజా, అటులైన నేటిరాత్రి నా ఈ మరణోన్ముఖ మగు రూపము, రాత్రి అవసానమున శ్రాంత ప్రదీపపు అంతిమశిఖవలె ఒక్కసారిగ ఉజ్వలతమమై శోభిల్లనిండు.

మదనుడు: అటులనే కాగలదు. మిత్రమా, కోమల మలయసమీరములు తమ పూర్తియైన వడితో వీవనిమ్ము. యౌవనక్లాంత మందస్రోతస్విని నవోల్లాసమున తిరిగి పొంగి ఆమె ప్రతి అంగమునందును లావణ్యమరీచివీచికల నృత్య మొనర్పనిమ్ము.

నేను నా పంచపుష్పశరములచే నిశీథపు నిద్రాభంగమొనర్చి, భోగవిలాసముల స్రోతమును ప్రవహింపజేసి, బాహుపాశములచే బద్ధులగు ఇద్దరి ప్రేమికుల తనువుల, దాని ఉత్తుంగ తరంగముల ముంచుచు తేల్చుచుండెదను.



కడపటి రాత్రి

## అర్జునుడు, చిత్రాంగద

చిత్రాంగద: ప్రభూ, కోరిక తీరినదా? ఈ సులలిత, సుఘటిత, నవనీత కోమల సౌందర్యమునకు గల పరిమళముల, మధువుల పూర్తిగ అనుభవించితివా? ఇంకను ఏమైన శేషించియున్నదా? ఇంకేమైన కోరుచున్నావా? నాకు గలదంతయు పూర్తియై పోయెనా? పూర్తి కాలేదు. ప్రభూ, బాగున్నను లేకున్నను ఇంకను మిగిలియున్నదానిని నేడు ఇవ్వగలను.

ప్రాణవల్లభా, నీకు ప్రీతికరముగ నుండునని తలచియే, బహుసాధనలచే సంపాదించి, నందన కాననమునుండి ఏరితెచ్చిన ఈ సౌందర్యమనెడి పుష్పరాసిని నీ చరణ కమలములకడ నివేదించితిని. పూజ సమాప్తియైన అనుమతి నొసగుము. ప్రభూ, పూదండలు లేని పళ్లెరములను మందిరపు వెలుపల పారవేయుదును. ఈసారి ప్రసన్న నయనములతో ఈ దాసురాలివైపు చూడుము.

ఏ పుష్పములచే నేను పూజయొనర్చుచుంటినో, వాటివలె నేను సుమధురము, సుకోమలము, పూర్ణసుందరము ఐనదానను కాను. నాకు దోషము లున్నవి, గుణము లున్నవి, పాపపుణ్యము లున్నవి, ఎన్నియో దైన్యములున్నవి; పుట్టుకనుండి ఎన్నియో అతృప్త తృషలును నన్ను ఆవరించియున్నవి.

సంసారమార్గ పథికుడా, ధూళిచే మాలిన్యములు నావసనములు; గాయపడినవి చరణములు, నేను ఎచ్చటనుండి పొందగలను కుసుమలావణ్యమును, రెండు నిముసముల జీవిత అకళంక శోభను; కాని అక్షయము అమరమునగు ఒక రమణీ హృదయము నాకడ నున్నది.

ధూళిమయమగు ధరణియొక్క ఒడిలో శిశువులవలె నున్నవి దుఃఖములు, సుఖములు, ఆశలు, భయములు, లజ్జలు, దుర్బలతలు, వాటి ఎన్ని భ్రాంతులు, ఎన్ని వ్యథలు, ఎన్ని ప్రేమలు ఒకటిగ కలిసి వ్యాపించియున్నవి:

ఒక అపరిమితమగు అసంపూర్ణతయు ఉన్నది. ఒక అనంత మహత్వమును ఉన్నది. కుసుమసౌరభమును వాటితో కలనియున్నయెడ, ఈ పర్యాయము ఆ జన్మ జన్మాంతరముల దాసురాలివైపు చూడుము.

## సూర్యోదయము

(మేలి ముసుగును తీసి)

నేను చిత్రాంగదను. రాజేంద్ర నందినిని. బహు ఆభరణములచే తన కురూప రూపమును నింపి, ఒక నారి ఆనాడు ఆ సరోవరతీరమున, శివాలయమున నీకు కాన్పించి నది నీకు బహూశా జ్ఞప్తియుండవచ్చును. సిగ్గులేని ఆ గయ్యాళి ఏమి పలికెనో, పురుషారాధన పురుషపద్ధతిని చేయయత్నింప, నీవు ఆమెను తిరస్కరించితివి. నీవు చేసినది మంచిదే యాయెను.

సామాన్యమగు ఆ నారీరూపమున ఆమెను నీవు గ్రహించియుండిన, ఆమరణ కాలము అనుతాపము ఆమె హృదయమును పొడుచుచు పీడించుచుండెడిది. ప్రభూ, నేనే ఆ నారిని; కాని ఆ నారిని నేనుకాను సుమా. అది నా హీనఛద్మవేషము మాత్రమే. తదుపరి వసంతుని వరమున ఒక వత్సరకాలము అపరూప రూపమును సంపాదించితిని. అదియు నేను కాను.

నేను చిత్రాంగదను; దేవిని కాను, సామాన్య రమణినికాను. పూజించి శిరముపై పెట్టుకొనుటకు నేను తగను. అలక్ష్యముగ నెట్టి వెనుక త్రోసిపుచ్చుటకును నేను ఒప్పను.

సంకటమార్గమున నన్ను పార్శ్వమున ఉంచుకొనిన, దురూహ ఆలోచనలలో నాకును భాగ మొసగిన, నీ కఠిన వ్రతములయందు సహాయ మొనర్చుటకు అనుమతి నొసగిన, నీ సుఖదుఃఖములయందు నన్ను నీ సహచరినిగ చేసికొనిన, అప్పుడే నా పరిచయమును నీవు పొందగలవు.

ఏ నీ సంతానమును నా గర్భమున వహించియున్నానో, అది పుత్రుడైన ఆశైశవ వీరశిక్షణ నొసగి ద్వితీయ అర్జుననిగ చేసి, అతనిని అతని జనకుని చరణములకడకు నేను పంపిన దినము, నన్ను నీవు తెలిసికొనగలవు, ప్రియతమా.

నేడు నీ పాదములవద్ద ఇంతమాత్రమే నివేదించుచున్నాను. నేను చిత్రాంగదను, రాజేంద్ర నందినిని.

అర్జునుడు : ప్రియా, నేడు నేను ధన్యుడను.

# పాత్రలు

| | | |
|---|---|---|
| చంద్రమాధవబాబు | ... | కలకత్తాలో వొక కాలేజీలో అధ్యాపకుడు, బ్రహ్మచారి సమితి సభాపతి |
| శ్రీశ్‌బాబు, విపిన్‌బాబు<br>పూర్ణబాబు | } | బ్రహ్మచారి సమితిలో సభ్యులు |
| అక్షయ్‌కుమార్ | ... | జగత్తారిణి పెద్ద అల్లుడు |
| రసిక్‌దాదా | ... | జగత్తారిణికి వరుసకు పినతండ్రి |
| గురుదాస్ | ... | సంగీత విద్వాంసుడు |
| వనమాలి | ... | పెళ్ళిసంబంధాలు కుదిర్చే వ్యక్తి |
| దారుకేశ్వర్<br>మృత్యుంజయ్ } | ... | కులీన యువకులు |
| జగత్తారిణి | ... | హిందూ కుటుంబములోని వితంతువు |
| పురబాల | ... | జగత్తారిణి పెద్దకూతురు, అక్షయకుమార్ భార్య |
| శైలబాల | ... | జగత్తారిణి వితంతు పుత్రిక |
| నృపబాల<br>నీరబాల } | ... | జగత్తారిణి అవివాహిత పుత్రికలు |
| నిర్మల | ... | చంద్రమాధవబాబు మేనకోడలు, అవివాహిత |

# ప్రథమాంకం

## దృశ్యం ౧

[అక్షయుని డ్రాయింగ్ రూం—అక్షయుడు, పురబాల]

పురబాల : మీసొంత చెల్లెళ్ళే అయినట్లయితే మెదలకుండా యెలా కూర్చునేవారో చూసే దాన్ని. యీపాటికి వొక్కొక్కళ్లకీ మూడేసి—నాలుగేసి సంబంధాలు తీసుకొచ్చేవారు కదూ. యింతకీ వాళ్ళు నా చెల్లెళ్లు కనుక—

అక్షయ్ : మానవ స్వభావాన్నిగురించి నీకు తెలియనిదంటూ యేమీలేదు. తన చెల్లెళ్లకీ భార్య చెల్లెళ్లకీ యెంత వ్యత్యాసం వుంటుందో నువ్వీ చిన్నవయసులోనే చక్కగా తెలుసుకున్నావ్. యిదిగో మామగారి కూతుళ్లలో యేవొక్కరినీ పరాయివాళ్ల చేతుల్లో అప్పగించటానికి మనసొప్పటంలా. యీ విషయంలో నా కౌదార్యం లేదన్నమాట వొప్పుకుతీరాల్సిందే.

పుర : చూడండి. మీతో నేనొక వొప్పందం చేసుకోవాలి.

అక్షయ్ : వొహ శాశ్వతమైన వొప్పందం—మంత్రపూర్వకంగా—మన పెళ్ళినాడే జరిగి.దిగా : మళ్ళీ యింకొహటా ?

పుర : యేమండోయ్. యిదంత భయంకరమైంది కాదులెండి. బహుశా అంత సహించరాని విషయంకూడా కాకపోవచ్చు.

అక్షయ్ : అయితే అదేమిటో విప్పిచెబుదూ.

ఏమని లోలో
తలపోసెదవో
యేనెరుగను మరి
విప్పిచెప్పవో లలనా :
కంటినీటితో
కళవళించు
కన్నులలో యే
లాటి భావములు
తేలిపోవునో లలనా :

పుర : ఉద్దండులవారూ! ఆగండి. అసలు నేనడగొచ్చిందీ—రోజు మొత్తంమీద మీరు పరిహాసాలు కట్టిపెట్టే సమయమేదో సెలవీయమని...అప్పుడు మీతో వొకటి రెండు ముఖ్యమైన సంగతులు మాట్లాడాలి.

అక్షయ్ : పేదవాణ్ణి. భార్యకి మాట్లాడే అవకాశాన్నివ్వటానికి ధైర్యం చాలదు. యే బాజూబందులయినా వోవేళడిగితే—?

మన నిమ్మనునేమో యని
భయము భయముగా నుండును
చూపులెచట చిక్కువడునో
యని కనులే యెత్తబోను

పుర : అయితే వెళ్లండి.

అక్షయ్ : అహఁహఁ. వొద్దు. కోపం వొద్దు...సరే. నువ్వేం చెప్పదలచినా సరే చెప్పు. వింటాను. నీ 'హాస్యనివారణ సమితి'లో సభ్యుణ్ణవుతానని రాసిస్తాను. నీయెదట యెలాంటి అసభ్యతనూ ప్రదర్శించనని...ఆఁ అన్నట్లు యేమిటీ మానిని మాట్లాడుతున్నది? మరదళ్ల పెళ్ళి ప్రస్తావనకదూ! మంచి ప్రస్తావన...

పుర : చూడండి. మా నాన్న లేరిప్పుడు. అమ్మ మీమీదే యెన్నో ఆశలు పెట్టుకుని వుంది. మీ మాటవినే యింకా ఆమె యీడుమించినా వాళ్లకిద్దరికీ చదువు చెప్పిస్తోంది. యిప్పుడుకూడా మంచి సంబంధాలు రాకపోతే యెంత అన్యాయమవుతుందో ఆలోచించండి.

అక్షయ్ : మరేమీ దిగులుపెట్టుకోవద్దని నే మొదట్లోనే నీతో చెప్పానుగా! నా తోడల్లుళ్లు గోకులంలో పెరుగుతూనేవున్నారు.

పుర : యెక్కడ ఆ గోకులం?

అక్షయ్ : యీ అభాగ్యుడు యెక్కణ్ణించి యీ కొట్టంలోకి వొచ్చిపడ్డాడో అదే— మా బ్రహ్మచారి సమితి.

పుర : బ్రహ్మదేవుడితో పోరాడేవాళ్లుగా వాళ్ళందరూ?

అక్షయ్ : దేవుడితో యేం పోరాడగలరు? ఆయన్ని కొంచెం రెచ్చగొట్టగలరు. అంతే. అందుచేతనే భగవంతుడైన బ్రహ్మదేవుడికికూడా యీ సమితిమీదనే పక్షపాతం యెక్కువ. మూతపెట్టిన చట్టిలో మాంసం వుడికి వుడికి మ్రగ్గిపోయినట్లు— ప్రతిజ్ఞాబద్ధులై అణిగివున్న సభ్యులుకూడా—యెముకలతోసైతం మెత్తబడిపోయి,

చక్కగా వివాహయోగ్యులయినారు—వద్దించటమే తరవాయిగా. నేనూ నొహప్పుడు యీ సమితికి సభాపతిగా వున్నవాణ్ణేగా !

పుర : మీ పరిస్థితి యెలా తయారయిందప్పుడు ?

అక్షయ్ : అదింకా యేం చెప్పను ? 'స్త్రీ' అన్నమాటనుకూడా వుచ్చరించనని ప్రతిజ్ఞ చేశాను. కాని చివరకు —శ్రీకృష్ణుడి పదహారువేల గోపికలు లభించటం సాధ్యం కాకపోయినా, కనీసం మహాకాళి అరవైనాలుగువేల యోగినుల జాడ తెలిసినా తనివితీరా వాళ్ళతో వొక్కసారి సరసాలాడాలని అనిపించేది. సరిగ్గా ఆ సమయంలో సాక్షాత్కరించావ్ నువ్వు. యింకేముంది !

పుర : అరవైనాలుగువేలమంది ఆసక్తి తీరిందా ?

అక్షయ్ : అదింక నీయెదట చెప్పను. నీకు గర్వమెక్కుతుంది. సంకేతాలతోమాత్రం చెప్పగలను. కాళీమాత అనుగ్రహించింది. అది మాత్రం నిజం.

పుర : అయితే నేనూ చెప్పగలను. భగవాన్ భోళాశంకరులకి నంది, భృంగీ లేక పోలేదు. ఆయన నన్ను దయతలచివుంటారు బహుశా.

అక్షయ్ : అయితే అయివుండొచ్చు. అందుకనే కార్తికేయుణ్ణి పొందగలిగావ్ !

పుర : అదుగో మళ్లీ మొదలు యెగతాళి.

అక్షయ్ : కార్తికేయుడంటే యెగతాళి కాబోలు ? నీమీద వొట్టువేసుకొని చెప్పగలను. అది నా అంతరాంతరాల్లోని విశ్వాసం...

[శైలబాల ప్రవేశిస్తుంది]

శైలబాల : ముఖర్జీగారూ ! యీసారి మీ మరదళ్ల నిద్దర్నీ కాపాడుకోండి.

అక్షయ్ : వొకవేళ కట్టుతప్పిపోయేట్లయితే—నేనున్నానులే. యింతకీ యేమిటి సంగతి ?

శైల : అమ్మ గద్దించటంతో రసిక్‌దాదా యెక్కణ్ణించో కులీనులైన యువకుల్నిద్దర్ని పట్టుకొచ్చాడు. తన కూతుళ్ల నిద్దర్నీ వాళ్లకిచ్చి చెయ్యటానికి అమ్మ నిశ్చయించుకుంది.

అక్షయ్ : అమ్మ బాబోయ్ ! ఏకంగా పెళ్ళిళ్ళ 'ఎపిడెమిక్' ప్లేగులాగ—వొకింట్లో వొక్కసారిగా యిద్దరమ్మాయిలకు సంక్రమించటం...నాకూడా యెక్కడ తగుల్తుందో అని భయంవేస్తోంది.

మరీ యింత చేరువగా
నునికి నాకు వెరపుగొల్పు
కంటిచూపు నోటిమాట
కలియబడియె నేని యింక
నేమయినను గలదా మరి?

శైల: యిదా మీ సంగీతాలకి సమయం?

అక్షయ్: యేం చెయ్యను చెప్పు. సన్నాయి వాయించటం చేతకాదుకాని, చేతయితే వాయించేవాణ్ణే. యేమంటావ్? శుభకార్యం. యిద్దరు మరదళ్లకీ వివాహ బంధనం...కాని యింత తొందరేమొచ్చిందీ అని!

శైల: వైశాఖమాసం దాటితే యిహ యీ యేడాదంతా మంచిదికాదుట. పెళ్ళి ముహూర్తాల్లేవుట.

పుర: మీరు ముందునుంచే బెంగెట్టుకోవడం దేనికి శైలా? వరుల్ని చూడనియ్ ముందు.

[జగత్తారిణి ప్రవేశిస్తుంది]

జగ: నాయనా అక్షయ్!

అక్షయ్: యేమిటత్తగారూ!

జగ: నీమాట పట్టుకుని పిల్లల్నింకా ఆపివుంచలేను.

శైల: ఆడపిల్లల్ని ఆపివుంచలేమని—యెక్కడో అక్కడ వొదిలేస్తామా? అమ్మా!

జగ: అదుగో అదె! నీమాటలు వింటూంటే నాకు వొళ్ళుమండుకొస్తుంది. నాయనా, అక్షయ్. శైల తలచెడ్డపిల్ల సరే. దాన్నింత చదివించి, పరీక్షలు ప్యాసుచేయించి నందువల్ల వొచ్చేదేమిటి చెప్పు? దానికింత చదువెందుకు?

అక్షయ్: అత్తగారూ, శాస్త్రాల్లో రాసిపెట్టేవుంది—ఆడదాని కేదోవొక ఉపద్రవం వుండితీరాలని...భర్త—లేదా విద్య. యివి రెండూ కాకపోతే హిస్టీరియా. చూడండి. లక్ష్మికి విష్ణువు వున్నాడు. అందుకని ఆమెకింక విద్య అవసరం లేక పోయింది. కనుకనే యెప్పుడూ భర్తతో—యేవో పనుల్లో మునిగితేలుతూ వుంటుంది. యింక సరస్వతికంటారా? భర్త లేడు. అంచేత యెప్పుడూ చదువుల్లో సతమతమవుతూంటుంది.

జగ : ఆc. నువ్వేన్నయినా చెప్పు అక్షయ్ : వొచ్చే వైశాఖంలో పిల్లలకిద్దరికీ పెళ్ళిళ్ళు చెయ్యకమానను.

పుర : అవునమ్మా : నా ఉద్దేశంకూడా అదే. ఆడపిల్లలకు పెందరాళే పెళ్ళిళ్ల చేసెయ్యటమే మంచిది.

అక్షయ్ : (జనాంతికంగా) అదీ నిజమే. ముఖ్యంగా—వొకరికంటె యెక్కువమంది భర్తల్ని శాస్త్రం నిషేధించినప్పుడు—పెందరాళే పెళ్ళిచేసుకుని, కాలాన్ని సద్వినియోగం చేసుకోవాల్సిందే.

పుర : ఆc. యేమిటీ మాటలు ? అమ్మ వింటుంది.

జగ : రసిక్‌బాబాయ్ యివాళ వరుల్ని చూపించటానికి వొస్తారు. రా అమ్మా పురీ : వారికి ఫలహారాలవీ చేసిపెట్టాలి.

[జగత్తారిణి, పురబాల వెళిపోతారు]

శైల : యింక ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు ముఖర్జీగారూ : యిహ యీసారి మీరు మీ బ్రహ్మచారి సమితిలోవున్న విపిన్‌బాబుని, శ్రీశ్‌బాబుని కాస్త గట్టిగా వూదర పెట్టకపోతే వీల్లేదు. ఆహా : కుర్రాళ్లిద్దరూ అంచక్కా వుంటారు. మా 'నేపూ' 'నీరూ' లకు సరీగ్గా తగినట్లుంటారు. మీరేమో చైత్రమాసం వెళ్లిపోయేలోగానే ఆఫీసు జంజాటం నెత్తినేసుకుని సిమ్లా వెళ్ళిపోతారాయెను. అమ్మనింక మళ్ళ పెట్టటం కష్టమైపోతుంది.

అక్షయ్ : కాని అలా అని సమితిని హఠాత్తుగా—అసమయంలో వొత్తిడిచేస్తే వులిక్కిపడతారందరూ. కోడిగుడ్డుకి బెజ్జంవేసిచూస్తే లోపల్నుంచి అమాంతం కోడిపిల్ల బయటికిరాదు. సమయానుగుణంగా చెయ్యాలి. దానికి కొంచెం వ్యవధి యివ్వాలి.

శైల : మంచిదే. అయితే ఆ యిచ్చేభారం నేను పైనవేసుకుంటాను ముఖర్జీగారూ :

అక్షయ్ : యింకొంచెం విడమర్చి చెప్పాలి.

శైల : అదుగో ఆ పదో నెంబరు యింట్లోనేగా వాళ్ళ సమితి. మన డాబామీదినించి 'దెఖన్‌హాషి' ('చూడగానే నవ్వే') వాళ్లయింటిమీదుగా సరాసరి అక్కడికి వెళ్ళొచ్చు. నేను పురుషవేషంతో ఆ సమితిలో సభ్యత్వాన్ని తీసుకుంటాను. తర్వాత ఆ సమితి యింక యెన్నాళ్ల స్థిరంగా వుంటుందో—అదీ చూస్తాను.

అక్షయ్ : అయితే యింకో జన్మమెత్తి మరోసారి సభ్యుణ్ణవుతాను. వొకసారి మీఅక్క చేతులో పీటీ అయాను—యీసారి నీచేతులో... బ్రహ్మచారి అవటంలో సుఖం అదే. కటాక్ష బాణాలకు లక్ష్యభేదంచేసే అవకాశాన్నివ్వొచ్చు.

శైల : యేమిటి ముఖర్జీగారూ ! మీరు వెనక్కి వెడుతున్నారేమిటి ? ఆ కటాక్షబాణాలూ అవీ యిప్పుడు చలామణీ అవుతాయా ? యుద్ధవిద్య యిప్పుడు చాలా మారిపోయింది.

[నృపబాల, నీరబాల ప్రవేశిస్తారు...నృప శాంతంగా, స్నిగ్ధంగా వుంటుంది. నీర ఆమెకి విరుద్ధం—ఉల్లాసంగా—చురుకుగా వుంటుంది]

నీర : (శైలను కావలించుకొని) చిన్నక్కా ! యివాళ యెవరు వొస్తున్నారు చెప్పవూ ?

నృప : ముఖర్జీగారూ ! యివాళ మీ స్నేహితుల్నెవైనా విందుకు పిలిచారా ? ఫలహారాలవీ చేస్తున్నారెందుకు ?

అక్షయ్ : అదే చదివి చదివి కళ్ళుపోగొట్టుకుని—భూమ్యాకర్షణవల్ల పిడుగు యెలా పడుతుందో—అలాంటి లక్ష రెండులక్షల క్రోసులదూరాల సంగతుల్నీ తెలుసుకుంటావు కాని, యిప్పుడు మధుమిస్త్రీ సందులో పద్దెనిమిదో నెంబరు యింటికి యే ఆకర్షణతో యెవరు వొచ్చిపడేదీ—అదిమాత్రం కనీసం ఊహించనైనా ఊహించలేవా ?

నీర : తెలిసిందిలే చిన్నక్కా ! నీ వరు డొస్తున్నాడు. అందుకనే పొద్దున్నే నా యెడమ కన్ను అదిరింది.

నృప : నీకు యెడమకన్నదిరితే నాకు వరుడు రావటమేమిటి ?

నీర : ఆఁ. నా యెడమకన్ను నీ వరుడు వస్తున్నాడని అదిరింది—పోనీ. అందుకు నేనేమీ విచారించటంలేదు...కాని ముఖర్జీగారూ ! ఫలహారాలు యిద్దరికోసం యేర్పాటుచేస్తున్నట్లుంది. చిన్నక్కా 'స్వయంవర' మవుతుందా యేం ?

అక్షయ్ : మా చిట్టి మరదలుకూడా వూరికే వుండిపోదు.

నీర : ఆహా ! ముఖర్జీగారూ ! యెంత శుభవార్త చెప్పారు ? మీకేం బహుమతి యివ్వను ? యిదిగో—తీసుకోండి నా రెండుచేతుల గాజులూ, నా మెళ్ళో హారమూ.

శైల : యెబ్బే ! చేతులు బోసిచేసుకోకు.

నీర : యివాళ మా వరుల గౌరవసూచకంగా మా చదువుకి సెలవివ్వాలి ముఖర్జీగారూ !

నృప : యేమిటిది ! వరవర అని వొకటే అంటున్నావ్.

అక్షయ్ : అందుకే ఆమెకు బరబరా అని పేరుపెట్టాను. ఓ బర్బరా ! భగవంతుడు మీ అక్కచెల్లెళ్ల కందరికీ యీ వొక్క అక్షయమైన వరాన్ని యిచ్చాడు. యింకా తృప్తిలేదూ ?

సీర :  అందుకనేగా లోభం పెరిగిపోయింది.

[నృపబాల ఆమెని లాక్కువి వెడుతూంటుంది]

సీర :  (వెడుతూ, వెడుతూ) రాగానే కబురుచెయ్యండి ముఖర్జీగారూ! టోకరా యివ్వకండి. చూస్తున్నారుగా చిన్నక్క యెంత ఆత్రపడుతోందో!

మాటయైన చెప్పకయే
దాటిపోవునేమో యని
నిదురరాదు నా కనులకు

అక్షయ్ :  భయం లేదు. భయం లేదు. వొకరుపోతే యింకొకరు వొస్తారు. అగ్నిని సృష్టించింది బ్రహ్మదేవుడే. అతడే శలభాన్నికూడా చేరుస్తాడు.. ముందు పాట కానియ్...

సీర :  అతనిచెంతనే యున్నను
ఆత్మవ్యథ తప్పదాయె

అక్షయ్ :  సీరూ, యిది ఆగంతకుల నుద్దేశించి తయారుచేసిందికాదు. చెంతనున్నవారెవరో చెప్పు అయినా...

సీర :  దారితప్పి యే పథికుడు
చేరె నాదుప్రాణ నదీ
తీరభూమి నతడు మరల
దారి తెలిసికొని యేరహ
దారులబడి పోవునొ యని
నిదురరాదు నా కనులకు

అక్షయ్ :  యిది నాకు సరిగా అన్వయించింది. కాని సీరూ, తెలిసి తెలిసి దారి తప్పాను. యీ పొరపాటును సరిదిద్దుకునే అవకాశాన్ని వుంచుకోలేదు.

సీర :  ఆవరణము ఛేదించక
అరుగుదెంచినా డాతడు
తెరచియున్న ద్వారమ్మున
మరలి యతడు వెడలిపోవు
పిచ్చికలల యలలులేచి
హెచ్చెను హృదయోన్మత్తత
వేళకానివేళ యెంత

వేడుకొన్న నేమాయెను
విందురెవ్వరీ వినతిని ?
నిదురరాదు నా కనులకు

అక్షయ్ :
పోనులే పోనులే పోను
వగ మానుమింక మదిలోను
రేయెల్ల గడచినా విడనాడిపోను
పోయినా ఒకవేళ నేను
పోయివత్తు నటంచు చెప్పిపోయేను
వెలుగునీడల దారు లొలసి తిరిగేను
ఎడబాట్లు కలయికలు ఈ రెంటిలోను
నా లలితహృదయ ముయ్యాల లూగేను
ఈవు చలియింపవని యెరుగుదును నేను
క్షణమాత్రమీవు కన్మరగియుంటేను
నిను పొందలేననుచు కనలిపోయేను.

నీర : నాకు విశ్రాంత అయితే యిహ... నిద్రపోగల్ను.

అక్షయ్ : నిర్భయంగా.

[నృపబాల, నీరబాల వెళిపోతారు]

శైల : ముఖర్జీగారూ ! నేను వేళాకోళానికి అనటంలేదు—బ్రహ్మచారి సమితిలో సభ్యుణ్ణి అవుతాను. కాని నాకు పరిచయంవున్న వ్యక్తి యెవరయినా వొకరు కావాలి. మీరిహ సభ్యులయే యోగం లేదనుకుంటా.

అక్షయ్ : లేదు. నేను పాపంచేశాను. మీ అక్క నా తపస్సును భంగపరిచి, నన్ను స్వర్గానికి దూరంచేసింది.

శైల : అయితే రసిక్‌దాదాను పట్టుకోవాలి. ఆయన యే సమితిలోనూ సభ్యుడు కాకుండానే శాశ్వత బ్రహ్మచర్యనియమాన్ని కాపాడుకుంటున్నారు.

అక్షయ్ : సభ్యుడే అయితే యీ మునలివయసులో వ్రతభంగం తప్పేదికాదు. 'ఇలిస్' చేప చూడటానికి అంత నదరుగా వుంటుంది. పట్టుకోగానే చచ్చిపోతుంది. ప్రతిజ్ఞకూడా అలాంటిదే. దాంతో కట్టుబడ్డవాళ్లకి సర్వనాశమే.

[రసిక్ ప్రవేశిస్తాడు. రసిక్ తల ముందువైపు పూర్తిగా బట్టతల. గడ్డం నెరిసివుంటుంది. పచ్చగా పొడుగ్గా వుంటాడు...]

అక్షయ్ : యేమోయ్ పాషండ ! భండ ! అకాల కూష్మాండ !

రసిక్ : యెందుకోయ్ మత్తమన్ధర ! కుంజకుంజర ! పుంజ అంజనవర్ణ !

అక్షయ్ : నువ్వు మా మరదళ్ళ పొదరిళ్ళలో దావానలం తెచ్చిపెడదామనుకుంటున్నావా ?

శైల : రసిక్‌దాదా ! నీకుమాత్రం యేమిటి దానివల్ల లాభం ?

రసిక్ : అమ్మయ్యో నేనింక సహించలేకపోయాను. యేం చెయ్యను ? సంవత్సరం సంవత్సరానికి మీ అక్కచెల్లెళ్ల వయస్సు పెరుగుతోందని— మీ అమ్మ నన్ను తప్పుపడుతుందెందుకు ? 'రెండుపూటలా పూరికే తిని కూచోకపోతే పిల్లల కెక్కడయినా యిద్దరు వరుల్ని చూడలేవూ ? అంటుంది సరేనమ్మా ! పోనీ నేను తినటం మానేయటానికి వొప్పుకుంటాను. దానివల్ల వరులు దొరుకుతారా ? లేకపోతే నీ చెల్లెళ్ల వయసు తరుగుతుందా ? ఇటు వాళ్లకిద్దరికీ వరులు దొరకలేదు. కాని వాళ్లమాత్రం హాయిగా తింటున్నారు—తిరుగుతున్నారు. అమ్మాయ్ ! శైలా ! కుమారసంభవం చదివావుగదా ? జ్ఞాపకం వుందా ?

స్వయం విశీర్ణద్రుమపర్ణవృత్తితా
పరాహికాష్ఠా తపసస్తయా పునః
తదప్యపాకీర్ణమతః ప్రియంవదాం
వదంత్యపర్ణేతి చ తాం పురావిదః ॥

అదేనమ్మాయ్ ! దుర్గ తన వరుణ్ణి వెదుక్కోవటంలో తిండీ—తిప్పలూ మానేసి తపస్సు చేసింది. కాని మనుమరాళ్లకు వరులు దొరకటంలేదని, ముసలివాణ్ణి నేను తిండీతిప్పలూ మానుకోనా ? మీ అమ్మ యేమిటిలా అంటుంది. ఆహా ! శైలా ! అది జ్ఞాపకంవుందిగా ! 'తదప్యపాకీర్ణమతః ప్రియంవదాం —'

శైల : జ్ఞాపకం వుంది తాతయ్యా ! కాని కాళిదాసు యిప్పుడంతగా నచ్చటంలా.

రసిక్ : అయితే చాలా చెడ్డరోజు లనవలసిందే !

శైల : అందుకనే నీ సలహా కావాలి.

రసిక్ : దానికి నేను సిద్ధమే నమ్మాయ్ ! నువ్వు యెలాంటి సలహా అడిగితే అలాంటిదే యిస్తాను. వొకవేళ ఊఁ అనమంటే ఊఁ అంటాను. ఉహూఁ అనమంటావ్ ! అలాగే అంటాను. నాకో సద్గుణం వుంది. నేను అందరి అభిప్రాయాలతో ఏకీభవించిపోతుంటాను. కనుకనే అందరూ నన్ను యించుమించు తమలాగానే బుద్ధిమంతుణ్ణి అని అనుకుంటూవుంటారు.

అక్షయ్ : నువ్వు యెంతో నేర్పుగా నీ ఆధిక్యాన్ని కాపాడుకుంటున్నావ్. వాటిలో నీయీ బట్టతల వొకటి.

రసిక్ : మరొకటికూడా వుంది — ' యావత్ కించిన్నభాషతే ' అదే నేను బయటివాళ్లతో యెక్కువ మాట్లాడను.

శైల : దాన్ని మాదగ్గిర నిలబెట్టుకోవాలనుకుంటున్నావా ?

రసిక్ : మీదగ్గిర పట్టుబడిపోయానుగా !

శైల : పట్టుబడిపోయినట్లయితే — పద — నేను యేది చెబితే అది చెయ్యాలి.

రసిక్ : భయం లేదమ్మా ! నే నెలాంటి గొప్పయింటివాళ్ళను యిద్దర్నీ తీసుకొచ్చాననని ! పెళ్ళికాని పిల్లలభారం మొయ్యటమెంత కష్టమో అంతకన్న వెయ్యిరెట్లు కష్టం— వాళ్లనుచూచి సహించటం. వాళ్ళని మీ అమ్మ కనుక చూసిందంటే—తన కూతుళ్లకోసం యీ యింట్లో ' శాశ్వత బ్రహ్మచారిణీ సమితి ' వొకటి స్థాపిస్తుంది. వొస్తా. ఆమె రమ్మని కబురుచేసింది.

[వెళిపోతాడు]

శైల : ముఖర్జీగారూ !

అక్షయ్ : చిత్తం.

శైల : యీ గొప్పింటియువకుల్నిద్దర్నీ యేదోఒక సాకుతో సాగనంపాలి.

అక్షయ్ : అది యెలాగూ జరుగుతుంది.

నీచెంత నింకెవరు నిలువగలరో చూడు !
ప్రాణేశ్వరివి నీవు నాకొక్కదానవే
పార్శ్వవర్తిగ నిల్చువాడ నేనొకడనే.

శైల : (నవ్వి) ఏకేశ్వరినా ?

అక్షయ్ : పోనీ వొక్క యీశ్వరికాదు. నలుగురు— శాస్త్రంలో వుంది—' అధికంతు న దోషాయ.'

శైల : అయితే మీరొక్కరే వుంటారా ? అక్కడ బహుశా ' అధికంతు ' అనేది చెల్లదనుకుంటా.

అక్షయ్: అక్కడ శాస్త్రంలో వొక పవిత్రమైన ప్రవచనం వుంది—'సర్వమత్యంత గర్హితం'

శైల: కాని ముఖర్జీగారూ! ఆ పవిత్ర ప్రవచనం యేమాత్రం చెల్లుబడికాదు. యింకా చెలికాళ్లు దొరుకుతారు.

అక్షయ్: మీ యీవొక్క బావస్థానంలో పదిమంది బావల యేర్పాటు జరిగిందా అప్పుడు మళ్లీ వొక కొత్త 'కార్యవిధి' చూడవలసిందే. అంతవరకూ కులీనుల యువకుల్ని గివకుల్ని దగ్గిరకు చేరనీయను.

[నౌకరు ప్రవేశిస్తాడు]

నౌకరు: యిద్దరు బాబులొచ్చారు.

[వెళిపోతాడు]

శైల: యిద్దరూ వొచ్చారనుకుంటాను. అమ్మా—అక్కా సామాన్లగదిలో హడావిడిగా వున్నారు. వాళ్ళకి తీరిక దొరికేలోగానే వీళ్ల నెలాగో అలా సాగనంపించండి.

అక్షయ్: సాగనంపితే యేమిటి బహుమతి?

శైల: మేము మీ మరదళ్లమందరం ('శాలి' అంటే వంగభాషలో మరదలు) కలిసి మీకు శాలివాహన మహారాజా అన్న బిరుదునిస్తాం.

అక్షయ్: శాలివాహన్ ది సెకండా?

శైల: సెకండ్ యెందుకవుతారు! ఆ శాలివాహనుడి పేరు చరిత్రలోంచి పూర్తిగా విలుప్తమైపోతుంది. మీరే శాలివాహన్ ది గ్రేట్ అవుతారు.

అక్షయ్: యేమన్నావ్? నా రాజ్యపరిపాలన కాలంనించి ప్రపంచంలో కొత్తశకం ప్రచారంలోకి వొస్తుందా?

నీ ప్రసన్నవీక్షణముల
రాజలాంఛనమ్ము గూర్చి
నన్ను మహాపురుషునిగా
చేయగలవు సుమా నీవు!

[శైలబాల వెళిపోతుంది]

[మృత్యుంజయుడు, దారుకేశ్వరుడు ప్రవేశిస్తారు]

[వొకరు విపరీతమైన పొడవు—సన్నగా వుంటారు. బూట్లు, మేజోళ్ళు వేసుకుని, చీలమండలదాకా ధోవతికట్టుకుని వున్నారు. కళ్లచుట్టూ కప్పువేసి, మలేరియా రోగి మొహంలా వుంటుంది. వయస్సు యిరవైరెండునించి ముప్పైరెండువరకూ యెంతైనా వుండొచ్చు. మరొకరు బాగా పొట్టి. గడ్డం మీసం వొత్తుగా వుంటుంది. చట్టిముక్కు, మిట్టనుదురు—నల్లగా బొద్దుగా వుంటారు]

అక్షయ్: (అతిస్నేహభావంతో లేచి, ఆత్రంగా కరచాలనం చేసి) రండి మిష్టర్ నెథానియల్! రండి మిష్టర్ జెరిమియా! కూచోండి. కూచోండి. అరేయ్ ఐస్ వాటర్ తీసుకురారా!...హుక్కా యియ్.

మృత్యు: (హఠాత్తుగా విజాతీయ సంభాషణమూలంగా సంకుచితుడై నమ్రతతో) అయ్యా నా పేరు మృత్యుంజయ్ గంగూలీ అంటారండి.

దారు: నా పేరు శ్రీ దారుకేశ్వర్ ముఖోపాధ్యాయ్.

అక్షయ్: యేమిటండీ! యింకా ఆ పేర్లనే వ్యవహరిస్తున్నారా? మీ క్రిష్టియన్ పేర్లు? (ఆగంతుకులు తెల్లబోయి నోరెత్తకపోవటం చూసి) యింకా నామకరణాలు జరగలేదనుకుంటా. దానివల్ల వొచ్చే నష్టం యేంలేదులెండి. కావలసినంత వ్యవధివుంది.

[అక్షయుడు హుక్కా గొట్టం మృత్యుంజయుడికి అందిస్తాడు. అతడు తటపటాయించటం చూసి]

బావుంది. నాదగ్గిర యింకా సిగ్గా? యేడేళ్ళప్పటినించి చాటుగా పొగ తాగితాగి రాటుదేలాను. పొగ రేగిరేగి బుద్ధి పొగచూరిపోయింది. సిగ్గుపడాల్సివొచ్చేట్లయితే నేను గౌరవసమాజంలో అసలు తలయెత్తుకు తిరగటానికే వీలుండదు.

[అప్పుడు సాహసించి దారుకేశ్వర్ మృత్యుంజయుడి చేతిలోంచి తపీమని హుక్కా లాక్కుని ఉఫ్ఉఫ్ అని గుక్కలు లాగటం మొదలెట్టాడు. అక్షయుడు పాకెట్‌లోనించి బర్మా చుట్ట పైకితీసి, మృత్యుంజయునికిచ్చాడు. అతడికి చుట్ట అలవాటయితే లేదు. అయినా అతడు అప్పుడే చేసుకున్న స్నేహం కనుక మర్యాదకు ప్రాణాలమీది తీపి వదలుకుని, మెల్లిమెల్లిగా హుక్కా పీల్చటం మొదలెట్టాడు—వస్తున్న దగ్గును యెలాగో అలా ఆపుకుంటూ]

అక్షయ్: ఇప్పుడిహ వ్యవహారంలోకి దిగుదాం. యేమంటారు?

[మృత్యుంజయ్ మాట్లాడక వూరుకుంటాడు....]

దారు : కాకపోతే యేమిటి? శుభస్య శీఘ్రం.

అక్షయ్ : కోడి కావాలా? మటనా?

[మృత్యుంజయ్ తెల్లబోయి తలగోక్కోవటం మొదలెడతాడు. దారుకేశ్వర్ యేమిటో అర్థంచేసుకోలేక అపరిమితంగా నవ్వటం మొదలెడతాడు]

అరె! బాబూ! పేరు వినగానే నవ్వటమా? అలా అయితే వాసన తగిలేసరికి మతిపోగొట్టుకోవటం—యిహ విస్తట్లో పడిందంటే ప్రాణాలే యెగిరిపోతాయి. ఆఁ. యేదో మనసు కుదుటపరచుకుని చెప్పండి. కోడా? మటనా?

[అప్పుడిహ భోజన ప్రస్తావన అని యిద్దరూ గ్రహిస్తారు. భీరువయిన మృత్యుంజయ్ మాట్లాడకుండా ఆలోచిస్తుంటాడు. దారుకేశ్వర్ నోరు వూరుతూవుండి, వొకసారి నాలుగు వైపులా చూస్తాడు]

భయమెందుకండీ? నాట్యం చెయ్యటానికొచ్చినవాళ్ళు ముసుగేసుకుంటారా?

దారు : (రెండు చేతులతో రెండు కాళ్ళు అదిమిపట్టుకుని నవ్వుతూ) కోడే బావుంటుంది. కట్‌లెట్... యేమంటారు?

మృత్యు : (సాహసం తెచ్చుకుని) మటనయితేమాత్రం యేం తీసిపోతుందా?

అక్షయ్ : భయమెందుకు బాబూ రెండూ వుంటాయి. సంకోచిస్తూ తింటే తృప్తివుండదు. (నౌకర్ని పిలిచి) అరేయ్, వీధిచివరలో హోటల్ వుందే—అక్కణ్ణించి బటర్ కలిమర్దిని పిలుచుకురా (బొటనవేలితో మృత్యుంజయ్ వీపుమీద పొడిచి) బీరా? షెరీయా?

[మృత్యుంజయ్ లజ్జితుడై ముఖం తిప్పుకుంటాడు]

దారు : విస్కీ యేర్పాటులేదనుకుంటాను?

అక్షయ్ : (వీపు చరచి) లేకపోవటమేమిటి? యెలా బ్రతికివున్నానని?

అభయమిస్తే చెబుతా ప్రతిమనిసికీ
ఒకవంతు సోడాలో రెండువంతులు విసికీ

[దుర్బలుడైన మృత్యుంజయ్ గట్టిగా నవ్వటం అవసరమనుకుంటాడు. దారుకేశ్వర్ తపీమని వొక పుస్తకం లాగి, దాన్ని టపటప బాదటం మొదలెడతాడు]

దారు : బ్రదర్, అది పూర్తిచేసెయ్ —

అభయమిస్తే చెబుతా ప్రతిమనిసికీ

అక్షయ్ : (మృత్యుంజయ్‌ని తోసి) అందుకోవోయ్, నువ్వు అందుకో.

[లజ్జాశీలిమైన మృత్యుంజయ్ తన మర్యాద కాపాడుకోటానికి మెల్లిగా పాట అందుకుంటాడు. అక్షయుడు డెస్కు దబదబా వాయించటం మొదలెడతాడు. వొకచోట హఠాత్తుగా ఆగి, గంభీరుడై —]

ఆ(. ఆ(. అసలు సంగతి అడగనేలేదు. యిటు అంతా సక్రమంగానే వుంది. మీరు యెలా అయితే అంగీకరిస్తారు ?

దారు : మమ్మల్ని సీమకి పంపాలి.

అక్షయ్ : అదెటూ జరుగుతుంది. తీగ కత్తిరించందే షాంపైన్ బిరడా వొస్తుందా ? దేశంలో మీలాంటివాళ్ల విద్యాబుద్ధులు అణగిమణగి వుంటున్నాయి. బంధాన్ని తెగ కొస్తేనే వొక్కసారి ముక్కునా, నోటా, కళ్ళలో పైకి చిమ్ముతాయి.

దారు : (వుబ్బి తబ్బిబ్బయిపోతూ, అక్షయుడి చెయ్యి అదిమిపట్టుకుని) భాయీ, యిదంతా నీవల్లనే జరగాలి. తెలిసిందా ?

అక్షయ్ : అదేమీ కష్టంకాదు. కాని మరి యివాళే ' బాప్టిజమ్ ' అవుతారా ?

దారు : (నవ్వుతూ) అదేమిటి ?

అక్షయ్ : (కొంచెం విస్మయభావంతో) అదేమిటి ? అనుకున్నదేగా ? రెవరెండ్ బిశ్వాస్ యివాళరాత్రే వొస్తున్నారు. బాప్టిజమ్ కాకపోతే క్రిస్టియన్ మతసంప్రదాయం ప్రకారం వివాహం జరగటానికి వీలుండదు.

మృత్యు : (హడలిపోతూ) క్రిస్టియన్ మతసంప్రదాయం యేమిటండీ ?

అక్షయ్ : మీరేమిటి తెల్లబోతున్నారే. అది వీల్లేదు. యెలాగయినా సరే యీరాత్రే బాప్టయిజ్ కావాలి. యేమయినా సరే విడిచిపెట్టను.

మృత్యు : మీరు క్రిస్టియన్లా యేం ?

అక్షయ్ : యేమి అమాయకులండి ! యేదో యేమీ యెరగనట్లు !

మృత్యు : (మరీ భయపడిపోతూ) అయ్యా ! మేము హిందువులం. బ్రాహ్మలం. మతం మార్చుకోలేం.

అక్షయ్ : (హఠాత్తుగా —అతిఉద్ధత కంఠస్వరంతో—) మతమేమిటండీ ? యిటు కలిమర్దిచేతి కోడిని తినబోతున్నారు. సీమకెడుతున్నారు. యింకా మతమా ?

మృత్యు : (యెంతో కంగారుగా) మెల్లిగా మెల్లిగా యెక్కడినించైనా— యెవరైనా వినగల్రు.

దారు : ఆవేశపడకండి. కొంచెం ఆలోచించి చూద్దాం మృత్యుంజయ్‌ని కొంచెం చాటుకు తీసుకెళ్ళి) సీమనించి వొచ్చినతర్వాత వొకసారి ప్రాయశ్చిత్తం యెటూ చేసుకోవాలి. అప్పుడు డబుల్ ప్రాయశ్చిత్తం చేసుకుని, ధర్మాన్ని అనుష్ఠించవొచ్చు. యీ అదృష్టాన్ని జారవిడుచుకుంటే యింక సీమకు వెళ్ళటమే పడదు. చూశావుగా. యే మామగారూ వొప్పుకోలేదు. అరె ! బ్రదర్ ! క్రిష్టియన్ హంక్కా యెలాగూ తాగినప్పుడు—ఇహ క్రిష్టియన్ అవటానికి యేం కొరత మిగిలింది ? (అక్షయుడిదగ్గిరకు వచ్చి) సీమకు వెళ్లటం కచ్చితంగా తేల్చినట్లైనా ? అలా అయితే క్రిష్టియన్ అవటానికి వొప్పుకుంటున్నాను.

మృత్యు : కాని యివాళ రాత్రికిమాత్రం ఆపండి.

దారు : అవాలిసివొచ్చినప్పుడు—గబగబ అయిపోయి, దాటిపోవటమే మంచిది. మొదటి నుంచీ చెప్తున్నా 'శుభస్య శీఘ్రం' అని.

[ఈలోగా చాటుగా స్త్రీజనం వచ్చివుంటారు. రెండు ప్లేట్లలో మిఠాయి, పూరీ—ఫలహారాలు, ఐస్‌వాటరూ పెట్టుకుని నౌకరు ప్రవేశిస్తాడు]

దారు : యేవండోయ్ యీ అభాగ్యుడి అదృష్టంలో కోడి యెగిరిపోయినట్లుందే ? కట్‌లెట్ యెక్కడ ?

అక్షయ్ : (మెల్లిగా) యివాల్టికి వీటితో కానీండి.

దారు : అదేమిటండీ ? ఆశ చూపించి, నిరాశకల్గించటమా ? మామగారింటికి వొచ్చి మటన్ చాప్ తింటానికి నోచుకోలేదూ ? అదీకాక, యీ ఐస్‌వాటర్ యేమిటండీ ? నాది అసలు శైత్యంచేసే ప్రకృతి. పాదానీళ్ల నయించవు (రాగవరుసన) అభయమిస్తే చెబుతా...

అక్షయ్ : (మృత్యుంజయుణ్ణి గిల్లి) అందుకోవేం—నువ్వా అందుకో. ఊరుకుంటావేం ? (సంగీతోద్వేగం తగ్గాక—ఫలహారపు పళ్ళాన్ని చూపిస్తూ) యిది అసలే పనికిరాదా ?

దారు : రాదండి. జబ్బుమనిషి పథ్యంలాంటివాటితో యేం చెల్లదు ! కోళ్ళను తినలేక పోబట్టే భారతవర్షం యిలా అయిపోయింది.

అక్షయ్ : (చెవిదగ్గిరకు వచ్చి—లక్నోబాణీలో పాట—)

పప్పుకూడూ పథ్యమూ తిని
భారతావని యెంతకాలం
భరిస్తుందో చెప్పు చూతాం

[దారుకేశ్వర్ మంచి ఉత్సాహంతో పాట అందుకుంటాడు. మృత్యుంజయ్‌కూడా అక్షయుడి మోచేతిపోట్లతో—కొంచెం సిగ్గుపడుతూ అందుకుంటాడు తర్వాత మెల్లిగా]

అక్షయ్ : (మళ్లీ చెవిపట్టుకుని పాటకు ఉపక్రమిస్తూ)

అన్నపానముల కటమటలాడే
భారతీయులకు పంచిపెట్టవోయ్
సోడా విస్కీ కోడీ మట్టన్

[దారుకేశ్వర్ రెచ్చిపోయి, బిగ్గరగా ఆ పాట నందుకుంటాడు. అక్షయుడి మోచేతిపోట్ల ఉత్సాహంతో మెల్లిగా తానుకూడా అందుకుంటాడు మృత్యుంజయ్]

అక్షయ్ : (మెల్లిగా) పిలక ఆడించుతూ బాపడా పోవయా
గడ్డమాడించుతూ రా కాలిమర్దీమియా

[పాట ఉత్సాహంగా జోరుగా సాగుతున్నకొద్దీ పరదా చాటునుంచి 'ఉస్...అబ్బబ్బ...' అన్న మాటలు విన్పిస్తూవుంటాయి. అక్షయుడు అసలు యేమీ యెరగనట్లు నిరీహుడైన పెద్దమనిషిలాగా మధ్యమధ్య అటువైపు చూస్తూవుంటాడు. యీ సమయంలో మసిగుడ్డ వొకటి చేత్తోపుచ్చుకుని, కలిమర్ది వచ్చి సలాంచేసి నిలబడతాడు]

దారు : (కలిమర్దితో) యిదుగో 'చాచా!' యివాళ వంట యేమేం చేశావో చెప్పు. అక్షయబాబూ! కరీయా కట్‌లెటా?

అక్షయ్ : (పరదావైపుకి కన్నెత్తిచూసి) మీకేది బాగుంటుందని అనిపిస్తే అదే...

దారు : నా ఉద్దేశం—'బ్రాహ్మణేభ్యో నమః' అని, అన్నిటినీ ఆదరిస్తాను.

అక్షయ్ : అది నిజమే. వారందరూ పూజ్యులు.

[కలిమర్ది సలాంచేసి వెళిపోతాడు]

అక్షయ్: (గొంతు కొంచెం హెచ్చించి) అయితే మీరు యీ రాత్రే క్రిస్టియన్లు అవాలని కోరుకుంటున్నారు.

దాసు: నేను అంటూనేవున్నాగా 'శుభస్య శీఘ్రం' అని. యివాళే క్రిస్టియన్ నవుతాను. యిప్పుడే అవుతాను. క్రిస్టియన్‌ని అయినతర్వాతే తక్కినవన్నీ. యీ బచ్చలి కూర, పెసరపప్పు తిని బ్రతకలేం. మీ ఫాదిరీని పిలుచుకురండి.

పిలక ఆడించుతూ బాపడా పోవయా
గడ్డమాడించుతూ రా కాలిమర్దిమియా

భృత్యుడు: (అక్షయుడి చెవిలో) అమ్మగారు పిలుస్తున్నారొకసారి.

[అక్షయుడు లేచి గుమ్మం అవతలికి వెళ్ళాక—]

జగత్తారిణి: యేమిటి? యేమిటీ గొడవ?

అక్షయ్: (గంభీరంగా) అదంతా తర్వాత చెపుతాలెండి. యిప్పుడు వాళ్లు విస్కీ కావాలంటున్నారు. యేం చెయ్యను? మీకాళ్లకు రాయటానికి మొన్న బ్రాంది తీసుకొచ్చామే—అందులో యేమయినా మిగిలింది వుందా?

జగ: (తెల్లబోయి) యేమిటీ నువ్వనేది? బ్రాందీ యివ్వాలా తాగటానికి?

అక్షయ్: యేం చేస్తామండీ! విన్నారుగా! వాళ్లిద్దరిలో వొకడున్నాడు—అతడికి నీళ్ళు తాగితేనే శైత్యం చేస్తుందిట! మద్యం తాగకపోతే వొక్కమాటకూడా పెకల్దు నోటంట.

జగ: కిరస్తానీల మవాలని అంటారేమిటి వాళ్లు?

అక్షయ్: హిందువులవటంవల్ల తిండికి చాలా యిబ్బందిట! బచ్చలికూర, పెసరపప్పు తింటే వాళ్లకి జబ్బుచేస్తుందని అంటున్నారు.

జగ: (విస్తుపోతూ) అలా అని వాళ్లకీరాత్రే కోడిని పెట్టించి, కిరస్తానీలను చెయ్యాలా యేం?

అక్షయ్: అదేనండీ! వాళ్లు వొకవేళ కోపం వొచ్చి వెళిపోయారంటే యిద్దరు వరులు యిప్పుడే చెయిజారిపోతారు. అందుకని వాళ్ళు చెప్పినవన్నీ వినవలసివొస్తోంది. (పురబాలతో) నాచేతకూడా మద్యం తాగించేట్లున్నారు.

పుర: సాగనంపండి. సాగనంపండి. యిప్పుడే సాగనంపండి.

జగ : (తొట్రుపాటుతో) అబ్బాయ్ ! యిక్కడ కోళ్లగిళ్ల అదేం వీల్లేదు. నువ్వు వాళ్లను వెంటనే పంపించెయ్ రసిక్‌బాబాయిని సంబంధాలు చూడమని పురమాయించటం పొరపాటయింది నాది. ఆయనవల్ల వొక్కపని అవుతుందా యెప్పుడైనా !

[స్త్రీలు వెళిపోతారు]

[అక్షయుడు గదిలోకొచ్చి చూసేసరికి—మృత్యుంజయ్ పారిపోయే ప్రయత్నంలో వుంటాడు. దారుకేశ్వర్ అతణ్ణి చెయ్యిపుచ్చుకుని లాగుతూ ఆపటానికి ప్రయత్నిస్తూంటాడు. అక్షయుడు లేనిసమయంలో మృత్యుంజయ్ వెనకా ముందూ ఆలోచించి, భయపడి పోతుంటాడు]

మృత్యు : (అక్షయుడితో—కోపంగా) లేదండీ, నేను క్రిస్టియన్‌ను కాలేను. పెళ్లిచేసుకోవాల్సిన అవసరంలేదు నాకు.

అక్షయ్ : అదేమిటండీ ! మిమ్మల్ని యెవరు కాళ్ళుపట్టుకుని బ్రతిమాలారు ?

దారు : నేను సిద్ధంగా వున్నానండీ చేసుకోటానికి.

అక్షయ్ : సిద్ధంగా వుంటే చర్చికి వెళ్లండి. మా వెనకా ముందూ యేడుతరాలవాళ్లకెవరికీ కిరస్తానీలుగా మార్చే వృత్తిలేదు.

దారు : మరి యేదో బిశ్వాస్ సంగతి చెప్పారు—

అక్షయ్ : ఆయన హైరిటి బజారులో వుంటాడు. ఆయన చిరునామా రాసిస్తాను.

దారు : వివాహంమాట మరి ?

అక్షయ్ : అది యీ వంశంలో కాదు.

దారు : అయితే యింతవరకు పరిహాసంటండీ చేసింది ? భోజనం మాటేమిటి ?

అక్షయ్ : అదీ యీ యింట్లో వీల్లేదు.

దారు : పోనీ హోటల్లో ?

అక్షయ్ : అలా అన్నావు ---బావుంది.

[డబ్బు సంచిలోనించి కొంత డబ్బుతీసి, వారిద్దరికీ యిచ్చి పంపిస్తాడు... నృపని చెయ్యిపట్టుకుని లాగుతూ నీరబాల వసంతకాలంలో హఠాత్తుగా వొచ్చే గాలిదుమారంలా గదిలోకి ప్రవేశిస్తుంది...]

నీరజాల : ముఖర్జీగారూ! అక్కకిమాత్రం యిద్దరిలో యెవర్నీ తప్పించటం యిష్టం లేదు.

నృప : (మాట్లాడకుండా—చెక్కిలిమీద చిటికతో కొట్టి) మళ్లీ అబద్ధమాడుతున్నావ్—

అక్షయ్ : కంగారుపడకు—నిజానిజాల తేడా కాస్త తెలుసుకోగలను నేను.

నీర : అవును ముఖర్జీగారూ! యిదంతా రసిక్‌దాదా చేసిన తమాషానా? లేక మా అక్కకివున్న గండమా?

అక్షయ్ : తుపాకిగుళ్లన్నీ గురితప్పకుండా తగుల్తాయా? బ్రహ్మ టార్గెట్ ప్రాక్టీస్ చేస్తున్నాడు. యీ రెండూ తప్పిపోయాయి. మొదట్లో కొన్ని యిలా జరుగుతూనే వుంటాయి. యీ అభాగ్యుడు పట్టుబడకముందు—మీ అక్క గాలం కొస తగిలి చాలా జలచరాలు తప్పిపోయాయి. నా నొష్టకువొచ్చి గట్టిగా తగిలిందిగాని గాలం.

[నుదురు కొట్టుకుంటాడు]

నృప : యికనించి రోజూ బ్రహ్మ ప్రాక్టీస్ కొనసాగుతూనే వుంటుందా? యేం ముఖర్జీ గారూ! అలా అయితే బ్రతకటం కష్టం.

నీర : యెందుకక్కా దిగులుపడతావ్? రోజూ గురితప్పుతుందా? వొకరు కాకపోతే వొకరయినా సరీగ్గా వొచ్చిపడతారు.

[రసిక్ ప్రవేశిస్తాడు]

నీర : రసిక్‌దాదా! యిహనుంచి మేముకూడా నీకు వధువును వెతుకుతాం.

రసిక్ : అది సంతోషకరమయిన సంగతి.

నీర : ఆఁ. ఆ సంతోషాన్ని చూపిస్తా. నువ్వు పూరింట్లో వుంటూ పక్కింటి చూరుకి నిప్పుపెట్టాలనుకుంటున్నావా? మా చేతిలో లేదూ చెకుముకి రాయి? మాతో కనుక పెట్టుకుంటే—నీకు రెండు—రెండు పెళ్లిళ్ల చేసేస్తాం. నెత్తిన మిగిలివున్న నాలుగు వెంట్రుకలుకూడా వుండవు.

రసిక్ : చూడమ్మాయ్! రెండు అచ్చమైన జంతువుల్ని పట్టుకొచ్చా కనుకనే బతికి పోయాం. మధ్యరకం అయినట్లయితే ముప్పు వొచ్చిపడేది. దేన్ని జంతువుగా గుర్తించటానికి వీలుండదో, అదే అన్నిటికంటె భయంకరమైన జంతువు.

అక్షయ్ : ఆ మాట నిజమే. నా మనస్సులో నాకూ వుంది భయం. కాని, వీపుమీద చెయ్యివేసి నిమిరేసరికి—చటుక్కున తోకాడిస్తూ లేచాయి. కాని అత్తగారేమంటున్నారు?

రసిక్ : ఆమె అన్నమాటలు నలుగుర్నీ పిలిచి వినిపించదగినవికావు. వాటిని నేను మనస్సులోనే దాచుకున్నాను. యేమయితే యేం ఆమె చివరికి కాశీలోవున్న తన చెల్లెలికొడుకుదగ్గిరకు వెళ్లటానికి నిర్ణయించుకుంది. అక్కడికెళితే సంబంధాలూ దొరుకుతాయి. తీర్థయాత్రాఫలితమూ దక్కుతుంది.

నీర : యేమిటి నువ్వనేది తాతయ్యా ? అయితే మేమిహ యిక్కడ రోజురోజూ కొత్త నమూనాలను చూడాల్సిందేనా ?

నృప : నీకింకా మనసుగా వుందాయేం ?

నీర : మనసుగా వుండేదా యిది. యిది శిక్షణ. రోజురోజూ అనేక దృష్టాంతాలు చూస్తూంటే వస్తుస్వరూపం సులభంగా తెలిసిపోతుంది. తర్వాత పెళ్ళిచేసుకునే ప్రాణిని అర్థంచేసుకోవటం కష్టమవదు.

నృప : నీ ప్రాణిని నువ్వు అర్థంచేసుకుందూ ! నాకోసం నువ్వు దిగులుపడాల్సిన అవసరంలేదు.

నీర : అదే మంచిది. నీ సంగతి నువ్వు ఆలోచించుకో. నా సంగతి నేను ఆ 'చించుకుంటా. రసిక్‌దాదా మాత్రం మనకోసం ఆలోచించ నక్కర్లేదు.

[నృప, నీరబాలలు వెళిపోతారు. శైలబాల ప్రవేశిస్తుంది]

శైల : రసిక్‌దాదా ! నీతో నేనో విషయం ఆలోచించాలి.

అక్షయ్ : ఆఁ. శైలా ! అదన్నమాట ! యివాళ రసిక్‌తాత రాజమంత్రి అయినాడు. నన్ను అప్రయోజకుడికింద కట్టావ్.

శైల : నవ్వి మీతో నాకు ఆలోచనతో పనేమిటి ముఖర్జీగారూ ! ఆలోచననేది ముసలి వాళ్లయితేనేకాని కుదరదు.

అక్షయ్ : అయితే రాజమంత్రి పదవికోసం—నా దర్బారును యెత్తేస్తున్నాను.

[హఠాత్తుగా బిగ్గరగా కాంభోజిరాగంలో]

నీ కోమలహస్తమ్ముల
నే కోసిన పూలనుంతు
మంత్రాలని తంత్రాలని
మంతపోయే పని నీయకు.

శైల : రసిక్‌దాదా ! మేము బ్రహ్మచారి సమితి సభ్యులమవుతాం. నువ్వు మాకు వాహనం కావాలి.

రసిక్ : భగవంతుడు శ్రీహరి స్త్రీవేషంతో పురుషుల్ని మోహపరవశుల్ని చేశాడు. నువ్వు పురుషవేషంతోనే పురుషుల్ని ప్రలోభపరచేట్లయితే—హరిభక్తి వదిలేసేసి నీ పూజతోనే యీ చరమవయస్సు వెళ్లబుచ్చుతాను. కాని మరి మీ అమ్మకి కనుక తెలిస్తే...?

శైల : ముగ్గురు కూతుళ్ళ తలుపుకొస్తే చాలు —అమ్మ మనస్సు యెంతో కలవరపడు తుంది. ఆమె యిహ వేరే మా విషయాలేవీ పట్టించుకోదు. దాన్నిగురించి బెంగ పెట్టుకోవొద్దు.

రసిక్ : కాని సమితిలో యెలా సభ్యత్వం తీసుకోవటమో నాకేమీ తెలియటంలేదు.

శైల : సరే. అది నే చూసుకుంటాను. దరఖాస్తు పత్రంలో పదిరూపాయలు ప్రవేశ రుసుం పంపించి కూచున్నాను. తాతయ్యా ! నువ్వు అమ్మతో కాశీవెళ్ళేట్లయితే కుదరదు.

అక్షయ్ : ఆమెతో కాశీవెళ్లటానికి నేను మనిషిని మాట్లాడతానిప్పుడే. దాన్నిగురించి దిగులక్కర్లేదు.

శైల : ముఖర్జీగారూ ! మీరు వాళ్లని యెంత కోతుల్ని చేసివొదిలారు ! చివరకు ఆ అమా యకులమీద జాలేసింది నాకు.

అక్షయ్ : వాళ్లని కోతుల్ని చేసెయ్యటం యెవరికీ సాధ్యంకాదు, శైలా ! వాళ్ళ స్వభావమే వాళ్ల నలా చేసేసింది. భగవంతుడి అనుగ్రహం విశేషంగా వుండాలిగాని—కవి కావటమెలాగో అలాగే—తోకబలమూ కవిత్వబలమూ అసలు లోపలంటూ వుండకపోతే వాటిని కదిలించి బైటికి తెప్పించట మెవరికీ సాధ్యంకాదు.

[పురబాల ప్రవేశిస్తుంది]

పుర : (కిరోసిన్ దీపాన్ని తీసుకుని కదిలించి చూస్తూ—) పనిమనిషి యెలాంటి దీపం పెట్టివెళ్ళాడు. మినుకు మినుకుమంటుంది. వాడికి చెప్పటం నా తరంకాదు.

అక్షయ్ : మనకు చీకటి అయితేనే చాలా బావుంటుందని వాడికి తెలుసు.

పుర : వెలుతురయితే సరిపడదా ? యేమి నియమనిష్ఠ ! యిదేదో కొత్తగా కనిపిస్తూందే !

అక్షయ్ : నే నన్నదేమిటంటే ఆ పనిమనిషి నన్నుచూసి చందమామనుకున్నాడు.

పుర : ఓ ! అయితే మంచిదే. యిహనేం వాడిజీతం పెంచెయ్యండి. కాని రసిక్‌దాదా యివాళ యేయే వ్యవహారం నడిపించాడు.

రసిక్ : అమ్మాయ్ ! వరులు చాలామంది దొరుకుతారు. కాని అందరూ వివాహ యోగ్యులుకాదు. దానికో సామాన్య ఉదాహరణ నివ్వబోయాను.

పుర : ఆ ఉదాహరణ చూపించకుండా వొకరిద్దరు వివాహయోగ్యులయిన వరుల ఉదాహరణలు చూపించినట్లయితే బాగుండేదిగా !

శైల : ఆ భారం నే తీసుకుంటున్నా అక్కా !

పుర : ఆఁ. నాకు తెలుసు— నువ్వూ మీ ముఖర్జీగారూ కొన్నాళ్ళనించి చేస్తున్న ఆలోచనలు చూస్తూంటే యెదో కాండ జరుగుతుందని—

అక్షయ్ : కిష్కింధాకాండ యివాళ జరిగిపోయింది.

రసిక్ : 'లంకా కాండ' యేర్పాటు జరుగుతోంది. బ్రహ్మచారి సమితి స్వర్ణలంకకి నిప్పుపెట్టబోతున్నారు.

పుర : వాళ్లలో శైల పాత్రేమిటి ?

రసిక్ : హనుమంతుడు మాత్రంకాదు.

అక్షయ్ : ఆమె అసలు నిప్పు.

రసిక్ : వొక వ్యక్తి ఆమెని వెంటబెట్టుకుని తీసుకువెళతాడు.

పుర : నాకేమీ అంతుపట్టకుండా వుంది. శైలా, నువ్వు బ్రహ్మచారి సమితికి వెళతావా యేం ?

శైల : నేను సభ్యురాలుగా చేరుతాను.

పుర : నువ్వనేదేం బాగాలేదు. ఆడవాళ్లకూడా సభ్యులౌతారా యేం ?

శైల : యీ రోజుల్లో ఆడవాళ్ల సభ్యత నేర్చుకున్నారు. అందుకని నేను చీరెలు అవీ మానేసి, అంగీ తొడుక్కోటానికి నిర్ణయించుకున్నాను.

పుర : అర్థమయింది. మారువేషంతో సభ్యురాలివవుతావన్నమాట. జుట్టు యిదివరకే కత్తిరించుకున్నావ్. అదీ తీరిపోయింది. మీయిష్టం యేమయినా చేసుకోండి. నాకేం జోక్యం లేదిందులో.

అక్షయ్ : వొద్దు. వొద్దు. నువ్వు యీ దళంలో కలవబోకు. యెవరెవరు పురుషులయిపోయినా పోనియ్. నువ్వుమాత్రం నా అదృష్టంతో స్త్రీగానే వుండు. లేకపోతే – 'బ్రీచ్ ఆఫ్ కాంట్రాక్టు.' అది భయంకరమైన దావా...

ఓ పురాణ చంద్రకళా !
యీలాగే చిరకాలము
నిలువుము నా సహచరివై
నీ పురాణహాసంతో
సుధతో నా క్షుధనుబాపు
నూత్న చకోరమ్మేదియు నీ
ప్రేమామృత సుప్రసాద
మాహరింపకుండుగాక !

[పురబాల వెళిపోతుంది]

[శైలబాలను వూరడిస్తూ]

భయం లేదు. కోపం జారిపోగానే మనస్సు నిర్మలమవుతుంది. కొంచెం పశ్చాత్తాపంకూడా కలుగుతుంది. అదే సంయోగానికి సమయం.

రసిక్ : కోపోయత్ర భ్రుకుటీరచనా విగ్రహోయత్రమౌనం
యత్రాన్యోన్యస్మితమనునయో యత్రదృష్టిః ప్రసాదః

శైల : రసిక్‌దాదా ! నువ్వు బాగా యేకరువు పెడుతున్నావ్ శ్లోకాలు. కోపం అంటే యేమిటో ముఖర్జీగారికి బాగా అనుభవం.

రసిక్ : నా అభిప్రాయం మార్చుకోటానికి సిద్ధంగా వున్నాను. ముఖర్జీగారే గనక శ్లోకా లేకరువుపెట్టినా లేదా వారి కోపం నామీదే వొచ్చిపడినా— యీ దురదృష్టవంతుడు బంగారంలా వుండిపోతాడు.

శైల : ముఖర్జీగారూ !

అక్షయ్ : (అతివిచలితభావంతో) యింకా ముఖర్జీగారా ! యీ వాలఖిల్య మునీశ్వరుల తపోభంగ ప్రయత్నంలో నే జోక్యంపెట్టుకోను.

శైల : తపోభంగం మేంచేస్తాం. మునికుమారుల్ని మాత్రం యీ యింటికి తీసుకురావటం మీవొంతు.

అక్షయ్ : సభ సభంతా యిక్కడికి పెల్లగించి తీసుకురావాలా ? దుస్సాధ్యమైన పనులన్నీ యీ ముఖర్జీ వొక్కడివొంతూనా ?

శైల : (నవ్వి) మహావీరుడు కావటంలోవున్న కష్టమే యిది. గంధమాదనంతో అవసరం వొచ్చినప్పుడు నలుడు, నీలుడు, అంగదుడు వీరెవరికీ లభ్యం కాలేదు.

అక్షయ్: ఓసి అభాగ్యురాలా! త్రేతాయుగంలోవున్న అభాగ్యులుతప్ప యింకో వుప మానం యేదీ నీకు తోచనేలేదా? యెంత ప్రేమ!

శైల: అవునండీ.

అక్షయ్:

ఈ మందభాగ్యునకు నేవేళ మదిలోన
భాసించుచుండు హతభాగినీ ముఖములే
ఈ విశాలజగాన నెంతగా వెదకినా
ఈ పాడుకందోయి కెవరు నచ్చరదేమొ!

సరే. అలాగే. మిడతలదండును మంటదాకా తరుముకొస్తాను. అయితే నాకు చప్పున తాంబూలం తెచ్చియ్. నువ్వు నీచేత్తో మడిచింది కావాలి.

శైల: యేం. అక్కచేత్తో—

అక్షయ్: అరె. అక్కచేత్తో చెయికలుపుకున్నాను. లేకపోతే పాణిగ్రహణం యెందుకు చేసుకున్నట్లు? యిప్పుడు యితర హస్తపద్మాలవైపుకి దృష్టిపోనివ్వటానికి అవ కాశం దొరికింది.

శైల: సరేనండీ అయితే. పద్మహస్తం మీ తమలపాకులకి సున్నంరానిచ్చిందంటే— యీ పాడుముఖం మరింత పాడవుతుంది.

అక్షయ్:

చావుమూడినవారు
చచ్చుచుందురు నూరు
సారులైనను గాని
ఈ పాడుపురుగులె
న్నెన్ని చచ్చినసరే
మరల నెన్నోవచ్చి
దొరలు మంటలలోన.

శైల: ముఖర్జీగారూ! యేమిటీ కాయితంపుండ?

అక్షయ్: అదే నీ సభ్యత్వపు దరఖాస్తూ, ప్రవేశరుసుం పదిరూపాయలనోటూ పాకెట్లో వున్నాయి. చాకలివెధవ వుతికి వొక్కఅక్షరంకూడా పోల్చుకోటానికి వీల్లేనంతగా పాడుచేశాడు. ఆ వెధవ బహుశా స్త్రీస్వాతంత్ర్యానికి ఘోరమైన విరోధిలా వున్నాడు. అందుకని నీయీ పత్రాన్ని సాంతం ధ్వంసంచేశాడు.

శైల: తెలిసింది.

అక్షయ్: కాస్త అంటిపెట్టుకుని వుంది జ్ఞాపకశక్తి. యింక మనస్సులో చొరనిస్తేనా దేన్నయినా!...

సకలమ్ముగను మరచిన నా
స్వాంతమేలొకో నేడీ
చంద్రముఖిని మరువలేదు

[శైల, రసిక్ నిష్క్రమిస్తారు. పురబాల ప్రవేశిస్తుంది]

అక్షయ్: భర్తే ఆడదానికి యేకైక పుణ్యతీర్థం. వొప్పుకుంటావా, లేదా?

పుర: నేనేం పండితులదగ్గర శాస్త్రాలడిగి తెలుసుకోటాని కొచ్చాననుకున్నారా? నేను అమ్మతో యివాళ కాశీవెళుతున్నాను—ఆ మాట చెప్పిపోవటానికొచ్చా.

అక్షయ్: యిదో శుభవార్తకాదు. వినగానే నీకు దుశ్శాలువలు బహూకరించాలని బుద్ధి పుట్టటంలేదు.

పుర: ఉష్! హృదయం విదీర్ణమవుతోందా? అవునా! సహించ శక్యంకావటంలేదా?

అక్షయ్: నేనిప్పుడు కేవలం వియోగం సంగతే ఆలోచించటంలా. యిప్పుడు నువ్వు నాలుగురోజులు లేకపోతే యింకా కొందరున్నారు. యేదోవిధంగా యీ అభాగ్యుడికి గడచిపోతుంది. కాని తరవాత జరిగేదేమిటి? చూడు. ధర్మంలో కర్మలో భర్తని దాటివెళ్ళిపోకు. నువ్వు డబుల్ ప్రమోషన్‌పొంది స్వర్గంలో వున్నప్పుడు నేను వెనకబడిపోతాను. నిన్ను విష్ణుదూతలు రథమెక్కించుకుని తీసుకువెళిపోతారు. యిహ నన్ను యమదూతలు చెవులుపట్టుకుని నడిపిస్తూ తరుముకు వెళతారు.

గగనమ్మున తేలియాడ నెగురవేసికొనిపోదురు
దేవలోకమునకు నిన్ను; నీవెనుకనె కుంటినడక
ననుగమింతు నేనుకూడ; ఆ దూతల నిగలబట్టి
తలలు చితుకగొట్టివేయ తలపుబుట్టు నా మదిలో.

పుర: సరే. కాస్త ఆగండి.

అక్షయ్: నేను ఆగితే? నువ్వొక్కతెవూ మాత్రం వెళిపోతావా? యిదేనా పందొమ్మిదో శతాబ్దం పద్ధతి? వెళ్లటం ఖాయమేనా?

పుర: వెళతాను.

అక్షయ్: నన్నెవరిచేతి కప్పగించిపోతావ్?

పుర : రసిక్ దాదాకు.

అక్షయ్ : ఆడవాళ్లకి - మరొకరి కప్పగించే హక్కువుందేమో నాకు తెలియదు. యీ విరహావస్థలో ఉపయుక్తమైనచేతిని నేనే వెతుక్కుని, ఆత్మసమర్పణ చేసుకోవాలి.

పుర : మీరంతగా వెతుక్కోనక్కర్లేదు.

అక్షయ్ : అలా వీల్లేదు.

ఎవరి వశమైనర్తును నా హృదయపదమ్మన్న తలపు
తలచి తలచి తలపుతోనె దాటిపోయినది కాలము
కుడివైపున దృష్టినిలుప నెడమకు వీగును ప్రాణము
ఎడమప్రక్క చూడబోవ కుడివైపునకే లాగును.

నాకో రెండుమూడు మంచి ఉపాయాలున్నాయి. మరి నీకు ?

విరహయామిని నెట్లు వేగింపగా గలవొ
చిరవియోగవ్యధాభరముచే శయ్యపై
దొరలుచును మన్మథుని దూషించెదవుగాక

పుర : రక్షించండి—ఆ యతిప్రాసల్ని అక్కడితో ఆపండి.

అక్షయ్ : విచారసమయంలో నేను ఆపలేను. కవిత్వం దానంతటది పొంగివాస్తోంది. అంత్యప్రాస బావుండకపోతే *' అమిత్రాక్షర ' వుంది. నువ్వు దూరదేశంలో వున్నప్పుడు నేను ' ఆర్తనాదవధ ' అని వొక కావ్యం రాస్తాను. సఖీ ! దాని మొదలు విను —

అశ్రుశకటమునెక్కి యలివేణి పురబాల
కాశీపురీక్షేత్ర గమనాభిలాషతో
సాగిపోనున్న యీ సాయంతనపువేళ
శ్యాలీత్రయీశాలి అక్షయుడు వరమాల్య
మేవరాంగనకాన యిచ్చి వరించునో
యేరీతి గడపునో యీ విరహమాసమ్ము
వచియింపుమో అమృతభాషిణీ దేవి !

పుర : సగర్వంగా, నా ప్రాణాలు తినకండి. యెగతాళికాదు. మీరు నిజంగా కావ్యం రాయకండి.

* ఒక ఛందస్సు పేరు.

అక్షయ్: ప్రాణాలు తినకండి— అనేట్లయితే— అవి అంత రుచికరమైనవాటిల్లోకి రావు— యిహ కావ్యం రాయటం అంటావా? ఆ పనికూడా అంత తేలికయినదని తోచదు. నా బుర్రలో యెక్కడో పగులుంది. కవిత్వం పేరుకోదు. చరచరా బయటికిపోతుంది.

పూవులే నా తరువు పూయుచుండునుగాని
ఫలములేలా ఫలింపవో యెరుంగుదు వీవు
పూయగానే తెచ్చి పొందుపరతును పూల
నన్నిటిని నీదు పాదాంభోజములచెంత.

కాని నే నడిగినదానికి సమాధానం రాలేదు. కుతూహలంతో చచ్చిపోతున్నా. కాశీ వెళుతున్నావే— యెందుకంత ఉత్సాహం? ఆ విష్ణుదూతలనంటే మనస్సులో క్షమించాను. కాని భూతనాథుడైన భవానీపతి అనుచరులమీద చాలా అనుమానం కలుగుతోంది. నంది, భృంగి అనేక విషయాల్లో నన్నుకూడా జయించగలరని వినికిడి. తిరిగివచ్చాక యీ భృత్యుడు నచ్చకపోయినా పోవచ్చు.

పుర: నేను కాశీ వెళ్లను.

అక్షయ్: అదేం మాట? భూతపతి భృత్యులందరూ వొకసారి చచ్చిపోయి భూతాలయినారు. వాళ్ళు మళ్లీ రెండోసారి చచ్చిపోతారు.

[రసిక్ ప్రవేశిస్తాడు]

పుర: యివాళ రసిక్‌దా ముఖం విచ్చిన పూవులా వుంది.

రసిక్: అమ్మోయ్! నీ రసిక్‌దా ముఖానికున్న యీ రోగం మాత్రం పోవటంలా. మాటాలేదు. పలుకూలేదు. విచ్చిన పూవులా ప్రఫుల్లంగా వుంటుంది. వివాహితులైనవాళ్లు చూసి, లోపల్లోపల కోపం తెచ్చుకుంటారు.

పుర: విన్నారా? వివాహితులైనవాళ్లుట! దీనికి తగిన సమాధానం చెప్పండి.

అక్షయ్: మన ప్రఫుల్లత సంగతి వృద్ధుడికేం తెలుస్తుంది. అది యెంత నిగూఢమయినదంటే—యీనాటివరకూ దాన్ని యెవరూ కనిపెట్టలేకపోయారు. అది మనం చేతులతో తడిమినా అందదు. అంత లోతయినది. అసలు వుందా లేదా అని కూడా హఠాత్తుగా సందేహం కలుగుతూవుంటుంది.

పుర: తెలిసింది లెండి!

[కోపంతో వెళిపోవటానికి ఉపక్రమిస్తుంది]

అక్షయ్ : (ఆమెని వెనక్కి రప్పించి) నీ పుణ్యముంటుంది. యీ వ్యక్తిముందు మాత్రం కోపం తెచ్చుకోకు. అలాచేస్తే అతడి అతిశయం మరీ మితిమీరుతుంది. దాంపత్య తత్త్వమెరుగని వృద్ధుడా ! చూడు. మాకు కోపం వచ్చినప్పుడు సహజంగా మా కంఠస్వరం హెచ్చుతుంది. అదిమాత్రం మీ చెవిని పడుతూంటుంది. అయితే అనురాగ సమయంలో మా కంఠం రుద్ధమవుతూవుంటుంది. చెవిదగ్గర నోరుపెట్ట బోతే మాటిమాటికీ నోరు గురితప్పుతూంటుంది— అప్పుడా వార్త మీకందదు.

పుర : ఆఁ. వూరుకుందురూ !

అక్షయ్ : నగల లెఖ్క తేల్చేటప్పుడు— అది యింట్లో నౌకర్ల దగ్గిర్నించి—కంసాలి వరకూ— యెవరికీ తెలియకుండా వుండదు. కాని వసంతరాత్రివేళ ప్రేయసి—

పుర : ఆపండి బాబూ.

అక్షయ్ : వసంతరాత్రివేళ ప్రేయసి—

పుర : ఆఁ. మీ పేలాపనకో తీరూ తెన్నూ లేదు.

అక్షయ్ : వసంత నిశీథంలో ప్రేయసి— 'నేను రేపే పుట్టింటికి వెళిపోతాను. నాకు వొక్క క్షణంకూడా యిక్కడ వుండబుద్ధిపుట్టటంలేదు. నా యెముకలు విరిగి పోతున్నాయి—' అని గర్జించినప్పుడు—

పుర : యేమండీ ! మీ ప్రేయసి యెప్పుడు పుట్టింటికి వెళ్ళిపోతానని వసంతరాత్రివేళ గర్జించిందండీ !

అక్షయ్ : చరిత్ర పరీక్ష. కేవలం సంఘటనల్ని మాత్రమే రాస్తే చాలదు. వాటితోపాటు తేదీలు సంవత్సరాలతోసహా నోటితో చెప్పెయ్యాలి. నేను అంత ప్రతిభాశాలినా ?

రసిక్ : (పురబాలతో) తెలిసిందా అమ్మాయ్. సూటిగా నీకు మాట చెప్పలేదు. అతడికి అంత వోపికలేదు. అందుకని తిప్పిచెవుతున్నాడు. అపేక్ష చాలినంతగా లేనప్పుడు—తిట్లతో చేర్చి అపేక్ష వొలకబోస్తారు.

పుర : సరేనండి మల్లినాథజీ ! మీరింక వ్యాఖ్యానం చెయ్యనఖ్కర్లేదు. అమ్మ చివరికి నిన్నే కాశీ తీసుకువెళ్లటానికి నిశ్చయించుకుంది.

రసిక్ : అది మంచిదేగా ! యిందులో దిగులుపడాల్సిందేముంది ? తీర్థయాత్రలు చేసే వయస్సేమో వొచ్చింది. యిప్పుడిహ మీ చంచల కటాక్షాలు యీ వృద్ధుణ్ణి యేమీ చెయ్యలేవు. యిప్పుడు చిత్తం చంద్రచూడుడి చరణాలమీద—

ముగ్ధస్నిగ్ధవిదగ్ధలుబ్ధ మధురైర్లోలైః కటాక్షైరలం
చేతస్సంప్రతి చంద్రచూడచరణధ్యానామృతే వర్తతే.

పుర: అది చాలా మంచిది. నీమీద యిహ కటాక్షాలను దుర్వ్యయం చెయ్యదలుచుకో లేదు. చంద్రచూడచరణ సన్నిధికే వెళ్ళు. అమ్మను పిలుస్తాను

రసిక్: (చేతులు జోడించి) పెద్దమ్మాయ్: మీ అమ్మ నన్ను సంస్కరించటానికి చాలా ప్రయత్నాలు చేసింది. కాని, సమయంకాని సమయంలో ప్రారంభించింది ఆ సంస్కరణ కార్యక్రమం—యిప్పుడామె శాసనంవల్ల ప్రయోజనమేమీ వుండదు. పైగా యిప్పటికే చెడిపోటానికి తగిన వయస్సు వుంది. విధాత కృపవల్ల ఆ వయస్సు యెప్పటికీ వుంటుంది. చంచల కటాక్షాలు అంతిమక్షణందాకా పనిచేస్తాయి. కాని బాగుపడే వయస్సు మాత్రం లేదిహ. ఆమె యిప్పుడు కాశీ వెళుతోంది యీ వృద్ధుడి శిశుప్రవృత్తిని ఉన్నతిమార్గాన పెట్టాలన్న దురాశను విడిచిపెట్టి. ఆమెని ప్రశాంతంగా వుండనియ్. మీరెందు కామెని కష్టపెట్టటం?

[జగత్తారిణి ప్రవేశిస్తుంది]

జగ: నాయనా, నే పోయొస్తా.

అక్షయ్: వెళుతున్నారా అత్తయ్యా రసిక్‌దాదా యిప్పటివరకు విచారిస్తున్నాడు. మీరు—

రసిక్: (వ్యాకుల భావంతో) బాబు మాటలన్నీ పరిహాసాలే. అమ్మా, నాకేం విచారం లేదు. యెందుకూ నేను విచారించటం?

అక్షయ్: 'నీ అత్తగారొక్కతే కాశీ వెళుతూంది నన్ను వెంటతీసుకెళ్లకుండా' అని అనలేదూ?

రసిక్: ఆఁ. అది సరియైన మాటే. మనస్సును వేధించేదే. అయినా అమ్మాయి వోవేళ వొక్కతే—

జగ: వద్దు బాబూ: దూరదేశంలో మీ రసిక్‌దాను సంబాళించగలిగే దెవరు? ఆయన్ని వెంటబెట్టుకుని ప్రయాణం చెయ్యలేను.

పుర: యేమమ్మా! రసిక్‌దాను తీసుకెళితే నిన్ను కనిపెట్టుకుని వుంటాడుగా!

జగ: రక్షించారు. నన్నెవరూ కనిపెట్టుకునివుండాల్సిన అవసరంలేదు. మీ రసిక్‌దా బుద్ధికుశలత యెంతటిదో నాకు బాగా తెలిసింది.

రసిక్: (బట్టతల చేత్తో నిమురుకుంటూ) అవునమ్మా: నాకున్న తెలివితేటలేవో చూపించుకుంటూనే వున్నా. వాటిని దాచివుంచుకునే యోగం లేదు. పట్టుబడాల్సిందే.

విరిగిన చక్రం అన్నిటికంటె ఐడఐడమంటూవుంటుంది. అది విరిగిన చక్రమని వాడవాడకంతకీ తెలిసిపోయింది. అందుకనే నమ్మా! మెదలకుండా కూచుందా మని వుంది. కాని నువ్వు వెంటతీసుకెళ్లకుండానూ విడిచిపెట్టవు...

జగ: నేను హారాన్ వాళ్ళింటికి వెళుతున్నానయితే. ఏకంగా వాళ్లతోపాటు వచ్చి రైలెక్కుతాను. తర్వాతయితే మళ్లీ మంచిదికాదు ప్రయాణానికి...పురో! నీకు విధిముహూర్తాల పట్టింపు లేదుగా! సరీగ్గా వేళకొచ్చేసెయ్ స్టేషన్‌కి.

పుర: అమ్మా! నేను కాశీ రానమ్మా!

[హఠాత్తుగా ఆమె అసమ్మతికి యిరకాటంలో పడి, అల్లుడికేసి చూస్తుంది]

అక్షయ్: (అత్తగారి మనోభావాన్ని గ్రహించి) అదెలా అవుతుంది? నువ్వు మీ అమ్మగారితో వెళ్లకపోతే ఆమె యిబ్బందిపడతారు. సరే. అత్తయ్యగారూ! మీరు ముందు పదండి. నేనీమెను సరీగ్గా వేళకి స్టేషన్‌కి తీసుకొస్తాను.

[జగత్తారిణి నిశ్చింతురాలై బయలుదేరుతుంది. రసిక్‌దాదా బట్టతల తడుముకుంటూ వీడ్కోలు సమయంలో తెచ్చిపెట్టుకునే విచారాన్ని తెచ్చుకోటానికి ప్రయత్నిస్తాడు. పురుషవేషధారిణియైన శైల ప్రవేశిస్తుంది]

అక్షయ్: ఎవరండీ? తమరు—

శైల: చిత్తం. తమ సహధర్మచారిణితో నాకు సన్నిహితమైన సంబంధం వుంది. (అక్షయునితో కరచాలనం చేసి) ముఖర్జీగారూ! గుర్తుపట్టనేలేకపోయారే!

పుర: నోట మాటరాకుండా చేశావ్— సిగ్గెయ్యటంలా?

శైల: అక్కా! సిగ్గు స్త్రీలకు భూషణం. పురుషవేషం వేసుకోబోయేటప్పుడు దాన్ని పరిత్యజించక తప్పదు. అలాగే ముఖర్జీగారు వొకవేళ స్త్రీవేషం ధరించాలిసొస్తే ఆయన సిగ్గుతో తలెత్తలేరు. రసిక్‌దాదా! మాట్లాడరేం?

రసిక్: ఆహా! శైల కిశోరకందర్పుడులా వుంది! సాక్షాత్తూ కుమారస్వామిలా— భవాని వొళ్ళోంచి లేచివొచ్చినట్లుంది. ఆమెను మొదట్నించి శైలగానే చూస్తూ వొచ్చాను. కళ్ళకుకూడా అలవాటైపోయింది. ఆమె సుందరి, అసామాన్య రూపవతి అన్నమాట యెప్పుడూ మనస్సుకి తోచనేలేదు. యివాళ ఆ రూపాన్ని మార్చుకోవటంవల్లనేమో ఆ అపురూపం తెలిసొచ్చింది. పురో సిగ్గెయ్యటంలేదా అంటావేమిటి? నా కామెను దగ్గిరికి లాక్కుని శిరస్సు నిమిరి ఆశీర్వదించా లనిపిస్తోంది.

అక్షయ్: (స్నేహమిశ్రితమైన గాంభీర్యంతో ఛద్మవేషిణిని వొక్క-క్షణం చూస్తూ ఆగి) నిజం చెపుతున్నా శైలా! నువ్వు నా మరదలివికాక నా తమ్ముడివయినా నేను అభ్యంతరం చెప్పేవాణ్ణికాను.

శైల: (కొంచెం కళవళపడి) నేనూ అంతే ముఖర్జీగారూ!

పుర: (శైలను గుండెలకు హత్తుకుని) యీ వేషంలో నువ్వు బ్రహ్మచారి సమితిలో సభ్యత్వం సంపాయించటానికి వెళుతున్నావా?

శైల: మరొక వేషంలో అయితే వ్యాకరణదోషం వచ్చిపడుతుంది అక్కా! యేమంటావ్ రసిక్‌దాదా?

రసిక్: ఆఁ. అది నిజమే. వ్యాకరణాన్ని కాపాడుకుంటూ నడుచుకోవాలి. [1]భగవాన్ పాణిని [2]బోపదేవ్ వీళ్ళందరూ యెందుకు జన్మించారు మరి? కాని అమ్మాయ్ శ్రీమతి శైలబాలకు [3]'ఉత్తర చాపకాన్' ప్రత్యయం చేరిస్తేనే—వ్యాకరణం రక్షింపబడుతుందా?

అక్షయ్: నూతన [4]'ముగ్ధబోధ'కో అలాగే రాసివుంది. నేను రాసివ్వగలను— బ్రహ్మచారి సమితిలోని ముగ్ధులకు శైల యెంత ప్రత్యయం చూపిస్తే వారంతగా ఆమెను విశ్వసిస్తారు. బ్రహ్మచారుల ధాతువు నాకు తెలుసు!

పుర: (పెద్ద నిట్టూరు వొకటి విడిచి) మీ ముఖర్జీగారూ యీ వృద్ధుడూ వీళ్ళతో కలిసి నీ నాటకమేదో నువ్వు సాగించు. నే నమ్మతో కాశీ వెళుతున్నాను.

[పురబాల సామానులు సర్దుకుంటుండగా, నృపబాల నీరబాల గదిలోకి వొచ్చి, పారిపోబోతారు. వెంటనే, నీరబాల తలుపుచాటునుంచి మరొకసారి బాగా పరిశీలనగా చూసి, చిన్నక్కా అంటూ పరుగెత్తుకొస్తుంది]

నీర: చిన్నక్కా! నిన్ను కావలించుకో బుద్ధిపుడుతోంది. కాని యీ చాప్‌కాన్ అడ్డు వొస్తోంది. నువ్వు అద్భుతకథల్లోని రాజపుత్రుడివని, యెడారులన్నీ దాటి మమ్మల్ని ఉద్ధరించటానికి వచ్చావని అనిపిస్తోంది.

[నీరబాల బిగ్గరగా మాట్లాడింది విని, కొంతవరకు తేరుకుని నృపబాల గదిలోకి వొచ్చి ముగ్ధదృష్టితో చూస్తూవుంటుంది]

---

1 సంస్కృత వ్యాకరణస్రష్ట. 2 బెంగాలీ వ్యాకరణ రచయిత.

3 'చాపకాన్' అంటే ఒకవిధమైన అంగీ—వ్యాకరణంలో ప్రత్యయవిశేషంకూడా.

4 బోపదేవ విరచిత వ్యాకరణం 'ముగ్ధబోధ.'

నీర : (ఆమెని చెయ్యిపుచ్చుకుని లాగి) యెంతాశే! అలా చూస్తావ్ దేనికి? నువ్వను కున్న దుష్యంతుడుమాత్రం కాదు. యితను—మన చిన్నక్క.

రసిక్ :
"ఇయమధిక మనోజ్ఞా 'చాప్కనేనా'పి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్"

అక్షయ్ : మూఢులారా! మీరు వొట్టి చాప్కాన్ మాత్రమే చూసి ముగ్ధులౌతున్నారు. గిల్ట్ కింత ఆదరణా? యిక్కడ మేలిమి బంగారం నిలబడి హాహాకారాలు చేస్తోంది.

నీర : యీరోజుల్లో మేలిమి బంగారం వెల చాలా యెక్కువ. మాకీ గిల్టే మంచిది. యేమంటావ్ చిన్నక్కా!

[శైల కృత్రిమ మీసాలను కొంచెం సవరించుకుంటుంది]

రసిక్ : (తనని చూపించుకుంటూ) యీ నిసలైన బంగారం చాలా చౌకగా పోతోందమ్మా! యింతవరకింకా యే టంకసాలలోనూ మహారాణి మొహరుకూడా పడలేదు.

నీర : సరే. మంచిది. అక్కను దానం చేస్తున్నాను. (రసిక్‌దా చెయ్యిపట్టుకుని నృపబాల చేతులో పెడుతుంది) ఇష్టమేగా అక్కా!

నృప : ఆఁ. ఇష్టమే నాకు.

[రసిక్‌దాను వొక బల్లమీద కూచోబెట్టి, అతడి తల్లో తెల్లవెంట్రుకలు వేరుచేస్తూవుంటుంది. నీరబాల శైల కృత్రిమ మీసాలను పైకి మెలి తిప్పటానికి ప్రయత్నిస్తూంటుంది]

శైల : ఆఁ. యేమిటి చేస్తున్నావ్. నా మీసా లూడిపోతాయి.

రసిక్ : అదేం పని? యిటు రారాదమ్మాయ్! యీ మీసాలు వూడిపోవు.

నీర : యింకానా మళ్లీ! చిన్నక్క చేతులో అప్పగించింది యెందుకని? సరేకాని రసిక్‌దాదా! నీ తలమీద అక్కడక్కడ యింకా నల్లవెంట్రుకలున్నాయి. కాని మీసాలు సాంతం నెరిసిపోయాయి యెందుకని?

రసిక్ : కొంతకొంత మందికి తల పండటానికి ముందే ముఖం పండుతుంది.

అక్షయ్ : అయితే నేనూ నా బ్రహ్మచారి సమితి తల నిమిరివస్తాను.

నీర :
జయరథ మధిరోహింపుము సాగింపుము విజయయాత్ర
విజయమాల లల్లి దిశల వీక్షింతుము నీకొరకై

పథధూళుల నూడ్చి శుభ్రవసనమ్ములు పరచియుంచి
వరియింతును విజయముతో తిరిగివచ్చువేళ నిన్ను.

అక్షయ్ : రథం సిద్ధంగా వుంది. యిప్పుడేది తీసుకురమ్మంటావో చెప్పు.

నీర :
సజల దృగంచలములలో సంధింపుము హాసరేఖ
శూన్యగృహమ్మున వసంతశోభను నెలకొల్పి పొమ్మ
చీకటింట దీపశిఖను చెచ్చెర వెలిగించి పొమ్మ
రాత్రినొసట దిద్దిపొమ్మ రాకాశశి తిలకమ్మును.

అక్షయ్ : యిహ అన్నీ బాగానే వున్నాయి. కాని నీ జాబితాలోవున్న బంగారు ప్రమిద మాత్రం దొరకదేమో. ప్రయత్నలోపం మాత్రం వుండదు.

నీర : అక్కా వాళ్ల సభ యే గదిలో జరుగుతుంది ముఖర్జీగారూ :

అక్షయ్ : నా సొంత గదిలో.

నీర : అయితే ఆ గది కాస్త సర్ది అమర్చనీయండి.

అక్షయ్ : నే నాగదిని ఉపయోగిస్తున్నన్నాళ్లు—వొక్కనాడూకూడా సర్ది అమర్చటానికి బుద్ధిపుట్టలేదనుకుంటా.

నీర : మీకు వూడ్చేవాళ్లు -నౌకర్లూ యెందరున్నా యింకా ఆశతీరలేదనుకుంటా.

[పురబాల ప్రవేశిస్తుంది]

పుర : యేం చేస్తున్నారు మీరు ?

నీర : ముఖర్జీగారిదగ్గిర చదువుకోటానికొచ్చాను. వారి బయటివైపు గది బాగా తుడిచి అలంకరించనిదే వారు పాఠం చెప్పరుట. అందుకని చిన్నక్కా నేనూ ఆ గది శుభ్రంచెయ్యటానికి వెళుతున్నాం. రా అక్కా !

నృప : నీకంత కోరికగావుంటే నువ్వు వెళ్ళి గది అలంకరించు. నే రాను.

నీర : ఆс. నేనొక్కతెనూ వెళ్లి కష్టపడితే నువ్వుమాత్రం ఆ ఫలితాన్ని అనుభవిద్దువు గాని—అలా వీల్లేదు.

[నృపను పట్టుకుని తీసుకునివెళిపోతుంది నీర]

పుర : అన్నీ సర్దుకున్నాను. ట్రైనుకి వెళ్లటానికింకా టైముందనుకుంటాను.

అక్షయ్ : మిస్ చెయ్యాలనుకుంటే మాత్రం కావలసినంత టైముంది.

# ద్వితీయాంకం

## దృశ్యం ౧

[చంద్రబాబు యిల్లు. బ్రహ్మచారి సమితి గది. శ్రీశుడు — విపినుడు]

శ్రీశ్ : నువ్వేమయినా అను. అక్షయబాబు మన సమితిలో వున్నప్పుడు మన బ్రహ్మచారి సమితి మాంచి కలిసికట్టుగా వుండేది. మన సభాపతి చంద్రబాబు కొంచెం కరుకు మనిషి.

విపిన్ : అత నున్నప్పుడు సారస్యం బాగా యెక్కువగా వుండేది. కాని శాశ్వత బ్రహ్మచర్య వ్రతానికి ఆ రసాధిక్యం అంత మంచిదికాదని నా అభిప్రాయం.

శ్రీశ్ : నా అభిప్రాయం పూర్తిగా విరుద్ధం. మన వ్రతం కఠినమైనది కనకనే సారస్యం యెక్కువ అవసరం. బీటలువారిన భూమిలో పంట పండించాలంటే నీరుపెట్టి తడపటం అవసరంకదా. జీవితాంతం వివాహంచేసుకోమన్న ప్రతిజ్ఞే చాలు. అలా అని అన్నివిధాలా యెండి చావవలసిందేనా ?

విపిన్ : యేమయినా అను. హఠాత్తుగా బ్రహ్మచారి సమితిని వదిలేసి, వివాహం చేసుకుని అక్షయబాబు మన సమితిని వేరుచేసిపోయాడనుకో. లోకులందరి యెదటా మన ప్రతిజ్ఞాబలం సన్నగిల్లిపోతోంది.

శ్రీశ్ : అదేమీ లేదు. నా సంగతిమాత్రం నే చెప్పగలను. నా ప్రతిజ్ఞాబలం హెచ్చింది. అందరూ సులభంగా అనుష్ఠించగలిగిన వ్రతమ్మీద యెవరికీ గౌరవం వుండదు.

విపిన్ : వొక మంచివార్త చెబుతా విను.

శ్రీశ్ : నీకు పెళ్ళిసంబంధం యేమన్నా వచ్చిందా ?

విపిన్ : రాకేం ? నీ మనుమరాలితో—వేళాకోళానికేంగాని, పూర్ణబాబు నిన్న బ్రహ్మచారి సమితి సభ్యుడయాడు.

శ్రీశ్ : పూర్ణా ? నిజంగానే ? అయితే రాయి నీళ్ళమీద తేలిందన్నమాట.

విపిన్ : శిల దానంత టది తేలిపోలేదు. దాన్ని మరొక ఏదో అవాంతరం వొచ్చి పైకి తేల్చింది.

శ్రీశ్ : యిదిగో విపిన్ ! పూర్ణ హఠాత్తుగా బ్రహ్మచారి సమితి సభ్యుడవటానికి కారణమేమిటో అర్థంకావటంలేదు. యీ సమితికి కైశికాకర్షణ, మాధ్యాకర్షణ, చుంబకాకర్షణ మొదలైన యే ఆకర్షణలూ లేవే.

విపిన్ : యెవరన్నారు లేవని. పర్దా చాటుగా వున్నాయి.

శ్రీశ్ : యింకొంచెం విడమర్చి చెప్పు. నీ తెలివి యెంతదూరం పోయిందో చూస్తా.

విపిన్ : పూర్ణబాబు యీ సమితిలో సభ్యుడయినదగ్గిర్నుంచీ గమనిస్తూన్నా—అతడి కళ్ళురెండూ ఆ గుమ్మంవైపు పరదా రహస్యాన్ని ఛేదించటానికి అక్కడే లగ్నమయివుండటం... కారణం వెతకబోయేసరికి పరదాకింది ఖాళీలోంచి రెండు పాదాలు కన్పించాయి. అవి కన్పించగానే— యెవరి మనస్సు ఆ పాదాలచెంత పరిభ్రమిస్తుందో వాళ్ళు బ్రహ్మచర్య వ్రతాన్ని పాలించాలనుకుంటే తప్పకుండా వ్రతభంగానికి లోనవుతా రనిపించింది.

శ్రీశ్ : ఆ చరణయుగళంలో వున్న చరమతత్వాన్ని కనిపెట్టగలిగావా ? దాన్ని కొంచెం కొంచెం తెలుసుకుంటేనే మనస్సు ఉత్కంఠితమవుతుంది. చాలా సమయాల్లో— దాన్ని పూర్తిగా తెలుసుకుంటే మనస్సుకి శాంతి లభిస్తుంది. ఆ పాదాలు రెండూ యెవరివి చెప్పు...

విపిన్ : అయితే ఆ గాథ చెబుతా విను. పూర్ణ సాయంకాలం చంద్రబాబుదగ్గిర 'నోట్సు' తీసుకోటానికి వెళుతూంటాడు తెలుసుగా ! ఆరోజువ నేనూ, పూర్ణా కలిసి కొంచెం పెందరాళే చంద్రబాబు యింటికి వెళ్ళాం. ఆయన వొక మీటింగ్‌నించి అప్పుడే వొచ్చారు. నౌకరొచ్చి కిరోసిన్ దీపం వెలిగించి వెళ్ళాడు. పూర్ణ పుస్తకంలో పేజీలు తిరగేస్తున్నాడు. యీ సమయంలో—యేం చెప్పనింక భాయీ ! బంకింబాబు రాయని నవలలోంచి వొచ్చిందొక యువతి—వెనకాల జడని అల్లల్లాడించు కుంటూ.

శ్రీశ్ : యేమిటీ ? యేమన్నావ్ ?

విపిన్ : చంద్రబాబుకోసం వొకచేత్తో ప్లేట్‌లో ఫలహారం, వొకచేత్తో గ్లాసులో మంచినీళ్ళు తీసుకుని హఠాత్తుగా గదిలో కొచ్చిందామె. మమ్మల్ని చూసి గతుక్కుమని, ముడుచుకుపోయింది. సిగ్గుతో ముఖం యెర్రబడింది. రెండు చేతుల్లోనూ రెండూ వున్నాయి. మేలిముసుగు సరిగ్గా తీసుకోటానికి వీల్లేదు. కంగారుగా టేబిల్‌మీద ఫలహారం, మంచినీళ్ళూ పెట్టేసి పరిగెత్తింది. పూర్ణను చూడగానే— అతడి మనస్సు— అల్లల్లాడుతున్న ఆమె జడవెనకాలే పరిగెత్తినట్లు తెలిసిపోయింది. బ్రాహ్మయువతే. కాని ముప్ఫైమూడుకోట్ల దేవతలతోపాటు లజ్జనుకూడా విసర్జించ

లేదు. అంతేకాదు నిజం చెబుతున్నా. తన లావణ్యాన్నికూడా భద్రంగా వుంచుకొన్నది.

శ్రీశ్ : యేమిటి విపిన్ ? చూపులకు బాగుంటుం దనుకుంటా.

విపిన్ : అద్భుతంగా వుంటుంది. హఠాత్తుగా మెరుపులాగా వచ్చి, చదువుసంధ్యలమీద పిడుగు పడేసిపోయింది.

శ్రీశ్ : యేదీ ! నే నొక్కరోజునా చూడలేదే ! ఆ అమ్మాయి ఎవరోయ్ ?

విపిన్ : మన సభాపతిగారి మేనకోడలు, పేరు నిర్మల.

శ్రీశ్ : మేనకోడలా ? కొంప మునిగింది. యిక్కడే వుంటుందా ?

విపిన్ : సందేహ మేమీలేదు. సభాపతిగారు స్వయంగా రోగరహితులేగాని, రోగ బీజాల్ని అంటిపెట్టుకుని తిరుగుతూంటారు.

శ్రీశ్ : కాని మేనకోడలి భర్త అనే అమంగళం యేమీ లేదనుకుంటా.

విపిన్ : ఆ అమంగళం అపరిణీత ఆకారంలో బ్రహ్మచారి సమితిలో ప్రవేశించింది. పూర్ణబాబు రెక్కలొచ్చి బైటబడే వేళకు ప్రజాపతి ఆ గూడును కాస్తా చించి పారేస్తాడు.

శ్రీశ్ : అయితే ఆమె కుమారి అన్నమాట.

విపిన్ : కాకపోతే ? బ్రహ్మచారిగణం పాలిటి మహామారి. యీ సంఘటన జరిగిన మర్నాడే పూర్ణ హఠాత్తుగా మన బ్రహ్మచారి సమితిలో పేరు నమోదు చేయించుకున్నాడు.

శ్రీశ్ : పూజారివేషం వేసుకుని దేవుణ్ణే దొంగిలిద్దామనే యెత్తు. మనంకూడా యీ వ్యవహారాన్ని కనిపెట్టివుండాలి.

విపిన్ : స్త్రీతత్వ పరిశోధన అంత ఆరోగ్యకరమైనది కాకపోవొచ్చు.

శ్రీశ్ : నీ ఆరోగ్యం దెబ్బతినకుండా కనక వున్నట్లయితే—నా ఆరోగ్యానికీ—

విపిన్ : మొదట్లో రోగప్రవేశం అంతు చిక్కదు. కాని బ్రహ్మచారి కుమారుల్లోని మారుడు యెప్పుడైతే లోపల్నించి వెలికివొస్తాడో—అప్పుడిహ అశ్వినీకుమారులకూడా సాధ్యంకాదు రక్షించటం. మొదట్లోనే జాగ్రత్తపడటం మంచిది.

[ఒక ప్రౌఢవ్యక్తి ప్రవేశిస్తాడు]

విపిన్ : యేమండీ ! యెవరు మీరు ?

ప్రౌఢవ్యక్తి : చిత్తం. నా పేరు శ్రీ.వనమాలి భట్టాచార్య. మా తండ్రిగారి పేరు రామకమల న్యాయచక్షు. నివాసం—

శ్రీశ్ : ఆ వివరాలమీద మాకు అంత మరీ ఆసక్తిలేదు లెండి. కాని యిప్పుడేం పని మీద వచ్చారో అది—

వనమాలి : పనేమీ లేదండి. మీరు పెద్దమనుషులు. మీతో పరిచయం అదీ...

శ్రీశ్ : పని మీకు లేకపోతే లేకపోవొచ్చు— మాకుంది. యిప్పుడు వేరే పెద్దమనుషు లెవరితోనయినా పరిచయం చేసుకోటానికి వెళ్లోట్లయితే---మాకు.

వన : అయితే వొచ్చిన పని విషయం చెప్పేస్తాను.

శ్రీశ్ : అదే మేలు.

వన : 'కుమార్‌టులి' నీల మాధవచౌధురిగారికి— అపురూపసుందరులైన అమ్మాయి లిద్దరున్నారు. వారికి పెళ్ళియీడు వొచ్చింది.

శ్రీశ్ : వొస్తే వొచ్చింది. మాతో వారికేమిటి సంబంధం ?

వన : సంబంధం— మీరు కాస్త మనసుంచితే యేర్పడుతుంది, కష్టమేముంది ! నేను అన్నీ సరిజేసుకుంటాను.

విపిన్ : మీ దయంతా అపాత్రులమీద అపవ్యయం చేస్తున్నారు.

వన : అపాత్రులా ? యెంతమాట ! మీలాంటి సత్పాత్రులు యెక్కడ దొరుకుతారు ? మీ వినయానికి మరీ ముగ్ధుణ్ణయాను.

శ్రీశ్ : యీ ముగ్ధభావాన్ని నిలుపుకోవాలనుకుంటే యిప్పుడే తప్పుకుని అవతల పడండి. వినయగుణం మరీ యెక్కువగా సాగదీస్తే నిలవదు.

వన : కన్యాదాత కావలసినంత డబ్బు యివ్వటానికి సిద్ధంగా వున్నారు.

శ్రీశ్ : పట్నంలో బిచ్చగాళ్ళకు లోటులేదు. యేయ్ ! విపిన్ ! నీకు వినోదంగా వున్నట్లుంది. కాని యిలాంటి ముఖప్రీతి మాటలు నాకు బాగుండవు.

విపిన్ : యెక్కడికి పారిపోను ! భగవంతు డితడిక్కూడా వొక జతే పోటుగాటి కాళ్ళిచ్చాడు.

శ్రీశ్ : వొకవేళ వెంటపడేట్లయితే - భగవంతు డిచ్చిన ఆ వొక్క జితనూ మనుష్యుల చేతుల్లో పోగొట్టుకోవలసివొస్తుంది.

వన : నేనే వెళుతున్నానండి.

[వెళిపోతాడు]

[చంద్రమాధవబాబు ప్రవేశిస్తాడు]

చంద్ర : పూర్ణా!

శ్రీశ్ : చిత్తం. నేను శ్రీశ్ ని.

చంద్ర : మన యీ సమితి సభ్యులసంఖ్య చిన్నదైపోయిందని యెవరూ నిరుత్సాహపడవలసిన దేమీలేదు.

శ్రీశ్ : నిరుత్సాహమా? అదే అసలు మన సమితికి గౌరవం. యీ సమితి మహత్తర ఆదర్శం, కఠిన విధానాలు సర్వసాధారణుల కనువుగా వుంటాయా! మన సమితి కొద్దిమంది సభ్యుల సమితి.

చంద్ర : (సమితి కార్యకలాపాలను నమోదుచేసే పుస్తకాన్ని తెరిచిచూస్తూ) మన ఆదర్శం ఉన్నతమైనదీ, మన విధానం కఠినమైనదీ కనుకనే వినయాన్ని కాపాడుకోవటం మన కర్తవ్యం. మనం మన సంకల్పసాధనకు యోగ్యులంకాకపోయినా కాకపోవొచ్చు అనేది సర్వదా జ్ఞాపకంపెట్టుకోవటం ఉచితం. ఆలోచించి చూడు. పూర్వం మన సమితిలో బహుశా మనకంటె అన్నివిధాలా ఉత్తములైన సభ్యులెందరో వుండివుండొచ్చు. కాని వారు తమ సుఖానికీ సాంసారికమైన ఆకర్షణకీ లోనై వొక్కరొక్కరే లక్ష్యభ్రష్టులయినారు. మనలో మరికొందరి జీవితపథాల్లో కూడా యీ ప్రబలమైన ఆకర్షణ యెక్కడ పొంచివుందో—అది యెవరూ చెప్పలేరు. అంచాత మనం దంభాన్ని పరిత్యజిస్తాం. అంతటితో వూరుకోక యే ప్రతిజ్ఞలకీ కట్టుబడివుండటాని కిష్టపడం. నా అభిప్రాయ మేమిటంటే, యెప్పుడో వొకప్పుడు మహత్కార్యసాధనకోసం ప్రయత్నంచెయ్యకుండా వుండటంకంటె, ప్రయత్నించి వైఫల్యాన్ని పొందటమే మేలు.

[ప్రక్కగదిలో కొంచెం తెరిచివున్న తలుపుచాటున వొక శ్రోత్రి యీ మాటలకు కొంచెం విచలితురాలవుతుంది. ఆమె కొంగున ముడివేసివున్న తాళాలగుత్తిలో కొన్ని కొద్దిధ్వని కలిగిస్తాయి. దాన్ని పూర్ణతప్ప యెవరూ గమనించలేకపోతారు]

చంద్ర : మన సమితిని చాలామంది పరిహాసం చేస్తూంటారు. యెంతోమంది 'మీరు దేశోపకారం చేయటంకోసం బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబించారు. కాని అందరూ

యీ మహత్తర ప్రతిజ్ఞాబద్ధులే కనుక అయితే యాభై సంవత్సరాల అనంతరం— ప్రజలకోసం యేమయినా చేయటానికి—అసలలాంటి ప్రజలింక యేంవుంటారు ?' అని అడుగుతూంటారు. నేను తరుచు వినమ్రతతో నిరుత్తరుణ్ణై యిలాంటి పరిహాసాలన్నిటినీ భరిస్తూంటాను. కాని దీనికేం సమాధానం లేదూ ?

[అని అతడు తన ముగ్గురు సభ్యులకేసి చూస్తాడు]

పూర్ణ : తెరచాటున వున్నామెను గుర్తుకుతెచ్చుకుని ఉత్సాహంతో) యెందుకు లేదు ? అన్నిదేశాల్లోనూ వొకవర్గం మనుషులున్నారు – సంసారులు కావటానికని జన్మించనివాళ్లు. వాళ్ళసంఖ్య స్వల్పం. ఆ కొద్దిమందినీ ఆకర్షించి, వొకే ఆదర్శబద్ధుల్ని చెయ్యటానికే యీ సమితి. ప్రపంచంలో వున్నవారందర్నీ బ్రహ్మచర్యవ్రత దీక్షితుల్ని చేయటానికికాదు. మన యీ వ్యామోహం చాలమందికి పట్టుకుంటుంది. కాని యెక్కువమంది పరిత్యజిస్తారు. చివరకు దీర్ఘకాలపరీక్షానంతరం అయిదారు గురుమాత్రం మిగులుతారు. ఆ అయిదారుగురు మీరేనా ? అని యెవరైనా వొకవేళ అడిగితే—పట్టుదలతో అవునని యెవరు చెప్పగలరు ? ఆఁ. మనం ఆ జాలానికి ఆకృష్టులమయినాం. అంతే. కాని పరీక్షలో చివరివరకు చలించకుండా వుండగలమో లేమో అది అంతర్యామికే తెలియాలి. కాని మనం చలించకుండా వుండగలిగినా, వుండలేకపోయినా, మనం వొక్కొక్కరమే జారిపోనీ—జారిపోకపోనీ– అలా అని మన యీ సమితిని పరిహసించే అధికారం యెవరికీ లేదు. వొకవేళ కేవలం మన సభాపతిగారొకరే వుండేట్లయితే మనం విడిచిపెట్టిన యీ సమితిరంగం ఆ ఏకైక తపస్వి తపఃప్రభావంతో పవిత్రమూ ఉజ్జ్వలమూ అయి నిలుస్తుంది. వారి చిరజీవన తపఃఫలం దేశానికి యెన్నటికీ వ్యర్థంకాబోదు.

[కుంఠితుడైన సభాపతి మళ్లీ ఆ పుస్తకాన్ని ముఖానికి మరింత దగ్గిరగా పెట్టుకుని, పరధ్యానంగా యేదో చూస్తూంటాడు. కాని పూర్ణ యీ ఉపన్యాసం—యథాసమయంలో యథాస్థానానికి పోయి చేరుకుంటుంది. చంద్రమాధవబాబు ఏకైక తపస్వి అన్నమాటలకి ఆమె కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి. విచలితయైన ఆ యువతి చెంగునవున్న తాళాలగుత్తి సవ్వడి—ఉత్కంఠుడైవున్న పూర్ణను సన్మానితుని చేస్తుంది]

విపిన్ : మనం యీ సమితికి యోగ్యులమో అయోగ్యులమో కాలమే వ్యక్తంచేస్తుంది. కాని, పనిచెయ్యటంకూడా మన సమితి ఆశయమయితే—దాన్ని యేదో సమయంలో ప్రారంభించటం ఉచితం. నా ప్రశ్న యిది—యేం చెయ్యాలి అని ?

చంద్ర : (ఉత్సాహితుడై) యీ ప్రశ్నకోసమే మనం యిన్నాళ్లు యెదురుచూశాం. యేం చెయ్యాలి ? యీ ప్రశ్న మనలో ప్రతివొక్కర్నీ బాధిస్తూ, ఆందోళన కలిగిస్తోంది

యేం చెయ్యాలి ? మిత్రులారా ! పని వొక్కటే మనందర్నీ యేకంగా బంధించ గల్గింది. యెవరైతే కలిసికట్టుగా పనిచేస్తారో వారందరూ వొకటి. యీ సమితి లోని మనమందరం కలిసి వొకపనిలో నిమగ్నులం కానంతవరకు మనం నిజంగా వొకటికాలేం. అందుకనే విపిన్‌బాబు ఈ ప్రశ్న వేశారు — యేం చెయ్యాలి ? యీ ప్రశ్నను యెగరగొట్టెయ్యటానికి వీల్లేదు సభ్యమహాశయులారా ! సమాధానం చెప్పండి మీరు — యేం చెయ్యాలి మనం ?

శ్రీశ్ : (కళవళపడుతూ) యేం చెయ్యాలి ? అని నన్నుగనక అడిగేట్లయితే - మనం అందరం సన్యాసులమై దేశసేవకు కంకణం కట్టుకుని, భారతదేశంలోని ప్రతి రాష్ట్రంలోనూ, ప్రతిగ్రామంలోనూ పర్యటించాలి. మన సమితిని పరిపుష్టం చెయ్యాలి. మన సమితికి సూక్ష్మసూత్రాల్ని రూపొందించి, వాటితో సమస్త భారత వర్షాన్నీ బంధించాలి — అంటాను.

విపిన్ : నవ్వి, దానికింకా చాలా వ్యవధి వుంది. రేపే ప్రారంభించదగిన పని యేదైనా చెప్పు. 'భల్లూకాన్ని కొట్టాలి, భాండారాన్ని దోచాలి' అని దీక్షపట్టి కనక కూచుంటే భల్లూకమూ వుండిపోతుంది భాండారమూ వుండిపోతుంది. యిప్పుడెంత హాయిగా వున్నావో అంత హాయిగా నువ్వూ వుండిపోతావు. నేనొక సూచన చేస్తున్నా. మనం వొక్కొక్కరం యిద్దరేసి విదేశీవిద్యార్థుల్ని పోషిద్దాం. వారి చదువు—సంధ్యలు, శరీరం—మనస్సుల సంరక్షణభారం యావత్తూ మనమీద వుంటుంది.

శ్రీశ్ : యిదా నీ పని ! యిందుకా మనం సన్యాసధర్మం స్వీకరించింది ? చివరకు పిల్లలకు చదువుచెప్పటమే అయితే మనదేశీయుల పిల్లలేం అపరాధం చేశారు ?

విపిన్ : (చిరాకు తెచ్చుకుని) అలా గనక అనేట్లయితే సన్యాసికి అసలు పనేలేదు. భిక్ష మెత్తటం—తిరగటం —ఆడంబరాలకు పోవటమే వున్నపని.

శ్రీశ్ : (కోపంతో) నేనూ చూస్తూన్నాగా ! మన సమితిలో కొంతమంది వున్నారు— యీ సమతి మహత్తరాశయాలంటే యేమాత్రం శ్రద్ధానక్తులు లేనివాళ్ళు. వాళ్ళు యెంత త్వరగా యీ సమితిని వొదిలిపెట్టి, పిల్లల్ని కనటంలో నిమగ్నులయితే అంత మేలు మనకు.

విపిన్ : (ముఖం కందగడ్డలా చేసుకుని) నా విషయం చెప్పటం నాకేమీ యిష్టంలేదు. కాని, యీ సమితిలో యిలాంటివాళ్లు కొందరున్నారు — సన్యాస స్వీకారంలోని కాఠిన్యానికీ—సంతానపోషణలోని త్యాగస్వీకారానికీ రెండింటికీ అయోగ్యులయిన వాళ్ళు వాళ్ళకి —

చంద్ర : (ముఖం ముందుసించి సమితి కార్యకలాపాల పుస్తకాన్ని తప్పించి) ప్రస్తుతం పైకివొచ్చిన ప్రస్తావన విషయంలో పూర్ణబాబు అభిప్రాయం తెలుసుకోగలిగితే — నా అభిప్రాయం వ్యక్తంచెయ్యటానికి అవకాశం దొరుకుతుంది.

పూర్ణ : యివాళ ప్రత్యేకంగా సమితి ఐకమత్యంకోసం వొక పనిని ప్రారంభించాలన్న ప్రస్తావన వొచ్చింది. కాని ఆ కార్యాచరణ ప్రస్తావనలో ఐక్యలక్షణాలు యెంత ప్రస్ఫుటమయినాయో — దాన్ని యెవరికీ యిహ వేలెత్తి చూపాల్సిన అవసరం లేదు. యీలోగా నేనింకో మూడో అభిప్రాయాన్ని వెలిబుచ్చానంటే - విరోధాగ్నికి మూడో ఆహూతి నివ్వటం అవుతుంది. అందువల్ల నా సూచన యేమిటంటే – సభాపతిగారు మనకొక పనినిగనక ఆదేశించినట్లయితే —దాన్ని శిరసావహించి, యింకేమీ ఆలోచించకుండానే నిర్వహిస్తాం. కార్యసాధనమే ఐక్యసాధనకి ఏకైక మార్గం...

[పక్కగదిలో వ్యక్తి మళ్లీ వొకసారి అటూ ఇటూ కదిలి కూర్చుంటాడు. ఆ వ్యక్తి తాళాలరింగు ధన్‌మని చప్పుడవుతుంది]

చంద్ర : మన ప్రథమ కర్తవ్యం భారతదేశ దారిద్ర్యవిమోచనం. ఆ దారిద్ర్యానికి శీఘ్ర నివారణోపాయం వాణిజ్యం. మనం కొద్దిమందిమి పెద్దవ్యాపారాన్ని సాగించలేం. దానికి పునాదులు వేయగలం. మనం అందరం అగ్గిపుల్లలమీద పరిశోధన ప్రారంభించా మనుకోండి. తేలికగా మండేది—త్వరగా ఆరిపోనిది — దేశంలో యెక్కడపడితే అక్కడ విస్తారంగా దొరికేది—అలాంటిదాన్ని కనక కనిపెట్టామంటే—అప్పుడిహ దేశంలో చవకగా అగ్గిపెట్టెలు తయారుచేయటానికి అవరోధాలేమీ వుండవు. అయితే కేవలం వస్తువును తయారుచేసే ప్రణాళికను తెలుసుకుంటే యేం లాభంలేదనుకుంటాను నేను. మనదేశంలో యెన్నిరకాల పుల్లలు దొరుకుతాయో—వాటిల్లో అన్నిటికంటె దేనికి యెక్కువ దహనశక్తి వుందో— దాన్ని కనిపెట్టాలంటాను.

విపిన్ : దహన తత్వవిషయంలో పూర్ణబాబుకి కొంత అనుభవం వుందనుకుంటాను.

చంద్ర : అలాగా ! యేం పూర్ణ ! నువ్వు దహనపదార్థ పరిశోధన చేశావా యేం ?

పూర్ణ : పూచికపుల్ల చవక అని నా ఉద్దేశం. అదీకాక

విపిన్ : ఆఁ. అదీకాక అది తేలికగా మండుతుంది. కాని బ్రహ్మచారి సమితిలో దాని పరిశోధన తేలికకాదు.

పూర్ణ : మనదేశంలో దహన పదార్థాల కావలసినన్ని వున్నాయి. వాటితో దహింపదగినవాటికీ కొరతలేదు. కాని పరిశోధన చాలా సమర్థంగా జరగాలి.

చంద్ర : సరియైనమాట అన్నారు. యెన్నోరకాల పుల్లలున్నాయి. యెంత త్వరగా మండుతాయో అంత త్వరగా కాలి నుసిఅయిపోయేవి.

విపిన్ : యెందుకు లేవు.

చంద్ర : త్వరగా మండాలి. కాస్తకాస్తే చాలాసేపటివరకు చివరిదాకా కాలేవి కావాలి. వెతికితే దొరక్కపోతాయా?

శ్రీశ్ : చాలా దొరుకుతాయి. చేతిదగ్గిరే వున్నట్లు గమనించగలరనుకుంటా బహుశా.

పూర్ణ : రకరకాల పుల్లలు తీసుకుని త్వరలోనే పరిశోధన చేసి చూస్తాను.

[శ్రీశ్ ముఖం పక్కకు తిప్పి నవ్వుతాడు. అక్షయుడు ప్రవేశిస్తాడు]

అక్షయ్ : లోపలికి రావచ్చునా మహాశయా?

[చూపు మందగించిన చంద్రబాబు హఠాత్తుగా గుర్తుపట్టలేక, కనుబొమలు చిట్లించి చూస్తూవుండిపోతాడు]

అక్షయ్ : భయపడకండి మహాశయా! అలా కనుబొమలు చిట్లించి నన్నూ భయపెట్టకండి. నేను అభూతపూర్వుణ్ణి కాను. అంతే కాదు — నేను భూతపూర్వుణ్ణి నాపేరు—

చంద్ర : యింక పేరు చెప్పక్కర్లేదు. రండి, రండి. అక్షయబాబూ!

[ముగ్గురు యువకసభ్యులూ అక్షయ్‌కి నమస్కారం చేస్తారు. విపిన్ — శ్రీశ్ — అప్పుడే తగాదాపడి వున్నందువల్ల గంభీరంగా కూర్చుంటారు]

పూర్ణ : మహాశయా! అభూతపూర్వులకంటె భూతపూర్వులకే యెక్కువ భయపడాలి.

అక్షయ్ : పూర్ణబాబూ! యెంతో తెలివిగా మాట్లాడారు. ప్రపంచంలో భూతాలంటే భయం అనవాయితీగా వుంది. తాను భూతమయిన వానికి తక్కిన లోకులజీవిత సౌఖ్యం వాంఛనీయం కాజాలదని అనుకుని, మానవులు భూతాన్ని భయంకరంగా ఊహించుకుంటారు. కనక సభాపతి మహాశయా! బ్రహ్మచారి సమితిలోని యీ 'భూతాన్ని' సమితినించి వెళ్లగొడతారా? లేక పూర్వసంపర్కపు మమకారంతో వొక కుర్చీవేయిస్తారా? యిప్పుడే చెప్పండి.

చంద్ర : కుర్చీవేయటమే నిశ్చయం.

[అని వొక కుర్చీని ముందుకు తోస్తాడు]

అక్షయ్: అందరి సమ్మతి ననుసరించి ఆసనాన్ని స్వీకరిస్తున్నాను. మీరందరూ నన్నెంతో గౌరవంగా కూర్చోమన్నారు కదా అని అమర్యాదగా అలాగే కూర్చుండిపోయేటంత అసభ్యుణ్ణిగా భావించకండి నన్ను. ముఖ్యంగా తాంబూలం, తంబాకు, తరుణి తమ సమితి నియమాలకు విరుద్ధాలు. యీ మూడు దురభ్యాసాలూ నన్ను భ్రష్టుణ్ణిచేసేశాయి. కనుక చప్పున వచ్చిన పనేమిటో ముచ్చటించి, యింటికి తిరుగుముఖం పడతాను.

చంద్ర: (నవ్వి) మీరు సమితిసభ్యులు కారుగనక— సమితి నియమాలు మీకు వర్తించవు. తమలపాకు, తంబాకు యేర్పాటుచెయ్యగలమే మోకాని, మీ మూడో అలవాటుని—

అక్షయ్: దాన్ని యిక్కడికు తీసుకువొచ్చే ప్రయత్నం చెయ్యకండి నాకది బాహాటమయిన అలవాటు కాదు.

[చంద్రబాబు తమలపాకు—పొగాకుకోసం నౌకర్ని— సనాతనుణ్ణి— పిలవబోతాడు. పూర్ణ 'నే పిలుచుకువొస్తాను' అని లేస్తాడు. పక్కగదిలో తాళాలూ— గాజులూ వొక్కసారే పలాయనం చిత్తగించిన ధ్వనులు విన్పిస్తాయి]

అక్షయ్: 'యస్మిన్ దేశే యదాచారః' నేనిక్కడ వున్నంతసేపూ నాకూ— యిక్కడి బ్రహ్మచారులకూ యేమీ ప్రభేదం వుండదు. యింక నా ప్రస్తావనను వినండి

[చంద్రబాబు టేబిల్‌మీది సమితి పుస్తకంమీదికి వొంగి శ్రద్ధగా వినటం మొదలెడతాడు]

అక్షయ్: నా మిత్రుడయిన వొక పల్లెటూరి ధనికుడు తన యేకైక సంతానాన్ని తమ బ్రహ్మచారి సమితిలో సభ్యుడుగా చేయాలని వాంఛిస్తున్నారు.

చంద్ర: (విస్మితుడై) తండ్రి కొడుక్కి వివాహం చేయదలచటంలేదా?

అక్షయ్: మీరా విషయంలో నిశ్చింతులుగా వుండండి. అతడు యేమయినా సరే వివాహం చేసుకోడు— దానికి నేను జామీనుంటాను. అతడికి అన్నగారి వరుసయిన మరొకరుకూడా సభ్యులవుతారు. ఆయన విషయంలోకూడా మీరు నిశ్చింతగా వుండొచ్చు. యెంచేతనంటే ఆయన మీ అందరి అంత సుకుమారుడు కాకపోవొచ్చు— కాని, మీ అందరికంటెకూడా కచ్చితమైన 'కుమారుడు' (బ్రహ్మచారి). ఆయన వయస్సు అరవై దాటింది. కనక ఆయనకి సందేహించదగిన వయస్సులేదు. అదృష్టవశాత్తూ మీ అందరికీ వుంది అలాంటి వయస్సు.

చంద్ర: సభ్యత్వాన్ని అర్థిస్తున్నవారి పేరు, వూరు, వివరాలు—

అక్షయ్: వారి వూరు, పేరు, వివరాలున్నాయనుకోండి. సమితిని ఆ వివరాలనుంచి వంచించబోము. వారు సభ్యులయాక వారి వూరు, పేరు, తక్కిన వివరాలూ తప్పక తెలుసుకోగలుగుతారు. కాని కింద అంతస్థులో చిత్తడిగావుండే గది ఆరోగ్యాని కంత మంచిదికాదు. మీయీ కొద్దిమంది శాశ్వత బ్రహ్మచర్యం తరిగి పోకుండా యెలా వుంటుందో దాన్నికూడా గమనిస్తూవుండాలి.

చంద్ర: (కొంచెం లజ్జితుడై పుస్తకాన్ని కొంచెం పైకి యెత్తిపట్టుకుని) అక్షయబాబూ! మీకు తెలుసు మా ఆదాయం—

అక్షయ్: ఆదాయం సంగతి బైటపెట్టకండి. ఆ ఆలోచన అంతగా వుల్లాసం గలిగించేదికాదని నాకు తెలుసు. మంచి యిల్లు సిద్ధంచేసివుంది. దానికోసం మీరు మీ కోశాధ్యక్షుణ్ణి స్మరించుకోనక్కర్లేదు. రండి, యివాళే మీకు అన్నీ చూపించి తీసుకువొస్తాను.

[దిగాలుపడివున్న శ్రీశ్, విపినుల ముఖాలు కళకళలాడ్తాయి. సభాపతి కూడా యెంతో సంతోషించి, జుట్టులో వేళ్లను జొనుపుకుంటూ జుట్టు రేగిపోయేట్లు చేసుకుంటాడు. వొక్క పూర్ణమాత్రం కుంగిపోతాడు]

పూర్ణ: సమితి స్థానాన్ని మార్చటానికి వీల్లేదు.

అక్షయ్: యేం? యెందుకని? యీ యింటినించి ఆ యింటికి మారగానే మీ శాశ్వత బ్రహ్మచర్యజ్యోతి కాస్తా గాలికొట్టి ఆరిపోతుందా?

పూర్ణ: యీ యిల్లు మాకు పనికిరానిదిగా తోచటంలేదు.

అక్షయ్: పనికిరానిది కాకపోవొచ్చు. కాని యింతకంటె మంచి యిల్లు నగరంలో దొరకటం కష్టంకాదుగా!

పూర్ణ: విలాసాలమీదికి మనస్సును పోనీయకుండా కొంచెం కష్టసహిష్ణుతను అలవాటు చేసుకోవటం మంచిది.

శ్రీశ్: దాన్ని సమితి సమావేశాల్లోకాక, వెలుపల చేసుకోవచ్చు.

విపిన్: వొక పనిలో ప్రవృత్తులంకాగానే కొంత కష్టాన్ని సహించాల్సిన అవసరం వొస్తుంది. అకారణంగా బలాన్ని వృధాచేసుకోవటం మూర్ఖత్వం.

అక్షయ్: మిత్రులారా! నా సలహా వినండి. సమితి గృహంలోవున్న అంధకారంతో, శాశ్వత బ్రహ్మచర్యపు అంధకారాన్ని యెక్కువచెయ్యకండి. వెలుతురు, గాలి స్త్రీజాతీయాలు కావు. కనక సమితిలోకి ఆ రెండింటినీ తీసుకురావటానికి అభ్యం

తరం చెప్పకండి. అదీకాక బాగా ఆలోచించిచూడండి. యీ ప్రదేశం చాలా సంపమైనది. మీ దీక్ష దీనికి అనువయినది కాదు. గాలి పోగుచేస్తే చెయ్యండి. కాని గాలినిగురించి మాట్లాడొద్దు. అది మీ ప్రతిజ్ఞలో భాగంకాదు. యేమంటావ్ శ్రీశ్ ? విపిన్‌బాబు వుద్దేశం యేమిటి ?

శ్రీశ్, విపిన్ : సరైన మాట. యిల్లోసారి చూసొస్తే సరి.

[పూర్ణ చిన్నబుచ్చుకుని, మాట్లాడకూరుకూంటాడు. పక్కగదిలోకూడా తాళాలు ఢన్‌మన్నా యొకసారి కాని అతి అప్రసన్నంగా.. ]

అక్షయ్ : చంద్రబాబూ ! యిప్పుడే రారాదూ ! చూపించొస్తాను.

చంద్ర : పదండి.

[చంద్రబాబు, అక్షయ్ వెళ్ళిపోతారు]

విపిన్ : చూడు పూర్ణబాబూ ! నిజం చెబుతున్నా. నీకు బ్రహ్మచారి సమితి ఫ్రాంటియర్ పాలసీలో మేము 'పరదా' పద్ధతిని ఆమోదించం. అందులోనించే శత్రువు ప్రవేశించే మార్గం.

పూర్ణ : అంటే యేమిటో ?

విపిన్ : పర్దాలా యెగిరిపోయే వస్తువు కాస్త గాలికల్లా అటూఇటూ కదిలిపోతుంది. బ్రహ్మచారి సమితికి అది యోగ్యంకాదు.

శ్రీశ్ : యిక్కడి పరిహద్దుల్ని కాపాడటానికి గట్టి యిటికగోడలాంటి అచలమైనది కావాలి. ఆ పర్దా వుండటం బావుండలేదు.

పూర్ణ : మీ మాటల్లో యేదో రహస్యం ధ్వనిస్తోంది.

విపిన్ : ఆ మాట నిజం. రహస్యమైన పదార్థమే సర్వనాశనానికి దారితీస్తుంది. బ్రహ్మచారి సమితి కన్నిటికంటె ప్రబలశత్రు వేదైతేవుందో దానికి పరదాలమధ్యనే నివాసం.

శ్రీశ్ : పరదాను ఆక్రమించటం, దాన్ని చించిపారెయ్యటం మా దీక్ష. పరదా నీడలో తిరిగే మాయామృగి -- వెలుతురు పడగానే — మరీచికలా మాయమైపోతుంది.

పూర్ణ : శ్రీశ్‌బాబూ ! మరీచిక మాయమైపోవచ్చు. కాని తృష్ణమాత్రం మాయంకాదు.

శ్రీశ్ : యెందుకవాలి ? అది వుండాల్సిందే. తృష్ణ లేకపోతే జీవయాత్ర సాగటమెలా ? అయితే ఆ యాత్ర యేమార్గాన సాగితే ఫలితం దక్కుతుందనేదే తెలుసుకోవటం అవసరం.

[నేపథ్యంలో—]

ఎవ్వరావలి దరికి చేరదలచినవారో
రారండు . . . .

విపిన్ : కొంచెం మెల్లిగా, పాట వినపడటంలా. దివ్యమయిన పాట నిజంగా.

పూర్ణ : ఆ పాటమాత్రం పరదా కాదూ. దానిచాటున యే రహస్యం నక్కివుందో! దానికికూడా దారులవెంట పుంతలవెంట యాత్ర సాగించే నేర్పువుంది.

విపిన్ : ఆగు సోదరా! తత్త్వవిషయాన్ని ప్రస్తుతానికి కట్టిపెట్టు. కొంచెం వినవోయ్. చాలా దగ్గిరయింట్లోవించే పాట వినవస్తోంది. అక్షయబాబు యిల్లు అక్కడే అని వినికిడి.

శ్రీశ్ : పాటలోని మాటలు స్పష్టంగా విన్పిస్తున్నాయి.

[నేపథ్యంలో పాట]

ఎవ్వరావలి దరికి చేరదలచినవారో
రారండు వేగమే రండు రారండోయి!
వేచియుంటిని నదీతీరాన నావతో.
ఆవలి తీరాన
ఎన్నెన్ని యుపవనా లెన్నియాటలుపాట లెందరెందరు ప్రజలు
ఈవలి తీరాన
జలశూన్యవాలుకామయ శుష్కమరుభూమి.
ఎంత తీరికయున్నదో చూడుడీవేళ!
నేడేల వృథసేయ? రేపు వగవగనేల?
రాదలంచినవారు రండు రారండోయి!
అస్తాచలము డాయనాయె దినకరుడు
మందమందములాయె మలయపవనములు
చీకటులు క్రమ్మెనా పడవ నడుపగరాదు
రాదలంచినవారు రండు వేవేగ!

శ్రీశ్ : పాటచూస్తే బ్రహ్మచారి సమితిని భయపెట్టటానికేలాగా వుంది. నావ బండ్ అయిపోతే కష్టం.

విపిన్ : అదుగో వినపడటంలా.........

పూర్ణ: అయితే యింక ఆలస్యమెందుకు? ఆవలివొడ్డుకి చేరుకోటానికి యేర్పాటు చెయ్యి.

శ్రీశ్ : ఆ గొంతునిబట్టే తెలుస్తోంది. అవతలి వొడ్డుకు తీసుకెళ్లరు. అగాధంలో ముంచేస్తారు...

## దృశ్యం ౨

## శ్రీశ్ యిల్లు

[శ్రీశ్ తన యింట్లో దక్షిణపువైపు వరండాలో 'పెద్దచేతులున్న పడక కుర్చీలో కాళ్లు బారజాపుకుని సిగరెట్ కాల్చుకుంటూ కూర్చునివుంటాడు— వొక శుక్లపక్షపు సాయంత్రంవేళ. పక్కన టీపాయ్‌మీద వొక ప్లేట్‌లో ఐస్ వేసిన లెమనెడ్ గ్లాసు, కుప్పగా పెట్టిన మల్లెపూలదండ వుంటాయి... విపిన్ ప్రవేశిస్తాడు]

విపిన్ : యేమండీ! పరివ్రాజకాచార్యులవారూ!

శ్రీశ్ : (లేచి కూర్చుని, బిగ్గరగా నవ్వి) యింకా ఆ తగాదా మరిచిపోలేదులా వుంది సరేకాని సోదరా! శిశుపాలకా! నువ్వు నేను సన్యాసిని కాలేనని నిజంగా అనుకుంటున్నావా?

విపిన్ : యెందుకు కాలేవు? కాని వెనకాల బరువుమోసే శిష్యులు చాలామంది వుండాలి.

శ్రీశ్ : అంటే దాని తాత్పర్యం యిదీ—యెవరైనా నాకు మల్లెపూలదండలు కట్టియిస్తూ వుండాలి, యెవరైనా బజారునించి లెమనెడ్, ఐస్ భిక్షతెచ్చిపెట్టేవాళ్లుండాలి— అంతేగా! దానివల్ల నష్టమేముంది? మల్లెపూలదండలమీదా, లెమనెడ్‌మీదా విరక్తిగావుండే సన్యాసధర్మమే చాలా ఉన్నతస్థాయి సన్యాసమా?

విపిన్ : సామాన్య పరిభాషలో సన్యాసధర్మమంటే అదేనని అనిపిస్తుంది.

శ్రీశ్ : యిదుగో చూడు —యేమనుకుంటున్నావ్ నువ్వు? భాషలో వొక మాటకు పరొక అర్థంవుండదనా? సన్యాసి అన్న మాటకు వొకరికి వొక అర్థమయితే -- మరొకరికి కూడా అదే అర్థమవాలా? అలా అయితే యిహ మనస్సు అనే స్వతంత్ర పదార్థ మంటూ యెందుకు?

విపిన్ : సన్యాసి అన్న పదానికి నీ మనస్సులోవున్న అర్థం యేమిటో వినాలని కుతూహలంగా వుంది.

శ్రీశ్ : నే ననుకునే సన్యాసిరూపం యిది — మెళ్ళో పూలదండ, వొంటినిండా చందనం, చెవులకు కుండలాలు, ముఖంలో చిరునవ్వు. నా సన్యాసి చెయ్యాల్సిన పని — మనుషుల మనస్సులను ఆకర్షించటం. చక్కని ముఖం, తియ్యని కంఠం, మాట నేర్పు—యివన్నీ లేకపోతే సన్యాసి అయినందువల్ల ఆశించిన ఫలితం లభించదు. అభిరుచి, బుద్ధి, కార్యకుశలత, ప్రసన్నత—అన్ని విషయాల్లోనూ నా సన్యాసి సంప్రదాయాలు గృహస్థులకు ఆదర్శప్రాయాలు కావాలి.

విపిన్ : అంటే వొక కార్తికేయులదళాన్ని మయూరాలమీద యెక్కించి వీధులవెంట బయల్దేరదీయా లన్నమాట !

శ్రీశ్ : మయూరాలు లేకపోతే ట్రాములున్నాయి. కాలినడకయినా నాకేం అభ్యంతరం లేదు. బ్రహ్మచారుల సమితి అంటేనే కార్తికేయుల సమితి. కాని కార్తికేయుడు కేవలం సుపురుషుడు మాత్రమే కాదే. అతడు స్వర్గ సేనాధిపతికూడాను.

విపిన్ : యుద్ధంచెయ్యటానికి మాత్రం రెండేచేతు లతడికి. కాని మాట్లాడటానికి మాత్రం మూడుజతల ముఖాలు.

శ్రీశ్ : దీన్నిబట్టి మన తాతముత్తాతలు —బాహుబలంకంటె వాక్యబలానికి మూడు రెట్లు యెక్కువ ప్రాధాన్యం యిచ్చారని వ్యక్తమవుతూంది. వస్తాదును వీరత్వానికి ఆదర్శంగా నేనూ అంగీకరించను.

విపిన్ : యీ మాట బహుశా నన్నుగురించి అయివుంటుంది.

శ్రీశ్ : అదుగో చూడు. మనిషిని అహంకారం యెలా పాడుచేస్తుందో. వస్తాదు అంటే నిన్నేనని నువ్వు రూఢిచేసుకున్నావు. నువ్వు కలియుగ భీమసేనుడివి. సరే, రా. 'యుద్ధం దేహి' వొకసారి వీరత్వపరీక్షకూడా తేలిపోతుంది.

[అని రెండుచేతుల్నీ కాసేపు తమాషాకి సారించటం మొదలెడతాడు. విపిన్ హఠాత్తుగా 'యిహ భీమసేనుడు పతనమైనాడు' అంటూ ధపీమని శ్రీశ్ పడకకుర్చీ ఆక్రమించుకుని దానిమీద కాళ్ళురెండూ యెత్తి పెట్టుకుంటాడు. 'అబ్బ ! దుస్సహమైన దాహం' అంటూ లెమనేడ్ గ్లాసు వొక్కగుక్కలో ఖాళీచేస్తాడు. అప్పుడు శ్రీశ్ చటుక్కున మల్లె పూలదండ తీసేసుకుని 'కాని విజయమాల మాత్రం నాదే' అంటూ తల మీద పెట్టుకుని, అక్కడ వేసివున్న 'మోడా' మీద చతికిలబడతాడు]

శ్రీశ్ : అవునుగాని సోదరా ! నిజం చెప్పు, కొంతమంది శిక్షితులయిన యువకులు— యిలా సంసారాన్ని పరిత్యజించి, చక్కనివేషంతో, ప్రసన్న ప్రఫుల్లముఖాలతో

పాటలతో, ఉపన్యాసాలతో, భారతదేశం నలువైపులా ఉపదేశాన్ని ప్రచారంచేస్తూ పర్యటిస్తే దానివల్ల ఉపకారం వుంటుందా? వుండదా?

విపిన్ : ఐడియా మాత్రం బాగానే వుంది.

శ్రీశ్ : అంటే వినటానికి బావుంది—కాని ఆచరణ అసాధ్యం అనా? నేను చెబుతున్నాను. అసాధ్యం కాదు. నేను దృష్టాంతాలతో నిరూపిస్తాను. భారతదేశంలో సన్యాసధర్మమనే వొక ప్రచండమైన శక్తివుంది. ఆ సాధువుల వొంటిమీది బూడిద దులిపేసి, చేతి జోలెలు లాగేసి, వాళ్ల జడలు కత్తిరించేసి, వాళ్లని సుందరాకారుల్నిగా చేసి కర్మనిష్ఠాప్రతిష్ఠుతుల్ని చేయటమే బ్రహ్మచారి సమితి ఏకైక లక్ష్యం. పిల్లలకి చదువుచెప్పటానికి, అగ్గిపుల్లలు తయారుచేయటానికీ కాదు మన లాంటి వాళ్లందరూ శాశ్వత బ్రహ్మచర్యదీక్ష నవలంబించింది! చెప్పు విపిన్! నువ్వు నా అభిప్రాయంతో ఏకీభవిస్తావా? లేదా?

విపిన్ : నీ సన్యాసికి యెలాంటి రూపం, వేషభాషలు, హంగులు అవసరమో—అలాంటివి నాకేమీ లేవు. అయితే—ఏకీభవించి బరువుమోయటానికి నీవెంట రావటానికి మాత్రం తయారు. చెవులకు కుండలాలు—లేదా కనీసం కళ్ళకు బంగారు ఫ్రేం కళ్లద్దాలు వేసుకుని, నువ్వు యెక్కడెక్కడ తిరిగినా, వెంట వొక కావలాదారుండటం అవసరం. ఆ పని నావల్ల కొంతవరకు నెరవేరుతుంది.

శ్రీశ్ : మళ్లీ వేళాకోళం మొదలెట్టావ్.

విపిన్ : కాదోయ్! వేళాకోళం కాదు, నిజం చెబుతున్నా. నీ ఆశయాన్ని ఆచరణలో పెట్టగలిగితే చాలా మేలే జరుగుతుంది. అయితే యిలాంటి సంప్రదాయంలో అందరి పనీ వొకటే కాజాలదు. యెవరికెంత సహజమైన శక్తిసామర్థ్యాలుంటాయో—వాటికనుగుణంగా అంతవరకే వాళ్ళు రాగలుగుతారు.

శ్రీశ్ : ఆ మాట నిజమే. కేవలం వొక్క విషయంలోమాత్రం మనం దృఢసంకల్పులం కావాలి. స్త్రీజాతితో మనం యెలాంటి సంపర్కాన్నీ పెట్టుకోకూడదు.

విపిన్ : పూలు, చందనం, అంగద–కుండలాలు అన్నీ వుంచుకోదలిచినప్పుడు—కేవలం ఆవొక్క విషయంలోమాత్రం యెందుకూ పట్టింపు?

శ్రీశ్ : వీటినన్నిటినీ వుంచుకుంటున్నాం కనకనే అదొక్క పట్టింపూ. చైతన్యుడిందుకే తన అనుచరులను స్త్రీల సంపర్కానికి దూరంగా వుండమని కఠినంగా ఆదేశించింది! ఆయన ధర్మం—అనురాగం—సౌందర్య ధర్మాలు. అందుచేతనే వారికి ప్రలోభావకాశాలు యెన్నో వుంటాయి.

విపిన్ : అలా అయితే భయంకూడా పడాల్సిందే.

శ్రీశ్ : నాగురించిమాత్రం లవలేశంకూడా భయంలేదు. నేను నా మనస్సును ప్రపంచంలోవున్న విచిత్రసౌందర్యమం దంతటిలోనూ లీనంచేసుకోగలన్ను. నన్ను పట్టుకుని యేదో వలలో పడెయ్యటం యెవరికి సాధ్యం? కాని మీరు రాత్రింబవళ్ళు ఫుట్‌బాల్, క్రికెట్, టెన్నిస్‌లలో మునిగితేలుతూంటారు. మీరొకసారి బిళ్లంకోడు ఆడితే యెముకలు విరిగి పడిపోతారు.

విపిన్ : సరే. సమయం వొచ్చినప్పుడు చూద్దాంలే.

శ్రీశ్ : ఆ మాట సరికాదు. సమయమనేది రాదు. సమయాన్ని రానివ్వను. సమయమనేది రథమెక్కి రాదు—మనం దాన్ని బుజాలమీదెక్కించుకుని తీసుకొస్తాం. నువ్వు యేదో సమయమన్నావ్—అది వాహనం లేకపోవటంవల్ల వెనక్కి తిరిగి పోవాల్సిందే.

[పూర్ణబాబు ప్రవేశిస్తాడు]

ఉభయులు : రండి పూర్ణబాబూ!

[విపిన్ అతడికి కుర్చీవదలి తాను కుర్చీపీట తెచ్చుకుని
వేసుకు కూచుంటాడు]

పూర్ణ : మీయీ వరండాలో వెన్నెల చక్కగా పడింది. మధ్యమధ్య స్తంభాలనీడలు వ్యాపించి మరీ బాగుంది.

శ్రీశ్ : వరండాలో వెన్నెల చక్కగా పడేట్లుచేసుకోవటం మొదలైన కొన్ని అత్యాశ్చర్యకరమైన శక్తులు నాకు పుట్టుకముందునించే వున్నాయి. కాని చూడు పూర్ణబాబూ! ఆ అగ్గిపుల్లలూ అవీ చేసే పనులు నాకు నచ్చలేదు.

పూర్ణ : (పూలదండకేసి చూసి) సన్యాసధర్మంమీద నీకు అసాధారణమైన అధికారం వున్నట్లుందే!

శ్రీశ్ : ఆ ప్రసక్తే జరుగుతోంది. మీరు దేన్ని సన్యాసధర్మం అంటారు?

పూర్ణ : చాకలి, మంగలి, దర్జీల సహాయాన్ని అపేక్షించని ధర్మాన్ని. సాలెల్ని సాంతం నిర్లక్ష్యం చెయ్యొచ్చు. పియర్సు సోప్ ప్రకటనని కన్నెత్తి చూడనక్కర్లేదు——

శ్రీశ్ : అరె! ఛా! ఆ సన్యాసధర్మం యెప్పుడో ముసలిదై చచ్చిపోయింది. యిప్పుడు నవీన సన్యాసుల సంప్రదాయం అంటూ వొకదాన్ని నెలకొల్పాలి.

పూర్ణ : విద్యాసుందర నాటకంలోని 'నవీన సన్యాసి ' సరియైన ఉదాహరణం కాకపోదు. కాని అతడు బ్రహ్మచారి సమితి నియమాలప్రకారం నడుచుకోలేదు.

శ్రీశ్ : నడుచుకున్నట్లయితే అతడే సరియైన దృష్టాంతం అయేవాడు—వేషంలో, రూపంలో, మాటలో, ఆచరణలో సుందరుడు సునిపుణుడు అయితీరాలి.

పూర్ణ : కేవలం రాజకన్యవైపునించి మాత్రం దృష్టి మరల్చుకోవాలి. అంతేగా ? దారం లేని దండని గ్రుచ్చాలి. కాని ఆ దండను వెయ్యటం యెవరి మెడలో ?

శ్రీశ్ : స్వదేశం మెడలో. యీ మాట కాస్త పైస్థాయికి వెళ్ళింది. యేం చెయ్యను చెప్పు. *మాలిని, రాజకుమారి పూర్తిగా పనికిరారు. కాని వేళాకోళం కాదు పూర్ణబాబూ !

పూర్ణ : వేళాకోళంగా తోచటమే లేదు. చాలా ఖండితమైన మాట. ఫెళఫెళలాడు తున్నట్లుంటే !

శ్రీశ్ : మన బ్రహ్మచారి సమితినించి వొక సన్యాస సంప్రదాయాన్ని నెలకొల్పాలి. వారు అభిరుచిలో, శిక్షణలో, కార్యాచరణలో గృహస్థులందరికీ ఆదర్శపాత్రులు కావాలి. వారు సంగీతం మొదలైన లలితకళలలో అద్వితీయులు కావాలి. మళ్ళీ కర్రసాములో, కత్తిసాములో, గుర్రపుస్వారిలో తుపాకి పట్టటంలోనూ అసమానులు కావాలి—

పూర్ణ : అంటే మనస్సును హరించటం—ప్రాణాన్ని హరించటం రెండింటిలోనూ గట్టి వాళ్ళు కావాలి. మగ †దేవీచౌధురాణీల దళం అని చెప్పు.

శ్రీశ్ : బంకింబాబు నా ఐడియాని ముందుగానే కాపీకొట్టేశారు. కాని, దాన్ని ఆచరణలో పెట్టి సొంతం చేసుకోవాలి.

పూర్ణ : పభాపతిగారేమంటారు ?

శ్రీశ్ : ఆయనకు కొన్నాళ్ళు నచ్చజెప్పి చెప్పి, ఆయన్ని మనవర్గంలోకి లాక్కున్నాను. కాని ఆయన తన అగ్గిపుల్లల వ్యవహారం విడిచిపెట్టలేదు. 'సన్యాసులు కృషి తత్వాన్నీ, వస్తుతత్వాల్నీ మొదలైనవి నేర్చుకుని, వూరూరూ తిరిగి రైతులకు నేర్పాలి. వొక్కొక్క రూపాయి వాటాలతో బ్యాంకి నెలకొల్పాలి. పెద్దపెద్ద

---

* భారత్ చంద్రరాయ్ రచించిన 'విద్యాసుందర్ ' అనే సుప్రసిద్ధ కావ్యంలోని పాత్రల పేర్లు. యతీంద్రమోహన్ ఠాకూర్ యీ కావ్యాన్ని నాటకరూపంగా రచించారు.

† బంకించంద్ర చట్టోపాధ్యాయ రచించిన నవల 'దేవీచౌధురాణి.' ఆ నవలలోని నాయిక దేవీ చౌధురాణి వీరనారీమణి.

గ్రామాల్లో కొత్తపద్ధతిని వొక్కొక్క దుకాణం పెట్టాలి. భారతదేశంలో నలు వైపులా వాణిజ్యాన్ని విస్తరింపజెయ్యాలి'—అంటూ ఆయన వుర్విళ్లూరిపోతున్నారు.

పూర్ణ: విపిన్‌బాబు వుద్దేశం యేమిటి?

విపిన్: నేను శ్రీశ్ నవీన సన్యాసి సంప్రదాయానికి ఆదర్శపురుషుణ్ణి అని అనుకోను. అయినాగాని, దళాన్ని కనక నిర్మించేట్లయితే—నేనుకూడా సన్యాసి కావటానికి అంగీకరిస్తాను.

పూర్ణ: కాని సన్యాసి కావటానికి చాలా ఖర్చుయేట్లుందండీ. కేవలం కౌపీనం వొక్కటే కాదుగా! కేయూర, కుండలాలూ, ఆభరణాలూ, అత్తరువులూ.

శ్రీశ్: పూర్ణబాబూ! వేళాకోళం చెయ్యి, యేమయినా చెయ్యి—బ్రహ్మచారి సమితి సన్యాసుల సమితి అయితీరుతుంది. మేము వొకవైపున కష్టసాధ్యమయిన ఆత్మ త్యాగాన్నీ చేస్తాం; మరొకవైపున మనిషికి కావలసిన ఉపకరణాలనూ దూరంచేసు కోము. మేము కఠినమైన శౌర్యాన్నీ లలితమైన సౌందర్యాన్నీ రెండింటినీ సమా నాదరంతో వరిస్తాం. ఊహాతీతమైన ఆ సాధనతో భారతదేశంలో నవయుగం ఆవిర్భవిస్తుంది...

పూర్ణ: అర్థమయింది శ్రీశ్‌బాబూ; కాని స్త్రీ మానవుడి కతిముఖ్యమైన ఉపకరణాల లెక్కలోకి రాదా! మరి స్త్రీని ఉపేక్షిస్తే లలితసౌందర్యంపట్ల సమానమైన ఆదరణ చూపినట్లవుతుందా? దానికేం వుపాయం చూశారు?

శ్రీశ్: స్త్రీలోవున్న దోషం—పురుషజాతిని లతలాగా అల్లుకుని వశంచేసుకోటం. స్త్రీవల్ల ఆ భయం కనక లేకపోతే—ఆమెతో వుంటూకూడా స్వాతంత్ర్యాన్ని గనక కాపాడుకోగలిగితే—అప్పుడిహ చెప్పాలిసిందేమీలేదు. కార్యసాధనకు జీవితాన్ని అంకితం చేయాలిసొచ్చినప్పుడు—కార్యసాధనకు గల అవరోధాలనన్ని టినీ దూరంచేసుకోవాలి. పాణిగ్రహణం చేసుకునేట్లయితే—తవ పాణినికూడా కట్టేసుకోవాలిసొస్తుంది. అలా జరగటానికి వీల్లేదు పూర్ణబాబూ!

పూర్ణ: ఆత్రపడకు. నేను నా వివాహానికి మిమ్మల్ని ఆహ్వానించటానికని రాలేదు. కాని ఆలోచించి చూడు. మళ్లీ మనుష్యజన్మ యెత్తుతామో లేదో సందేహం. కాని హృదయాన్ని జీవితాంతంవరకూ తన దప్పితీర్చే జలాన్నించి దూరంచేస్తున్నాం గదా! ఆ లోటును భర్తీచెయ్యటానికి యెక్కడయినా యేదయినా దొరుకుతుందా? ముసల్మానుల స్వర్గంలో 'హూరీ' లుంటారు. హిందువుల స్వర్గంలోకూడా అప్స రసలకు కొదవలేదు. బ్రహ్మచారుల స్వర్గంలో—సభాపతి, సభ్యమహాశయుల కంటె మనోహరమయిన దేదైనా లభిస్తుందా?

శ్రీశ్ : పూర్ణబాబూ! యేమిటి నువ్వనేది? నువ్వు—

పూర్ణ : భయంలేదు సోదరా! యింకా చావుదాకా రాలేదులే. నీయీ వరండానిండా వెన్నెలా, యీ పూలపరిమళం—బ్రహ్మచారుల దీక్షను కాపాడుకోటానికి సాయ పడేందుకేనా సృష్టించింది? మనస్సులో మధ్యమధ్య గూడుకట్టే ఆవిరిని పైకి వదిలేయటమే మంచిదమకుంటా. దాన్ని అణిచిపెట్టి తన్నుతాను మరిచిపోతే యెప్పుడో వోరోజున బ్రహ్మచారి సమితి బాయిలర్ కాస్తా బ్రద్దలైపోతుంది. యేమయినా కానియ్ సన్యాసి కావటానికే నిర్ణయించుకుంటే—నేనుకూడా కలుస్తాను. కాని ప్రస్తుతం సమితిని కాపాడుకోవాలి.

శ్రీశ్ : యేం? యేమయింది?

పూర్ణ : అక్షయబాబు మన సమితిని మరోచోటికి మార్చటానికి యేర్పాట్లు చెయ్యటం నాకేం బావుండలేదు.

శ్రీశ్ : సందేహమనే పదార్థం—నాస్తికత్వానికి ఛాయ—బలహీనమవుతుంది. పాడై పోతుంది. సొంతం రూపుమాసిపోతుంది. యిలాంటి ఆలోచనలను యేనాడూ నేను నా మనస్సులోకి రానీయను. మేలే జరుగుతుంది. జరుగుతున్నదంతా మంచికే. బ్రహ్మచారి సమితి ఉజ్జ్వలభవిష్యత్తు నాకు కళ్లకు కట్టినట్లు కన్పిస్తోంది. అక్షయబాబు యీ సమితిని వొక యింటినించి మరోయింటికి మార్పిస్తే దానికేం అనిష్టాన్ని తెచ్చిపెట్టగలడు? కేవలం యీ వీధిలో యింటినించి మరోయింటికి మార్చటం కాదు. మనం యింటింటికీ వీధివీధికీ పర్యటిస్తూ తిరగాలి. భయసందేహో ద్వేగాలను మనసులోంచి దూరంచేసుకో పూర్ణబాబూ! విశ్వాసం ఆనందం లేక పోతే యే మహాకార్యమూ జరగదు.

విపిన్ : అవును. కొన్నాళ్లపాటు చూద్దాం. వోవేళ యేదయినా అసౌకర్యానికి కారణం కన్పిస్తే అప్పుడు స్వస్థానానికి తిరిగి వొచ్చేయొచ్చు. మన అంధకార గహ్వరాన్ని—యెవరూ వొచ్చి లాక్కుపోరు.

[హఠాత్తుగా చంద్రబాబు ఆదరా బాదరా ప్రవేశిస్తాడు.
ముగ్గురు సభ్యులూ సగౌరవంగా లేచి నిలబడతారు]

చంద్ర : చూడు. నేనా సంగతి ఆలోచించాను.

శ్రీశ్ : కూర్చోండి.

చంద్ర : అహఁహఁ. కూర్చోను. వెళుతున్నా నేను. సన్యాసదీక్షకోసం మనం యిప్పట్నించీ సంసిద్ధులమై వుండాలంటున్నాను. హఠాత్తుగా యేదైనా ప్రమాదం జరిగినా—లేదా మామూలు జ్వరమే వచ్చినా యేం చికిత్స చెయ్యాలో దానికి మనం

శిక్షణ పొందాలి. డాక్టర్ రామ్‌రతన్‌బాబు ఆదివారాల్లో ఫ్రీ. మనకు రెండు గంటలు ఉపన్యాసాలివ్వటానికి యేర్పాటుచేసొచ్చాను.

శ్రీశ్ : కాని దానివల్ల చాలా ఆలస్యం జరగదూ ?

చంద్ర : ఆలస్యం అనేది జరగక తప్పదు. ఆ పని అంత సులభమైనదికాదు. కేవలం అదేకాదు. మనం కొంచెం కొంచెం 'లా' చదవటంకూడా అవసరం. అన్యాయాలనుంచి, అత్యాచారాలనుంచి కాపాడటం—యెవరికి యెంతవరకూ హక్కులవీ వుంటాయో రైతులకీ వాళ్లకీ తెలియజెప్పటం మన కర్తవ్యం.

శ్రీశ్ : కూర్చోండి—

చంద్ర : అహఁ. శ్రీశ్‌బాబూ కూర్చోను. నాకొంచెం పనుంది. యింకోటికూడా చెయ్యాలి మనం—యెడ్లబళ్లు, వడ్ల తిరగళ్లు, నేతమగ్గాలు మొదలైన అత్యావశ్యకమైన దేశీయ సాధనసామగ్రిలో కొన్ని మార్పులుచేసి వాటిని చౌకగా గిట్టుబాటయేట్లు, యెక్కువకాలం పనిచేసేట్లు, గట్టిగా వుండేట్లు చెయ్యటానికి తగిన ప్రయత్నాలుకూడా చెయ్యాలి మనం. ఈసారి వేసవి సెలవుల్లో కేదారబాబుగారి కార్ఖానాకెళ్ళి, రోజూ మనం కొన్నిటిని పరిశీలిస్తూవుండాలి.

శ్రీశ్ : చంద్రబాబూ, చాలాసేపట్నించీ నించునే వున్నారు—

[కుర్చీ ముందుకు తోస్తాడు]

చంద్ర : వొద్దొద్దు. నేనిప్పుడే వెళిపోతున్నా. చూడు. నా అభిప్రాయం యిది—గ్రామాల్లో సర్వసాధారణంగా వుపయోగపడే యీ వస్తువులను కొంత మెరుగు పరచగలిగామంటే—దానిమూలంగా రైతుల హృదయాల్లో యెంత వుత్తేజం కలుగుతుందని ! పెద్దపెద్ద సంస్కరణలవల్లకూడా అంత వుత్తేజం కలగదు. వారు అనాదినించీ వుపయోగిస్తున్న యీ తిరగళ్ల నాగళ్లలో కొంచెం మార్పులు తీసుకురాగలిగామంటే వాళ్ల హృదయాల్లో యెంతో చైతన్యం రేకెత్తుతుంది. ప్రపంచం వొకచోటే నిలిచిపోలేదన్న సంగతి వారు గ్రహించగలుగుతారు.

శ్రీశ్ : చంద్రబాబూ ! కూర్చోరన్నమాటేనా ?

చంద్ర : అహఁ. వొద్దు. వొకసారి ఆలోచించిచూడు. మనం యింతకాలంనించు పొందుతూవొచ్చిన శిక్షణవుందే—అది తిరగళ్ల నాగళ్లదగ్గర్నించి తెలుసుకోటం మొదలెడితే వుచితంగా వుండేది. పెద్దపెద్ద యంత్రాగారాల సంగతి అలా దూరంగా వుంచండి. మన దృష్టి యిళ్లలోనే పడలేదు సరిగా. మనచేతికిందే వున్నవాటి వేపైనా మనం బాగా చూడలేదు. వాటినిగురించి ఆలోచించనూలేదు. యెలా

వున్నవి అలాగే వుండిపోయాయి. మానవుడు ముందుకుపోతున్నాడు. అతడి వస్తు సామగ్రి వెనకబడేవుంది. అలా యెన్నటికీ జరగటానికి వీల్లేదు. మనం పతితులమైవున్నాం. యింగ్లీషు మనల్ని బుజానవేసుకుని లాక్కుపోతోంది. దీన్ని ముందుకు వెళ్లట మనలేం. మన సామాన్య గ్రామీణజీవనయాత్ర పల్లెసీమ బురద దారులమధ్య యిరుక్కుపోయివుంది. మన సన్యాస సంప్రదాయం ఆ యెద్దుబండి చక్రాల్ని బురదలోంచి పైకి లాగాలి. యంత్రవాహనాలకు చోదకులం కావాలన్న దురాశ యిప్పుడు వొద్దు. టైమెంతయింది? శ్రీశ్‌బాబూ!

శ్రీశ్: యెనిమిదిన్నరయింది.

చంద్ర: అయితే యిహ నే వెళతాను. కాని యీ మాటమాత్రం ఖాయం. మనం యింక తక్కిన ఆలోచనలన్నీ కట్టిపెట్టి, నియమంగా శిక్షణకార్యక్రమంలో మునిగిపోవాలి.

పూర్ణ: మీరు కనక కాసేపు కూర్చుంటే చంద్రబాబూ! మీతో వొకటి రెండు చెప్పాలి సినవున్నాయి.

చంద్ర: అహఁ. యివాళిహ తీరికలేదు.

పూర్ణ: యెక్కువేమీ అక్కర్లేదు. నేననేదేమిటంటే—మన సమితి—

చంద్ర: ఆ సంగతి రేపు మాట్లాడుకుందాం పూర్ణబాబు—

పూర్ణ: కాని రేపేగా సభ జరగబోతోంది!

చంద్ర: సరే. అయితే యెల్లుండి. నాకు టైంలేదు.

పూర్ణ: చూడండి. అక్షయబాబు—

చంద్ర: పూర్ణబాబు! క్షమించాలి నన్ను. యివాళ ఆలస్యమయిపోయింది. కాని చూడు నాకో ఆలోచన తోస్తోంది—వొకవేళ బ్రహ్మచారి సమితి క్రమంగా విస్తృతమయేట్లయితే—అప్పుడు మన సభ్యులందరూ సన్యాసులై పర్యటించలేరు గనక—యిందులో రెండు విభాగాలుండటం అవసరమవుతుంది.

పూర్ణ: స్థావరవిభాగం—జంగమ విభాగమూనా!

చంద్ర: యే పేర్లయినా పెట్టు. అదీకాక, ఆనాడు అక్షయబాబు అన్నాడు చూడు—అదీ యేమంత అసంగతంగా లేదు. బ్రహ్మచారి సమితితోపాటు దానికి అనుబంధంగా మరో సమితి—వివాహితులయినవారిని, వివాహం చేసుకుందామనుకునే వారిని చేర్చుకోడానికి వీలుగావుంటే బావుంటుందని అన్నా డక్షయబాబు. గృహస్థు

అయినవారికూడా దేశాన్నిగురించి చేయాల్సిందుంది. అందరూకూడా తమ సాధ్యాసాధ్యాల కనుగుణంగా యేదో ప్రయోజనకరమైన పనిలో నిమగ్నులయి వుండాలి — యిది సామాన్యమయిన దీక్ష. మనలో కొందరు వొక జట్టుగా బ్రహ్మ చర్యదీక్ష వహించి, దేశదేశాలూ పర్యటిస్తారు. మరోజట్టు బ్రహ్మచర్యదీక్ష వహించి, వొక్కచోటనే స్థిరంగా కూర్చుని పనిచెయ్యటం ఆరంభిస్తారు. యింకో గృహస్థుల జట్టు తమ అభిరుచులకు తగినట్లు—తమతమ శక్త్యనుసారం యేదో వొక ప్రయోజనకరమైన పని పెట్టుకుని దేశంకోసం తమ కర్తవ్యాన్ని నిర్వర్తించు కుంటారు. పర్యటనకు అంగీకరించి ఉపక్రమించేవారు—మ్యాప్‌లు సిద్ధంచేసు కోవటం—భూమి సర్వే చెయ్యటం—భూతత్వ విద్య (Geology), వృక్షశాస్త్రం (Botany), జంతుశాస్త్రం (Zoology) మొదలైనవి నేర్చుకోవాలి. వారు యేయే దేశాల కెళితే, ఆయా దేశాల్లోని వాస్తవికాంశాల నన్నిటినీ తరచి తరచి సేక రిస్తారు. అలా అయితేనే భారతదేశీయులద్వారా భారతదేశపు యదార్థ వివరణ లను గ్రథనం చేయటానికి పునాదులు యేర్పడతాయి—హంటర్ దొరగారిమీద ఆధారపడి గడపాల్సిన అవసరం వుండదు.

పూర్ణ : చంద్రబాబూ ! మీరు కనక కూర్చుంటే—వొక్కమాట.

చంద్ర : అహఁ. నేను చెప్పేదేమిటంటే—యెక్కడికెక్కడి కయితే వెళతామో అక్కడక్కడ చారిత్రకమైన జనశ్రుతులను, ప్రాచీన గ్రంథాలను సేకరించటం మన కర్తవ్యం. శిలాశాసనాలను, తామ్రశాసనాలనుకూడా పరిశోధించాలి. అందుకని ప్రాచీన లిపి పరిచయాన్నికూడా మనం కొన్నాళ్ళు అభ్యసించటం అవసరం.

పూర్ణ : అవన్నీ తర్వాత సంగతులు. ముందు—

చంద్ర : అహఁహఁ. అందరూ అన్నివిద్యలూ నేర్చుకొనివుండాలని అనటంలేదు నేను. అలా అయితే యెన్నేళ్ళయినా పూర్తిఅవటం అంటూ వుండదు. అభిరుచుల్నిబట్టి మనలో కొందరం కొందరం —రెండేసి మూడేసి నేర్చుకుంటాం...

శ్రీశ్ : కాని అలా అయినాకూడా—

చంద్ర : అయిదేళ్ళు పడుతుందనుకో. అయిదు సంవత్సరాలకు మనం సంసిద్ధులమై బయల్దేరగలం. జీవితాంతంవరకూ దీక్షవహించేవారికి—అయిదేళ్ళంటే వోలెక్క లోడి కాదు. అదీకాక యీ అయిదేళ్ళూ మనకు పరీక్షాకాలం అవుతుంది. అంత వరకు యెవరు అంటిపెట్టుకుని వుండగలుగుతారో—వారినిగురించి యిహ యెలాంటి సందేహాలూ వుండవు.

పూర్ణ : కాని చూడండి—మన సమితిని మరొక చోటికి మారుస్తున్నారే.

చంద్ర : కాదు పూర్ణబాబూ! యివాళింకేమి వీల్లేదు. నాకు చాలా తొందరపనులున్నాయి. పూర్ణబాబూ! నే చెప్పిన మాటలు బాగా ఆలోచించుకుని చూడు— మొదట్లో అసాధ్య మేమో అనే అనిపిస్తుంది. కాని కాదు. దుస్సాధ్యమన్నది నిజమే. ఆఁ, మంచి పని అనేదే దుస్సాధ్యం. మనం అయిదుగురం దృఢప్రతిజ్ఞా ప్రతిబద్ధులం కలిసేట్లయితే మనం చెయ్యబోయే పనివుందే—అది చాలాకాలంవరకు భారతదేశమంతటా వ్యాపించగలుగుతుంది.

శ్రీశ్ : కాని మీరు బండిచక్రాలు మొదలైన వేవేవో చిన్నచిన్న వస్తువు లన్నారు—

చంద్ర : నిజమే. నేను వాటిని చిన్నవిలే అని నిర్లక్ష్యంచెయ్యను. అలాగే పెద్దపనిని కూడా అసాధ్యంగా భావించి భయపడను.

పూర్ణ : కాని సమితి సమావేశం విషయంలోకూడా—

చంద్ర : ఆ విషయాలన్నీ రేపు మాట్లాడుకుందాం పూర్ణబాబూ! యివాళ్టి కింక వెళతాను.

[వెళ్ళిపోతాడు]

విపిన్ : సోదరా శ్రీశ్! మాట్లాడకుండా వూరుకున్నావేం? వొక తాగుబోతు పేలాపన చూసేసరికి మరొక తాగుబోతు మత్తు కాస్తా యెగిరిపోతుంది. చంద్రబాబు ఉత్సాహం నిన్ను చాలా డీలా చేసేసింది.

శ్రీశ్ : కాదోయ్! చాలా ఆలోచించాల్సిన విషయాలు. ఉత్సాహమనేది యెప్పుడూ వాగుడుగానే వుంటుందా? ఒక్కొక్కప్పుడు కేవలం స్తబ్దంగా వుంటుంది. అదే అపాయకరమైన స్థితి.

విపిన్ : పూర్ణబాబూ! చటుక్కున పలాయనం చేస్తున్నారే!

పూర్ణ : సభాపతిగారిని వీధులో పట్టుకోటానికి వెళుతున్నా. దారే వెళుతూ వెళుతూ అదృష్టముంటే నా మాటలు వొకటి రెండు చెవిని వేసుకోవొచ్చు.

విపిన్ : అప్పుడు సరిగ్గా తారుమారవుతుంది. తక్కిన మీరు చెప్పదలచిన మాటలు వింటూ వింటూ—ఆయన తాను యెక్కడికి వెళ్ళాల్సిందీకూడా మరిచిపోతారు.

[వనమాలి ప్రవేశిస్తాడు]

వన : కులాసాగా వున్నారా శ్రీశ్‌బాబూ! విపిన్‌బాబూ బాగున్నారా? అరే! పూర్ణ బాబూకూడా వున్నట్లుందే! సరే మంచిదే. నేను నానాఅవస్థా పడి 'కుమార్ టులీ' వధువు లిద్దర్నీ ఆపివుంచాను.

శ్రీశ్ : కాని మమ్మల్నింక మభ్యపెట్టివుంచలేరు. మేమేదోవొక అఘాయిత్యం చేసేస్తాం.

పూర్ణ : మీరు కూర్చోండి శ్రీశ్‌బాబూ ! నాకో పనివుంది.

విపిన్ : అంతకంటె మీరు కూర్చోండి పూర్ణబాబూ ! మీ పనిని మేమిద్దరం కలిసి పూర్తిచేసి వొస్తాం.

పూర్ణ : అంతకంటె ముగ్గురం కలిసి పూర్తిచేస్తే మంచిది.

వన : మీరు తొందరలో వున్నట్లున్నారు చూస్తే. సరే మరోసారి వొస్తాను.

## దృశ్యం 3

### చంద్రబాబు యిల్లు

(చంద్రబాబు—నిర్మల)

చంద్ర : నిర్మల్ !

నిర్మల : ఏమిటి మావయ్యా !

చంద్ర : నిర్మల్ ! నా చొక్కాగుండీలు కనబడటంలేదే !

నిర్మల : బహుశా అక్కడే యెక్కడో వుంటాయి.

చంద్ర : (నిశ్చింతగా) వొకసారి వెతికిచూడు.

నిర్మల : నువ్వెదెక్కడ పారేసుకున్నా వాటినన్నిటినీ వెతికిపెట్టటం నా చాతవుతుందా ?

చంద్ర : (మనస్సులో యెదో కొంచెం సందేహం రేకెత్తటంతో స్నిగ్ధకంఠంతో) నీచాతనే అవుతుంది నిర్మల్ ! నా పొరబాట్లన్నిటి విషయంలో యింత వోపిక యింకెవరికుంటుంది ?

[నిర్మలలోని అణచుకున్న అభిమానం చంద్రబాబు వాత్సల్యపూరిత కంఠస్వరంతో అశ్రుధారగా వెలికి రాబోతుంది. తనను తమాయించుకోటానికి ప్రయత్నించబోతుంది. ఆమె మాట్లాడకుండా వూరుకోటం చూసి, చంద్రమాధవబాబు ఆమెదగ్గిర కొస్తాడు. నిర్మల ముఖాన్ని రెండువేళ్ళతో కొంచెం పైకెత్తి వొక్కక్షణం చూస్తాడు]

(కొంచెం పరిహాసంగా) నిర్మలాకాశంలో యేదో కాస్త మాలిన్యం కనిపిస్తున్నట్లుందే! యేం జరిగిందో చెప్పు అయినా.

నిర్మల : (శుష్కస్వరంతో) యింతకాలానికి నన్ను యీ బ్రహ్మచారి సమితినించి తొలగిస్తున్నారెందుకని? నేనేం చేశాను?

చంద్ర : (ఆశ్చర్యపోతూ) బ్రహ్మచారి సమితినించి నిన్ను తొలగించటమా? ఆ సమితికీ నీకు యేమిటి సంబంధం?

నిర్మల : గుమ్మంచాటున వున్నంతమాత్రాన సంబంధం వుండదా యేం? కనీసం ఆ వున్న కాస్త సంబంధమయినా యెందుకు పోగొట్టాలి?

చంద్ర : నిర్మల్, నువ్వీ సమితి కార్యకలాపాలేమీ చెయ్యొద్దు. చేసేవాళ్ళ సౌకర్యాలవీ కాస్త కనిపెట్టివుంటే—

నిర్మల : యెందుకనో? నీకు మేనల్లుణ్ణికాక మేనకోడలినై పుట్టానుకదా అని, మీ మంచి పనుల్లో పాల్గొనకూడదేం? అయితే మరి నా కిన్నాళ్ళు శిక్షణ యెందుకిచ్చినట్లు? నీ అంతట నువ్వు నా మనస్సును అన్నివిధాలా ప్రోత్సహించి తీరా ఆచరణమార్గానికి అవరోధం కల్గిస్తావేమిటి?

చంద్ర : నిర్మల్! యెప్పటికైనా వివాహంచేసుకుని, నువ్వు సంసారధర్మాన్ని నిర్వర్తించాలి—బ్రహ్మచారి సమితి కార్యకలాపాలు—

నిర్మల : నే వివాహం చేసుకోను.

చంద్ర : అయితే యేం చేస్తావో చెప్పు.

నిర్మల : దేశసేవా కార్యకలాపాల్లో నీకు సాయంచేస్తాను.

చంద్ర : మేము సన్యాసదీక్షను స్వీకరించటానికి సంసిద్ధులమై వున్నాం.

నిర్మల : భారతదేశంలో యెన్నడూ యెవరూ సన్యాసినులు కాలేదా?

[చంద్రమాధవబాబు నిరుత్తరుడై చూస్తూ నుంచుంటాడు]

మామయ్యా! యే యువతి అయినా కనక మీదీక్షను స్వీకరించటానికి మనస్పూర్తిగా సంసిద్ధురాలై వున్నప్పుడు బాహాటంగా ఆమెని మీ సమితిలో యెందుకు చేర్చుకోరు? నేను మీ బ్రహ్మచారి సమితిలో యెందుకు సభ్యురాల్ని కాకూడదు?

చంద్ర : ఆ సభలో సభ్యులుగా వున్నవాళ్ళు—

నిర్మల : ఆ సభ్యులుగా వున్నవాళ్ళూ, భారతవర్షాన్ని ఉద్ధరించటానికి పూనుకున్నవాళ్ళూ, సన్యాసధర్మాన్ని స్వీకరించబోయేవాళ్ళూ—వీరందరూ తమ వ్రతాన్ని పాలించ దలిచే వొకస్త్రీని మనస్సులో యే సంకోచమూ లేకుండా, తమవర్గంలో చేర్చుకో లేరేం? అలాగే అయినట్లయితే వాళ్ళందరూ గృహస్థులయిపోయి తమతమ యిళ్ళ లోనే వుండిపోవటం మేలు. అలాంటివాళ్ళవల్ల యేపనీ నెరవేరదు.

[చంద్రమాధవబాబు అయిదువేళ్ళను జుట్టులో జొనుపుకుని, జుట్టంతా రేపుకుంటాడు ఈసమయంలో హఠాత్తుగా అతడి చొక్కామడతలో వున్న గుండీ కిందపడిపోతుంది. నిర్మల నవ్వుతూ ఆ గుండీతీసి, అతడిచొక్కా మెడకు పెడుతుంది. చంద్రబాబు అదేమీ గమ నించడు. తలలో వేళ్ళు దూర్చుకుంటూ, మస్తిష్కంలోని ఆలోచన లతో కిందుమీదవుతూంటాడు, నిర్మల వెళిపోతుంది]

[పూర్ణబాబు ప్రవేశిస్తాడు]

పూర్ణ : చంద్రబాబూ! ఆ సంగతి యేమాలోచించారు? మన సమితిని మరోచోటికి మార్చటం నా బుద్ధికిమాత్రం బాగుండలేదు.

చంద్ర : యివాళ మరో ప్రస్తావన వొచ్చింది. దాన్ని మీతో పూర్తిగా సంప్రదించాలని వుంది పూర్ణబాబూ! నాకో మేనకోడలుంది. తెలుసుననుకుంటా.

పూర్ణ : (నిరీహుని లాగా) మీ మేనకోడలా?

చంద్ర : ఊఁ. ఆమె పేరు నిర్మల. మన బ్రహ్మచారి సమితిలో ఆమె హృదయానికి గట్టి సంబంధం వుంది.

పూర్ణ : (విస్మితభావంతో) యేమన్నారు?

చంద్ర : ఆమె ఆసక్తిగాని, ఉత్సాహంగాని మనలో యెవరికి వున్నవాటికంటే తక్కువవి కావని నా విశ్వాసం.

పూర్ణ : (ఉత్తేజితుడవుతూ) యీ మాట వింటుంటే నా వుత్సాహం పురకలు పెడుతోంది. ఆమె స్త్రీ అయివుండి—

చంద్ర : నేనూ అదే ఆలోచిస్తున్నాను. సరళమైన స్త్రీవుత్సాహం పురుషుని వుత్సాహానికి వొక కొత్తఉత్తేజం కలిగించగలదు—అన్నదివాళ నాకు అనుభవంలో కొచ్చింది.

పూర్ణ : (ఆవేగంతో) నేనది బాగా వూహించుకోగలను.

చంద్ర : పూర్ణబాబూ! మీ వుద్దేశంకూడా అదేనా?

పూర్ణ : యే వుద్దేశం మాట అడుగుతున్నారు ?

చంద్ర : అంటే నిజమైన ఆసక్తిగల స్త్రీలు మన కఠిన కర్తవ్యానికి అడ్డుతగలకుండా నిజంగా సాయపడగలరని—

పూర్ణ : (నేపథ్యంవేపుకి చూస్తూ, బిగ్గరగా) యీ విషయంలో నాకు లవలేశమైనా సందేహంలేదు. స్త్రీజాతి వుత్సాహమే పురుషుల వుత్సాహానికి ఆలంబనం. వారి వుత్సాహమే మనకు వుద్దీపన. పురుషుడి వుత్సాహాన్ని నవజాతశిశువులా పెంచి పోషించగలిగినది కేవలం స్త్రీల వుత్సాహమే.

[శ్రీశ్, విపిన్ ప్రవేశిస్తారు]

శ్రీశ్ : అంతే అయివుండొచ్చు పూర్ణబాబూ! కాని ఆ ఉత్సాహం లేకపోవటం మూలంగానేనా యేం—యివాళ సమితికి రావటానికి యింత ఆలస్యంచేస్తున్నది ?

చంద్ర : కాదు కాదు. ఆలస్యం అవటానికి కారణం నా చొక్కా గుండీ యెంత వెతికినా కనపడకపోవటం—

శ్రీశ్ : అదుగో గుండీపెట్టుకున్నట్లు కన్పిస్తోందే. యింకోటి అవసరమేముంది ? వొక వేళ వుందనుకున్నా, యింకో బెజ్జం యెక్కణ్ణించొస్తుంది ?

చంద్ర : (మెడ తడుముకుంటూ) అవును నిజమే. మనం అందరం సమావేశమైనాం. యిప్పుడు ఆ విషయాన్ని ఆలోచించేస్తే మంచిది. యేమంటావ్ పూర్ణబాబూ!

పూర్ణ : అది మంచిమాటేకాని మరి ఆలస్యం అయిపోదూ ?

చంద్ర : అహఁ. కాదు. యింకా వ్యవధివుంది. శ్రీశ్‌బాబూ! మీరు కొంచెం కూర్చోరాదూ ? యీ విషయం కొంచెం స్థిరంగా కూర్చుని ఆలోచించదగింది. నాకు వొక మేనకోడలుంది. ఆమె పేరు నిర్మల.

[పూర్ణబాబు హఠాత్తుగా దగ్గి, కందిపోతాడు]

మన బ్రహ్మచారి సమితి ఆశయాలన్నిటితో ఆమె మనస్సు బాగా హత్తుకుపోయింది.

[శ్రీశ్, విపిన్‌లు అవిచలితులై నిరుత్సాహభావంతో వింటూవుంటారు.]

యీ మాటమాత్రం నేను కచ్చితంగా చెప్పగలను— ఆమె వుత్సాహం మన యెవరి వుత్సాహానికి తీసిపోయేది కాదు.

[శ్రీశ్—విపినుల దగ్గర్నించి యెలాంటి ప్రత్యుత్తరం రాకపోవటంతో—
చంద్రబాబు లోపల్లోపల కొంచెం వుత్తేజితుడవుతాడు]

యీ విషయాన్ని నేను క్షుణ్ణంగా ఆలోచించి నిర్ణయానికొచ్చాను. స్త్రీల వుత్సాహమే పురుషుల మహత్కార్యాలన్నింటికీ గొప్ప ఆలంబనం. యేమంటావ్ పూర్ణబాబూ ?

పూర్ణ : (నిరుద్విగ్నభావంతో) అది నిజమే.

చంద్ర : (హఠాత్తుగా—ఆత్రంగా) నిర్మల కనక వొకవేళ బ్రహ్మచారి సమితిలో సభ్యత్వాన్ని అర్థిస్తే— ఆమెకు మనం సభ్యత్వం యెందుకివ్వకూడదు ?

పూర్ణ : యేమంటున్నారూ ?

శ్రీశ్ : యే స్త్రీ అయినా సరే మన సమితిలో సభ్యత్వం కావాలనే కాంక్ష వ్యక్తం చేస్తుందేమో అన్నది మనం యెన్నడూ ఊహించలేదు. కనక దానికి సంబంధించిన నియమమేమీ లేదు.

విపిన్ : నిషేధమూ లేదు.

శ్రీశ్ : స్పష్టంగా నిషేధం లేకపోవొచ్చు. కాని మన సమితి ఆశయాలేవీకూడా స్త్రీల ద్వారా సాధించేవి కావు.

విపిన్ : మన సమితి ఆశయాలు సంకుచితాలు కావు. కాని మహత్తర ఆశయాల్ని సాధించబోయేట్లయితే నానావర్గాలకిచెందిన నానావిధవ్యక్తుల వివిధప్రయత్నాలతో ప్రవృత్తులం కావాలిసుంటుంది. స్వదేశానికి మేలు—స్త్రీ చెయ్యగలిగినంత నువ్వు చెయ్యలేవు. అలాగే నువ్వు చెయ్యగలిగింది స్త్రీ చెయ్యలేదు. కనక సమితి ఆశయాలను సర్వాంగసంపూర్ణంగా సాధించదలచేట్లయితే మీరంతా యెంతవసరమో స్త్రీ సభ్యరాంద్రుకూడా అంత అవసరం.

శ్రీశ్ : పనిచేయాలని అనుకొని వాళ్ళు ఆశయాల్ని యెక్కువగా పెంచుకుంటారు. నిజంగా పనిచేయబోతే—లక్ష్యాన్ని పరిమితం చేసుకోటం అవసరం. మన సమితి ఆశయాలు మహత్తరమైనవనుకుని నువ్వు నిశ్చింతగా వుంటావు. నేను వాటిని అంత గొప్పవిగా భావించను.

విపిన్ : మన సమితి కార్యక్షేత్రంలో కనీసం వొక మహదాశయం నీకు నచ్చిందికదా అని నాకు నచ్చకపోదు. అలాగే నన్నాకర్షించిందికదా అని నిన్నాకర్షించకపోదు. నీకూ, నాకూ మన వుభయులకూ కనక అక్కడ స్థానంవుంటే, అక్కడ మనం వుభయులమూ వుండటం అవసరమూ వుపయోగమూ అయితే, భిన్నప్రకృతికి చెందిన మరొకరికూడా అక్కడ స్థానం యివ్వటం యేమంత కష్టం ?

శ్రీశ్ : ఔదార్యం చాలా వుత్తమమైనదే. ఆ సంగతి నేను నీతిశాస్త్రంలో చదివాను. నేను నీ ఔదార్యాన్ని నష్టపరచదలచుకోలేదు. విభజించదలచుకున్నా నంతే. స్త్రీలే యే కార్యాన్ని సాధించగలరో దానికోసం వారు వేరే ప్రత్యేక సమితిని స్థాపించుకోవొచ్చు. మనం ఆ సమితిలో సభ్యత్వాన్ని అర్థించం. మన సమితిని మనకి వుండనియ్. లేకపోతే మనం పరస్పరం వొకరిపనుల కొకరం అడ్డం తగులుతూ వుంటాం. మెదడుని ఆలోచనలతో మునిగితేలనీ. కడుపును జీర్ణం చేసుకుంటూ వుండనీ. జీర్ణకోశాన్ని తలలోకీ మెదడును పొట్టలోకీ మార్చే ప్రయత్నం చెయ్యకుండావుంటే చాలు.

విపిన్ : కాని అలా అని మెదడును వేరుచేసి వొకచోటా జీర్ణకోశాన్ని మరోచోటా వుంచినా పని జరగదు.

శ్రీశ్ : (అతిచిరాకుతో) వుపమానం యుక్తికాదు. దాన్ని ఖండిస్తే నేననేదంతా ఖండించి నట్లవుతుందా? వుపమానం కొంతదూరంవరకే వుపయోగిస్తుంది.

విపిన్ : అంటే—యెంతవరకూ నీ యుక్తికి వుపయోగిస్తుందో అంతవరకే నన్నమాట.

పూర్ణ : (చాలా విచారిస్తూ) విపినబాబూ! నా అభిప్రాయం యిది—మన యీ కార్య కలాపాలన్నిటిలో ఆడవాళ్ళు ముందుకొస్తే దానివల్ల వాళ్ళలో వున్న మధురభావం లుప్తమైపోతుంది.

చంద్ర : (వొకపుస్తకాన్ని కళ్ళకి చాలాదగ్గరగా పెట్టుకుని) మహత్కార్యాల్లో యే మాధుర్య మైతే నష్టమవుతుందో ఆలాటి మాధుర్యం అంత జాగ్రత్తగా పదిలపరచటానికి యోగ్యమైంది కాదు.

శ్రీశ్ : కాదు చంద్రబాబూ! ఆ సౌందర్యమాధుర్యాల ప్రసక్తి నేనేమీ తీసుకురావటం లేదు. సైనికుల మాదిరిగా మనం వొక అడుగుమీద నడవాలి. అభ్యాసలోపం వల్లకానీ, సహజమైన దౌర్బల్యంవల్లకానీ యెవరైనా వెనకబడతారేమో అన్న సందేహం వున్నప్పుడు వాళ్ళనుగురించి బాధపడుతూంటే మన పనులన్నీ వ్యర్థ మయిపోతాయి.

[యీ సమయంలో నిర్మల సంకోచించకుండా మర్యాదగా గదిలోకి వొచ్చి, నమస్కరించి నిలబడుతుంది. హఠాత్తుగా అందరూ నిర్ఘాంత పోతారు. ఆమె కంఠం గద్గదంగా వుంటుంది.]

నిర్మల : మీ ఆశయాలేమిటో—మీరు దేశసేవాపరాయణత్వంలో యెంతదూరం పోవ టానికి సిద్ధంగా వున్నారో—అవి నాకేమీ తెలియవు. కాని నాకు మా మామయ్య

సంగతి తెలుసు ఆయన యే దారిని వెళుతున్నాడో, ఆ దారినే నేనూ ఆయన్ని అనుసరించకుండా మీరెందు కడ్డుపడుతున్నారు ?

[శ్రీశ్ నిరుత్తరుడవుతాడు. పూర్ణ అనుతప్తుడవుతాడు. విపిన్ ప్రశాంత గంభీరుడవుతాడు. చంద్రబాబు అతిగంభీరంగా ఆలోచనామగ్నుడవుతాడు]

నిర్మల : (శ్రీశ్—పూర్ణలకేసి అశ్రుపూరితమైన దృక్కులను ప్రసరింపజేసి) నేను పని చెయ్యాలనుకుంటున్నానంటే—దానికంతటికీ ఆయనే నాకు చిన్నప్పట్నుంచీ గురువు. మృత్యుపర్యంతం సత్కార్యాల్లో ఆయన్ని అనుసరించాలనుకుంటున్నాను. మీరు కేవలం తర్కంలో నా అయోగ్యతని నిరూపించాలని ప్రయత్నిస్తారెందుకని ? నా సంగతి మీకేం తెలుసు ?

[శ్రీశ్ స్తబ్ధుడౌతాడు. పూర్ణకి ముచ్చెమటలు పోస్తాయి]

నిర్మల : నేను మీ బ్రహ్మచారి సమితినిగాని మరో సమితినిగాని యేమీ యెరగను. కాని బ్రహ్మచారి సమితిని ఆధారంగా చేసుకొని, తమ జీవితాశయాల్ని సాధించు కోటాని కుద్యుక్తులయిన వ్యక్తిశిక్షణలోనే పెరిగాను. అలాంటప్పుడా బ్రహ్మచారి సమితినించి మీరు నన్ను దూరంగా వుంచలేరు. (చంద్రబాబువైపు తిరిగి) నేను మీ కార్యకలాపాల్లో పాల్గొనటానికి అర్హురాల్నికానని నువ్వు కనక అనేట్లయితే నేను వెళిపోతాను. కాని వీళ్ళకేంతెలుసు నా సంగతి ? వీళ్ళందరూ నన్ను నీచించి విచ్ఛిన్నంచెయ్యటానికే వాదోపవాదాలు చేస్తున్నారు.

శ్రీశ్ : (వినీత మృదుకంఠంతో) క్షమించండి. నేను మీ విషయంలో యేమీ వాదించ లేదు. నేను స్థూలంగా స్త్రీజాతినిగురించే ప్రస్తావించాను.

నిర్మల : స్త్రీజాతి, పురుషజాతి విభేదాన్నిగురించి, నేనేమీ చర్చించలేదు. నా అంతః కరణ నాకు తెలుసు. యెవరి వున్నతదృష్టాంతాన్ని ఆశ్రయించుకుని బ్రతుకు తున్నానో వారి అంతఃకరణకూడా నాకు తెలుసు. కార్యరంగంలో ప్రవృత్తురాల్ని కావటాని కింతకంటె యెక్కువేమీ తెలుసుకోవాల్సిన అవసరంలేదు.

[చంద్రబాబు తన కుడిఅరచేతిని కళ్ళకి దగ్గిరగా పెట్టుకుని పరిశీల నగా చూసుకుంటూవుంటాడు. పూర్ణ చమత్కారంగా యేదో మాట్లాడబోతాడు. కాని అతడి నోట్లోంచి వొక్కమాటా పైకిరాదు.]

పూర్ణ : (మనస్సులో చాలాసార్లు ఆవృత్తిచేసుకుని) దేవీ ! యీ పంకిలమైన ప్రాపంచిక వ్యవహారాల్లో మీరెందుకు జోక్యం చేసుకోవాలనుకుంటున్నారు ?

[ఆ మాట మనస్సుకు యెంతబాగుందో అంతబాగా వినిపించదు
పైకి —అన్నమాట పూర్ణ వెంటనే గ్రహిస్తాడు. ఆ మాట గద్య
మధ్య పద్యంలాగ ఆడంబరంగా వుంటుంది. సిగ్గుతో అతడి చెవులు
యెరుపెక్కుతాయి]

విపిన్ : (స్వాభావికమైన గంభీర శాంతస్వరంతో) ప్రపంచం యెంత పంకిలమో, ఆ ప్రపంచాన్ని సంస్కరించే కార్యం అంత పవిత్రం.

శ్రీశ్ : సమితి సమావేశంలో స్త్రీలను చేర్చుకొనే విషయం ఆలోచించి యే నిర్ణయం చేస్తారో అది మీకు తెలియజేస్తాను.

[నిర్మల వొక్క క్షణంకూడా ఆగకుండా నిశ్శబ్దంగా వెళి
పోవటానికి ప్రయత్నిస్తుంది]

చంద్ర : (హఠాత్తుగా) నా మెడగుండీ —

నిర్మల : (సిగ్గుపడుతూ వొచ్చి, మెల్లిగా) మెడనే వుంది.

చంద్ర : (మెడ తడుముకుని) ఆc. ఆc. వుంది నిజమే.

[ముగ్గురు శిష్యులకేసిచూసి నవ్వుతాడు]

## దృశ్యం ౪

## అక్షయుడి యిల్లు

[నృపబాల—నీరబాల]

నృప : యీమధ్య నువ్వు అడపాదడపా ఇంత గంభీరంగా వుంటున్నావెందుకు నీరూ ;

నీర : మన యింటి గాంభీర్యమంతా నీవొక్కతెకేనాయేం అక్కడికి. నా యిష్టం. నే గంభీరంగా వుంటాను.

నృప : నీ ఆలోచనలేమిటో నాకు బాగా తెలుసు.

నీర : నువ్వంతగా ఊహించాలివిన అవసరం మేమొచ్చింది ? యిప్పుడిహ నీ విషయం నువ్వు ఆలోచించుకునే సమయం వొచ్చింది.

నృప : (నీరూ మెడ వాటేసుకుని) నువ్వు బెంగెట్టుకున్నావా ? అమ్మో ! మనమంత పనికిరానివాళ్ళ మయినామా ? మనల్ని సాగనంపటానికికూడా యింత ఆలోచనా, యింత విచారమూనా ?

నీర : మనంకూడా అంత విసిరి పారెయ్యటానికి వీలైన వస్తువులం కాదు—పారేసి వూరుకోటానికి. మనకోసమని యింత హంగామా జరుగుతోందంటే—అది గౌరవ ప్రదమైన విషయం. కుమారసంభవం చదివావుగా ! గౌరి వివాహంకోసం దేవతల్లో వొకరు కాలి బూడిదయిపోయారు. వొకవేళ యే కవి చెవినయినా పడితే—మనల్నిగురించికూడా ఓ వర్ణన తయారవుతుంది.

నృప : కాదు చెల్లీ ! నాకు చాలా సిగ్గేస్తోంది.

నీర : అయితే నాకుమాత్రం సిగ్గెయ్యటంలేదూ ? నేనక్కడికి సిగ్గులేనిదాన్నన్నమాట ! కాని యేంచెయ్యను చెప్పు. స్కూల్లో ఆనాడు ప్రైజ్ తీసుకోటానికి వెళ్ళినప్పుడు సిగ్గుపడ్డాను. మళ్ళీ ఆతర్వాత సంవత్సరంకూడా ప్రైజ్ సంపాయించటానికి రాత్రుళ్ళు మేల్కొని, పాఠాలు బట్టీపట్టాను. సిగ్గూ వేస్తుంది, ప్రైజూ వొదులు కోలేను. అది నా స్వభావం.

నృప : సరేకాని నీరూ ! యీసారి ప్రైజ్ సంగతేదో అనుకుంటున్నారే దానికోసం కూడా నువ్వు ఆత్రపడుతున్నావా యేం ?

నీర : యేదో చెప్పు అయినా ; బ్రహ్మచారి సమితిలో వున్న పభ్యులిద్దరి సంగతేనా ?

నృప : యేదయితే యేం. నువ్వు కనుక్కున్నావ్‌గా !

నీర : అవును. నిజం చెప్పనా ? (నృపమెడ కావిలించుకుని, చెవిలో) బ్రహ్మచారి సమితిలోని ఆ సభ్యులిద్దరికీ చాలా స్నేహమట. మనం యిద్దరం ఆ యిద్దరిచేతు ల్లోనూ పడితే. పెళ్ళయినా వొకర్నొకరం విడిచిపెట్టిపోవాలిసిన అవసరం వుండదు. లేకపోతే మనం యెవరం యెక్కడికెళ్ళి పడతామో తెలియదు. అందుకనే ఆ దేవ తల జంటకోసం యింత పూజాప్రయత్నం చేస్తున్నాను. ' బ్రహ్మచారి సమితిలో వున్న వో అశ్వినీకుమారయుగళమూర్తులారా ! మా అక్కచెల్లెళ్ళ నిద్దర్నీ వొక రెమ్మలోవున్న రెండు పువ్వుల్లాగా మీరిద్దరూ వొక్కసారే పరిగ్రహించండి ' అని చేతులు జోడించి మనసులో మనసులో ప్రార్థిస్తున్నా.

[విరహభావన సూచితంకావటంతో అక్కచెల్లెళ్ళు వొక రొన్కొకరు కావిలించుకుంటారు. నృపబాల కళ్ళలో నిలచిన నీటిని యెంత ప్రయత్నించినా ఆపుకోలేకపోతుంది]

నృప : అవునుగాని నీరూ ! చిన్నక్కని యెలా విడిచిపెట్టివెళ్ళటం చెప్పు. మనం యిద్దరం వెళ్ళిపోతే ఆమె కెవరుంటా రింకా ?

నీర : ఆ సంగతి చాలాదూరం ఆలోచించా. వుండనిచ్చేట్లయితే అసలు విడిచివెళ తామా ? ఆమెకి భర్తలేడు. పోనీ మనకి లేడు అనే అనుకుందాం — చిన్నక్క కన్నా మనకి యేం సుఖంకావాలి ?

[పురుషవేషధారిణి అయిన శైలబాల ప్రవేశిస్తుంది]

నీర : (టేబిల్‌మీద పళ్ళెంలోవున్న వొక పూలదండ తీసి శైలబాల మెడలో వేసి) మేమిద్దరం స్వయంవర పద్ధతిలో నిన్ను మా పతిగా వరించాం.

[శైలబాలకు నమస్కరిస్తుంది]

శైల : మళ్ళీ యిదేమిటి ?

నీర : మరేం భయంలేదులే. మా సవతుల మిద్దరం నీమూలాన తగవులాడుకోం. వొకవేళ తగవులాడినా నృప నాతో నెగ్గలేదు. నేనొక్కతెనే సర్దుకుపోగలను. నువ్వేమీ కష్టపడక్కర్లేదు. అక్కా ! నిజం చెబుతున్నా చిన్నక్కా ! నీదగ్గర మేమెంత చనువుగా వుండగలుగుతున్నామో, అలాటి చనువు మాకు మరెక్కడ దొరుకుతుంది ? అలాంటప్పుడు మమ్మల్ని పరాయివాళ్ళ కంటగట్టాలనుకోట మెందుకు ?

[నృప కళ్ళనించి జలజల కన్నీళ్ళు స్రవిస్తాయి]

శైల : (ఆమెకళ్ళు తుడుస్తూ) అదేమిటి నృపా ! ఛా ! మీ సుఖమేమిటో మీ కేం తెలుసు ? నావల్ల మీ జీవితాలు సార్థకమయేట్లయితే మరొకరి చేతుల్లో అప్పగించ గలనా అసలు మిమ్మల్ని ?

[రసిక్ ప్రవేశిస్తాడు]

రసిక్ : అమ్మాయిలూ ! నాలాంటి అసభ్యుణ్ణి మీరు సభ్యుణ్ణిచేశారు. యివాళ సమితి యిక్కడే సమావేశమవుతుంది. యెలా నడుచుకోవాలో నేర్పండి.

నీర : మళ్ళీ ఆ పాత వేళాకోళమేనా ? యీ సభ్య—అసభ్య విషయాన్నిగురించి మూడు రోజుల్నుంచీ మాట్లాడుతున్నావ్ నువ్వు.

రసిక్ : కన్నబిడ్డమీద ఆమాత్రం మమకారం వుండదూ ? వొక్కసారి వేళాకోళం నోటినించి పైకిరాగానే—రాజపుత్ర కన్యలాగా దాన్నింక పీక నులిమి పారెయ్యాల్సిందేనా ? అప్పుడే యేమయింది ? బ్రహ్మచారి సమితి నిలిచివుండేంతవరకు యీ పరిహాసాన్ని మీరు రెండుపూటలా వినాలిసిందే.

నీర : అయితే వీలైనంత పెందరాళే దాని కుద్వాసన చెప్పాలి. చిన్నక్కా ! యింక దయాలేదు గియాలేదు. రసిక్‌దా రసికత్వాన్ని మానిపోనీయం, సమితిలో బ్రహ్మ చర్యాన్ని త్వరలోనే రూపుమాపుతాం. అప్పుడే విశ్వవిజయినీ శ్రీ అన్న మనపేరు సార్థకమవుతుంది. యేవిధంగా దండయాత్ర సాగించాలో దానికేదయినా పథకం తయారుచేశావా ?

శైల : యేమీ లేదు. రంగంలో విలబడ్డాక యెలా తోస్తే అలా చెయ్యటమే.

నీర : నా అవసరం వొచ్చినప్పుడు రణభేరి మోగిస్తే చాలు నేను హాజరవుతాను. నేను బ్రహ్మచారి సమితికి భయపడతానా ? మృణాల మృదుభుజాల్లో బలంలేదూ ?

[అక్షయ్ ప్రవేశిస్తాడు]

అక్షయ్ : యీనాటి సభలో విదుషీమణులకు వొక ఐతిహాసిక ప్రశ్న వేయాలనిపిస్తోంది.

శైల : సిద్ధంగా వున్నాను.

అక్షయ్ : రెండు కొమ్మలమీద కాళ్ళువేసి, ఆ రెండు కొమ్మలనే నరకాలని ప్రయత్నిం చిందెవరు ?

నృప : నాకు తెలుసు ముఖర్జీగారూ ! కాళిదాసు...

అక్షయ్ : కాదు కాదు. మరొక మహనీయుడు. అక్షయకుమార ముఖోపాధ్యాయ్.

నీర : రెండు కొమ్మలెవరు ?

అక్షయ్ : (యెడమవైపుకి నీరను లాక్కుని) యిది వొకటి (కుడివైపుకి నృపను లాక్కుని) యిది వొకటి.

నీర : పోతే కుఠారం యివాళ వొస్తుందనుకుంటా—

అక్షయ్ : వొస్తుందేమిటి ? వొచ్చేసింది అన్నా అత్యుక్తికాదు. అదుగో మెట్లమీద అడు గుల సవ్వడి విన్పిస్తోంది.

[వొకచే నరుగు—శైల పారిపోయేప్పుడు రసిక్‌దానిజ క్కుని వెళిపోతుంది. గాజుల గలగలలు భయంతో పరుగెడుతున్న కొన్ని అడుగుల సవ్వడులు పూర్తిగా ఆగిపోకముందే—శ్రీశ్, విపిన్ ప్రవేశిస్తారు]

అక్షయ్ : పూర్ణబాబు రాలేదేం !

శ్రీశ్ : చంద్రబాబు యింటిదగ్గర అతణ్ణి కలుసుకున్నాం. కాని హఠాత్తుగా అతడికి అస్వస్థత కలగటంవల్ల యివాళ యిక్కడికి రాలేకపోయాడు.

అక్షయ్ : (దారివైపు చూస్తూ) కొంచెంసేపు కూర్చోండి. నేను చంద్రబాబు రాకకోసం యెదురుచూస్తూ గుమ్మంలోకి పోయి నిలబడతాను. వారి కళ్ళు మసక. యెక్కడికి వెళ్ళబోయి యెక్కడికి వెళతారో యేం చెప్పగలం? దగ్గిరలో యిలాంటి ప్రదేశం కూడా వుంది. బ్రహ్మచారి సమితి సమావేశం కావటానికి యేవిధంగానూ కాంక్షించదగనిది.

[అక్షయ్ వెళిపోతాడు. అక్షయ్ వెళిపోయాక శ్రీశ్, గదినంతా పరిశీలనగా చూస్తాడు. గదిలో రెండు దీపాలు వెలుగుతూంటాయి. ఆ రెండింటికీ లేతగులాబిరంగు అవగుంఠనాలుంటాయి. ఆ అవరణను భేదించుకుంటూ కాంతి కొంచెం మసకగానూ, రంగుగానూ వ్యాపిస్తుంటుంది గది అంతా. టేబిల్ మీద పూలదానులో పూలు పెట్టివుంటాయి]

విపిన్ : (కొంచెం నవ్వి) యేమయినా అను సోదరా! యీ యిల్లు బ్రహ్మచారి సమితి కుపయోగించేది కాదు.

శ్రీశ్ : (చకితుడై) యెందుక్కాదు?

విపిన్ : యింట్లో అలంకరణ అంతా మీ నవీన సన్యాసులక్కూడా కొంచెం యెక్కువనిపిస్తుంది.

శ్రీశ్ : మా సన్యాసధర్మ విషయంలో యెక్కువంటూ యేదీ లేదు.

విపిన్ : వొక్క స్త్రీ తప్ప.

శ్రీశ్ : అవును. ఆ వొక్కటి మటుకే.

[తక్కిన రోజుల్లోలాగ ఆ మాటలో వూతం రాదు]

విపిన్ : గోడనున్న పటాలు, తక్కిన రకరకాల అలంకరణలూ వున్న యీ గదిలో ఆ స్త్రీజాతి పరిచయమే యెక్కువగా కనిపిస్తున్నట్లుంది.

శ్రీశ్ : ప్రపంచంలో స్త్రీజాతి చిహ్నాలు సర్వత్రా వున్నాయి.

విపిన్ : అది నిజమే. కవుల మాటలు విశ్వసించేట్లయితే చంద్రుడిలో, పూలలో, లతలలో, ఆకులలో యెక్కడైనా సరే స్త్రీజాతి చిహ్నాలనించి అభాగ్యుడు—పురుషుడు తప్పించుకోలేడు.

శ్రీశ్ : (నవ్వి) చంద్రబాబు యింట్లో ఆ మొదటి అంతస్తు గదిలో స్త్రీల కెలాంటి సంబంధంలేదని మాత్రమే అనుకుంటూవొచ్చాను. యివాళ ఆ భ్రమ కాస్తా హఠాత్తుగా తొలగిపోయింది. అహఁ వాళ్ళు ప్రపంచమంతా విస్తరించుకున్నారు.

విపిన్ : పాపం. యీ కొద్దిమంది బ్రహ్మచారిగాళ్ళకోసం యెక్కడా కాస్త సందుంచలేదు—సమితి సమావేశమయేందుకు చోటు దొరకటమే కష్టం.

శ్రీశ్ : అదిగో చూడు—

[మూలనున్న టీపాయ్‌మీదినించి రెండు జడసూదులుతీసి చూపిస్తాడు]

విపిన్ : (సూదులు రెండూ తీసుకుని పరీక్షగా చూసి) యిదుగో సోదరా ! యీ ప్రదేశం బ్రహ్మచారులకు నిష్కంటకం కాదు.

శ్రీశ్ : పూలూ వున్నాయి. ముళ్ళూ వున్నాయి.

విపిన్ : అదే కదా ప్రమాదం ! కేవలం ముళ్ళేవుంటే తప్పించుకుపోవొచ్చు.

[శ్రీశ్ అవతలవైపున వున్న చిన్న పుస్తకాల షెల్ఫులోంచి పుస్తకాలు తీసి చూడటం మొదలుపెడతాడు. కొన్ని నవలలూ, కొన్ని ఆంగ్ల కావ్యగ్రంథాలు. పాల్‌గ్రేవ్ కావ్యపరిచయ స్వర్ణభాండారాన్ని (Palgrave's Golden Treasury) తెరిచి చూస్తుంటాడు. మార్జిన్‌లో స్త్రీ దస్తూరితో నోట్సు రాసివుంటుంది. అప్పుడు మొదటి పేజీ తిప్పిచూస్తాడు—చూసి వొకసారి పుస్తకాన్ని అటూ యిటూ తిరగేసి విపిన్‌కి యెదురుగా పట్టుకుంటాడు]

విపిన్ : నృపబాల. యిది పురుషుని పేరయివుండదని నా విశ్వాసం. నీకేమనిపిస్తుంది.

శ్రీశ్ : నా విశ్వాసమూ అదే. యీ పేరుకూడా అన్యజాతీయంలాగానే తోస్తోందోయ్.

[మరొక పుస్తకం చూపిస్తాడు]

విపిన్ : నీరబాల. యీ పేరు కావ్యగ్రంథాల్లో చెల్లుబాటవుతుంది. కాని బ్రహ్మచారి సమితిలో—

శ్రీశ్ : బ్రహ్మచారి సమితిలోక్కూడా యీ పేరుగలవాళ్ళు గనక చొరబడివొచ్చేట్లయితే—ద్వారానికి అడ్డంగా నిలబడి ఆపగలిగిన బలవంతుడెవడూ మన సమితిలో కనిపించడు.

విపిన్ : పూర్ణ వొక్క దెబ్బతోనే పడిపోయాడు. కోలుకుంటాడో లేదో సందేహం.

శ్రీశ్ : యేమిటది ?

విపిన్ : సరీగ్గా గమనించలేదనుకుంటా నువ్వు !

శ్రీశ్ : అహఁహఁ. అది నీ అనుమానం.

విపిన్ : హృదయం అనుమానించాల్సిన వస్తువే. చూడటానికి వీల్లేనిది. పట్టుకోటానికి వీల్లేనిది.

శ్రీశ్ : పూర్ణ అస్వస్థత—అయితే వైద్యశాస్త్రాంతర్గతమయినది కాదా ?

విపిన్ : కాదు. యిలాంటి వ్యాధులకు సంబంధించిన లెక్చర్లు యేవీ వుండవు మెడికల్ కాలేజీల్లో.

శ్రీశ్ : యీ యింట్లో గుమ్మంలో అడుగుపెట్టగానే పరిచయమైన రసిక్ చక్రవర్తి అనే వృద్ధయువకుడు బ్రహ్మచారి సమితి ద్వారపాలకుడి కనువైనవాడుగా తోచదు.

విపిన్ : శివుడి తపోవనాన్ని కావలికాయటానికి మన్మథుడే నందిరూపంలో రావటం గుర్తుకొస్తోంది. అతడు విశ్వాసయోగ్యుడుగా తోచటంలేదు.

[చంద్రబాబు ప్రవేశిస్తాడు]

చంద్ర : యివాళ వాదవివాదాల ఉత్తేజనమూలంగా పూర్ణబాబు హఠాత్తుగా అస్వస్థుడవటం చూసి, నేనతన్ని యింటికి పంపించెయ్యటం వుచితమనుకున్నాను.

విపిన్ : పూర్ణబాబు ప్రస్తుతపు దుర్బలస్థితిని చూస్తే—అతడు ముందునించే జాగ్రత్త పడివుండటం భావ్యమనిపించింది.

చంద్ర : పూర్ణబాబు అంత అజాగ్రత్తగా వున్నాడని అనుకోను.

[అక్షయ్—రసిక్ ప్రవేశిస్తారు]

అక్షయ్ : క్షమించండి. యీ నవీన సభ్యుణ్ణి మీకు అప్పగించేసి నేను వెళిపోతాను.

రసిక్ : (నవ్వుతూ) నా నవీనత పైకి అంత ప్రత్యక్షంగా కన్పించేదికాదు.

అక్షయ్ : అతివినయంమూలంగా దాన్ని పైకి ప్రాచీనతతో కప్పిపుచ్చుకున్నారు. క్రమక్రమంగా తెలిసిపోతుంది. యీయనే సార్థకనామధేయుడైన రసికచక్రవర్తి.

రసిక్ : నా తండ్రి నా రసికత్వాన్నిగురించి తెలుసుకోకముందే రసిక్ అని పేరుపెట్టారు. యిప్పుడిహ పితృవాక్యపరిపాలనకోసం నేను రసికత్వపు ప్రయత్నం చేయాలి సొస్తోంది. యింక తర్వాతా —' యత్నేకృతేయది న సిధ్యతి కోఽత్రదోషః.'

[అక్షయ్ వెళిపోతాడు. పురుషవేషధారిణి శైల ప్రవేశిస్తుంది. శైల వొచ్చి అందరికీ నమస్కరిస్తుంది. దృష్టిలోపంగల చంద్రబాబు మసకచూపుతో చూస్తాడామెని. విపిన్-శ్రీశ్ ఆమెకేసి చూస్తూం టారు. శైలవెనక యిద్దరు భృత్యులు భోజనపాత్రలు పట్టుకొస్తారు. శైల చిన్నచిన్న వెండి ప్లేట్లు తీసుకుని, చలవరాతి టేబిల్‌మీద అమరుస్తూవుంటుంది]

రసిక్ : వీరు తమ సమితిలో మరో నవీన సభ్యులు. వీరి నవీనతనుగురించి యెలాంటి సంశయమూలేదు. సరీగ్గా నాకు విరుద్ధం. వీరి బుద్ధికౌశలాన్ని పైపై నవీనతతో దాచుకున్నారు. మీరు కొంచెం విస్మితులయినట్లు కన్పిస్తోంది. అది సహజమే. యితణ్ణి చూస్తే బాలకుడనిపిస్తుంది. కాని నేను మీకు హామీ యివ్వగలను— యితడు బాలకుడు కాడు.

చంద్ర : వీరి పేరు?

రసిక్ : అబలాకాంత చట్టోపాధ్యాయ్.

శ్రీశ్ : అబలాకాంతా?

రసిక్ : పేరు మన సమితిలో చెలామణీ అయేందుకనువుగా లేదు. అది వొప్పుకుం టాను. పేరునుగురించి నాకూ మమకారం లేదు. వొకవేళ మార్చి, విక్రమ సింహుడు, లేదా భీమసేనుడనికాని మరింకేదైనా వుపయోగకరమయిన పేరు పెట్టినా అతడు అభ్యంతరం చెప్పడు. అయితే— 'స్వనామా పురుషోధన్యః— అని శాస్త్రంలో వుంది. నిజమే. కాని అతడు అబలాకాంత పేరుతోనే ప్రపంచంలో పురుషత్వాన్ని ఆర్జించుకోవాలని ఆత్రపడటంలేదు.

శ్రీశ్ : యేమిటండీ మీరనేది? పేరనేది చిటికిమాటికి మార్చుకోటానికి పైన వేసుకొనే వుత్తరీయం కాదు.

రసిక్ : అది మీవొక్కరి అభిప్రాయం శ్రీశ్‌బాబూ! పేరును పూర్వులు దుస్తుల్లాంటి దానికిందనే పరిగణించారు. అదంతా యెందుకు చూడండి— అర్జునుడికి పితృ దత్తమైన నామధేయమేదో చెప్పటం కష్టం. పార్థ, ధనంజయ, సవ్యసాచి— లోకులు నోటికొచ్చిన పేరుతో పిలిచేవారు. యిదుగో పేరును మీరు తిరుగులేని సత్యంగా భావించకండి. అతణ్ణి మీరు మరచిపోయి అబలాకాంత్‌వి కాదన్నా అతడేం పరువునష్టం దావా తీసుకురాడు.

శ్రీశ్ : (నవ్వి) మీరింతగా అభయం యెటూ యిచ్చారుగనక నేను చాలా నిశ్చింతగా వున్నాను. వారి క్షమాగుణాన్ని తెలుసుకోవాల్సిన అగత్యం రాదు. పేరు మరచి పోను లెండి.

రసిక్ : మీరు పోకపోవొచ్చుగాని నేను పోతానండీ. అతడు నాకు వరుసకు మనుమ డవుతాడు. అంచేత అతడి విషయంలో నాకు కాస్త నోరు జారుతూంటుంది. యెప్పుడైనా వొకవేళ వొకటి అనబోయి మరొకటి అంటే దాన్ని క్షమిస్తూండండి.

శ్రీశ్ : అబలాకాంతబాబూ ! మీరేమిటీ యేర్పాట్లన్నీ చేస్తున్నారు ? మా సభాకార్య క్రమంలో మధురాహారసేవన లేదు.

రసిక్ : (లేచి) ఆ లోపాన్ని సవరిస్తున్నవారికి సమితి తరఫున ధన్యవాదాలర్పిస్తున్నాను.

శైల : (ప్లేట్లు అమరుస్తూ) శ్రీశ్‌బాబూ ! ఆహారంకూడా మీ నియమాలకు విరుద్ధమా ?

శ్రీశ్ : స్థూలకాయుడైన విపిన్‌ని దగ్గిరికి లాక్కుని, యీ సభ్యుని ఆకృతిని పరిశీలించిచూస్తే ఆ విషయంలో సంశయమేమీ వుండదు.

విపిన్ : నియమాల విషయమే గనక చెబితే అబలాకాంతబాబూ ! యీ ప్రపంచంలో వుత్తమశ్రేణికిచెందిన దేదయినాసరే తన నియమాలు తానే సృష్టించుకుంటుంది సమర్థుడైన రచయిత తానేర్పరుచుకున్న నియమాల్నే పాటిస్తాడు. వుత్తమ కావ్యం విమర్శకుల నియమాల్ని పాటించదు. యీ మధురాహారసేవన విషయంలోకూడా యే సమితి నియమాలూ చెల్లుబాటుకావు. దీని యేకైకనియమం— కూర్చుని నిశ్శేషంగా భుజించటమే. యివి యిక్కడ వున్నంతసేపూ ప్రపంచంలో వున్న తక్కిన నియమాలన్నీ గుమ్మం వెలుపల వేచివుండాలిసిందే.

శ్రీశ్ : నువ్వు యిల్లా అయినావేమిటి విపిన్ ? నువ్వు తినటం మాత్రమే చూశానుగాని, వొక్క గుక్కలో యిన్ని మాటలు మాట్లాడటం యెప్పుడూ వినలేదే !

విపిన్ : రసన ఉత్తేజితమయింది. యిప్పుడు సరళంగా మాట్లాడటం నాకు చాలా తేలికయింది. నా జీవితచరిత్ర రాసేవాడెవడో యెక్కడ వున్నాడో యిప్పుడు !

రసిక్ : (బట్టతల నిమురుకుంటూ, నాద్వారా ఆ ప్రయత్నం జరుగుతుందని యెదురు చూడకండి. నేనంత దీర్ఘకాలంవరకూ నిలిచివుండలేను.

[విలాసభరితమైన నూతన గృహానికి రావటంతో చంద్రమాధవబాబు మనస్సు చెదరిపోయివుంటుంది. అతడి వుత్సాహవాహిని యథా ప్రకారంగా ప్రవహిస్తూవుండదు. అతడు క్షణక్షణానికీ సమితి కార్యకలాపాల పుస్తకాన్ని, మధ్యమధ్య తన అరచేతిని చూసు కుంటూ వుంటాడు]

శైల : (చంద్రబాబు దగ్గిరగా వెళ్ళి, సభాకార్యక్రమానికి వొకవేళ యేదయినా కొంచెం అంతరాయం కలిగితే క్షమించండి చంద్రమాధవబాబూ ! కొంచెం ఫలహారం—

చంద్ర : యిలాంటి సామాజిక ఆచారాలు సభాకార్యక్రమానికి విఘాతం కలిగిస్తాయి. అందులో సందేహం లేదు.

రసిక్ : సరే. పరీక్షించి చూడండి. మధురాహారం సమితి కార్యక్రమానికి ఆటంక మయితే—

విపిన్ : (మెల్లిగా) అలా అయితే ముందు సభను కట్టిపెట్టి, మధురాహారమే సేవిస్తే సరి !

శ్రీశ్ : రండి రసిక్‌బాబూ ! మీరేమీ తీసుకోటమే లేదేమిటి ?

రసిక్ : రోజురోజూ కావాలని అడిగి, అప్పుడప్పుడు లాక్కుని తింటూవుంటాను. యివాళ బ్రహ్మచారి సమతి సభ్యుణ్ణిగా— మీ సంసర్గగౌరవంవల్ల కాస్త బలవంతం చేయించుకుందామని చూస్తున్నాను. కాని—

శైల : కాని యేమిటి మళ్ళీ రసిక్‌దాదా ! నువ్వు ఆదివారాలుంటావుగా. యివాళ యేమీ తినవుగా !

రసిక్ : చూశారా మహాశయా ! యింకెవరికీ వర్తించవుట నియమాలు— వొక్క రసిక్ దాదాకే. ఉహుఁ 'బలం బలం బాహుబలం.' ప్రతిమాలించుకోవాలనీ, బలవంతం చేయించుకోవాలనీ చూడకూడదు.

విపిన్ : (నాలుగు భోజనపాత్రలే వుండటం చూసి) మీరు మాతోపాటు కుర్చోరా ?

శైల : ఉహుఁ. నేను వడ్డనచేస్తాను.

శ్రీశ్ : అదెలా కుదురుతుంది !

శైల : నన్ను వడ్డన చేయనీయండి. భోజనం చేయటంలోకంటె వడ్డన చేయటంలో నాకెక్కువ ఆనందం.

శ్రీశ్ : రసిక్‌బాబూ ! యిదేమయినా బాగుందా ?

రసిక్ : 'భిన్నరుచిర్హిలోకః.' వారికి వడ్డనచేయటంలో ఆనందం. మనకు భోజనం చెయ్యటంలో ఆనందం. యిలాంటి రుచిభేదంలో బహుశా కొంచెం పరస్పర సౌకర్యం వుంటుందని తోస్తూంది.

[అందరూ భోజనం చేస్తుంటారు]

శైల : చంద్రబాబూ ! అది తీపి. అది ముందు తినకండి. యిటు పక్కన కూరలూ అవీ వున్నాయి. మంచినీళ్ళ గ్లాసుకి వెతుక్కుంటున్నారా ?— యిదిగో గ్లాసు.

[చంద్రబాబు ప్లేట్లో మామిడిపండు వుంటుంది. దాన్ని అతడు సరిగ్గా తినటానికి వీలుకాక తటపటాయిస్తుంటాడు. జాలిపడి శైల దాన్ని చటుక్కున ముక్కలుకోసి, అతడు సులువుగా తినటానికి వీలయేట్లు చేస్తుంది. యే సమయానికి యేవికావాలో వాటినన్నిటినీ కొంచెం దగ్గరకు జరిపి అందిస్తూ—అతడి భోజనం నిర్విఘ్నంగా జరిగేట్లు చేస్తుంటుంది]

చంద్ర: శ్రీశ్‌బాబూ! స్త్రీసభ్యుల్ని చేర్చుకోటం విషయంలో మీరేమయినా ఆలోచించారా?

శ్రీశ్: ఆలోచించిచూస్తే దాని కభ్యంతరం చెప్పటానికి పెద్దకారణమేమీ కన్పించదు. కేవలం సంఘం చెప్పే అభ్యంతరం సంగతే ఆలోచిస్తున్నా.

విపిన్: సంఘాన్ని అనేక సమయాల్లో శిశువులా పరిగణించటం వుచితం. శిశువు చెప్పే అభ్యంతరాలనన్నిటినీ పాటించుకుంటూపోతే— దానివల్ల శిశువు వృద్ధిలోకి రాదు. సంఘానికూడా ఆ మాట వర్తిస్తుంది.

శ్రీశ్: మన దేశంలో యిన్ని సభలూ, సమితులూ వున్నా, వాటి ప్రయత్నాలు కార్య కలాపాలు అకాలంలో వ్యర్థమైపోవటానికి ప్రధాన కారణం—వాటన్నిటిలోనూ స్త్రీలు లేకపోవటమే అని నా అభిప్రాయం, యేమంటారు రసిక్‌బాబూ?

రసిక్: స్థితిగతుల్నిబట్టి నాకు స్త్రీజాతితో యెక్కువ సంబంధం అయితే లేదనుకోండి. అయినా యింతవరకుమాత్రం తెలుసుకున్నాను. స్త్రీజాతి సహకరిస్తుంది—లేదా అడ్డుతగుల్తుంది. అయితే సృష్టి లేకపోతే ప్రళయం. కనుక వారిని సమితిలో చేర్చుకోటంవల్ల యితర సౌకర్యాలేమీ లేకపోతే లేకపోవచ్చు—కాని వాళ్ళు అడ్డు తగలకుండా మాత్రం చెయ్యొచ్చు. ఆలోచించిచూడండి. బ్రహ్మచారి సమితిలోకి మీరు కనక స్త్రీలను తీసుకొనేట్లయితే—చాటుచాటున యీ సమితిని విచ్ఛిన్నం చెయ్యాలనే వారి ఉత్సాహం యెగిరిపోతుంది. కాని ప్రస్తుత పరిస్థితిలో—

శైల: బ్రహ్మచారి సమితిమీద స్త్రీజాతికి ఆక్రోశం వున్నదన్న వార్త రసిక్‌దాదాకి యెక్కణ్ణించి వొచ్చింది.

రసిక్: ప్రమాదం వొస్తున్నదన్న కబురు తెలియకపోయినా జాగ్రత్తగా వుండకూడదా యేం? వొంటికన్ను లేడికి యేవైపు కన్ను గుడ్డో ఆ వైపునుంచే వొచ్చి తగిలిందిట బాణం. బ్రహ్మచారి సమితి స్త్రీజాతిపట్ల గుడ్డిదయితే అటువైపునుంచే హఠాత్తుగా దెబ్బ తగలొచ్చు.

శ్రీశ్ : (విపిన్‌తో మెల్లిగా) వొంటికన్ను లేడికివాళ వో బాణంవొచ్చి తగిలింది. వొక సభ్యుడు ధూళిపాలయినాడు.

చంద్ర : కేవలం పురుషులతోనే సమాజానికి మేలు చేయాలనుకునేవాళ్ళు—వొంటి కాలితో నడవాలనుకునేవాళ్ళే. అంచేతనే వాళ్ళు కొంతదూరం వెళ్ళాక చతికిల పడాలిసొస్తుంది. గొప్పగొప్ప ప్రయత్నాలన్నిటికీ స్త్రీలను దూరంగా వుంచుతూ వుండటంవల్లనే మన దేశోపకారప్రయత్నాల్లో చైతన్యం శూన్యమవుతోంది. మన హృదయాలు, మన కృత్యాలు, మన ఆశలు—లోపల వొకటి పైకి వొకటిగా వేరైపోయాయి. అంచేతనే మనం బయటికి వెళ్ళి వుపన్యాసాలిస్తాం. యింట్లో కొచ్చి మరిచిపోతాం. చూడు అబలాకాంతబాబూ! యింకా చిన్నవయసు నీది. యీ మాటలు బాగా జ్ఞాపకముంచుకో. స్త్రీజాతిని అవహేళన చెయ్యకు. స్త్రీజాతిని కనక మనం కిందనే వుంచితే వాళ్ళూ మనల్ని కిందివైపుకే లాగుతారు. అలాంటప్పుడు వాళ్ళభారంవల్ల మనం ఉన్నతపథాన నడవటం అసాధ్యమవుతుంది. రెండు అడుగులు వెళ్ళి మళ్ళీ యింట్లో మూలకొచ్చిపడతాం. వాళ్ళని కనక ఉన్నత స్థానంలో వుంచితే—అప్పుడు యింట్లోకి వొచ్చినా మన ఆదర్శాన్ని కించపరుచుకోటానికి సిగ్గుపడతాం. మనదేశంలో బయట సిగ్గు అయితే వుందికాని, యింట్లో ఆ సిగ్గులేదు. అంచేతనే మన ఉన్నతి కేవలం బాహ్యాడంబరంగా పరిణమించింది.

శైల : మీ వుపదేశం వ్యర్థంకాకుండేట్లు, నన్ను మీ ఆదర్శానికి వుపయోగపడేట్లు ఆశీర్వదించండి.

చంద్ర : నా మేనకోడలు నిర్మలను బ్రహ్మచారి సమితిలో చేర్చుకోటానికి మీకేమీ అభ్యంతరంలేదుగా ?

రసిక్ : యింకేమీ అభ్యంతరంలేదు. కేవలం చిన్న వ్యాకరణసంబంధమైన అభ్యంతరం తప్ప. యీ కుమారసమితిలోకి యెవరైనా కుమారీవేషంతో ప్రవేశిస్తే *బోపదేవుని అభిశాపం...

శైల : బోపదేవుని శాపం యీ కాలంలో వర్తించదు.

రసిక్ : సరే, కనీసం 'లోహారామ్' నయినా తప్పించుకుని తిరగాలి. నాకేమనిపిస్తుందంటే—స్త్రీలు పురుషసభ్యులకు తెలియకుండా వేషం—పేరు మార్చుకునివొచ్చేట్లయితే సులభంగా పరిష్కారమవుతుందనుకుంటా.

శ్రీశ్ : అలా అయితే వొక తమాషా అవుతుంది. యెవరు స్త్రీయో, యెవరు పురుషుడో అనే సందేహం రేకెత్తుతుంది.

---

* వంగభాషలో "ముగ్ధబోధ" అనే వ్యాకరణ గ్రంథాన్ని రచించిన ప్రాచీన పండితుడు.

విపిన్ : నేను బహుశా యీ సందేహాన్ని తీర్చుకోగలననుకుంటా.

రసిక్ : నన్నుకూడా యెవరూ హఠాత్తుగా నా మనుమరాల్నిగా శంకించరనుకుంటా.

శ్రీశ్ : కాని అబలాకాంతబాబు విషయంలో సందేహం వుంటుంది.

శైల దగ్గరలో టీపాయ్ మీదవున్న ఫలాహారపు పళ్ళెం
తీసుకురావటానికి వెళుతుంది]

చంద్ర : చూడండి రసికబాబూ! భాషాతత్వంలో కన్పిస్తూంటుంది—వ్యవహారంలోకి రాగా రాగా వొక్కొక్క మాటకు అసలు అర్థం లుప్తమైపోయి, విపరీతార్థం యేర్పడుతూవుండటం, స్త్రీసభ్యుల్ని స్వీకరిస్తే బ్రహ్మచారి సమితి అర్థం వొక వేళ మారిపోతే దానివల్ల నష్టమేమిటి?

రసిక్ : యేమీలేదు. నేను పరివర్తనకు విరోధినికాను. పేరుమార్పు కానీండి, వేషం మార్పు కానీయండి, యేదైనా సరే. యెప్పుడేది జరిగినా విరోధించకుండా స్వీకరిస్తా కనకనే నా మనస్సు నవీనంగా వుంటుంది.

[ఆహారసేవన పూర్తి అవుతుంది. స్త్రీసభ్యుల్ని చేర్చుకునే
విషయంలో యెవరికీ అభ్యంతరం వుండదు]

రసిక్ : సభాకార్యక్రమానికి యేమీ విఘాతం కలగలేదని ఆశిస్తాను.

శ్రీశ్ : యేమీలేదు. తక్కినరోజుల్లో నోటితోనే పనిజరిగేది. యివాళ కుడిచేతికూడా పని తగిలింది.

విపిన్ : దానివల్ల ఆంతరంగిక సంతృప్తి కొంచెం అధికమయింది. అయితే యివాళ యింతటితోనే సభచాలిద్దాం. యెంచేతనంటే యిహపైన యే ఆలోచనా రాదు. యిటు టైంకూడా చాలా అయిపోయింది.

(అందరూ నిష్క్రమిస్తారు)

# తృతీయాంకం

## దృశ్యం ౧

## అక్షయుడి యిల్లు

[అక్షయ్, నీర, నృప]

నీర : పోనిమ్మ పోనిమ్మ పోవువారందరిని
పోబోకుమా నీవుమాత్ర మిటనుండి.
ముగియనేలేదు వర్షాకాల గానమ్మ
మూసియున్నవి కుటీరముల ద్వారములెల్ల
నీరవనిశీథమున చీకటులు నిండినవి
చంచలములైనవి వనాంచలములెల్ల
నిద్రగోల్పోయినవి వ్యాకుల సమీరములు

అక్షయ్ : యేమయిందో చెప్పు అయినా. యిన్నాళ్ళూ పనివాళ్ళ చీపుళ్ళతో తుడవటంతో యీ యిల్లు నిర్మలంగా వుంటూవొచ్చింది. అలాంటియింట్లో గాలి యిప్పుడు రెండు పూటలా మీ అక్కచెల్లెళ్ళ పైటచెంగు విసురులతో చంచల మవుతోందేమిటి ?

నీర : అక్కలేదు. నువ్వు వొక్కడివీ వుంటున్నావని దయతలచి మధ్య మధ్య వొచ్చి చూసిపోతున్నాం. దానికిపైగా సంజాయిషీకూడావా మళ్ళీ ?

అక్షయ్ : అమ్మ దొంగా ! దయామయివా ? శూన్యహృదయాన్ని దొంగిలించటానికి శూన్యగృహంలోకి చొరబడటమా ? ఆంతర్యం యేమిటో బోధపడటంలేదే.

దయామయీ ! చోరశిఖామణీ ! యెంత దయ నాపై
దయతో మాయాపాశము తగిలింపుము నాదు మెడను
దయతో నా శూన్యహృదయధనము నపహరించిపొమ్ము

నీర : మేమంత వెర్రిబాగులదొంగల మనుకోవొద్దు. దొంగిలించటానికి అసలు హృదయమంటూ యెక్కడుందని ?

అక్షయ్ : సరిగ్గాచెప్పు అయితే—యీ అభాగ్యుడి హృదయం యెంతదూరం పోయిందో ?

నృప : నాకు తెలుసు ముఖర్జీ మహాశయా ! చెప్పనా ? నాలుగువందల డెబ్బైఅయిదు మైళ్ళు.

నీర : అక్కా ! తెల్లబోయేట్లు చేశావే ! నువ్వు ముఖర్జీగారి హృదయం వెనకాలే మైళ్ళు లెక్కపెడుతూ పరుగెత్తావా యేం ?

నృప : లేదు చెల్లీ ! అక్క కాశీ వెళ్ళేప్పుడు టైంటేబిల్‌లో మైళ్ళు చూశా.

అక్షయ్ : సిరాధమనులను రక్తము చిందులాడ నల్లదిగో
పారుబోతు హృదయము తా పరుగుతీసి పోవుచుండ
వేగవేగ పరువులెత్తు వెనుక వెన్కగా భామిని
వాయువేగభరమున తన పైటచెంగు తేలియాడు
ముడివీడిన శిరోజములు విడివిడిగా చెదరిపోవు
ఏమీ యీ ఆనందము ! ఏమీ యీ నాట్యభంగి !
ఈ కురంగగామినీ పలాయనమ్మిదేమి !

నీర : కవివర్యా ! బాగు బాగు ! కాని మీ రచనలో యెవరో ఆధునిక కవిఛాయలు కన్పిస్తున్నాయ్ !

అక్షయ్ : దానికి కారణం—నేనూ అత్యంత ఆధునికుణ్ణి. మీరేమనుకుంటున్నారు—మీ ముఖర్జీ మహాశయుడు *కృత్తివాస ఓఝా తమ్ముడనా ? భూగోళంలో మైళ్ళు లెక్కపెడతావ్ గదా చరిత్రలో తేదీలు మరిచిపోవటమా ? అలా అయితే విదుషీమణులైన మరదళ్ళు వుండీ యేమిటి ప్రయోజనం ? యింత గొప్ప ఆధునికుణ్ణి చూసి మీరు ప్రాచీనుడని భ్రాంతిపడ్డారు !

నీర : ముఖర్జీ మహాశయా ! శివుడు వివాహమండపంలోకి వెళ్ళినప్పుడుకూడా ఆయన మరదళ్ళు యిలాగే భ్రాంతిపడ్డారు. కాని ఉమ కళ్ళకిమాత్రం మరోవిధంగా కన్పించాడాయన. మీకెందుకు దిగులు. అక్క మిమ్మల్ని ఆధునికుడిగానే యెరుగును.

అక్షయ్ : బుద్ధిహీనలారా ! శివునికి మరదళ్లే కనక వుంటే, ఆయనకి ధ్యానభంగం కలిగించటానికి మన్మథుడి అవసరం వొచ్చేదా ? నాతో ఆయనకు పోలికా ?

నృప : అవునుకాని ముఖర్జీ మహాశయా ! మీరు యింతసేపటినుంచీ కూర్చుని యేమిటి చేస్తున్నారు ?

అక్షయ్ : మీ గొల్లమనిషి పాలలెక్క రాస్తున్నా.

* వంగభాషలో సుప్రసిద్ధమైన 'కృత్తివాస రామాయణ' గ్రంథకర్త.

నీర : (డెస్కుమీదినుంచి అసంపూర్తిగావున్న వుత్తరం తీసుకుని) యిదేనా పాల లెక్క లెక్కలో పాలు వెన్నల పద్దే యెక్కువే :

అక్షయ్ : (ఒంగారుపడుతూ) అహాఁహాఁ. దాన్నితీసుకెళ్ళి గొడవచెయ్యకు. అబ్బ :... యిచ్చివెళ్ళు.

నృప : నీరూ : వేధించకు. వుత్తరాన్ని ఆయనకి తిరిగి యిచ్చేసెయ్. అక్కడమాత్రం మందక్ళు ఆగడం సహించలేదు. కాని ముఖర్జీ మహాశయా : మీరు వుత్తరంలో అక్కను యేమని సంబోధిస్తారో చెప్పండి :

అక్షయ్ : రోజూ వొక కొత్త సంబోధన చేస్తూవుంటా.

నృప : యివాళ యేమనిచేశారో చెప్పండయినా.

అక్షయ్ : వింటారా ? అయితే సఖీ : విను. చంచలచకిత చిత్తచకోరచోరచంచుచుంబిత చారుచంద్రికా రుచిరుచిరచిరచంద్రమా :

నీర : చమత్కారంగా వుంది చాటుచాతుర్యం.

అక్షయ్ : యిందులో చౌర్యంలేదు. చర్వితచర్వణమూ లేదు.

నృప : (విస్మయంతో) అవును ముఖర్జీ మహాశయా : రోజురోజూ మీరింత పొడుగాటి సంబోధనలు రాస్తూంటారన్నమాట. అందుకనే అక్కకి వుత్తరాలు రాయటం యింత ఆలస్యం అవుతూవుంటుందనుకుంటాను.

అక్షయ్ : అందుకనేగా నృపదగ్గిర నా అబద్ధాలు సాగవ్ : భగవంతుడు నాకు అప్పటి కప్పుడు గద్యను రచించగల అసాధారణమైన ప్రతిభను ప్రసాదించాడు. దాన్ని వుపయోగించుకోనీయటంలేదు యీమె. భగినీపతిమాట వేదవాక్యంగా విశ్వసించా అని యే మనుసంహితలో రాసివుంది చెప్పు.

నీర : కోపం తెచ్చుకోకండి. శాంతించండి ముఖర్జీ మహాశయా : శాంతించండి. నృప అక్కమాట వదిలెయ్యండి. కాని ఆలోచించిచూడండి. నేను మీమాటల్లో సగం కాదు పాతికపరకకూడా విశ్వసించను. దీనివల్లా మీరు సాంత్వన పొందరా ?

నృప : అగిసరేకాని ముఖర్జీ మహాశయా : నిజం చెప్పండి. అక్కమీద మీరెప్పుడైనా కవిత్వం రాశారా ?

అక్షయ్ : ఒంసారి ఆమె మరింత కోపంతెచ్చుకున్నప్పుడు ఆమె స్తోత్రం రచించి గానం చేశాను.

నృప : తర్వాత ?

అక్షయ్ : తర్వాతచూస్తే అనుకున్నదానికి విరుద్ధఫలితమే యెదురయింది. వాయువు తోడయితే అగ్ని యెలా భగ్గుమంటుందో అలా అయింది. అప్పటినించీ స్తోత్ర రచన వొదిలేశాను.

నృప : వొదిలేసి కేవలం గొల్లమనిషి లెక్కలు రాస్తున్నారా ? మీరేం స్తోత్రం రచించారో ముఖర్జీ మహాశయా ! మాకు వినిపించరాదూ !

అక్షయ్ : ధైర్యం చాలటంలేదు. చివరికి నాపై వారిదగ్గర రిపోర్టుచేస్తారు !

నృప : ఉహూఁ. మేం అక్కతో చెప్పం.

అక్షయ్ : అయితే అవధరించండి —

మనోమందిరసుందరీ
స్ఖలదంచలా చలచంచలా
అయి మంజులామంజరీ
రోషారుణరాగరంజితా
గోపనహాస్య— కుటిల—ఆస్య—
కపటకలహాగంజితా
సంకోచనత—అంగినీ
చకితచపల— నవకురంగ—
యౌవనవనరంగినీ
అయిఖలచ్ఛలగుంఠితా
లుబ్ధపతన క్షుబ్ధలోభన
మల్లికా అవలుంఠితా
చుంబనధనవంజినీ
రుద్ధకోరక సంచితమధు
కఠిన కనకకంజినీ

యింకేంలేదు. మీరు వెళ్ళండి.

నీర : యెందుకని ? యెందుకింత అవమానం ? అక్కచేతులో చివాట్లుతిని ఆ అక్కసంతా మామీద వెళ్లగక్కాలా ?

అక్షయ్ : వీళ్ళుచూస్తే అంతఃపురాన్ని యిహ పవిత్రంగా వుండనిచ్చేట్లులేరు. అవి ! దుష్టురాలా ! అందరూ వొచ్చేవేళయింది.

నృప : అంతకంటె అక్క వృత్తరం పూర్తిచెయ్యాలని చెప్పరాదూ !

నీర : అయితే మేము వుంటేమాత్రమేం ? నువ్వుత్తరం రాసుకోరాదూ ? నీ కలం నోట్లోనుంచొచ్చే మాటల్ని మేమేం యెత్తుకుపోతామా యేం !

అక్షయ్ : మీరు దగ్గరుంటే మనస్సు యిక్కడే తిరుగుతోంటుంది. దూరాన వున్నవాళ్ల దాకా పోదు. అహ. యెగతాళి కాదు. వెళ్ళిపొండి. యిప్పుడే వొచ్చేస్తారు వాళ్లందరూ... యీవొక్క గుమ్మంతప్ప యింకోటి లేదు. పారిపోవటానికి వీలుండదు.

నృప : యీ సంజెవేళ నీదగ్గిరకొచ్చేదెవరు ?

అక్షయ్ : యెవర్ని ధ్యానిస్తున్నానో వారుమాత్రం కాదు.

నీర : యెవర్నిగురించి ధ్యానంచేస్తారో వారెప్పుడూ రారు. ఆ సంగతి యీపాటికి బాగా గ్రహించివుంటా రనుకుంటాను ముఖర్జీ మహాశయా ! దేవతల్ని ధ్యానంచేస్తే వుపదేవతల వుపద్రవం వొచ్చిపడుతుంది.

నీవే నా ధ్యానధనము
నీ యెదలో సందడించు నిక్కము నగవులు వగపులు
వసంతమ్ము చేరవచ్చె వకుళప్రసవములు విచ్చె
పూవుటీరములను నిండె పున్నమిచందురుని నవ్వు
ఎందెందున వెదకిరేవి పొందలేరు వారునిన్ను
అంతరంగమందె యుందు వతిగుప్తస్వప్నముగా

అక్షయ్ : యెక్కడినుంచి సంగ్రహించింది ?

నీర : మీ శ్రీముఖంనించే !

అక్షయ్ : చివరకు విరహంలో వున్నప్పుడు నా శ్రీహృదయం మీదనే దాడి చెయ్యవొచ్చావా ? సరే. అయితే యింక దయ తలచవొద్దు. సాంతం పూర్తికానియ్.

నీర :
కనులకింత భ్రమనుగొల్పి చనియెద విది యేటివరుస
బాష్పసలిలసేచనమున పరిశుద్ధము చేయరాదొ
పరిమళములెకాని విరులసరులెచ్చట కానరావు
అడుగుల సవ్వడులెగాని నడువరెవరు దారిలోన
పూలన్నియు వాడిపోయి, కాలమెల్ల గడచిపోవ
అనాథయై దిక్కుమాలి యట్లైనిలిచె నా భవనము

[నేపథ్యంలో]

"అబలాకాంతబాబు వున్నారా ?"

[చటుక్కున శ్రీశ్ ప్రవేశిస్తాడు. 'క్షమించండి' అని పారి పోబోతాడు. నృప, నీరు కంగారుగా వెళిపోతారు]

అక్షయ్ : రండి, రండి శ్రీశ్ బాబూ !

శ్రీశ్ : (సిగ్గుపడుతూ) క్షమించండి.

అక్షయ్ : సరే. అలాగే. కాని అపరాధమేమిటో ముందు చెప్పండి.

శ్రీశ్ : ముందుగా తెలియజెయ్యకుండానే—

అక్షయ్ : మీ స్వాగతంకోసం మునిసిపాలిటీనించి బడ్జెట్ శాంక్షన్ కావలసిన అవసరం యెటూ లేనప్పుడు—ముందు తెలియజెయ్యకుండానే రావొచ్చు శ్రీశ్ బాబూ !

శ్రీశ్ : యిక్కడికి నే రావటం అనధికారంగా అసమయంలో ప్రవేశించటంకిందికి రాదని మీరంటే చాలు—

అక్షయ్ : అలాగే అంటాను. మీరెప్పుడొస్తే అదే సుసమయం. మీరెక్కడ అడుగు పెడితే అక్కడే మీకు అధికారం—శ్రీశ్ బాబూ ! స్వయంగా విధాతే మీకు అన్ని చోట్లకు పాస్ పోర్టు యిచ్చేశాడు. కాస్త కూర్చోండి. అబలాకాంతబాబుకి కబురు పంపుతాను. (స్వగతంలో) పారిపోతేనేగాని వుత్తరం పూర్తికాదు.

[వెళ్ళిపోతాడు]

శ్రీశ్ : కళ్ళయెదట్నుంచి రెండు మాయబంగారులేళ్ల పరుగెత్తాయి. వోరి నిరస్త్రవ్యాధుడా ! నీకు వెంబడించే సమర్థత లేదు. గీటురాయిమీద బంగారుగీతలాగ, చూపు దృష్టి పథంమీదవే అంకితం అయిపోయినట్లుంది.

[రసిక్ ప్రవేశిస్తాడు]

శ్రీశ్ : సంజెవేళవొచ్చి మీకు చిరాకు కలిగించలేదుగదా రసిక్ బాబూ !

రసిక్ : భిక్షుకుడికి పడేసిన చెరుకుముక్క రసవిహీనమవుతుందా ? శ్రీశ్ బాబూ ! మిమ్మల్నిచూసి చిరాకుపడేటంత అభాగ్యుణ్ణా ?

శ్రీశ్ : అబలాకాంతబాబు యింట్లోవున్నారా ?

రసిక్ : లేకేం ! రమ్మని చెప్పనా ?

శ్రీశ్ : వొద్దు, వొద్దు. వొకవేళ యేదైనా పనిలోవుంటే వారిని తొందరపెట్టి ప్రయోజనంలేదు. నేను సోమరిపోతుని. పనిలేనివాళ్ళకోసం వెతుక్కుంటూ తిరుగుతుంటాను.

రసిక్ : ప్రపంచంలో అందరూ సోమరులే. అసలు పనిలేనివాళ్ళే ధన్యులు. వుభయులూ కనక కలిస్తే అది మణికాంచనసంయోగమే. యిలా సోమరిపోతులూ, నిరుద్యోగులూ కలుసుకోటానికేగా సంధ్యాసమయాన్ని సృష్టించింది. యోగులకోసం ప్రాతఃకాలం. రోగులకోసం రాత్రిసమయం. పనివున్నవారికోసం పదినుంచి నాలుగువరకూ మధ్యసమయం. యిహ సంధ్యాసమయం — నిజం చెబుతున్నా — బ్రహ్మచారి సమితి సమావేశంకావటానికేగా చతుర్ముఖుడు సృష్టించింది? యేమంటారు శ్రీశ్‌బాబూ!

శ్రీశ్ : ఆ మాట అంగీకరించకుండా వుంటామా! సంధ్యాసమయం బ్రహ్మచారి సమితికి చాలాపూర్వమే సృష్టింపబడ్డది. అది మన సభాపతి చంద్రాబాబు నియమాల్ని పాటించదు.

రసిక్ : చంద్రుడి నియమాల్ని పాటించేవారి నియమమే వేరు. మీదగ్గిర స్పష్టంగా చెబుతాన్నాను. నవ్వకండి శ్రీశ్‌బాబూ! కింది అంతస్థులో నా గదిలోకి కష్టపడి వో కిటికీలోంచి కాస్త వెన్నెల ప్రవేశిస్తుంటుంది. శుక్లపక్షంలో సందెవేళ స్వచ్ఛమైన వెన్నెలకాంతి నా హృదయంమీదికి పడుతున్నప్పుడు యెవరు నాదగ్గిరకి యే సందేశం పంపారా అనిపిస్తుంటుంది. తెల్లని వొక హంసదూత యే విరహిణి పక్షాన యీ శాశ్వతవిరహి చెవుల్లో యిలా చెబుతున్నట్లుంటుంది—

అలిందే కాలిందీ కమలసురభౌ కుంజవసతేః
వసంతీం వాసంతీ నవపరిమళోద్గారచికురాం
త్వదుత్సంగే లీనాం మదముకులితాక్షీం పునరిమాం
కదాహం సేవిష్యే కిసలయకలాప వ్యజనినీమ్

శ్రీశ్ : వాహ్! వాహ్! రసిక్‌బాబూ! చమత్కారంగా వుంది. ఛందస్సులోంచి దాని రసం బోధపడుతోందనుకోండి. కాని అనుస్వారవిసర్గలతో యెంగిలికాపీయకుం —

రసిక్ ; వొక తర్జుమా కూడా చేశాను. సంపాదకులకు తెలిస్తే చుట్టూ యెక్కడ తిరుగుతారో అని దాచివుంచాను.

శ్రీశ్ : వాహ్ వాహ్ రసిక్‌బాబూ! మీలో యింత యిదివుందని నాకు తెలియనే తెలియదు!

రసిక్ : యెలా తెలుస్తుంది చెప్పండి. కావ్యలక్ష్మి తన పద్మవనంలోంచి అప్పుడప్పుడు. యీ బట్టతలమీదికి ఆరుబయలు గాలికోసం వొస్తూవుంటుందని యెవరూ సందేహిం చనే సందేహించరు. (చేత్తో నిమురుకుని) యిలాంటి ఖాళీజాగా యింకెక్కడా లేదు.

శ్రీశ్ : అహ్హాహ్హా రసిక్‌బాబూ! యమునాతీరంలో చక్కటి వరాండావున్న ఆ కుంజ కుటీరం నాకు యెంతో బాగుంది. 'పయనీర్' పత్రికలో అది 'వేలం వేయ బడును' అని ప్రకటన కనక వొచ్చేట్లయితే దాన్ని కొనేసేస్తాను.

రసిక్ : అదేమిటి శ్రీశ్‌బాబూ! కేవలం వరాండాను యేంజేసుకుంటారు? ఆ మద ముకుళితాక్షి సంగతి ఆలోచించాలి. ఆమెని వేలంలో పొందటం కష్టం.

శ్రీశ్ : యెవరి రుమాల యిక్కడ పడిపోయింది?

రసిక్ : యేదీ! చూడనీండి! అదా! దుర్లభమైన వస్తువు మీచేతికి చిక్కినట్లు తోస్తుంది. వాహ్! యెంత చక్కటి వాసన! శ్లోకంలో పంక్తి మార్చివెయ్యాలి మహాశయా! ఛందోభంగ మయితేఅవుతుంది. 'వాసంతీ నవపరిమళోద్గార రుమాలాం.' శ్రీశ్ బాబూ! యీ రుమాలను మన బ్రహ్మచారి సమితి పతాకగా చేసుకోటానికి వీలు పడదు. చూశారా! వొకమూల 'న' అన్న అక్షరం కుట్టివుంది.

శ్రీశ్ : యేమిపేరయివుంటుందో చెప్పండి అయినా! నళినీ? అహఁ. అది చాలామందికి వుండే పేరే. నీలాంబుజా? చాలా మోటు. నీహారికా? మరీ అతిశయోక్తి! చెప్పండి రసిక్‌బాబూ! మీకేమనిపిస్తుంది?

రసిక్ : పేరు తోచటంలేదు శ్రీశ్‌బాబూ! నాకు మనస్సులో భావాలుమాత్రం పేరు కుంటున్నాయి. నిఘంటువులో 'న'తో వున్న పదాలన్నీ బుర్రలో పోగవు తున్నాయి. 'న' లతో మాలొకటికి కూర్చి నీలోత్పలనయన మెడలో వేయాలని పిస్తోంది. 'నిర్మలనవనీనందితనవీన ' చెప్పండి శ్రీశ్‌బాబూ! పూర్తిచెయ్యండి.

శ్రీశ్ : నవమల్లికా.

రసిక్ ; వాహ్ వాహ్. నిర్మలనవనీనందిత నవీననవమల్లికా. గీతగోవిందం మట్టిలో కలిసిపోయింది. యింకా యెన్నెన్నో మంచి మంచి 'న' లు బుర్రలో హాహాకారాలు చేస్తూ పరుగులిడుతున్నాయి. సరీగా కూర్చోలేకపోతున్నాను మహాశయా! నిభృత నికుంజనిలయ — నిపుణనూపురనిక్వణనిబిడనీరదనిర్ముక్త— అక్షయబాబు వున్న ట్లయితే ఆలోచించాలిసొచ్చేదికాదు. మేష్టార్ని చూడగానే పిల్లలందరూ తమతమ బెంచీలమీదికిపోయి వరసగా యెలా కూర్చుంటారో — అక్షయబాబు అలికిడికాగానే మాటలన్నీ పరుగెత్తుకెళ్ళి క్రమపద్ధతినిపోయి కూడుకుంటాయి. ముసలివాణ్ణి వంచించి రుమాల కాస్తా చాటుగా జేబులో పెట్టుకోకండి.

శ్రీశ్ : ఆవిష్కారకర్త అధికారం అందరికంటె పైది—

రసిక్ : నాకా రుమాలతో కొంచెం ప్రయోజనంవుంది శ్రీశ్‌బాబూ! మీకు చెప్పానుగా— నా నిర్జనగృహంలోని వొక్కగానొక్క కిటికీలోంచి రవంత వెన్నెలమాత్రం పడుతూంటుంది. నాకో కవిత జ్ఞాపకం వొస్తూంటుంది.

వీథీషు వీథీషు విలాసినీనాం
ముఖాని సంవీక్ష్య శుచిస్మితాని
జాలేషు జాలేషు కరంప్రసార్య
లావణ్యభిక్షా మటతీవచంద్రః

అభాగ్యుడయిన భిక్షుకుడు నా గవాక్షంచెంతకు వొచ్చినప్పుడు యేమిచ్చి మురిపించను చెప్పండి. కావ్యశాస్త్రిల్లోని రసవత్తరఘట్టాలన్నీ గుర్తుకొచ్చి అన్నీ ఆవృత్త మౌతూంటాయి. కాని సమన్వయం కావు. ఆ దుర్భిక్షసమయాల్లో యీ రుమాల చాలా వుపయోగిస్తుంది. అందులో లావణ్యసంపర్కం చాలావుంది.

శ్రీశ్ : ఆ లావణ్యాన్ని దైవికంగా యెప్పుడైనా చూశారా రసిక్‌బాబూ?

రసిక్ : చూడకపోవటమేమిటి? లేకపోతే యీ రుమాలకోసం యింత యుద్ధంచేస్తానా? యిప్పటికీ యింకా నా తలలో తుమ్మెదలా ఝుమ్మని తిరుగుతున్న 'న' అనే అక్షరానికెదురుగా కమలవనవిహారిణి అయిన వొక మానసమూర్తి లేదూమరి?

శ్రీశ్ : రసిక్‌బాబూ! మీ మస్తిష్కం వుందే అది వొక తేనెతుట్టెలాంటిది. దాని రంధ్రాల్లోంచి స్రవించే కవితామధువు నాకూడా మత్తెక్కిస్తోంది.

[పెద్ద నిట్టూర్పు విడుస్తాడు]

[పురుషవేషధారిణి శైలబాల ప్రవేశిస్తుంది]

శైల : నేను రావటం చాలా ఆలస్యమయిపోయింది. క్షమించండి శ్రీశ్‌బాబూ!

శ్రీశ్ : నేనూ యీ సంజవేళ మీపని కడ్డంవొచ్చాను. మీరుకూడా క్షమించాలి అబలాకాంతబాబూ!

శైల : రోజూ సాయంసమయాల్లో యిలాగనక అడ్డమొస్తూవుండేట్లయితే క్షమిస్తాను. లేకపోతే లేదు.

శ్రీశ్ : సరే, వొప్పుకుంటున్నాను. కాని తర్వాత మీరు పస్తాయించవలసొస్తే మాత్రం యీ ప్రతిజ్ఞ జ్ఞాపకం వుంచుకోవాలి.

శైల : నన్నుగురించి దిగులుపెట్టుకోకండి. కాని మీరుకనక పశ్చాత్తాపపడాలిసొస్తే మీకు నిష్కృతి కల్గిస్తాను.

శ్రీశ్ : ఆ నమ్మకంమీద కనక మీరు వుందేట్లయితే అంతులేకుండా వేచివుండాలి.

శైల : రసిక్‌దాదా ! నువ్వు శ్రీశ్‌బాబు పాకెట్‌కేసి చెయ్యిచాస్తున్నావ్ దేనికి ? యీ ముసలితనంలో జేబులు కత్తిరించే వృత్తి మొదలెడతావా ?

రసిక్ : కాదు భాయీ ! ఆ వృత్తి మీవయసులోనే శోభగా వుంటుంది. వొక రుమాల గురించి శ్రీశ్‌బాబుకూ నాకూ తగాదా వొచ్చిపడింది. దాన్ని నువ్వు పరిష్కారం చెయ్యాలి.

శైల : అదెలా ?

రసిక్ : ప్రేమబజార్లో పెద్ద వడ్డీవ్యాపారం సాగించటానికి నాకు మూలధనం లేదు. నాది చిన్నచిన్న వస్తువుల వ్యాపారం. రుమాళ్ళు, తలవెంట్రుకలు, చిన్నచిన్న కాయితాలమీద నాలుగయిదు స్వదస్తూరితో రాసిన అక్షరాలు— యిలాంటివాటి నన్నిటినీ సమకూర్చుకునే సంతృప్తిపడాలి. శ్రీశ్‌బాబు తమకున్న మూలధనంతో బజారంతా చిల్లరధరకే కొనెయ్యగలరు. రుమాలెందుకు— నీలాచలమంతటిలో సగంవరకూ తమ అధికారాన్ని చలాయించగలరు. మనం తలవెంట్రుకల్ని తాడు చేసి దాన్ని కంఠానికి వురిపెట్టుకుందామనుకునేచోట వారు ఆగుల్ఫలంబితపరిమళ భరితకేశజాలమనే అంధకారంలో సంపూర్ణంగా మునిగి అదృశ్యం అవగలరు. వారు ఉంఛవృత్తి చెయ్యటానికెందుకొస్తారు ?

శ్రీశ్ : అబలాకాంతబాబూ ! మీరు నిష్పక్షపాతవ్యక్తులు. రుమాల ప్రస్తుతం మీదగ్గరే వుంచండి. యిరుపక్షాల వాదాలూ పూర్తిఅయినతర్వాత విచారణలో యెవరిపక్ష మయితే వారికివ్వొచ్చు.

శైల : (రుమాల జేబులో పెట్టుకొని) నన్ను మీరు నిష్పక్షపాతవ్యక్తిగా భావించారను కుంటా. యీ మూల 'న' అనే అక్షరం యెర్రదారంతో కుట్టివున్నట్లే— నా హృదయంలో వొక మూల ఆ 'న' అక్షరమే రక్తంతో లిఖితమైవున్నట్లు వెతికితే కన్పిస్తుంది మీకు. యీ రుమాల మీయిద్దరిలో యెవరికీ యివ్వను నేను.

శ్రీశ్ : రసిక్‌బాబూ ! యిదేమిటీ జబర్దస్తీ ! అసలు 'న' అక్షరంకూడా చాలా భయం కరమైన అక్షరం.

రసిక్ : నే విన్నదేమిటంటే విదేశీశాస్త్రంలో న్యాయధర్మం గుడ్డిది. యిద్దరు గుడ్డివాళ్ళు గనక పోట్లాడితే యెవరికి బలమెక్కువుంటే వాళ్ళు గెలుస్తారు.

శైల : శ్రీశ్ బాబూ ! యిది యెవరి రుమాలో వారిని మీరు చూడలేదు. అయినా యెందుకు వూరికే వూహలమీద ఆధారపడి జగడమాడతారు.

శ్రీశ్ : చూడలేద నెవరన్నారు ?

శైల : చూశారా ? యెవర్ని చూశారు ? 'న' లు యిద్దరున్నారు.

శ్రీశ్ : యిద్దర్నీ చూశాను. యీ రుమాల ఆ యిద్దరిలో యెవరిదయినాకానీ నా హక్కును నేను వొదులుకోలేను.

రసిక్ : శ్రీశ్ బాబూ ! వృద్ధుడి సలహా వినండి. హృదయాకాశంపై యిద్దరు చంద్రుల్ని నిలుపుకోకండి. 'ఏకశ్చంద్రస్త మోహన్తి'—

[నౌకరు ప్రవేశిస్తాడు]

నౌకరు : (శ్రీశ్‌తో) చంద్రబాబు వుత్తరం తీసుకుని వౌకరు మీయింటికి వెతుక్కుంటూ వెళ్ళి, చివరి కిక్కడికొచ్చారు.

శ్రీశ్ : (వుత్తరం చదువుకుని) కొంచెం సేపుంటారా ? చంద్రబాబు యిల్లు దగ్గిరే, నేను చప్పున వెళ్ళిచూసొస్తాను.

శైల : పారిపోరు కదా !

శ్రీశ్ : ఉహూఁ. నా రుమాల తాకట్టు వుంచుతున్నాను. దాన్ని విడిపించుకోకుండా వెళ్ళిపోను.

[వెళ్ళిపోతాడు]

రసిక్ : అమ్మాయ్ శైలా ! బ్రహ్మచారి సమితిలోని సభ్యులు యెంత భయంకరమైన బ్రహ్మచారులో అనుకున్నా. కాని అలాంటివాళ్ళేంకాదు. వీళ్ళ తపస్సు భగ్నం చెయ్యటానికి మేనకా, రంభా, మన్మథుడూ, వసంతుడూ—యెవరూ అఖ్ఖర్లేదు. యీ ముసలితాత రసిక్ చెయ్యగలడు.

శైల : అలాగే తోస్తోంది.

రసిక్ : అసలు సంగతేమిటో తెలుసా ? డార్జిలింగ్‌లో వుండేవాళ్ళు మలేరియాప్రాంతంలో అడుగుపెట్టారంటే చాలు — వాళ్ళనా రోగం పట్టుకుంటుంది. వీళ్ళిన్నాళ్ళూ చంద్రబాబు యింట్లో మంచి ఆరోగ్యకరమైన ప్రదేశంలో వున్నారు. యీ యిల్లు రోగాణువులతో నిండిన యిల్లు. యిక్కడి రుమాళ్ళు, పుస్తకాలు, కుర్చీలు, టేబుల్స్—వేటిని ముట్టుకుంటే వాటిలోంచే వొక్కసారిగా ముక్కునా, నోటా రోగం ఆక్రమించేస్తుంది. పాపం శ్రీశ్ బాబు వెళ్ళారు !

శైల : రసిక్‌దాదా ! నీకు బహుశా రోగబీజాలు అలవాటయిపోయాయనుకుంటా.

రసిక్ : నా సంగతి వొదిలెయ్. ఉదరక్లేశా లేవేవివున్నాయో అన్నీ వొచ్చేశాయి నాకు.

[నీరబాల ప్రవేశిస్తుంది]

నీర : మేం పక్క గదిలోనే వున్నాం.

రసిక్ : జాలర్లు వల లటూయిటూ లాక్కోలేక చస్తున్నారు. గద్దమాత్రం పైన సిద్ధంగా వుంది నెత్తిన తన్నటానికి.

నీర : నృప రుమాల తీసుకుని శ్రీశ్‌బాబు యెంత హంగామా చేశారు ! నృప సిగ్గుతో కందిపోయి పారిపోయింది. నేనింత అమాయకురాల్ని — పొరపాటునయినా యేమీ పారేయకుండాపోయాను. పన్నెండు రుమాళ్ళు తీసుకొచ్చాను. యీసారి గదినిండా రుమాళ్ళు వొదిలేసి పోదామనుకుంటున్నా.

శైల : నీ చేతిలో అదేం పుస్తకం నీరా !

నీర : నాకు నచ్చిన పాటలన్నీ యిందులో రాసుకుని పెట్టుకున్నాను అక్కా !

రసిక్ : నీరా ! యిప్పుడు నీకెలాంటి పారమార్థికమైన పాటలు నచ్చుతున్నాయో — వాటిల్లో వొకటి రెండు మచ్చుతునకలు చూడొచ్చునా !

నీర :

బ్రతుకంతయు గడచిపోయె
ఆవలితీరమ్ము జేర్చ
నావ అల్లదే ! పిలువుము !
ఇచ్చిపుచ్చుకోళ్లగాగ - లెక్కలెల్ల ముగియింపుము

రసిక్ : నువ్వు చాలా తొందరపడుతున్నావ్ నీరా ! దాటించటానికి నావికుణ్ణి యిప్పుడే పిలిపిస్తాను. యిచ్చిపుచ్చుకోటాలు యేవో ఖరారుచేసి తీసుకో.

నీర :

అంధకారమున దీపము
వెలుగుటలేదనియా నే
నెంతపిలిచినా యులుకవు పలుకవు ?
సుఖమున దుఃఖమ్మున నా
యెదలో నీ మురళి మ్రోగు
నిన్ను జేరు దారి తెలియ
కున్నవారి నేడ్పింతువు !
నింగివైపు చూడక్కనిలిపి

నిలిచియుండు నే నీయెడ
నాదు మనోవేదనచే
నాకృష్టుడవై వాకిలి
చెంత చేరగలవటంచు
అనుక్షణము నా యెదలో
ఆశయేదో పొడముచుండు

[నేపథ్యంలో]

"అబలాకాంతబాబు వున్నారా?"

[విపిన్ గదిలోకి వొచ్చి, గతుక్కుమని నిలబడిపోతాడు. నీరజాల వొక్కక్షణం తెల్లబోయి, గబగబా బయటికి వెళ్ళిపోతుంది]

శైల: రండి. విపిన్‌బాబూ!

విపిన్: కచ్చితంగా చెప్పండి. రావొచ్చునా! నేను రావటంమూలంగా మీకెలాంటి నష్టమూ లేదుగదా!

రసిక్: కొంత నష్టపడందే లాభం రాదు విపిన్‌బాబూ! అదే వ్యాపారసరళి. పోయిన దానికి రెట్టింపు రాబట్టుకోవచ్చు. యేమంటావ్ అబలాకాంత్?

శైల: రసిక్‌దాదా రసికత యీమధ్య కాస్త గట్టిపడుతోంది.

రసిక్: చెరుకుపాకం గట్టిపడి బెల్లమయినట్లు. కాని విపిన్‌బాబూ! మీరేం ఆలోచిస్తున్నారో చెప్పండి!

విపిన్: యే నెపంతో బయటపడితే—నన్ను వదిలెయ్యటానికి మీ గౌరవానికి భంగం రాకుండా వుంటుందా అని ఆలోచిస్తున్నా.

శైల: స్నేహానికి భంగం కలిగితే?

విపిన్: అలా అయితే నెపం వెతకాల్సిన అవసరమే లేదు.

శైల: అయితే యిహ ఆ వెతకటం వొదిలేసి, సరీగ్గా కూర్చోండి.

రసిక్: ముఖం ప్రసన్నం చేసుకోండి విపిన్‌బాబూ! నన్నుగురించి యీర్ష్యపడకండి. నేను వృద్ధుణ్ణి. యువకులు యీర్ష్యపడటానికి అర్హుణ్ణికాను. యిహ మా సుకుమార మూర్తి అబలాకాంతబాబుని యే స్త్రీకూడా పురుషుణ్ణిగా భావించనే భావించదు. మిమ్మల్నిచూసి కనక యే సుందరయువతి అయినా బెదరిన లేడిలాగ పారిపోయిం

దంటే— ఆమె మిమ్మల్ని పురుషుణ్ణిగా యెంతో గౌరవిస్తున్నదని మనస్సుని సమాధానపరచుకోండి. అయ్యో! వారి అభాగ్యుడైన రసికా! నిన్నుచూసి యే తరుణీ సిగ్గుపడి పారిపోనుకూడా పారిపోదుగదా!

విపిన్ : రసిక్‌బాబు మిమ్మల్నికూడా యీ జట్టులోకి లాగుతున్నారు అబలాకాంతబాబూ! యిదేమిటి?

శైల : నాకేం తెలుసు విపిన్‌బాబూ! నా యీ అబలాకాంతబాబు అన్నపేరే మిథ్య— యే అబలకూడా యింతవరకూ నన్ను కాంతుణ్ణిగా వరించలేదు.

విపిన్ : నిరాశపడకండి. యింకా సమయం మించిపోలేదు.

శైల : ఆ ఆశ, ఆ సమయమూ కనక వుంటే బ్రహ్మచారి సమితిలో పేరు చేర్పించుకోటానికి సిద్ధపడేవాణ్ణే కాను.

విపిన్ : (స్వగతంగా) యితడి మనసులో యేదో వేదన కనిపిస్తుంది. లేకపోతే యింత పిన్నవయసులో, యీ లేతముఖంలో స్నిగ్ధకోమలకరుణభావం వుండేదికాదు. యిదేం పుస్తకం! పాటలు రాసివున్నట్లు కన్పిస్తోంది. 'నీరబాలాదేవి—'

[చదువుతూంటాడు]

శైల : యేమిటి చదువుతున్నారు విపిన్‌బాబూ!

విపిన్ : యెవరో వొక అపరిచితురాలికి అపరాధంచేశాను. బహుశా ఆమెదగ్గిర క్షమాపణకోరుకునే అవకాశాన్ని పొందలేనేమో! బహుశా ఆమెచేతులో శిక్ష పొందే భాగ్యంకూడా రాదేమో! కాని యీ పాటలు రత్నాలు - యీ దస్తూరి ముత్యాలు. వొకవేళ లోభపడి దొంగిలించేట్లయితే దండదాత అయిన విధాత క్షమిస్తాడనుకుంటా.

శైల : విధాత క్షమించొచ్చు. కాని నేనుమాత్రం క్షమించను. ఆ పుస్తకంమీద నాకు లోభంవుంది విపిన్‌బాబూ!

రసిక్ : అయితే నేనేనా లోభం మోహం అన్నీ జయించి కూర్చున్నవాణ్ణి? ఆహా! దస్తూరిలాంటి వస్తువు మరోటుందా? మనస్సులో భావాలు రూపుదిద్దుకుని, వేళ్ళ చివర్నించి బయటికొస్తూవుంటాయి. అక్షరాలమీదికి చూపు ప్రసరించగానే— హృదయం కళ్ళలోకివొచ్చి నిలుస్తున్నట్లనిపిస్తుంది. అబలాకాంత్ యీ పుస్తకాన్ని విడిచిపెట్టవొద్దు. చంచల అయిన మీ నీరబాలాదేవి కౌతుకస్రవంతిలాగా రాత్రిం బవళ్ళు పరవళ్ళు తొక్కుతూంటుంది. ఆమెని పట్టుకుని ఆపలేం. యీ పుస్తకం పుటలు ఆమె గండూషంతోనే నిండివున్నాయి. యీ వస్తువుకి విలువ వుంది—

విపిన్‌బాబూ! మీరు నీరబాలను యెరుగనైనా యెరుగరు. మీరీ పుస్తకం తీసుకుని యేంజేసుకుంటారు?

విపిన్: మీరు స్వయంగా ఆమెనే యెరుగుదురు. యిహ పుస్తకంతో మీకేమిటి ప్రయోజనం? యీ పుస్తకంనించి నేను యే పరిచయాన్నయితే యెదురుచూస్తు న్నానో దానిమీదికి మీదృష్టి పోనీయటం దేనికి?

[శ్రీశ్ ప్రవేశిస్తాడు]

శ్రీశ్: జ్ఞాపకమొచ్చింది మహాశయా! ఆనాడిక్కడే పుస్తకాలమీద పేర్లు చూశాను. నృపబాల, నీరబాల — యిదేమిటీ? విపినా? నువ్విక్కడికి హఠాత్తుగా—?

విపిన్: నీవిషయంలోకూడా సరిగ్గా అదే ప్రశ్న అడగొచ్చు.

శ్రీశ్: నేను మన సన్యాసి సంప్రదాయం సంగతి అబలాకాంతబాబుతో సంప్రతించ టానికొచ్చాను. ఆ ముఖం, ఆ కంఠస్వరం, ముఖంలో భావం—వారు సరిగ్గా మన సన్యాసులకు ఆదర్శంగా వుండగలరు. వారుకనక తమ చంద్రరేఖలాంటి నుదుట చందనం దిద్దుకుని, మెడలో దండవేసుకుని, చేత్తో వీణ వొకటి పట్టుకుని, పొద్దున్నే యే వూళ్లోనయినా అడుగుపెట్టారంటే— యే గృహస్థు హృదయం ద్రవించకుండా వుంటుంది?

రసిక్: అర్థంకావటంలేదు మహాశయా! హృదయం ద్రవింపజెయ్యటాని కంత అవసర మేమొచ్చింది?

శ్రీశ్: బ్రహ్మచారి సమితి —హృదయాన్ని ద్రవింపజేసే సమితి.

రసిక్: యేమన్నారు! అయితే నావల్ల మీకేమిటీ ఉపయోగం?

శ్రీశ్: మీలో యెంత ఉత్తాపం వున్నదంటే—మీరుకనక ఉత్తర మేరువుమీదికి వెళితే అక్కడవున్న మంచునంతట్నీ కరిగించి యేరుగా ప్రవహింపజెయ్యగలరు. విపిన్! లేస్తున్నావా యేం?

విపిన్: వెళతాను. రాత్రిళ్లు నేను కొంచెం చదువుకోవాలి.

రసిక్: (జనాంతికంగా) అబలాకాంత్ అడుగుతున్నాడు చదవటం అయిపోయాక ఆ పుస్తకం తిరిగివస్తుందా?

విపిన్: (జనాంతికంగా) చదవటం అయిపోయాక దాన్నిగూర్చి ఆలోచించటం జరుగు తుంది. యివ్వాల్టికి పోనీండి.

శైల : (మెల్లగా) శ్రీశ్‌బాబూ ! తటపటాయిస్తున్నారేమిటి ? మీదేమయినా పారేసుకున్నారా యేం ?

శ్రీశ్ : (మెల్లగా) యివాళకాదు. మరోరోజున వెతికిచూసుకుంటాను.

[శ్రీశ్, విపిన్ వెళ్ళిపోతారు]

నీర : (గబగబా వొచ్చి) యిదేం బందిపోటుతనం అక్కా ! నా పాటలపుస్తకం తీసుకెళ్ళిపోయారు. నాకు భలే (రాగం) కోపం వొస్తోంది.

రసిక్ : రాగశబ్దానికి నానార్థాలున్నాయి నిఘంటువులో.

నీర : సరే పండితమహాశయా ! నీ నిఘంటువును పైకితీయనక్కర్లేదు. నా పుస్తకాన్ని తిరిగి తీసుకురా.

రసిక్ : పోలీసులకు కబురుచెయ్యినీరా ! దొంగల్ని పట్టుకోటం నా వృత్తికాదు.

నీర : నా పుస్తకాన్ని నువ్వెందుకు తీసుకెళ్లనిచ్చావ్ అక్కా !

శైల : యింత అమూల్యధనాన్ని నువ్వు పారేసుకుని యెందుకు వెళ్ళావ్ ?

నీర : నేనేం బుద్ధిపూర్వకంగా వొదిలేసెళ్లానా యేం ?

రసిక్ : లోకులావిధంగానే శంకిస్తారు.

నీర : వూరుకో రసిక్‌దాదా ! నీ వేళాకోళం నాకేం బావుండలేదు.

రసిక్ : అయితే భయానకమైన దుస్థితి.

[నీరబాల కోపంతో వెళిపోతుంది]

[సిగ్గుపడుతూ నృపబాల ప్రవేశిస్తుంది]

రసిక్ : యేమిటి నృపా ! పోగొట్టుకున్న ధనానికై వెతుక్కుంటూ తిరుగుతున్నావా ?

నృప : ఊహూఁ. నాదేమీ పోలేదు.

రసిక్ : అది చాలా సంతోషకరమైన వార్తే. శైలా అయితే యింకెందుకు ? రుమాల యజమాని యెప్పుడయితే కన్పించటంలేదో అప్పుడిహ కన్పించిన వ్యక్తికిచ్చేసెయ్ (శైల చేతులోంచి రుమాల తీసుకుని) యీ వస్తువెవరిది నృపా ?

నృప : వో ! అది నాదికాదు.

[పారిపోబోతుంది]

రసిక్ : (నృపను పట్టుకుని) యే వస్తువయితే వొదిలేసుకున్నావో దానిమీద యింక యెలాంటి హక్కు వుంచుకోకూడదు.

నృప : రసిక్‌దాదా ! విడిచిపెట్టు ! నాకు పనుంది.

## దృశ్యం ౨

## 'గోల్‌దీఘి' దారి

[శ్రీశ్—విపిన్]

శ్రీశ్ : యేమోయ్ విపిన్ ! యివాళ మాఘమాసం చివరలో తొలి వసంతపుగాలి సాగింది. వెన్నెలకూడా కన్నులపండువుగా వుంది. యివాళ గనక యిప్పుడే పడుకుని నిద్రపోయినా, పాఠాలు వల్లెవేయబోయినా దేవతలు చిన్నచూపుచూస్తారు.

విపిన్ : దేవతల యీసడింపులను సహించటం సహజమేకాని రోగం వొచ్చిపడినా, లేక —

శ్రీశ్ : చూడు. అందుకే నీతో పేచీవొచ్చేది నాకు. మలయసమీరానికి నీ మనస్సూ చలిస్తుందని నాకు బాగా తెలుసు. కాని నువ్వు కవివై పోతున్నావని యెక్కడెవరు యేం అపవాదువేస్తారో అన్న భయంతో—మలయసమీరానికి...స్థానాన్ని యివ్వకుండా వుండాలనుకుంటున్నావ్. యిందులో నీ గొప్పతనం యేముందని అడుగుతున్నా. యివాళ నేను నీదగ్గిర ముక్తకంఠంతో వొప్పుకుంటున్నా. నాకు పువ్వులూ బాగుంటున్నాయి. వెన్నెలా బాగుంటోంది—

విపిన్ : యింకా—?

శ్రీశ్ : బాగుండేట్లున్న వస్తువులన్నీకూడా బాగున్నై.

విపిన్ : బ్రహ్మదేవుడు నిన్ను భలే ఆశ్చర్యకరమైన అచ్చులో పోతపోసినట్లు కనబడుతుం

శ్రీశ్ : నిన్ను పోతపోసిన అచ్చు మరీ ఆశ్చర్యకరం ! నేనన్నవన్నీ నీకూ బాగుంటాయి నిజానికి. కాని పైకిమాత్రం మరోరకంగా మాట్లాడతావ్—నా పడకగదిలోని గడియారం లాగా. అది నడవటం సరీగ్గానే నడుస్తుంది. కాని గంటలు తప్పు కొడుతుంది.

విపిన్ : కాని శ్రీశ్ ! నీకు కనక మనోరంజకమైన వస్తువులన్నీ మనోహరంగా వుండటం మొదలెట్టాయంటే—విపత్తు రాబోతోందన్నమాటే.

శ్రీశ్ : నే నేమాత్రం విపత్తుగా భావించటంలేదు.

విపిన్ : ఆ లక్షణమే అన్నిటికంటె చెడ్డది. రోగం వొచ్చినప్పుడు దాని బాధకూడా తెలియకుండాపోయిందంటే—దానికింక చికిత్సామార్గమే వుండదు. స్త్రీజాతికి వొక విధమైన ఆకర్షణవుంది అని నేను స్పష్టంగా వొప్పుకుంటా సోదరా ! బ్రహ్మచారి సమితి ఆ ఆకర్షణనించి తప్పించుకోవాలంటే వాళ్ళకు దూరదూరంగా వుండాలి.

శ్రీశ్ : పొరపాటు, పొరపాటు ! పెద్ద పొరపాటు. నువ్వు దూరంగావుంటే యేమవుతుంది. మరి వాళ్లు దూరంగా వుండరుగా. ప్రపంచాన్ని రక్షించటంకోసం బ్రహ్మ యింతమంది స్త్రీలను సృష్టించినప్పుడు—వారిని తప్పించుకు తిరగటం అసంభవం. అందుచేత బ్రహ్మచర్యాన్ని గనక కాపాడుకోదలచుకుంటే—కాస్తకాస్త స్త్రీజాతిని సైరిస్తూపోతూవుండాలి. అదే స్త్రీసభ్యుల్నికూడా చేర్చుకోవాలని నియమం వొచ్చిందిగా ! యిన్నాళ్లకి బ్రహ్మచారి సమితి చిరస్థాయిగా వుండటానికి వుపాయాన్ని అవలంబించింది. కాని వొక్క స్త్రీమాత్రమే అయితే కుదరదు విపిన్. చాలామంది స్త్రీలు సమితిలో చేరాలి. మూసివున్న గదిలో వొక్క కిటికీతలుపులే తెరిచినప్పుడు చలిగాలికి శైత్యంచేస్తుంది. ఆరుబయలు గాలిలోనే వుంటే ఆ విపత్తు రాదు.

విపిన్ : నాకు నీయీ ఆరుబయలు గాలి, మూసినగదిలో గాలి యీ సంగతులే తెలియవు. వస్తుతః జలుబుచేసే తత్వమయినప్పుడు వాళ్లను ఆ జలుబునించి దేవతలైనా మనుషులైనా యెవరూ కాపాడలేరు.

శ్రీశ్ : నీ తత్వం యెలాంటి దంటావ్ ?

విపిన్ : ఆ సంగతి విడమరచిచెబితే—నీ తత్వంతో దానికి చాలా సామ్యం వుందని గ్రహించగలవు. నాడిమాత్రం అన్నిసమయాల్లోనూ సరిగ్గా బ్రహ్మచారుల నాడి లాగానే కొట్టుకుంటూవుంటుందని గుండెమీద చెయ్యివేసుకుని చెప్పలేను.

శ్రీశ్ : అదే నీలోవున్న మరొక పొరబాటు. బ్రహ్మచారుల నాడిమీద నలభైతొమ్మిది గాడ్పులు వొచ్చి నాట్యంచెయ్యనియ్—యేం భయంలేదు. అణిచిపెట్టనూ వొద్దు. అరికట్టనూవొద్దు. మనలాగా కఠోరదీక్షపూనినవారి హృదయాన్ని మాయపుచ్చి, ముడిచిపెట్టి వుంచగలవా ? దాన్ని అశ్వమేధయాగంలో అశ్వంలాగా వొదిలెయ్. దాన్ని యెవరు కట్టివెయ్యబోతారో వారితో యుద్ధంచెయ్.

విపిన్ : యెవరది? పూర్ణలాగా వున్నాడు! ఆ అమాయకుడిహ యీ వీధిలోంచి వెళ్లటానికి ఆస్కారంలేదు. ఆ వీరపురుషుడి అశ్వమేధాశ్వం తెగకుంటుతోంది. అతణ్ణొకసారి పిలవనా?

శ్రీశ్ : పిలు. కాని అతడు మన యిద్దరికోసమే సందులూ, గొందులూ వెతుకుతూ తిరుగుతున్నాడనిమాత్రం తోచదు.

విపిన్ : పూర్ణబాబూ! యేమిటి సంగతులు.

[పూర్ణ ప్రవేశిస్తాడు]

పూర్ణ : చాలా పాతసంగతులే. నిన్నా మొన్నా యే సంగతులున్నాయో యివాళా అవే సంగతులు.

శ్రీశ్ : నిన్నా మొన్నా శీతగాలి కొడుతూవుంది. యివాళ వసంతసమీరం సాగింది. యిందులో రెండుమూడు కొత్తవార్తల్ని ఆశించొచ్చు.

పూర్ణ : మలయమారుతంవల్ల పుట్టే వార్తలకి బ్రహ్మచారి సమితి వార్తాపత్రికలో స్థానం వుండదు. తపోవనంలో వొకనాడు అకాలంలో వీచిన వసంతవాయువును ఆధారంగా తీసుకుని కాళిదాసు కుమారసంభవ కావ్యాన్ని రచించాడు. మన దురదృష్టవశాత్తు — వసంతవాయువుతో కుమార—అసంభవ కావ్యం తయారవుతుంది.

విపిన్ : అయితే ఆవనీయండి పూర్ణబాబూ! ఆ కావ్యంలో దగ్ధమైపోయిన దేవతను యీ కావ్యంలో పునర్జీవితుణ్ణి చెయ్యొచ్చు.

పూర్ణ : యీ కావ్యంలో బ్రహ్మచారి సమితే దగ్ధమయిపోతుంది. ఆ దగ్ధమైపోయిన దేవతే దీన్ని దగ్ధంచేస్తాడు. అహఁ, నేను వేళాకోళం చెయ్యటంలేదు శ్రీశ్ బాబూ! మన బ్రహ్మచారి సమితివుందే—యిదొక పెద్ద లక్కయిల్లు. నిప్పంటుకున్నదంటే అదిహ ఆగదు. అంతకంటె వివాహితుల సమితి స్థాపించండి. స్త్రీజాతి విషయంలో నిరపాయంగా వుంటుంది. ఆమలో కాలిన యిటికలతోనే యిల్లుకడితే మళ్ళీ తగలబడుతుందనే భయం వుండదు.

శ్రీశ్ : యెపుకుపడితే వాడు వివాహంచేసుకోవటంతో వివాహం అనేది ధ్వంసం అయిపోయింది పూర్ణబాబూ! అందుకనే యీ బ్రహ్మచారి సమితి స్థాపించింది. నేను బ్రతికివుండేంతవరకు యీ సమితిలో ప్రజాపతి ప్రవేశం నిషిద్ధం.

విపిన్ : మన్మథుడో?

శ్రీశ్ : రానీ అతణ్ణి. వొక్కసారి అతడితో బాగా పరిచయమయిందంటే చాలు. యిక భయం లేదు.

పూర్ణ : చూడు శ్రీశ్ బాబూ !

శ్రీశ్ : యేం చూసేది? అతణ్ణి వెదుకుతూ తిరుగుతున్నాను. వొకసారి దీర్ఘంగా నిట్టూరుస్తాను. కవిత్వాన్ని ఆలాపిస్తాను. కనకవలయభ్రంశ రిక్తప్రకోష్ఠుణ్ణవుతాను. అప్పుడే సరియైన సన్యాసిని కాగలుగుతాను. మన కవేమన్నారు —

రేయిగడచి పోకమునుపె
నీదువలపు దీపికతో
దీపము వెలిగించిపో ప్రియా !
దారివెంట మునుముందుగ
దీప్తశిఖా ధారిణివై
యెపుడువత్తువా యటంచు
వేచియున్నవాడనో ప్రియా !
నీరవముగ నాయెడంద
తనచీకటి యింటిలోన
మ్రగ్గిపోవనెంచునో ప్రియా !
రేయిగడచి పోకమునుపె
నీదువలపు దీపికతో
దీపమువెలిగించిపో ప్రియా !

పూర్ణ : వాహ్ ! శ్రీశ్ బాబూ ! నీకవి మాబాగా రాశాడు.

రేయిగడచి పోకమునుపె దీపము వెలిగించిపో...

గృహం అలంకరించి వుంది. పళ్లెంలో మాల, మంచంమీద పూలపాన్పు. జీవన దీపంమాత్రం వెలగటంలేదు. సంజె మెల్లమెల్లగా రాత్రి అయిపోతోంది. వాహ్ ! అద్భుతంగా రాశాడు. యే పుస్తకంలో వుందో కాస్తచెప్పు.

శ్రీశ్ : పుస్తకం పేరు 'ఆవాహన.'

పూర్ణ : పేరుకూడా యెంచియెంచి మంచిదే పెట్టాడు.

(తనలో తాను)

[రేయిగడచి పోకముసుపె, నీదువల దీపికతో...

[దీర్ఘంగా నిట్టూరుస్తాడు]

మీరు యింటికెళుతున్నారా ?

శ్రీశ్ : యిల్లు యెటువైపో మరిచిపోయాను సోదరా !

పూర్ణ: దారి మరిచిపోయేలాగానే వుంది యీ రాత్రి. యేమంటావ్ విపిన్‌బాబూ!

శ్రీశ్: విపిన్‌బాబు యిల్లాంటివిషయాల్లో యేమీ మాట్లాడ్డు—తన మనస్సులో కవిత్వం యెక్కడ బయటపడుతుందోనని. లోభి యెప్పుడూ దేన్నయితే మరింత భద్రం చేసుకుందామనుకుంటాడో దాన్ని నేలకింద పూడ్చిపెడతాడు.

విపిన్: కానిచోట వృథాగా ఖర్చుపెట్టాలనుకోను సోదరా! స్థానాన్ని వెతుక్కుంటూ తిరుగుతున్నా. చావాలిసేవొస్తే యేకంగా గంగాతీరానికెళ్ళి చావటమే మేలు.

పూర్ణ: అది ఉత్తమమైన మాట. శాస్త్రసంగతమైనదికూడాను. విపిన్‌బాబు అవసాన దశదాకా కవిత్వాన్ని దాచిపెట్టుకుంటున్నాడు. యెవరేం మాట్లాడినా యెప్పుడూ అతడు నిరుత్తరుడుగా వుంటాడు. యితరుల మాటలన్నీ మధుపూరితాలయి వుండాలని ఆశీర్వదిస్తున్నాను.

శ్రీశ్: దానితోపాటు కొంచెం మసాలాకూడా వుండాలి.

విపిన్: కేవలం మాటలవర్షంతోనే కర్తవ్యం నిశ్శేషంకాకుండా వుండాలి.

పూర్ణ: వాక్యాల్లో విరామస్థానాలే వాక్యాలకంటె మధురంగా వుండిపోతాయి.

శ్రీశ్: ఆనాడు నిద్రే రాకుండా వుండాలి.

పూర్ణ: రాత్రి తెల్లవారనేకూడదు.

విపిన్: చంద్రుడు పూర్ణచంద్రుడుగా వుండాలి.

పూర్ణ: విపిన్ వసంతకుసుమాలతో ప్రసన్నుడై పోతాడు.

శ్రీశ్: అభాగ్యుడైన శ్రీశ్ కుంజద్వారంచెంతజేరి తొంగితొంగి చూడకుండా వుండాలి.

పూర్ణ: పోనీండి శ్రీశ్‌బాబూ! మీ ఆ ఆవాహననుంచి యింకోటేదైనా చదవండి. చాలా చక్కగా రాశారు.

రేయిగడచి పోకమునుపె
పీడువలపు దీపికతో
దీపమువెలిగించిపో ప్రియా!

అహా! వొక జీవనదీపశిఖ మరొక జీవనదీపం దగ్గిరగా కొంచెం అలా రాసుకుంటే చాలు. అంతే. యింకేమీ అక్కర్లా. సన్నటి రెండువేళ్ళతో దీపాన్ని కొంచెం కదిలించి, తాకించటం. తర్వాత క్షణంలో అంతా వొకటే వెలుగు

(తనలో) [రేయిగడచి పోకమునుపె...

శ్రీశ్ : పూర్ణబాబూ! యెక్కడి కెళుతున్నారు?

పూర్ణ: చంద్రబాబుగారింట్లో వో పుస్తకం పడేసొచ్చాను. అది వెతుక్కోటానికి వెళుతున్నా.

విపిన్ : వెతికినా దొరుకుతుందా? చంద్రబాబుగారింట్లో అంతా అస్తవ్యస్తం. అక్కడేది పోగొట్టుకున్నా మళ్లీ దొరకదు.

[పూర్ణ వెళ్ళిపోతాడు]

శ్రీశ్ : [పెద్దనిట్టూర్పు విడిచి] పూర్ణ దిట్టంగా వున్నాడేమిటోయ్ విపిన్.

విపిన్ : లోపల అణిగివున్న ఆవిరితో. అతడి తల సోడాసీసా మూతలాగా టప్‌మని యెగిరిపోకుండా వుంటేగద.

శ్రీశ్ : పోతేపోనియ్. యెలాగో అలా యినపబద్దీ బిగించి మస్తిష్కాన్ని కదలనీకుండా, వొకేచోట బిగించివుంచటమే పురుషార్థమా యేమిటి? మధ్యమధ్య అటూయిటూ కాకుండావుంటే—రాత్రింబగళ్ళు కూలివాడు బరువుమోసినట్లు—దాన్ని మోయటం వల్ల యేమిటి ప్రయోజనం? తెంచేసెయ్ దారాన్ని. యెగరనియ్ వొకసారి. ఆరోజున నీకు వినిపించాను.

సావధానుండవై సాగిపోయే పథిక
మరచితివి నీదారి తిరిగిరావోయి!
తెరచిన కనుంగవకు దొరలు నశ్రువులతో
గ్రుడ్డితనమును తెచ్చుకొంటివి గదోయి
మరచిపోయిన దారిమధ్య పడిపోయినది
పోగొట్టుకొన్న నీ ముగ్ధహృదయాంబుజము
రాలిపడినది కంటకారామసీమలో
రాగారుణప్రసవ రమ్యగుళుచ్ఛమ్ము
ఆ నదీతీరాన నన్నివేళలయందు
పెరిగి విరిగెడుక్రీడ వెలయుచునుండు
సావధానుండవై సాగిపోయే పథిక
మరచితివి నీదారి తిరిగిరావోయి!

విపిన్ : యీమధ్య నువ్వు బాగా కవిత్వం చదవటం మొదలెట్టావ్ త్వరలో చిక్కుల్లో పడేట్లున్నావ్ చూస్తే.

శ్రీశ్ : బుద్ధిపూర్వకంగా చిక్కులకోసం వెతుక్కుంటూ నదీ రేవారికోసం దిగులు పెట్టుకోనక్కర్లేదు. చిక్కుల్ని తప్పించుకు తప్పించుకుపోతూ హఠాత్తుగా చిక్కుల్లో

అడుగుపెడితేనే ప్రమాదం. రండి రండి రసిక్‌బాబూ! రాత్రివేళ బయటికి బయలుదేరారేమిటి?

[రసిక్ ప్రవేశిస్తాడు]

రసిక్: నాకు రాత్రేమిటి, పగలేమిటి?

పరమసౌ దివసో నపునర్నిశా
నను నిశైవవరం నపునర్దినమ్
ఉభయమేతదుపైత్య థవాక్షయం
ప్రియజనేన యత్ర సమాగమః

రసిక్: యెన్నో రాత్రుళ్లూ, పగళ్లూ రానూవొచ్చాయి, పోనూపోయినాయి. యింతవరకు ప్రియజనంమాత్రం రాలేదు, అందుకని పగటిమీదగాని రాత్రిమీదగాని దేనిమీదా నాకేమాత్రం ఆసక్తిలేదు.

శ్రీశ్: సరేగాని రసిక్‌బాబూ! వొకవేళ ప్రియజనం హఠాత్తుగా యిప్పుడే వొచ్చి పడితే?

రసిక్: వొస్తే నావంక చూడనేచూడరు. మీయిద్దరిలో యెవరికో వొకరికే ఆ చూపు దక్కుతుంది.

శ్రీశ్: అయితే క్షణంలో అరసికవ్యక్తులకిందే జమ అయిపోతారు.

రసిక్: కాని మరుక్షణంనించి పరమానందంగా కాలం గడుపుతాలుకూడా! నేను యీర్ష్యపడబోవటంలేదు శ్రీశ్‌బాబూ! నా అదృష్టంలోకి యింత ఆలస్యంగా వొస్తున్నవారిని నేను మీకు అర్పించేస్తాను. దేవి! వరమాలను కటుకుని రమ్ము. నేడి వసంత శుక్లపక్షరాత్రివేళ అభిసారికవై రమ్ము దేవీ!

మందం నిధేహి చరణౌ పరిదేహి నీలం
వాసః పిధేహి వలయావలిమంచలేన
మాజల్పసాహసిని శారదచంద్రకాంత
దంతాంశవస్తవ తమాంసి సమాపయంతి

శ్రీశ్: రసిక్‌బాబూ! మీ సంచి బాగా నిండుగా వున్నట్లుంది. యిలా యెన్ని రాసిపెట్టుకున్నారు?

రసిక్: అంతులేనన్ని. లక్ష్మిమాత్రం రాలేదు. కేవలం వాణితోటే కాలక్షేపం చేస్తున్నా.

శ్రీశ్ : యేమోయ్ విపిన్ ! యీ అభిసరణ — వ్యవహారం వూహించుకుంటే చాలా బావుంటోందోయ్.

విపిన్ : అయితే దీన్ని మళ్లీ ప్రయోగించటానికి బ్రహ్మచారి సమితిలో యీ ప్రస్తావన తీసుకురారాదూ ?

శ్రీశ్ : తలుచుకుంటేనే సుందరంగా వుండే పదార్థాలెన్నో వున్నాయి. ఆ అయిడియా లన్నీ ఆచరణలో పెట్టాలంటే ధైర్యం చాలదు. యేవీధివెంట అభిసారికలు వొస్తారో, యే కామినులమెళ్లో హారాలు పెరిగి ముత్యాలు దారిపొడుగునా పడు తూంటాయో ఆ వీధిపేరు నీ 'పటల్‌డాంగా స్ట్రీట్' అనుకున్నావా ? ఆ వీధి ప్రపంచంలో యెక్కడా లేదు. విరహిణీహృదయనీలాంబరాన్ని ఆశ్రయించి మనోరాజ్యపథంలో అలా బయలుదేరుతుంది. తన వక్షస్థలంమీదినించి ముత్యాలు చెదరిపడిపోతున్నా చూడనుకూడా చూసుకోదు. నిజమైన ముత్యాలే అయితే యేదుకుని తీసుకుంటుంది. యేమంటారు రసిక్‌బాబూ !

రసిక్ : యీ మాట అంగీకరించాల్సిందే. అభిసరణం వూహాపథంలోనే బావుంటుంది. గుర్రాలూ, బళ్ళూ తిరిగే మార్గాన బావుండదు. యీ వసంతజ్యోత్స్నా రాత్రివేళ యే గవాక్షంనుంచో — వో రమణీమణి వ్యాకులహృదయం మీయింటివైపుగా అభి సరించి రావాలని ఆశీర్వదిస్తున్నాను శ్రీశ్‌బాబూ !...

శ్రీశ్ : ఆ ఆశీస్సు తప్పక ఫలిస్తుంది రసిక్‌బాబూ ! యివాళ్టి మలయసమీరంద్వారా ఆ వార్త నా మనస్సు కందుతున్నట్లే వుంది. బందిపోటుదొంగ ముందుగానే వార్త పంపి, దోపిడీకొచ్చినట్లు, నా అజ్ఞాత అభిసారికకూడా అలాగే ముందుగానే తానొస్తున్నట్లు వార్త పంపింది.

విపిన్ : నీ డాబామీది వరాండా అలంకరించి సిద్ధంచేసి వుంచుకో.

శ్రీశ్ : నా దక్షిణపు వరాండాలో వొక కుర్చీలో నేను కూర్చుంటాను. మరొక కుర్చీ అలంకరించివుంటుంది.

విపిన్ : దానిమీద నేనొచ్చి కూర్చుంటాను.

శ్రీశ్ : 'మధ్వభావే గుడం దద్యాత్' మధువు లేకపోతే బెల్లం—అభావపక్షంలో నీతోనే సరిపెట్టుకుంటాను.

విపిన్ : మధుమయి వొచ్చినప్పుడు యీ అభాగ్యుడిమొహాన 'లగుడం దద్యాత్' చేతి కర్ర విసరటమే.

రసిక్ : జనాంతికంగా, శ్రీశ్‌బాబూ ! మీ దక్షిణంవైపు డాబా ప్రత్యేకతకు చిహ్నంగా వొక జెండా యెగరవేయటం అవసరం — దాన్ని పారేసుకొచ్చారు.

శ్రీశ్ : ఆ రుమాల ప్రయత్నిస్తే దొరుకుతుందా యిప్పుడు ?

రసిక్ : ప్రయత్నిస్తే తప్పేముంది ?

శ్రీశ్ : విపిన్, నువ్వు రసిక్‌బాబుతో మాట్లాడుతూవుండు. నేనిప్పుడే వొచ్చేస్తాను.

[వెళ్ళిపోతాడు]

విపిన్ : అవునుగాని రసిక్‌బాబూ! కోపం తెచ్చుకోవొద్దు—

రసిక్ : అథవా తెచ్చుకున్నా మీరు భయపడాల్సిన పనేమీలేదు. నేను చాలా దుర్బలుణ్ణి.

విపిన్ : వొకటిరెండు ప్రశ్నలడుగుతాను. విసుక్కోవొద్దు.

రసిక్ : నా వయస్సునిగురించి ప్రశ్నేమీ కాదుకదా.

విపిన్ : కాదు.

రసిక్ : అయితే అడగండి. సరియైన సమాధానం పొందుతారు.

విపిన్ : అనాడొక మహిళను చూశానే ఆమె —

రసిక్ : ఆమె ఆలోచించదగినదే. మీరు సంకోచించకండి విపిన్‌బాబూ! ఆమెని గురించి మీరు మధ్యమధ్య ఆలోచించినా చర్చించినా దానివల్ల మీ అసాధారణ ప్రవర్తన యేమీ వ్యక్తంకాదు. మేమూ సరీగ్గా అలాంటి పనే చేస్తూవుంటాం.

విపిన్ : అబలాకాంతబాబనుకుంటాను—

రసిక్ : అతడి సంగతి చెప్పకండి. అతడి నోట మరోమాటే లేదు.

విపిన్ : అతడేమిటి—

రసిక్ : ఆఁ. అది నిజమే. అయితే యేమయింది? అతడు నృపబాల, నీరబాల యిద్దరిలో యెవర్ని యెక్కువగా ప్రేమిస్తున్నదీ నిర్ణయించుకోలేకపోతున్నాడు. అత డిద్దరిమధ్య యెప్పుడూ వూగులాడుతూంటాడు.

విపిన్ : కాని వారిలో యెవరైనా అతడిమీద—

రసిక్ : లేదు. అతణ్ణి వివాహంచేసుకుంటారన్న వుద్దేశంలేదు. అలా అయితే యే చిక్కూ వుండేదేకాదు.

విపిన్ : అందుకనే అనుకుంటా అబలాకాంతబాబు కొంచెం—

రసిక్ : కొంచెం చింతాక్రాంతుడై వుంటాడు.

విపిన్ : శ్రీమతి నీరబాలకి సంగీతమంటే యిష్టమనుకుంటాను.

రసిక్ : యిష్టంలేకేం ? మీ జేబులోనే వుందిగా దానికి నిదర్శనం !

విపిన్ : (జేబులోంచి సంగీతం పుస్తకం బయటికి తీసి) నేను దీన్ని తీసుకురావటం చాలా అసభ్యంగా వుంది.

రసిక్ : అలా మీరు చెయ్యకపోతే మాలో యెవరో వొకరం చేసేవాళ్ళం.

విపిన్ : మీరుచేస్తే ఆమె క్షమిస్తారు. కాని నేను —నిజంగా అనుచితమైన పనే. కాని యిప్పుడు తిరిగి యిచ్చేట్లయితే—

రసిక్ : ఆ అనుచితకార్యం అలాగే వుండిపోతుంది.

విపిన్ : అందుకని—

రసిక్ : హరించటంవల్ల కలిగిన దోషం ఆ హరించిన వస్తువును రక్షించుకోటంవల్ల మహా అయితే యింకొంచెం యెక్కువవుతుంది.

విపిన్ : పుస్తకం విషయం ఆమె మీతో యేమయినా చెప్పారా ?

రసిక్ : చెప్పింది తక్కువేకాని—చెప్పనిది చాలా యెక్కువ.

విపిన్ : అదేమిటి ?

రసిక్ : సిగ్గుతో చాలా కందిపోయింది.

విపిన్ : యెబ్బే ! ఆ సిగ్గుపడాల్సింది నేను.

రసిక్ : మీ సిగ్గు ఆమె సగం పంచుకుంది — అరుణిడి లజ్జతో ఉషస్సు రంజితమయినట్లు.

విపిన్ : మీరు నన్ను మరీ వెర్రివాణ్ణి చెయ్యకండి.

రసిక్ : మా సంప్రదాయంలో కలుపుకుంటున్నాను మహాశయా !

విపిన్ : పుస్తకాన్ని మళ్లీ జేబులో పెట్టుకుని తప్పుచెయ్యటం మానవధర్మం— క్షమించటం దేవతల ధర్మం అంటారు యింగ్లీషులో.

రసిక్ : అయితే మీరు మానవధర్మాన్ని కచ్చితంగా పాలించారు.

విపిన్ : అయితే దేవతాధర్మాన్ని పాలిస్తారామె.

[శ్రీశ్ ప్రవేశిస్తాడు]

శ్రీశ్ : అఖిలాకాంతబాబుని కలుసుకోవటం జరగలేదు.

రసిక్ : నువ్వు రాత్రికి రాత్రే అతణ్ణి సన్న్యాసిని చేయాలనుకుంటున్నావా యేం ?

శ్రీశ్ : యేమయితే యేం—అక్షయబాబుదగ్గిర వీడ్కోలు తీసుకొచ్చాను.

విపిన్ : అవునవును—వారికి చెప్పిరావటం మరిచిపోయాను—వొక్కసారి వెళ్ళి వారిని కలుసుకొస్తాను.

రసిక్ : (జనాంతికంగా మళ్లీ యింకేదో సంగ్రహించే ప్రయత్నంలో వున్నట్లున్నారు చూస్తే. మానవధర్మం క్రమంగా మిమ్మల్ని నొక్కిపట్టేసింది.

[విపిన్ వెళ్ళిపోతాడు]

శ్రీశ్ : రసిక్‌బాబూ ! నేను మీదగ్గిర వో సలహా తీసుకోదలిచాను.

రసిక్ : సలహా యివ్వటానికి తగిన వయస్సే వుంది. తెలివిలేకపోవొచ్చుగాని.

శ్రీశ్ : మీయింటిదగ్గిర ఆ రోజున యిద్దరు మహిళల్ని చూశాను. వాళ్లిద్దరూ సుందరీమణులనే తోచింది నాకు.

రసిక్ : మీ గ్రహణశక్తిని తప్పుపట్టటానికి వీల్లేదు. అందరూ అదేమాట అంటున్నారు.

శ్రీశ్ : వాళ్లనుగురించి వొకవేళ మధ్యమధ్య మీతో సంప్రతించటం మీకేమీ...

రసిక్ : సంప్రతిస్తే చాలా సంతోషిస్తా నేను. మీకూ అది బాగానే వుండొచ్చు. వాళ్లకూ పెద్దనష్టమేమీ వుండబోదు—

శ్రీశ్ : యేమాత్రం వుండదు. మిణుగురు పురుగు నక్షత్రాన్నిగురించి వాగటం మొదలెడితే—

రసిక్ : దానివల్ల నక్షత్రానికేమీ నిద్రాభంగం కాదు.

శ్రీశ్ : మిణుగురుపురుక్కే నిద్రలేనిరోగం పట్టుకోవొచ్చు. దానివల్ల నాకే అభ్యంతరమూ లేదు.

రసిక్ : యివాళ అలాగే తోస్తోంది.

శ్రీశ్ : యీ పట్టుకొచ్చిన రుమాల యెవరిదో ఆమె పేరు చెప్పాలి.

రసిక్ : ఆమె పేరు నృపబాల.

శ్రీశ్ : ఆ యిద్దరిలో యెవరామె ?

రసిక్ : మీరే ఊహించి చెప్పండయినా.

శ్రీశ్ : ఆ యెర్రరంగు సిల్కుచీర కట్టుకుందే —

రసిక్ : ఊఁ. చెప్పండింకా.

శ్రీశ్ : సిగ్గుతో పారిపోదా మనుకుందీ — కాని పారిపోవటానికికూడా సిగ్గేసిందీ అందుకనే వొక్కక్షణం హఠాత్తుగా భీతహరిణిలాగా గతుక్కుమని నిలబడి పోయిందీ — నుదుటిమీద కొన్ని ముంగురులు యించుమించు కళ్లమీదకొచ్చి పడ్డాయ్ — తాళాలగుత్తి కట్టుకున్న పమిటచెంగు జారిపోతూంటే యెడంచేత్తో పట్టుకుని, గబగబా వెళిపోయిందీ — అప్పుడామె విసిల దీర్ఘకుంతలాఞ నా దృష్టిపథం ముందు నల్లటి కాంతిరేఖలాగా నాట్యమాడుతూ భర్రున సాగిపోయినట్లుకూడా అయిందీ —

రసిక్ : ఆఁ. ఆమె నృపబాలే. నిజమే. పాదాలు రెండూ లజ్జాపరిమితాలయినాయి. చేతులు రెండూ సంకోచగ్రస్తాలయినాయి. నేత్రాలు రెండూ భయభ్రాంతాలయినాయి. కుంతలాలు కుంచితాలయినాయి. విచారకరమైన విషయం యేమిటంటే హృదయం కనబడలేదు. అది యేదో పువ్వులోపల దాగివుండే మధువులాగా మధురమైనదీ మంచులాగా చల్లనైనదీ.

శ్రీశ్ : రసిక్‌బాబూ! మీ హృదయంలో యెంత కవితారసం సంచితమైవుందో, అది యేవైపుగా ప్రసరిస్తున్నదో యిప్పుడు బాగా తెలుసుకోగలిగాను.

రసిక్ : పట్టుపడ్డాను శ్రీశ్‌బాబూ!

కవీంద్రాణాం చేతః కమలవన మాలాతపరుచిం
భజన్తేయే సన్తః కతిచిదరుణామేవ భవతీం
విరిఞ్చి ప్రేయస్యాస్తరుణతర శృఙ్గారలహరీం
గభీరాభిర్వాగ్భిర్విదధతి సభారంజన మయీమ్ ॥

నువ్వు కవీంద్రుల చిత్తకమలవనమాలాకిరణరేఖవు. నిన్ను లేశమాత్రమయినా భజించేవారు గభీరవాక్యాలద్వారా సభారంజనమయియైన సరస్వతి తరుణలీలాలహరిని వ్యక్తంచెయ్యగలుగుతారు... నేను ఆ కవి చిత్తకమలవన కిరణరేఖాపరిచయాన్ని పొందగలిగాను.

శ్రీశ్ : నేనూ కొద్దిరోజులయింది ఆ పరిచయాన్ని పొంది. అప్పటినుంచే కవిత్వం నాకు చాలా సులభమయింది.

[అక్షయ్ ప్రవేశిస్తాడు]

అక్షయ్ : స్వగతం ఊహూఁ! యిద్దరు నవయువకులు కలిసి నన్ను యింట్లో నిలవ నిచ్చేట్లు లేరు చూస్తే. వొకడొచ్చి దొంగలాగా నా గదిలో తడమటం మొదలెట్టాడు. పట్టుబడి సరైన సంజాయిషీ యివ్వలేకపోయాడు. చివరికి నన్ను పట్టుకున్నాడు. తర్వాత కాసేపటికి చూస్తే రెండోవ్యక్తి వొచ్చి నా గదిలో పుస్తకాలన్నీ అటుతిప్పి యిటుతిప్పి చూడటం మొదలెట్టాడు. దూరాన్నుంచే చూసి పారిపోయొచ్చేశాను. చక్కగా నా మనసుకు నచ్చిన వుత్తరం రాద్దామనుకున్నా —కాని వీళ్ళు రాయ నీయటం లేదు. ఆహా! చక్కటి వెన్నెలొచ్చింది.

శ్రీశ్ : అరె! అక్షయబాబే!

అక్షయ్ : యేం బాబూ! వొక దొంగ గదిలోనూ, యింకోరు దారిలోనూ హా ప్రియే! నీ ధ్యానంనుంచి నాకు భంగం కలిగిస్తున్నారు—రంభా, ఊర్వశి, మేనకలయితే నాకే విచారమూ వుండేదికాదు. మనస్సుకు నచ్చిన ధ్యానభంగం అక్షయ్ అదృష్టంలో లేదు. కలికాలంలో ఇంద్రుడికి వయసుమీరటంతో అరసికుడైపోయాడు.

[విపిన్ ప్రవేశిస్తాడు]

విపిన్ : యిదిగో అక్షయబాబూ! మీకోసమే వెతుకుతున్నా.

అక్షయ్ : ఓయి అభాగ్యుడా! యిలాంటి రాత్రిని సృష్టించింది నన్ను వెతకటానికేనా?

In such a night as this,
When the sweet wind did gently kiss the trees
And they did make no noise, in such a night
Troilus methinks mounted the Trojan walls
And sighed his soul toward the Grecian tents,
Where Gressid lay that night.

శ్రీశ్ : In such a night— మీరేం చేయటానికి బయలుదేరారు అక్షయబాబూ!

రసిక్ : అపసరతి న చక్షుషో మృగాక్షీ
రజనిరియం చ నయాతి నైతి నిద్రా —
కనులయెదుటనుండి కదలిపోదు మృగాక్షి
రాత్రి గడచిపోదు రాదు నిద్ర

అక్షయబాబు అవస్థ నాకు తెలుసు మహాశయా!

అక్షయ్ : యెవరయ్యా నువ్వు.

సిరక్ : నేను రసిక్‌చంద్రుణ్ణి. యిరువైపులా యిద్దరు యువకుల్ని ఆసరా చేసుకుని యౌవనసాగరంలో తేలిపోతున్నా.

అక్షయ్ : యీ వయసులో యౌవనం సహ్యంకాదు రసిక్‌దాదా :

రసిక్ : యౌవనం యే వయసులో సహ్యమవుతుందో తెలియదు నాకు. అది అసహ్య వ్యవహారం. శ్రీశ్‌బాబూ మీకేమని అనిపిస్తుంది ?

శ్రీశ్ : యింకా పూర్తిగా తెలుసుకోలేకుండా వున్నా.

రసిక్ : నాలాగా పరిణత వయస్సుకోసం ప్రతీక్షిస్తున్నట్లున్నారు. అక్షయ్‌దా : యివాళ నువ్వు చాలా అన్యమనస్కంగా వున్నట్లున్నావ్ :

అక్షయ్ : నీకు అన్యమనస్కంగానే కనబడతాను. మనస్సు సరీగ్గా నీవైపు లేదు... విపిన్‌బాబూ : నువ్వు నాకోసం వెతుకుతున్నానన్నావ్ నిజమే కాని అంత అత్యంతవసరమైన వ్యవహారమని నాకనిపించటంలేదు. కనుక నేనిప్పుడు సెలవు తీసుకుంటున్నాను. వొక ముఖ్యమైన పనివుంది.

[వెళిపోతాడు]

రసిక్ : విరహి వుత్తరం రాయటానికెళ్ళాడు.

శ్రీశ్ : అక్షయబాబుకేం హాయిగా వున్నారు. రసిక్‌బాబూ : వారి భార్యే పెద్దసోదరి అనుకుంటా. ఆమె పేరు ?

రసిక్ : పురబాల.

విపిన్ : (దగ్గరకొచ్చి) యేం పేరన్నారు ?

రసిక్ : పురబాల.

విపిన్ : ఆమే అందరిలోనూ పెద్దదేమో ?

రసిక్ : అవును.

విపిన్ : అందరిలోనూ చిన్నామె పేరు ?

రసిక్ : నీరబాల.

శ్రీశ్ : మరి నృపబాల యెన్నో ఆమె ?

రసిక్ : ఆమె నీరబాలకంటె పెద్దది.

శ్రీశ్ : అయితే నృపబాలే రెండో ఆమె.

విపిన్ : నీరబాల అందరికంటె చిన్నది.

శ్రీశ్ : పురబాలకంటె చిన్నది నృపబాల.

విపిన్ : ఆమెకంటె చిన్నది నీరబాల.

రసిక్ : (స్వగతం) వీళ్లు నామజపం చెయ్యటం మొదలెట్టారు. నాకు చెడ్డ బెడదయింది. యింక యీ మంచు దుస్సహంగా వుంది. పారిపోయే వుపాయం చూసుకోవాలి.

[వనమాలి ప్రవేశిస్తాడు]

వనమాలి : యిదిగో ! మీరిక్కడున్నారు ! నేను మీయిళ్లకెళ్ళాను.

శ్రీశ్ : అయితే మీరిప్పుడిహ యిక్కడుండండి. మేం యిళ్లకి వెళతాం.

వన : మీరెప్పుడూ తొందరలో వున్నట్లే కన్పిస్తారు.

విపిన్ : అవును. మిమ్మల్నిచూస్తే యింకొంచెం యెక్కువ తొందరలో పడతాం.

వన : అయిదు నిమిషాలు ఆగారంటే—

శ్రీశ్ : రసిక్‌బాబూ ! కొంచెం చలివేస్తున్నట్లులేదూ !

రసిక్ : మీకిప్పటికి తెలుస్తోంది. నాకు యెప్పుడనగానో తెలిసింది.

వన : పదండి. యింటికే పదండి—

శ్రీశ్ : మహాశయా ! యింతరాత్రివేళ మా యింట్లోకి కనక వొచ్చిపడ్డారంటే—

వన : చిత్తం. మీరు కొంచెం తొందరలో వున్నట్లున్నారు. అయితేపోనీ మరోసారెప్పుడైనా కలుసుకుందాం.

# చతుర్థాంకం

## దృశ్యం ౧

### అక్షయుని యిల్లు

[రసిక్—శైలబాల]

రసిక్ : అమ్మాయ్ శైలా :

శైల : యేమిటి రసిక్ దాదా.

రసిక్ : యిది నా పనా ? మహాదేవుని తపోభంగానికి స్వయంగా కందర్పదేవుడుండనే వున్నాడు. నేను ముసలివాణ్ణి.

శైల : నువ్వు వృద్ధుడివే—ఆ యువకులిద్దరూ మహాదేవ ద్వయంకారు.

రసిక్ : అహం. కారు. నేనది పూర్తిగా కనిపెట్టేశాను. అందుకనే మరి నిర్భయంగా వొచ్చాను. కాని వాళ్లతోపాటు వీధిమధ్య మంచుల్లో నిలబడి, అర్ధరాత్రివరకు రసికసంభాషణ చేయదగినంత వేడిలేదు నావొంట్లో.

శైల : వారి సావాసంతో ఆ వేడి కావాల్సినంత తెచ్చుకోవొచ్చు.

రసిక్ : బతికున్న చెట్టు యెండవేడికి చిగిర్చి పూస్తుంది. యెండిపోయిన చెట్టు ఆ వేడికే పగులు చూపుతుంది. యౌవనంలో వుండే వేడి ముసలివాళ్ల విషయంలో అంత వుపయోగకరమైనదిగా తోచదు.

శైల : యేదీ నిన్నుచూస్తే యెక్కడా పగిలిపోయినట్లు కనిపించదే ?

రసిక్ : హృదయాన్ని చూస్తే తెలుసుకోగలవు శైలా :

శైల : యేమిటి రసిక్దాదా నువ్వనేది ? నీదే యిప్పు డందరికంటె యే చిక్కూలేని వయస్సు. యౌవనతాపం నిన్నేం చేస్తుంది ?

రసిక్ : 'శుష్కేన్ధనే వహ్నిరుపైతి వృద్ధిం.' యౌవనజ్వాల వృద్ధుడికి తగిలితే భగభగ మని మండిపోతుంది. అందుకనే 'వృద్ధస్య తరుణీభార్యా' విపత్తుకు కారణ మన్నారు. యింకేం చెప్పను ?

[నీరబాల ప్రవేశిస్తుంది]

రసిక్ : ఆగచ్ఛ వరదే దేవీ ! కాని నువ్వు నాకు వరమిస్తావో లేదో తెలియదు. నేను మాత్రం నీకు వరుణ్ణి యివ్వటంకోసం చచ్చి సున్నమవుతున్నా. శివుడుమాత్రం యేమీచేయటంలేదు. కాని నీ పూజనుమాత్రం పొందుతున్నాడు. ఈ వృద్ధుడు శ్రమపడుతున్నాడు. ప్రతిఫలమ్మాత్రం లేదు.

నీర : శివుడికి పూలూ నీకు ఫలమూనూ. నీకే వేస్తాను రసిక్‌దాదా వరమాల.

రసిక్ : రాతిదేవుడికి నైవేద్యం పెడితే సుఖవిదే. దాన్ని మళ్లీ సంపూర్ణంగా తీసుకోవొచ్చు. అలాగే నాకూ్కడా నిర్భయంగా వరమాల వెయ్యనూ గలవు. యెప్పుడవసరమయితే అప్పుడు మళ్లీ దాన్ని తీసుకోనూగలవు. అంతకంటె నీరా ! నాకో మెడకు చుట్టుకొనేది (muffle.) అల్లియిద్దూ. వరమాలకంటె ముసలివాడికది చాలా వుపయోగంగా వుంటుంది.

నీర : అలాగే యిస్తా వొక జత మఖమల్ జోళ్లుకూడా కుట్టివుంచా. అవికూడా 'శ్రీ చరణాల్ని' అలంకరిస్తాయి.

రసిక్ : ఆహా ! దీన్నే కృతజ్ఞత అంటారు. కాని నీరా ! నాకుమట్టుకు మెడకు చుట్టుకునేది చాలు. ఆపాదమస్తకం అన్నీ యెందుకులే. దానికి తగినవ్యక్తి దొరుకుతాడు. జోళ్ళు అతనికోసం కట్టిపెట్టు.

నీర : సరే. నీ ధోరణికూడా నువ్వు కట్టిపెట్టు.

రసిక్ : చూశావా శైలా ! యిటీవల నీరూకూడా సిగ్గు వొలికిస్తున్నది. అష్టే మంచి లక్షణంకాదు.

శైల : నీరూ ! యేమిటిది ? మళ్లీ యీ యింటికొచ్చారేమిటి ? యివాళ మా సభ జరుగుతుందిక్కడ. యిప్పుడే వొస్తారెవరైనా. చిక్కులో పడతావ్.

రసిక్ : ఆ విపత్తు రుచికూడా వొకసారి చూశావ్. యిప్పుడు మాటిమాటికీ విపత్తులో చిక్కుకోటానికి ఆత్రంగా తిరుగుతున్నావ్.

నీర : చూడు రసిక్‌దాదా ! నువ్వు కనక నన్ను చిరాకెత్తించావంటే మెడ అల్లికరాదు నీకు చెపుతున్నా... యిదుగో చూడు అక్కా ! నువ్వుకూడా రసిక్‌దాదా మాటలకు నవ్వటం మొదలెడితే ఆయన అతిశయం పెచ్చుమీరిపోతుంది.

రసిక్ : చూశావా శైలా ! నీర యీమధ్య పరిహాసాన్నికూడా సహించలేకపోతోంది. మనస్సు యింత దుర్బలమయిపోయింది. నీరూ ! కొన్నికొన్ని సమయాల్లో కోయిల

కూతకూడా చెవికి చెడ్డకటువుగా విన్పిస్తుందని శాస్త్రంలో వుంది. నీ రసిక్‌దాదా పరిహాసంకూడా యిప్పుడు నీకు ఆ కుహూరవం అని భ్రమ కలుగుతోంది.

నీర : అందుకనే నీ కంఠాన్ని అల్లికతో బిగిద్దామనుకుంటున్నా. స్వరమయినా కాస్త తగ్గుతుంది.

శైల : నీరూ ! యింక జగడం పెట్టుకోకు. రా. యిప్పుడే అందరూ వొచ్చిపడతారు.

[నీర, శైల వెళ్ళిపోతారు]

[పూర్ణ ప్రవేశిస్తాడు]

రసిక్ : రండి పూర్ణబాబూ !

పూర్ణ : యింకా యెవరూ—

రసిక్ : మీరు బహుశా యీ వృద్ధుణ్ణి వొక్కణ్ణేచూసి నిరాశపడివుంటారనుకుంటాను. రాకేం అందరూ వొస్తారు—పూర్ణబాబూ !

పూర్ణ : నిరాశెందుకు పడటం !

రసిక్ : అది యెలా చెప్పను చెప్పండి. కాని యింట్లో ప్రవేశించగానే మీ రెండుకళ్ళ కేసి చూసేసరికి, అవి యెవరికోసం వెతుకుతూ తిరుగుతున్నాయో— ఆ వ్యక్తిని నేనుమాత్రం కాదు అని తోచింది.

పూర్ణ : చక్షుతత్వంమీద యింతదూరం అధికార మెలావొచ్చింది మీకు ?

రసిక్ : నావంక యెవ్వరూ యెన్నడూ చూడలేదు పూర్ణబాబూ ! అంచేత యీ ముసలి తనంవరకు యితరుల చక్షువులను పరిశీలనగా చూడటానికి కావాల్సినంత అవకాశం దొరికింది. మీలాగా అదృష్టం కలిసొచ్చినట్లయితే దృష్టితత్వాన్ని ఆర్జించకుండానే అనేకదృష్టుల్ని పొందగలిగేవాణ్ణి కాని యేమయినా అనండి పూర్ణబాబూ ! కళ్ళ రెండిటిలాంటి అద్భుతమైన సృష్టి మరొకటి జరగలేదు. శరీరంలో మనస్సు యెక్కడైనా ప్రత్యక్షంగా నివసిస్తుందీ అంటే —అది ఆ కళ్ళలోనే.

పూర్ణ : (ఉత్సాహంతో) సరీగ్గా చెప్పారు రసిక్‌బాబూ ! అల్పమైన శరీరంలో— యే అవయవంతోనైనా అనంతాకాశాన్నీ అగాధసముద్రాన్నీ పోల్చవొచ్చుననుకుంటే ఆ కళ్ళతోనే.

రసిక్ :
నిస్సీమశోభా సౌభాగ్యం నతాంగ్యా నయనద్వయమ్
అన్యోన్యాలోకనానంద విరహాదివ చంచలమ్ ॥

తెలిసిందా పూర్ణబాబూ !

పూర్ణ : లేదు. కాని తెలుసుకోవాలనే వాంఛ వుంది.

రసిక్ : అనంతశోభా సుభగమ్మానతాంగి నయనయుగము
అన్యోన్యాలోకనజనితానంద వియోగముచే
చంచలములు కానోపును

పూర్ణ : కాదు రసిక్‌బాబూ! అదీ సరిగ్గాలేదు. అది కేవలం వాక్చాతుర్యం. రెండు నేత్రాలు పరస్పరం చూసుకోవాలని వాంఛించవు.

రసిక్ : మరొక రెండు నేత్రాలని చూడాలని కాంక్షిస్తాయికదా! ఆ అర్థమే తీసుకో రాదా! చివరి రెండు పంక్తులూ మార్చేస్తే సరి—

పూర్ణ : చాలా చమత్కారంగా వుంది రసిక్‌బాబూ! కాని పాపం నిస్పృహోయుడైన ఆ బందీ —పంజరంలో పక్షిలాగా కంగారుగా అటూయిటూ తిరుగుతాడు. ప్రియ చక్షువు లున్నచోటికి రెక్కలు విప్పుకొని యెగిరిపోలేడు.

రసిక్ : మళ్లీ పరస్పరావలోకన వ్యవహారంకూడా యెంత దారుణమైనదో అదీ శాస్త్రంలో రాసివుంది.

హత్వాలోచన విశిఖైర్గత్వా కతిచిత్ పదాని పద్మాక్షీ
జీవతియువా నవా కిం భూయోభూయో విలోకయతి ॥

చూపుతూపులతోడ సుందరుని హతమార్చి
కొన్ని యడుగులు నడచి కువలయాక్ష యొకింత
వెనుదిరిగి యతడు జీవించియుండెనొ లేదొ
యనుచు పదేపదే కనులార తిలకించు

పూర్ణ : రసిక్‌బాబూ! మళ్లీమళ్లీ చూడాలని వాంఛించేది కేవలం కావ్యాల్లోనే.

రసిక్ : దానికి కారణం —కావ్యాల్లో మళ్లీ తిరిగిచూడటానికి యెలాంటి అసౌకర్యమూ వుండదు. ప్రపంచంకూడా అదే మూసలో కనక తయారయినట్లయితే యిక్కడ కూడా మళ్లీమళ్లీ చూడొచ్చు. యిక్కడ మనస్సు తిరిగిచూడాలనుకుంటుంది. చూపులు తిరిగిరావు.

పూర్ణ : (నిట్టూరుస్తూ) యీ ప్రపంచం చాలా చెడ్డది రసిక్‌బాబూ! మీరు బాగాచెప్పారు—

రసిక్ : ఆహా! పూర్ణబాబూ! నేత్రాల ప్రసక్తికనక వస్తే యిహ ముగించ బుద్ధి పుట్టదు.

లోచనే హరిణగర్వమోచనే
మావిదూషయ నతాంగి కజ్జలైః

సాయకః సపది జీవహారకః
కిం పునర్హి గరలేన లేపితః ॥

హరిణగర్వ మోచనములలోచనముల
కాటుకపై పూతయేలనే నతాంగి!
ప్రాణహరణమునకు బాణ
మొకటి చాలదా మరింక దాని
పైన విషపుపూత యేల

పూర్ణ : ఆగండి. రసిక్‌బాబూ! అదుగో యెవరో వొస్తున్నట్లున్నారు.

[చంద్రబాబు, నిర్మల ప్రవేశిస్తారు]

చంద్ర : అరె! అక్షయబాబా!

రసిక్ : నాకూ అక్షయబాబుకీ పోలికలున్నాయని వింటే అతడూ అతడి ఆత్మీయులూ కూడా విచారిస్తారు. నేను రసిక్‌ని.

చంద్ర : క్షమించండి రసిక్‌బాబూ హఠాత్తుగా భ్రమించాను.

రసిక్ : క్షమించటానికేం జరిగింది మహాశయా! నన్ను అక్షయబాబుగా భ్రమపడి కొంచెంకూడా అగౌరవపరచలేదు. క్షమాపణ వారిదగ్గిర కోరండి. పూర్ణబాబుతో యింతవరకూ నేను విజ్ఞానచర్చ చేస్తున్నాను చంద్రబాబూ!

చంద్ర : మన బ్రహ్మచారి సమితిలో నెలకోరోజు విజ్ఞానచర్చకోసం నిర్ణయించాలని అనుకున్నాను. యివాళ యే విషయాన్నిగురించి చర్చిస్తున్నారు పూర్ణబాబూ!

పూర్ణ : అహఁ. అదేమీలేదు చంద్రబాబూ!

రసిక్ : కళ్లచూపుల్నిగురించి నాలుగయిదు మాటలు వొకరితో వొకరం మాట్లాడుకోవటం జరిగింది.

చంద్ర : దృష్టిరహస్యం చాలా క్లిష్టమైనది రసిక్‌బాబూ!

రసిక్ : క్లిష్టమయిందికాకేం? పూర్ణబాబు అభిప్రాయంకూడా అదే.

చంద్ర : సమస్తవస్తువుల ఛాయే మన దృష్టిపటలంమీద ప్రతిఫలితమవుతుంది. దాన్ని మనం యెలా సూటిగా చూడటమన్న విషయమై యే అభిప్రాయమూ నాకు సంతోష జనకంగా తోచదు.

రసిక్ : సంతోషజనక మెలా అవుతుంది? సూటిగా చూడటం, వంకరగా చూడటం — మొదలైనవాటితో మానవుడికి తలతిరిగిపోతుంది. చాలా చిక్కైన విషయమే.

చంద్ర : నిర్మలతో రసిక్ బాబుకి పరిచయంకాలేదు. యీమే మన బ్రహ్మచారి సమితిలో ప్రథమ స్త్రీసభ్యురాలు.

రసిక్ : (నమస్కరించి) వీరు మన సమితికి సభాలక్ష్మి. తమ సౌజన్యంవల్ల మా సమితికి తెలివితేటల వెలితి తీరిపోయింది. వీరు మాకు ' శ్రీ ' నివ్వటానికొచ్చారు.

చంద్ర : కేవలం శ్రీకాదు. శక్తి.

రసిక్ : రెండూ వొకటే చంద్రబాబూ! శక్తి యెప్పుడైతే శ్రీగా ఆవిర్భవిస్తుందో అప్పుడే ఆ మెశక్తికి పరిమితిఅంటూ వుండదు. యేమంటారు పూర్ణబాబూ!

[పురుషవేషంతో శైలబాల ప్రవేశిస్తుంది]

శైల : క్షమించండి చంద్రబాబూ. నేను రావటం ఆలస్యమయిందా యేం?

చంద్ర : (గడియారం చూసి) లేదు. యింకా వేళకాలేదు. అబలాకాంతబాబూ! నా మేనకోడలు నిర్మల యివాళ మన సమితిలో సభ్యురాలయింది.

శైల : (నిర్మలదగ్గిర కూర్చుని) చూడండి. పురుషులు స్వార్థపరులు. ఆడవాళ్లని ముఖ్యంగా తమకి సేవచేయటానికే బంధించివుంచా లనుకుంటారు. చంద్రబాబు మిమ్మల్ని మా సమితి శ్రేయస్సుకోసం నియోగించారంటే— అందులో వారి మహత్వం వ్యక్తమవుతోంది.

నిర్మల : మా మామయ్యకు దేశశ్రేయస్సు, తన శ్రేయస్సు రెండూ వొకటే. నేను మీ సమితికి యేదైనా వుపకారం గనక చేయగలిగానంటే దానివల్ల వారికి సేవ చేసినట్లవుతుంది.

శైల : మీరు అదృష్టవశాత్తు చంద్రబాబుని బాగా అర్థంచేసుకునే యోగ్యతను పొందగలిగారు. మీ జీవితం ధన్యం.

నిర్మల : ఆయన్ని నే నర్థంచేసుకోకపోతే యెవరు చేసుకుంటారు.

శైల : ఆత్మీయులు సాధారణంగా ఆత్మీయుల్ని అర్థంచేసుకోరు. ఆత్మీయతతో కొద్ది వాళ్లను గొప్పవాళ్లను చేసి యెత్తేస్తారు. అలాగే గొప్పవాళ్లనుకూడా కొద్దివాళ్లని చేసి దించేస్తారు. చంద్రబాబుని మీరు యథాతథంగా అర్థంచేసుకున్నారంటే— దానివల్ల మీ సామర్థ్యం వ్యక్తమవుతోంది.

నిర్మల : కాని మా మామయ్యని యథాతథంగా అర్థంచేసుకోవటం చాలా తేలిక. ఆయనలో అలాంటి స్వచ్ఛత్వం వుంది.

శైల : చూడండి. అందుకనే వారిని సరిగ్గా తెలుసుకోగలగటం కష్టం. దుర్యోధనుడు స్ఫటికకుడ్యాన్ని కుడ్యంగా చూడలేకపోయాడు. పరశ—స్వచ్ఛతలో మహాత్వాన్ని అందరూ గ్రహించగలుగుతారా! దాన్ని అవహేళనచేస్తారు. ఆడంబరమే లోకుల దృష్టిని ఆకర్షిస్తుంది.

నిర్మల : మీరు యథార్థం మాట్లాడారు. బయటివాళ్ళు యెవరూ మా మామయ్యని యెరగనే యెరగరు. బయటివాళ్ళలో యిన్నాళ్లకు మీదగ్గిర మామయ్య సంగతి వినటం నాకెంత ఆనందంగా వుందో యేం చెప్పను?

శైల : మీ భక్తికూడా సరీగ్గా నా కలాంటి ఆనందాన్నే కల్గిస్తోంది.

చంద్ర : (వుభయులదగ్గిరకి వొచ్చి) అబలాకాంతబాబూ! మీకో పుస్తకం యిచ్చానే— అది చదివారా?

శైల : చదివాను. అందులోంచి నోట్స్ అంతా తీసుకుని, మీ వుపయోగానికి సిద్ధంచేసి వుంచాను.

చంద్ర : నాకు చాలా వుపకరిస్తుంది, చాలా సంతోషం అబలాకాంతబాబూ! పూర్ణ స్వయంగా నాదగ్గిర్నించి ఆ పుస్తకాన్ని అడిగితీసుకుని వెళ్ళాడు. కాని అతడికి వొంట్లో బాగుండకపోవటంవల్ల యేమీ చేయలేకపోయాడు. పుస్తకం మీదగ్గిరుందా?

శైల : తీసుకొచ్చిస్తాను.

[వెళ్ళిపోతుంది]

రసిక్ : పూర్ణబాబూ! మీరేదో డీలాపడినట్లు కన్పిస్తున్నారు. సుస్తీచేసిందా యేం?

పూర్ణ : లేదు. యేమీలేదు, రసిక్‌బాబూ! యిప్పుడు వెళ్ళాడే అతడి పేరేనా అబలాకాంతబాబు?

రసిక్ : అవును.

పూర్ణ : అతడి వ్యవహారం నాకంత బాగాలేదు.

రసిక్ : చిన్నవయసుకదా—అందుకని—

పూర్ణ : స్త్రీలతో యెలా ప్రవర్తించటం సముచితమో—ఆ శిక్షణ అతడికి చాలా అవసరం.

రసిక్ : నేనూ అది గమనించిచూశాను. ఆడవాళ్లతో అతడికి పురుషోచితంగా ప్రవర్తించటం తెలియదు. యేమిటో రాసుకుతిరిగే స్వభావం. అది బహుశా చిన్నవయసు ధర్మమైవుంటుంది.

పూర్ణ : మాకయినా వయస్సేమీ ముదిరిపోలేదు. కాని మేము —

రసిక్ : అది చూశానుగా ! మీరు బాగా దూరదూరంగానే వున్నారు. కాని ఆమె బహుశా దాన్ని కేవలం మర్యాదగానే గ్రహించివుండదు. మీరామెని నిర్లక్ష్యం చేసినట్లు ఆమె బహుశా భ్రమించివుంటుంది.

పూర్ణ : యేమంటున్నారు రసిక్‌బాబూ ! యేం చెయ్యాను చెప్పండి. ఆమెదగ్గిరకి వెళ్ళి యేం మాట్లాడటమో నాకు యెంత ఆలోచించినా తోచనేలేదు.

రసిక్ : ఆలోచిస్తే తోచదు. ఆలోచించకుండానే ముందుకు వెళ్ళాలి. ఆతర్వాత మాటలు వాటంతటవే వొస్తాయి.

పూర్ణ : కాదు రసిక్‌బాబూ ! నాకు వొక్కమాటకూడా రాలేదు. యేం మాట్లాడమంటారో మీరే చెప్పండి.

రసిక్ : సృష్టి తలకిందులయిపోయేవిధంగా యేమీ మాట్లాడనక్కర్లేదు. 'యీమధ్య యెండలెంత యిదిగా వున్నాయి' అంటూ మాట్లాడండి.

పూర్ణ : 'అవును. యెండలెక్కువగానే వున్నాయి' అని అంటుందనుకోండి తర్వాత యింకేం మాట్లాడను ?

[విపిన్, శ్రీశ్ ప్రవేశిస్తారు]

శ్రీశ్ : (చంద్రబాబుకి, నిర్మలకి నమస్కరించి—నిర్మలతో) మీ ఉత్సాహం గడియారం కంటె వడిగా ముందుకిపోతోంది. యిదుగో చూడండి యింకా ఆరున్నర కాలేదు.

నిర్మల : తమ సమితిలో నాకివాళ మొదటిరోజు. అందుకని సభ ప్రారంభంకాక మునుపే వొచ్చేశాను. ప్రథమంగా సభ్యత్వం పొందటంలో సంకోచం తొలిగిపోవటానికి కొంచెం వ్యవధి అవసరం.

విపిన్ : కాని మీకో చిన్న మనవి యేమిటంటే —మాదగ్గిరేమీ సంకోచంతో వ్యవహరించొద్దు. యివాళ్నించీ మీరు మా భారాన్ని స్వీకరించారు. దురదృష్టవంతులైన పురుషసభ్యుల్ని దయతో కనిపెట్టివుండండి. ఆదేశిస్తూ నడిపించండి.

రసిక్ : వెళ్ళండి పూర్ణబాబూ ! మీరుకూడా వొకమాట మాట్లాడండి.

పూర్ణ : యేం మాట్లాడను ?

నిర్మల : నడిపించగల సామర్థ్యంలేదు నాకు.

శ్రీశ్ : మీరు మమ్మల్నందర్నీ అచలాలకింద జమకట్టేశారా ?

విపిన్ : లోహంకంటె అచలమయిన వస్తువేముంది? కాని అగ్ని లోహాన్ని నడిపిస్తుంది. మాలాంటి భారీవస్తువుల్ని కదిలించేందుకు తమలాంటి దీప్తి అవసరం.

రసిక్ : విన్నారా పూర్ణబాబూ!

పూర్ణ : నేనేం మాట్లాడనో చెప్పండి.

రసిక్ : మాట్లాడండి. లోహాన్ని చలింపజేయాలన్నా అగ్ని కావాలి. కరిగించాలన్నా అగ్ని కావాలని అనండి.

విపిన్ : యేమిటి పూర్ణబాబూ! రసిక్‌బాబుతో పరిచయమయిందా?

పూర్ణ : ఆఁ.

విపిన్ : మీవాంట్లో బాగుందా యివాళ?

పూర్ణ : ఆఁ.

విపిన్ : వొచ్చి చాలాసేపయిందా?

పూర్ణ : లేదు.

విపిన్ : చూశారా యీసారి శీతువు గుర్రప్పందాలలో గుర్రంలాగా రివ్వున పరిగెత్తుతూ మాఘమాసం మధ్యదాకా వొచ్చి ఆగింది.

పూర్ణ : ఆఁ.

శ్రీశ్ : యిదిగో పూర్ణబాబూ! పోయినసారి మీవాంట్లో బాగాలేదు. యీసారి బాగా కులాసాగా వున్నట్లేనా?

పూర్ణ : ఆఁ.

శ్రీశ్ : యిన్నాళ్ళూ బ్రహ్మచారి సమితిలో యే వెలితి అయితే వుండేదో దాన్ని యివాళ యిక్కడికి రాగానే గ్రహించాను. బంగారు ఆభరణంలో వొక వజ్రం పొదగకుండా వుండటమే ఆ వెలితి. దాన్ని యివాళ పొదగటమయింది. యేమంటారు పూర్ణబాబూ!

పూర్ణ : మీలాగా అంత కవితాశక్తి నాకు లేదు. నేను అంత మాటల్ని యేర్చికూర్చి మాట్లాడలేను—ముఖ్యంగా స్త్రీలనుద్దేశించి.

శ్రీశ్ : మీ అసమర్థత తెలుసుకుని చాలా విచారిస్తున్నాను పూర్ణబాబూ! క్రమక్రమంగా సమర్థులు కాగలరని ఆశిస్తాను.

విపిన్ : (రసిక్‌ను చాటుగా లాగి, జనాంతికంగా, యిద్దరు వీరపురుషుల మధ్య యుద్ధం జరగనీయండి. యింక రండి రసిక్‌బాబూ! మీతో వొకటిరెండు సంగతులు మాట్లాడాలి. చూడండి. ఆ పుస్తకం మూట యేమయినా వొచ్చిందా మళ్లీ?

రసిక్ : అపరాధం చెయ్యటం మానవధర్మం. క్షమించటమేమో దేవధర్మం. ఆ మాటే ప్రసంగవశాత్తూ తెచ్చాను.

విపిన్ : దానికేమన్నారు?

రసిక్ : యేమీ అనకుండా మెరుపులా వెళ్ళిపోయారు.

విపిన్ : వెళ్ళిపోయారా?

రసిక్ : కాని ఆ మెరుపులో పిడుగు లేదు.

విపిన్ : వురుములు?

రసిక్ : అవీ లేవు.

విపిన్ : మరి?

రసిక్ : వొక ప్రాంతంలో లేదా మరో ప్రాంతంలోనో బహుశా కొంచెం వర్షం ఆశాస వుందేమో.

విపిన్ : దాని అర్థం?

రసిక్ : యేం తెలుసు మహాశయా! అర్థమూ వుండొచ్చు అనర్థమూ వుండొచ్చు.

విపిన్ : రసిక్‌బాబూ! మీరు చెప్పేదేమిటో నాకేమీ అర్థంకావటంలేదు.

రసిక్ : యెలా అర్థంచేసుకుంటారు?—చాలా కఠిన విషయం.

విపిన్ : (దగ్గిరగా వొచ్చి) యేది కఠిన విషయం మహాశయా?

రసిక్ : యీ వృష్టి, వజ్ర, విద్యుత్తుల విషయం.

శ్రీశ్ : యేమోయ్ విపిన్! అంతకంటె కఠినమైనది వినదలచుకుంటే పూర్ణదగ్గిరికెళ్ళు.

విపిన్ : కఠినమైనవాటినిగురించి నాకంత ఆసక్తిలేదు సోదరా!

శ్రీశ్ : యుద్ధంచేయటంకంటె సంధిచేసుకునే విద్యే యెక్కువ కష్టమైనది. అది నీకు వొచ్చు. నీకో నమస్కారం. పూర్ణను కొంచెం చల్లబరిచి రా. నేనీలోగా రసిక్‌బాబుతో వృష్టి, వజ్ర, విద్యుత్తులనుగురించి ఆలోచిస్తూవుంటా.

[విపిన్ వెళ్ళిపోతాడు]

రసిక్‌బాబూ ! అదే మీరా రోజున నృపబాలని చెప్పారే—ఆమె—ఆమెనిగురించి కొంచెం వివరంగా చెప్పండి. ఆరోజున రెప్పపాటుసేపు ఆమె ముఖంలో చూసిన స్నిగ్ధతనుగురించిన కుతూహలాన్ని అణచుకోలేకుండావున్నాను.

రసిక్ : వివరంగా చెబితే కుతూహలం మరింత యెక్కువవుతుంది. యిలాంటి కుతూహలం "హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవాభి వర్ధతే"—నేనింతసేపూ ఆమెను తెలుసుకునేవొచ్చాను. కాని ఆ కోమలహృదయంలోని స్నిగ్ధమధురభావం నాకు మాత్రం "క్షణేక్షణే తన్నవతాముపైతి"—

శ్రీశ్ : సరే. ఆమె—నేను అడుగుతున్నది ఆ నృపబాల సంగతి.

రసిక్ : నేనది అప్పుడే గ్రహించాను.

శ్రీశ్ : ఆఁ. ఆమె—యింకా యేమడగను ? ఆమెనిగురించి యేదయినాసరే కొంచెం చెప్పండి—నిన్న యేమన్నారు ? యివాళ పొద్దున యేంచేశారు ? యెంత సామాన్యమయిన సంగతయినాసరే మీరు చెప్పండి. నే వింటాను.

రసిక్ : (శ్రీశ్ చెయ్యిపట్టుని) చాలా సంతోషం శ్రీశ్‌బాబూ ! మీరు నిజమైన భావుకులు. నిజమే. మీరామెను రెప్పపాటుసేపు చూసి, మీరు తెలుసుకోకుండా విడిచిపెట్టింది రవంతకూడా లేదు. ఆమెకనక 'రసిక్‌దా ! ఆ కిరోసిన్ దీపం కాస్త యెక్కించు' అని అన్నదంటే—నాకది యేదో ఆదికవినుండి అనుష్టుప్ ఛందస్సు వినవొచ్చినట్లు కొత్తగా వుంటుంది. యేం చెప్పను శ్రీశ్‌బాబూ ! మీరు వింటే బహుశా నవ్వుతారేమో ! ఆరోజున యింట్లోకి వొచ్చి చూసేసరికి నృపబాల సూదిలో దారం యెక్కిస్తోంది. వొళ్లో దిండుగలీబు పడివుంది. నాకది వొక అద్భుతదృశ్యంగా తోచింది. యెన్నిసార్లు యెంతమంది దర్జీలకొట్లముందునించి వెళ్లాను ! యెప్పుడూ తలెత్తికూడా చూడలేదు. కాని—

శ్రీశ్ : అవును రసిక్‌బాబూ ! ఆమే స్వయంగా యింటిపనులన్నీ చేస్తారా ?

[శైలబాల ప్రవేశిస్తుంది]

శైల : రసిక్‌దాదాతో యేమిటి ఆలోచిస్తున్నారు ?

రసిక్ : అతిసామాన్య విషయాలమీదనే మా ఆలోచన సాగుతోంది. వీలైనంత మరీ స్వల్పవిషయాలమీద.

చంద్ర : సభాప్రారంభ సమయమయింది. యింక ఆలస్యంచేయటం వుచితంకాదు పూర్ణబాబూ ! వ్యవసాయ విద్యాలయాన్నిగురించి మీరివాళ వొక ప్రతిపాదన తీసుకొస్తానన్నారు ! ప్రారంభించండి.

పూర్ణ : (నిటారుగా నిలబడి గడియారం చైన్ సవరించుకుంటూ) నేడు—నేడు—

రసిక్ : (పక్కన కూర్చుని మెల్లిగా) నేడు యీ సభ—

పూర్ణ : నేడు యీ సభ—

రసిక్ : యే నూతన సౌందర్యాన్ని, గౌరవాన్ని సంపాదించుకోగలిగిందో—

పూర్ణ : యే నూతన సౌందర్యాన్ని, గౌరవాన్ని సంపాదించుకోగలిగిందో—

రసిక్ : ముందుగా దాన్ని అభినందించకుండా వుండలేకపోతున్నాను.

పూర్ణ : ముందుగా దాన్ని అభినందించకుండా వుండలేకపోతున్నాను.

రసిక్ : (మెల్లిగా) చెప్పుకుంటూ పొండి పూర్ణబాబూ!

పూర్ణ : అభినందించకుండా వుండలేకపోతున్నాను.

రసిక్ : భయమేమిటి పూర్ణబాబూ! చెప్పండి.

పూర్ణ : యే నూతన సౌందర్యం—గౌరవం—(దగ్గు) యే నూతన సౌందర్యం (మళ్లీ దగ్గు) అభినందించకుండా—

రసిక్ : (లేచి) సభాధ్యక్షా! నాదో మనవి. నేడు పూర్ణబాబు సభ్యులందరికంటె ముందు సభకు హాజరయినారు. వారు చాలా అస్వస్థులుగా వున్నారు. అయినా వుత్సాహాన్ని అణుచుకోలేకపోయారు. నేడు మన సమితికి ప్రథమ అరుణోదయం. దాన్ని చూడటానికి పక్షులు, ప్రత్యూషంలోనే తమతమ గూళ్లు వొదిలిపెట్టి బయలుదేరాయి—కాని శరీరం రోగగ్రస్తం. అంచేత పూర్ణబాబుకు హృదయంలో ఆవేశాన్ని కంఠంలో వ్యక్తీకరించే శక్తిలేదు. కనక వారికివాళ మనం నిష్కృతి ప్రసాదించాలి. నేడు నవప్రభాతంలో యే అరుణకాంతిని స్తుతించటానికి వారు లేచారో ఆ అవరుద్ధకంఠంతోవున్న భక్తునితరపున నేను క్షమాపణకోరుకుంటున్నాను. పూర్ణబాబూ! నేడసలు మన సభాకార్యక్రమాన్ని నిలిపివేయటంకూడా మంచిది. అయినా ప్రస్తుతపరిస్థితిలో నేటికి మిమ్మల్నిలాంటి ప్రస్తావనను తీసుకురానీయలేను. సభాపతి మహాశయులు క్షమించాలి. మన సభ్యులకు తమ ప్రతిభద్వారా సార్థక్యాన్ని ప్రసాదించటానికి విచ్చేసిన కరుణాహృదయులకు వీరిని క్షమించటమనేది స్వజాతిసులభమైన సహజధర్మం...

చంద్ర : నాకు తెలుసు. పూర్ణబాబు కొద్దిరోజుల్నించి కులాసాగా లేరు. యీ స్థితిలో వారికి శ్రమయివ్వలేం మనం. విశేషించి అబలాకాంతబాబు తమయింట్లో కూర్చునే మన సమితి కార్యకలాపాల్లో చాలా ముందుకుపోయారు. యింతవరకు

భారతదేశపు వ్యవసాయాన్నిగురించి గవర్నమెంటు యెన్ని రిపోర్టులనయితే వెలువరించిందో వాటినన్నిటినీ నేను వారికిచ్చాను. వాటన్నిటిలోనించి వారు— భూమికి యెరువువేయటాన్నిగురించిన అంశాన్ని క్రోడీకరించిపెట్టారు. వాటి ఆధారంతో అందరికీ సులభంగా అర్థమయ్యే భాషలో వొచిన్నపుస్తకాన్ని తయారుచేయటాని క్కూడా సంసిద్ధులైవున్నారు. యింత నేర్పుతో, సామర్థ్యంతో సమితి కార్యకలాపాల్లో సహకరిస్తూన్నందుకు వారికి ధన్యవాదాలర్పించటం సముచితం. విపిన్‌బాబు యూరపులోని విద్యాలయాలన్నిటి నియమావళిని, కార్యప్రణాళికలను సమకూర్చి యిచ్చే భారాన్ని స్వీకరించారు. యిహ శ్రీశ్‌బాబు స్వంతఖర్చుతో లండన్ మహానగరంలో ప్రజోపయోగకరములైన విశిష్టసంస్థ లేవయితేవున్నాయో వాటిజాబితా నేకరించటంతోపాటు, వొక వ్యాసాన్నికూడా రాసియివ్వటానికి వాగ్దానంచేశారు. అది యింకా పూర్తిచేయలేకపోయారనుకుంటా. నేను వొక పరిశోధనలో నిమగ్నుడనైవున్నాను. అందరికీ తెలుసు. మనదేశంలో యెడ్లబండ్లు యెలా నిర్మించారంటే— వాటికి వెనక బరువుపడగానే బోల్తాపడతాయి. యెడ్ల మెడలకు తాళ్ళు పురితాళ్ళలా బిగుస్తాయి. మళ్లీ యే కారణంవల్లనైనా యెద్దుకవక పడిందంటే బరువుతోసహా మళ్లీ బండి దానిమెడమీద పడుతుంది. దీన్ని తప్పించటానికి వుపాయాన్ని అన్వేషించటంలో మునిగివున్నాను. కృతకృత్యుణ్ణి కాగలనని ఆశిస్తున్నాను. మనం గోజాతినిగురించి పైకి దయాదాక్షిణ్యాలను వ్యక్తంచేస్తాం. కాని ప్రతినిత్యం అనవసరంగా అవి పడే కష్టాన్నిగురించి వుదాసీనభావంతో చూస్తూ వూరుకుంటున్నాం. నా దృష్టిలో యిలాంటి మిథ్యాభావుకతకంటె లజ్జాకరమైనది సృష్టిలో మరొకటి లేనేలేదు. మన సమితినించి దీనికేదైనా ప్రతివిధానం కనక చేయగలిగేట్లయితే— అప్పుడే మన సమితి ధన్యమవుతుంది. నేను రాత్రిపూట బండ్లవాళ్ల వాడకి వెళ్ళి గోజాతి పరిస్థితినిగూర్చి పరిశీలించాను. గోజాతిమీద అనర్థకమైన అత్యాచారం— స్వార్థానికీ ధర్మానికీ రెండింటికీ విరుద్ధమైనది— దాన్ని హిందువులైన బండ్లవాళ్లకు నచ్చచెప్పటం అంత కష్టమని అనుకోను. దీన్ని గురించి నేను బండ్లవాళ్లతో వొక పంచాయతీ యేర్పాటుచేసే ప్రయత్నంలో వున్నాను. శ్రీమతి నిర్మల ఆకస్మిక ప్రమాదాలకి వెంటనే చేయాల్సిన చికిత్సా పద్ధతుల్నీ, రోగుల్నిగురించి డాక్టర్ రామరతన్ మహాశయులవద్దనుంచి నియమంగా సలహాలు తీసుకుంటూంది. గౌరవకుటుంబాల్లో ఆ శిక్షణను ప్రచారంచెయ్యటానికి ఆమె కొంతమంది గౌరవనీయుల గృహాలకి వెళ్లి శిక్షణయివ్వటానిక్కూడా పూనుకుంది. యీవిధంగా ప్రతివొక్క సభ్యుడి ప్రత్యేక కృషిప్రయత్నాలవల్ల మన యీ చిన్న బ్రహ్మచారి సమితి సామాన్యులకు తెలియకుండా క్రమంగా అద్భుతమైన సాఫల్యాన్ని పొందగలుగుతుంది— యీవిషయంలో నాకెలాంటి సందేహమూ లేదు.

శ్రీశ్ : యేమోయ్ విపిన్! నా పని నేను మొదలుపెట్టనుకూడా లేదోయ్.

విపిన్ : నాస్థితీ సరిగ్గా అంతే.

శ్రీశ్ : కాని చెయ్యాలి.

విపిన్ : నేనూ చెయ్యాలి.

శ్రీశ్ : కొన్నాళ్లపాటు తక్కిన ఆలోచనలన్నీ కట్టిపెడితేనేగాని సాగేట్టులేదు.

విపిన్ : నేనూ అదే ఆలోచిస్తున్నా.

శ్రీశ్ : కాని అబలాకాంతబాబుని ధన్యులనే చెప్పాలి. ఆయన తన పని యెప్పుడు చేసుకుపోతుంటారో తెలియదు.

విపిన్ : అదే పెద్ద ఆశ్చర్యం. కాని ఆయన అన్యమనస్కుడవటానికి విశేషకారణం వుండివుండదని తోస్తుంది.

శ్రీశ్ : వెళతాను. వొకసారి వారితో మాట్లాడొస్తానోయ్.

[శైలకు దగ్గరగా వొస్తాడు]

పూర్ణ : రసిక్‌బాబూ! మీకు యేమనిచెప్పను ధన్యవాదాలు?

రసిక్ : మీరేమీ చెప్పొద్దు. నేను సుళువుగా గ్రహించగలను. కాని అందరూ నాలాగా కాదు పూర్ణబాబూ! వుజ్జాయింపుగా గ్రహించలేరు. వారికి చెప్పటం అవసరం.

పూర్ణ : మీరు నా ఆంతర్యంలో సంగతిని గ్రహించారు రసిక్‌బాబూ! మిమ్మల్ని పొందటంతో నేను బ్రతికిపోయాను. నాకు యేదోవొకటి నోటితో వుచ్చరించటానిక్కూడా సంకోచం కలుగుతూంటుంది. నేనేం చెయ్యాలో మీరు సలహా యివ్వండి.

రసిక్ : ముందు మీరామెదగ్గిరకు వెళ్ళి యేదోవొకటి మాట్లాడటం మొదలెట్టండి.

పూర్ణ : అదుగో చూశారా? అబలాకాంతబాబు మళ్లీ ఆమెదగ్గిరకెళ్ళి కూర్చున్నారు.

రసిక్ : కూచోనీయండి. అతడామెని నాలుగువైపులా చుట్టి కూర్చోలేదుగా! అబలాకాంతబాబుని మీరు వ్యూహంలా ఛేదించుకునిపోనక్కర్లేదు. మీరుకూడా వోపక్కన పోయినుంచోరాదూ!

పూర్ణ : సరే. చూస్తాను.

శైల : (నిర్మలతో) నాకింతగా చెప్పనక్కర్లేదు. మీరు నాకంటె చాలాయెక్కువ పని చేశారు కాని పాపం పూర్ణబాబునిగురించి నాకు చాలా విచారమేస్తుంది. మీరొస్తారనే ఆయన యివాళ యెంతో యెక్కువ వుత్సాహంతో వొచ్చారు. కాని ఆ సంగ

తిని వ్యక్తంచెయ్యలేకపోయినందుకు బహుశా ఆయన చాలా చిన్నబుచ్చుకుని వుంటారు. మీరుకనక వారిని—

నిర్మల : మీ తక్కినసభ్యులకంటె నన్ను కొంచెం యెక్కువగా వేరుచేసిచూడటం నాకు చాలా సంకోచంగా వుంది. నన్ను సభ్యురాలినిగా మీతోపాటు పరిగణించండి. మహిళనుగదా అని వేరుచేయకండి.

శైల : మీరు మహిళగా జన్మించటంలో వున్న సదుపాయాన్ని మా సభ్యులు పోగొట్టకోలేరు. మీరు మాతోపాటే అయితే యెంతపని జరుగుతుందో, మాకన్న భిన్నంగా వుంటే అంతకంటె యెక్కువ పని జరుగుతుంది. పడవను తాటితో ముందుకు లాగేవాళ్ళు దానికి కొంతదూరంగానే వుండాలి. చంద్రబాబు చుక్కాని పట్టుకున్నారు. వారూ మాకు కొంచెందూరంగా యెగువనే వున్నారు. మీరుకూడా తాటితో లాగుతూండాలి. కనక వేరుగా వుండాల్సిందే. మేమందరం తెడ్లువేసే వాళ్ల జట్టులో కూర్చున్నాం.

నిర్మల : మీరుకూడా ఆచరణలో ఆలోచనలో వీరందరికంటె వేరుగా వున్నట్లే తోస్తుంది. వొక్కరోజు చూడగానే యీ సమితిలో మీరు ప్రధాన సహాయకులు కాగలరని నాకు దృఢవిశ్వాసం యేర్పడింది.

శైల : అది నా అదృష్టం. యిదిగో రండి పూర్ణబాబూ ! మేం మీ సంగతే మాట్లాడుకుంటున్నాం. కూర్చోండి.

శ్రీశ్ : అబలాకాంతబాబూ ! రండి. మీతో చాలా విషయాలు మాట్లాడాల్సినవున్నాయి. (జనాంతికంగా తీసుకెళ్ళి) యివాళ సమితి పురాతన సభ్యులు ముగ్గురిలో యిద్దర్ని నిగ్గుపడేట్లుచేశారు. అది మంచిదే అయింది. పురాతనత్వంలో చైతన్యం తీసుకు రావటానికేగా నూతనత్వం అవసరం.

శైల : మరి కొత్త కట్టెపుల్లల్లో నిప్పురగల్చటానికి పాతకట్టె అవసరంకదా.

శ్రీశ్ : సరే. ఆ చర్చ తర్వాత కావిద్దాం. కాని నా రుమాలకానిదే దాన్ని అపహరించి పరాన్ని పోగొట్టుకున్నాను. యిహ రుమాలనుకూడా పోగొట్టుకోలేను. (జేబులోంచి పైకితీసి; యివిగో నేను డజను నిలుక్కురుమాళ్ళు తీసుకొచ్చాను దీనికి బదులు వీటిని తీసుకోవాలి. యివి దానికి తగిన మూల్యమని నేను చెప్పటంలేదు. తగినమూల్య మివ్వాలంటే చైనా జపానుల్ని కొల్లగొట్టాలి.

శైల ; మహాశయా ! యీ వ్యాజాన్ని తెలుసుకోటానికి తగిన తెలివి భగవంతు డిచ్చాడు నాకు. కనక నాకోసం తీసుకురాలేదు. యెవరి రుమాల అపహరించారో వారికి నాద్వారా—వీటిని—

శ్రీశ్ : అజలాకాంతబాబూ ! భగవంతుడు మీకు కావాల్సినంత తెలివియిచ్చినట్లు కన్పిస్తూనేవుంది. కాని దయమాత్రం కాస్త తక్కువని తోస్తుంది. యీ అభాగ్యుడికి రుమాల తిరిగి యిచ్చేశారంటే ఆ కళంకం సాంతం తొలగిపోతుంది.

శైల : సరే. నేను దయను వ్యక్తంచేసుకుంటున్నాను — కాని మీరు సమితికి యే వ్యాసాన్నిస్తానని వాగ్దానంచేశారో దాన్ని రాసియివ్వాలని కోరుతున్నా.

శ్రీశ్ : తప్పకుండా యిస్తా. రుమాలు తిరిగి యివ్వగానే పనిమీదికి మనస్సు పోనివ్వగలను. అప్పుడిహ తక్కిన అన్వేషణలన్నీ మాని, సత్యాన్వేషణే చేస్తూవుంటా.

[గదిలో మరొకచోట —]

విపిన్ : గ్రహించారా రసిక్‌బాబూ ! నేను ఆమె పాటల 'సెలక్షన్' చూసి ఆశ్చర్యపోయాను. పాటను యెవరు తయారుచేశారో వారి కవిత్వం వుండొచ్చు. కాని యీ పాటల యెన్నికలో యే కవిత్వమయితే వ్యక్తమవుతోందో అందులో చాలా సౌకుమార్యం వుంది.

రసిక్ : సరీగ్గా చెప్పారు— యెన్నిక సామర్థ్యమే సామర్థ్యం. లతని పూలు వాటంతటవే పూస్తాయి. కాని వాటిని యెవరు మాలగుచ్చుతారో— అందం, నైపుణ్యం వారిదే.

విపిన్ : మీకాపాట జ్ఞాపకం వుందా ?

ఏ శిలలదాకెనో యేమో హఠాత్తుగా
నానావ యిట మునిగిపోనున్న దీనాడు
కొంగ్రొత్తదీనావ
తొలిప్రయాణమ్మిదే
ఈ యగాధజలమ్ము
తరియింపగాలేక
ఆటలాడువిధాన
ఆతీర మీతీర
మందుకొన నడయాడు
నానావ యిట మునిగిపోనున్న దీనాడు.
నీలికెరటాలపై
తేలిపోయే పడవ
చుక్కాని చేబూని
యొక్కడనె యున్నాను
మలయమారుతములో
ఛలియించు తెరచాప

ఆకాశవీథి మేఘావృతముకాదు
ఆనందమయము నా అంతరంగమ్ము
ఈనావ కుసుమితోద్యానమ్ము చెంత
చేరునను నాస నా చిత్తమ్ము విడదు
నానావ యిట మునిగిపోనున్న దీనాడు.

రసిక్ : పోనీండి మునిగి. యేమంటారు విపిన్‌బాబూ ?

విపిన్ : పోనీండి. కాని యెక్కడ మునిగిందీ ఆ చిరునామా వుంచుకోవాలి కాస్త. సరే రసిక్‌బాబూ ! యీ పాటను ఆమె యెందుకు పుస్తకంలో రాసిపెట్టుకున్నారు ?

రసిక్ : స్త్రీహృదయ రహస్యాలను విధాతే తెలుసుకోలేడు అని లోకోక్తి. యీ రసిక్ బాబు అల్పుడు.

శ్రీశ్ : (దగ్గిరకొచ్చి) విపిన్ నువ్వు చంద్రకాంతబాబు దగ్గిరికోసారి వెళదూ. నిజానికి మన కర్తవ్యాన్ని మనం నిర్లక్ష్యంచేశాం. ఆయనతో కాస్త సంప్రతిస్తే—ఆయన సంతోషిస్తాడు.

విపిన్ : సరే.

[వెళ్ళిపోతాడు]

శ్రీశ్ : ఆఁ. మీరు ఆ కుట్టుపని సంగతి చెప్పారే !—ఆమె బహుశా స్వయంగానే యింటిపనులన్నీ చేసుకుంటారనుకుంటాను.

రసిక్ : అన్నీ !

శ్రీశ్ : మీరీనాడు వెళ్ళి చూశారనుకుంటా— ఆమెవొళ్ళో దిండుగలీబు పడివుంది. ఆమె -

రసిక్ : తలొంచుకొని సూదిలో దారం గుచ్చుతోంది.

శ్రీశ్ : సూదిలో దారం గుచ్చుతున్నారు. అప్పుడే స్నానంచేశొచ్చి వుంటారనుకుంటా.

రసిక్ : అప్పుడు మూడుగంటలయింది.

శ్రీశ్ : మూడు గంటలు ? ఆమె బహుశా తన మంచంమీద కూర్చుని—

రసిక్ : అహఁ. మంచంమీద కాదు. వరాండాలో చాపేసుకుని—

శ్రీశ్ : వరాండాలో చాపేసుకు కూచుని సూదిలో దారం యెక్కిస్తున్నారు.

రసిక్ : ఆఁ. సూదిలో దారం యెక్కిస్తున్నారు (స్వగతం) యిహ భరించలేను.

శ్రీశ్ : చిత్తరువులోలాగా స్పష్టంగా చూడగలుగుతున్నా. కాళ్ళు చాచుకునివున్నాయి. తల వొంగివుంది. చెదిరినజుట్టు ముఖమ్మీది కొచ్చిపడుతోంది. సాయంకాలపు యెండ —

విపిన్ : (దగ్గిరగా వొచ్చి) చంద్రబాబు నీతో ఆ వ్యాసాన్నిగురించి మాట్లాడాలనుకుంటున్నారు.

[శ్రీశ్ వెళ్ళిపోతాడు]

రసిక్ : యింకా యెంతని వాగను ?

[మరొక వైపున]

నిర్మల : (పూర్ణతో) మీవొంట్లో యివాళ అంత బాగాలేదనుకుంటా.

పూర్ణ : అహఁ. బాగానే వుంది. ఆఁ. కొంచెం యిదయింది నిజమే—యెక్కువేం లేదు. అయినా అంత బాగా—(దగ్గు) మీవొంట్లో బాగా కులాసాగా వుందా ?

నిర్మల : ఆఁ.

పూర్ణ : మీరు—అదే అడుగుతున్నా—మీరు—మీరు—మీకది యెలావుంది ? అది లేదూ మిల్టన్ 'యెరియోపెజీటికా' అది మా ఎమ్.ఏ. కోర్సులో వుందిగా ? అది మీకు చాలా యిదిగా వున్నట్లనిపించలా ?

నిర్మల : నేనది చదవనేలేదు.

పూర్ణ : చదవలేదూ ? (నిస్తబ్ధుడవుతాడు) మీరు—యీయేడు యెండలెంత యిదిగా వున్నాయి. వోసారి రసిక్‌బాబు—రసిక్‌బాబుతో నాకు కొంచెం పనుంది.

[నిర్మలదగ్గిరవించి వెళ్ళిపోతాడు]

[మరొకచోట]

విపిన్ : సరేకాని రసిక్‌బాబూ ! మీకేమనిపిస్తుంది — ఆ పాట ఆమె ప్రత్యేకంగా భావించి మరీ వుంటుంది.

రసిక్ : అయినా అయ్యుండొచ్చు. మీరు నాకు భలే శోకరా యిచ్చారే. మొదట్లో నేనలా వూహించలేదు.

విపిన్ : ఏశిలల దాకెనో యేమో హఠాత్తుగా
నానావ యిట మునిగిపోనున్న దీనాడు

అవునుగాని రసిక్‌బాబూ ! యిక్కడ నావ అంటే సరిగ్గా యేం ధ్వనిస్తోంది ?

రసిక్ : హృదయమని అర్థమవుతోంది—అందులో యేం సందేహంలేదు. అయితే ఆ రాయి యెక్కడో, ఆ పాషాణం యెవరో అదే ఆలోచించదగ్గ విషయం.

పూర్ణ : (దగ్గిరగా వొచ్చి) విపిన్‌బాబూ ! క్షమించండి. రసిక్‌బాబుతో నే కాస్త మాట్లాడాలి—

విపిన్ : మంచిది. మాట్లాడండి. నే వెళుతున్నా.

[రసిక్‌దగ్గిర్నించి వెళ్ళిపోతాడు]

పూర్ణ : నాఅంత మూఢుడు ప్రపంచంలో లేడు రసిక్‌బాబూ !

రసిక్ : మీకంటె మరీ మూఢులున్నారు — తమకితాము తెలివిగలవాళ్ళ మనుకునేవాళ్ళు. వుదాహరణకి నేను.

పూర్ణ : కొంచెం యేకాంతం చిక్కితే మీతో యెన్నో సంగతులు మాట్లాడాల్సినవున్నాయి. సభ అయిపోయాక రాత్రి కొంచెం తీరికచేసుకోగలరా ?

రసిక్ : మంచిది.

పూర్ణ : యివాళ మంచి వెన్నెలగా వుంది. 'గోల్‌దీఘి' పక్క...యేమంటారు.

రసిక్ : (స్వగతం) చచ్చాం.

శ్రీశ్ : (దగ్గిరగా వొచ్చి) వో ! పూర్ణబాబు మాట్లాడుతున్నట్లున్నారు. సరే. యిప్పు డొద్దు. రాత్రి మీకు కొంచెం తీరిక చిక్కుతుందా రసిక్‌బాబూ ?

రసిక్ : చిక్కొచ్చు.

శ్రీశ్ : అయితే నిన్నటిలాగా—యేమంటారు ? నిన్న చూశారుగా యింట్లోకంటె వీధిలో మంచి పట్టుగావుంటుంది.

రసిక్ : పట్టుగా వుండకేం ! (స్వగతం) జలుబు పట్టుకుంటుంది. దగ్గు పట్టుకుంటుంది. కంఠస్వరం—గడ్డపెరుగులా బిగుసుకుపోతుంది...

[శ్రీశ్ వెళ్ళిపోతాడు]

పూర్ణ : సరే రసిక్‌బాబూ. మీరయినట్లయితే యెలా మాట్లాడటం మొదలెడతారు ?

రసిక్ : బహుశా అడిగేవాణ్ణి—ఆరోజున బెలూన్ యెగిరిందే—మీ డాబామీదినుంచి కనిపించిందా ?

పూర్ణ : ఆమెకవక 'ఆఁ' అని అంటే—

రసిక్ : నే ననేవాణ్ణి. మనస్సుకు యెగిరే అధికారం యిచ్చాడు కనకనే యీశ్వరుడు మానవశరీరానికి రెక్కలివ్వలేదు. శరీరాన్ని అలావుంచి విధాత మనస్సు ఆధిక్యాన్ని హెచ్చించాడు అనేవాణ్ణి.

పూర్ణ : గ్రహించాను రసిక్‌బాబూ ! చమత్కారంగా వుంది. దీనిమీద యెన్నో మాటలు సృష్టించొచ్చు.

విపిన్ : దగ్గిరగా వొచ్చి పూర్ణబాబుతో మాట్లాడుతున్నారా ? యిప్పుడొద్దు. అయితే— మనం యీరాత్రి కలుసుకుందా మనుకున్నాంగా ! యేమంటారు ?

రసిక్ : అదే మంచిది.

విపిన్ : వెన్నెల్లో వీధులవెంట హాయిగా తిరుగుతూ—యేమంటారు ?

రసిక్ : చాలా హాయిగా —(స్వగతం) కాని ఆతర్వాత అనారోగ్యం.

[మరొకచోట]

శైల : నిర్మలతో, అయితే మంచిది. మీరుకనక కోరేట్లయితే నేనుకూడా ఆ విషయాన్ని ఆలోచించిచూస్తాను. నేను డాక్టరీ కొంతకొంత చదివాను. అట్టే లేదనుకోండి. కాని నేను మీతో కలిసి పనిచెయ్యటం మీకుత్సాహంగా వుంటుందంటే. అందుకు నే సిద్ధమే.

పూర్ణ : దగ్గిరగా వొచ్చి ఆరోజున బెలూన్ యెగిరిందే డాబామీదినించి మీక్కనిపించిందా ?

నిర్మల : బెలూనా !

పూర్ణ : ఆఁ. అదే. బెలూన్ (అందరూ నిరుత్తరులవుతారు) రసిక్‌బాబు చెప్పారు. మీరు బహుశా చూసివుంటారని. నన్ను క్షమించండి. మీ ఆలోచనకు భంగం కలిగించాను. నేను చాలా అభాగ్యుణ్ణి...

# పంచమాంకం

## దృశ్యం ౧

## అక్షయుని యిల్లు

[అక్షయ్—పురబాల]

అక్షయ్ : దేవీ ! అభయమిచ్చేట్లయితే వొక్క ప్రశ్న—

పుర : యేమిటది ?

అక్షయ్ : నీ శ్రీదేహంలో కృశించిన లక్షణాలేవీ కన్పించటంలేదే !

పుర : శ్రీదేహం కృశింపజేసుకోటానికేమీ వెళ్ళలేదు నేను పశ్చిమానికి.

అక్షయ్ : అయితే యేమిటి విరహవేదన అనే పదార్థం మహాకవి కాళిదాసుతోనే సహగమనం చేసుకుందాయేం ?

పుర : దానికి దృష్టాంతం మీరే. మీ ఆరోగ్యంకూడా యేమీ చెక్కుచెదిరినట్లు కన్పించటంలేదే.

అక్షయ్ : యెక్కడ చెదరనిచ్చారు ? నీ ముగ్గురు చెల్లెళ్ళూ కలిసి, నా కృశత్వాన్ని నివారించివుంచారు. విరహమంటే యేమిటో అసలు యేవిధంగానూ తెలియనీయలేదు.

విరహవేదనతోడ మరణింతు ననుచు నే
ప్రతినబూనితిగదా ! బాహువుల బంధించి
వారించినారెవరు మీరు ?
బాష్పాంబురాశిలో బడి మున్గిపోనెంచు
నన్నెవరు బంగారునావలో నెక్కించి
తిన్నగా దరిచేర్చినారు ?

ప్రియే, కాశీక్షేత్రంలో బహుశా పంచశరుడు త్రిలోచనుడిభయంతో అడుగు ముందుకు వెయ్యలేకపోయాడనుకుంటాను.

పుర : అయితే కావొచ్చు. కాని కలకత్తాలో మరి అతడి రాకపోకలున్నాయిగా !

అక్షయ్ : ఆఁ. వున్నాయ్ — కుంపిణీ శాసనాన్ని అతడు మన్నించడు. దానికి నిదర్శనాలు లభించాయి నాకు.

[నృపబాల, నీరబాల ప్రవేశిస్తారు]

నీర : అక్కా !

అక్షయ్ : యిప్పుడు 'అక్కా' తప్ప మరోమాటలేదు. అకృతజ్ఞురాలా ! అక్క విరహ తాపంలో అంతకంతకీ తప్తకాంచనంలాగా వన్నె తేలుతున్నప్పుడు — మిమ్మల్ని చల్లగా వుంచిం దెవరు ?

నీర : విన్నావా అక్కా ! అన్నీ వొట్టి అబద్ధాలు. నువ్వు లేనన్నాళ్లు మమ్మల్ని వొక్కసారయినా పిలిచి అడగలేదు. యెప్పుడూ వుత్తరం రాస్తూనో, రెండుకాళ్ళూ టేబిల్ మీద పెట్టి, చేత్తో పుస్తకం పట్టుకుని చదువుకుంటూనో కూచునేవాడు. నువ్విహా వొచ్చావ్ గనక మమ్మల్ని పట్టుకుని పాటలు పాడతాడు, వేళాకోళాలాడతాడు. చూపిస్తాడింకా —

నృప : నువ్వయినా యిన్నాళ్ళు మాకొక్క వుత్తరమయినా రాయనేలేదుగా అక్కా !

పుర : నాకు తీరికవుంటేనా చెల్లీ ! అమ్మతో రాత్రింబగళ్లు హడావిడిగా వుండాలిసొచ్చె.

అక్షయ్ : యేం 'మీ బావగారిధ్యానంలో నిమగ్నురాలినయివున్నాన' ని అంటే — లోకం నిందిస్తుందాయేం ?

నీర : అలా అయితే బావగారి అతిశయం యింకా పెచ్చుమీరిపోతుంది. ముఖర్జీగారూ ! మీరు మీ బయటిగదిలోకి వెళ్లరాదూ ! అక్క యిన్నాళ్ళకొచ్చింది. మమ్మల్ని ఆమెతో కాసేపు మాట్లాడుకోనీయరాదా ?

అక్షయ్ : నృశంసురాలా ! విరహదావదగ్ధ అయిన మీ అక్కను మళ్లీ విరహంతో బాధించాలనుకుంటున్నారా ? మీ బావగారు అనే నల్లటి కారుమబ్బు సంయోగరూపమయిన ముసలధారావర్షంద్వారా ప్రియురాలి చేతోరూపమయిన లతానికుంజంలో ఆనందరూపమయిన కిసలయాలను చిగురెత్తించి, ప్రేమరూపవర్షంలో కటాక్షరూప విద్యుత్తు —

నీర : వదరుబోతులనే కప్పల బెకబెకలు —

[శైలబాల ప్రవేశిస్తుంది]

అక్షయ్ : రా, రా. వుత్తమాధమమధ్యమలయిన యీ ముగ్గురు మరదళ్ళు లేకపోయినట్లయితే నాకు

నీర : ఉత్తమ మధ్యమలు కారా ?

శైల : (నృప, నీరలతో) మీరు కొంచెం అటు వెళతారా ? మేం కాస్త మాట్లాడుకోవాలి.

అక్షయ్ : ఆ మాటలేమిటో గ్రహించావా నీరూ ? హరినామస్మరణమాత్రం కాదు.

నీర : సరే. మీరింక వాగనవసరంలేదు.

[నృప, నీర వెళ్ళిపోతారు]

శైల : అక్కా, నృప, నీరలకోసం అమ్మ రెండు సంబంధాలను నిశ్చయించిందా అయితే—

పుర : ఆఁ. మాటలు వొకరకంగా నిశ్చయమయిపోయాయి. ఆ పుత్రవాళ్లిద్దరూ కూడా అయోగ్యులేంకారని విన్నాను. వాళ్ళు పిల్లలను చూసి, యిష్టపడగానే పూర్తిగా నిశ్చయాలు జరిగిపోతాయి.

శైల : వొకవేళ నచ్చకపోతే— ?

పుర : అలాఅయితే అది వాళ్ల దురదృష్టమనుకోవాలి.

అక్షయ్ : అయితే నా మరదళ్ల యిద్దరి అదృష్టం మంచిదన్నమాట.

శైల : నృప నీరలకు నచ్చకపోతే ?

అక్షయ్ : అయితే అప్పుడు వాళ్ల అభిరుచులను మెచ్చుకుంటాను.

పుర : నచ్చకపోవటమేమిటి ? మీవన్నీ మరీ బడాయిలు ! స్వయంవరాల రోజులు వెళ్ళిపోయాయి. ఆడపిల్లలకు నచ్చాలి అన్న అవసరంలేదు. భర్త అనగానే ప్రేమించ గలరు.

అక్షయ్ : లేకపోతే—ప్రస్తుతం మీ అక్కభర్తకు యెంత దుర్దశ సంభవించేది శైలా !

[జగత్తారిణి ప్రవేశిస్తుంది]

జగ : నాయనా ! అక్షయ్ ! కుర్రవాళ్లకిద్దరికీ అయితే కబురుపంపాలి. వాళ్లకి మన యింటి జాడ తెలియదు.

అక్షయ్ : మంచిదే అత్తగారూ ! రసిక్‌దాదాను పంపిస్తే సరి.

జగ : అయ్యో రాత ! మీ రసిక్‌దాదాది యేం తెలివని ! ఆయన యెవర్ని తీసుకురాబోయి యెవర్ని తీసుకొస్తాడో యేం చెప్పగలం !

పుర : అయితే అమ్మా ! నువ్వేం బెంగెట్టుకోవొద్దు. కుర్రవాళ్లనిద్దర్నీ తీసుకొచ్చే యేర్పాటుచేస్తాను.

జగ : అమ్మా పురీ ! నువ్వు కాస్త శ్రద్ధతీసుకోకపోతే కాదు. యీకాలపు కుర్రాళ్ళు వాళ్ళతో యెలా వ్యవహరించాలో—యెలా వ్యవహరించకూడదో నాకేమీ తెలియదు.

అక్షయ్ : (జనాంతికంగా) పురీ హస్తరాసి మంచిదంటారు. పురీ తన తల్లికి యెలాంటి అల్లుణ్ణి సంపాయించిపెట్టిందని. దాంతో ఖ్యాతి పెరిగిపోయింది. యీకాలపు కుర్రవాళ్లను యెలా వశంచేసుకోవాలో—ఆ విద్యలో—

పుర : (జనాంతికంగా) తమరు యీకాలపువాళ్లే కాబోలు.

జగ : అమ్మా ! మీరు సంప్రతించుకుంటూవుండండి. *కాయస్థులావిడ వొచ్చి కూర్చు న్నారు. నే నామెని పంపించొస్తాను.

శైల : అమ్మా ! నువ్వు కొంచెం బాగా ఆలోచించుకో. కుర్రవాళ్ళనిద్దర్నీ యింతవరకూ మీరెవరూ చూడనేలేదు. హఠాత్తుగా—

జగ : ఆలోచించి ఆలోచించి నా ఆయుర్దాయమంతా గడిచిపోయింది. యిహ ఆలోచించ లేను.

అక్షయ్ : ఆలోచన వీలునుబట్టి తర్వాత చేసుకోవొచ్చు. యిప్పుడు ముందు పనికావాలి.

జగ : చెప్పు నాయనా ! శైలకు బాగా అర్థమయేట్లు చెప్పు.

[వెళ్ళిపోతుంది]

పుర : నువ్వు లేనిపోని ఆలోచనలు పెట్టుకుంటున్నావు శైలా ! అమ్మ మనస్సులో నిశ్చ యించుకున్నాక ఆమెనింక యెవరూ ఆ నిశ్చయాన్నించి కదిలించలేరు. విధివిధా నాన్ని నేను వొప్పుకుంటాను చెల్లీ ! యెవరికి యెవరితో ముడిపడవలసుందో— వెయ్యి ఆలోచనలతో సతమతమయినా—వాళ్లతో వారికి ముడిపడితీరుతుంది.

అక్షయ్ : అది సరైనమాట. కాకపోతే—యెవరికి యెవరితో ముడిపడాల్సివుందో వారికి వారితో ముడిపడక మరొకరితో ముడిపడుతుందా ?

పుర : మీ తర్కమేమిటో—మీ మాటలు సగం అర్థమేకావు.

అక్షయ్ : దానికి కారణం నేను జ్ఞానంలేనివాణ్ణి అవటం.

పుర : వెళ్లండి. యిహ స్నానానికి వెళ్లండి. బుర్ర చల్లబడ్డతర్వాత రండి.

[వెళ్ళిపోతుంది]

* వంగదేశంలోని వొక జాతి. కాయస్థులు చిత్రగుప్త వంశీయులని చారిత్రక ప్రతీతి.

[రసిక్ ప్రవేశిస్తాడు]

శైల : రసిక్‌దాదా! విన్నావుగా అంతా! చిక్కులో పడ్డాం.

రసిక్ : చిక్కేముంది! కుమార సమితి కౌమార్యం అలాగే వుండిపోయింది. నృప, నీరుకూడా వొడ్డెక్కారు. అన్నివైపులా సురక్షితాలయినాయి.

శైల : యేవైపూ సురక్షితంకాలేదు.

రసిక్ : కనీసం యీ వృద్ధుడివైపు సురక్షితమయింది. యిద్దరు అర్వాచీనులతో కలిసి, నేను రాత్రిళ్ళు వీథిలో నిలబడి శ్లోకాలు యేకరువుపెట్టక్కర్లేదు.

శైల : ముఖర్జీగారూ! మీరుతప్ప రసిక్‌దాదాను యెవరూ అదుపులో పెట్టలేరు—ఆయన నా మాట మన్నించడు.

అక్షయ్ : యే వయసులో మీ మాటను వేదవాక్యంగా భావించాలో ఆ వయసు దాటి పోయిందికదా! అంచేత ఆయన తిరగబడటానికి సాహసిస్తున్నాడు. సరే. నేను చక్కబెడతాను. పద, రసిక్‌దా! నా బయటగదిలో కూచుని ధూమపానం చేసుకోవచ్చు.

## దృశ్యం ౨

### విపిన్ యిల్లు

[విపిన్—గురుదాస్]

[తంబురా తీసుకుని విపిన్ సరిగమలు కఠోరంగా అపస్వరాల్లో సాధనచేస్తుంటాడు...]

విపిన్ : భాయీ గురుదాస్ నువ్వు విద్వాంసుడివి. నాకీ వుపకారం చెయ్యాకతప్పదు. యీ పుస్తకంలో రాసిన పాటలకన్నిటికీ స్వరం వేసిపెట్టాలి. నువు పాడింది చాలా గొప్పగావుంది. నీకు శ్రమ అనుకోకపోతే— మరోసారి—మొదట యీ పాటల్లో మాటలు చూడగానే యిరకాటంలో పడ్డాను. యిప్పుడు చూస్తే యీ మాటలు మానససరోవరంలో పద్మాలు, వాటికి గానంకూడా జోడిస్తే వీణాపాణి స్వయంగా వాటిమీద అధివసించినట్లేవుంది. భాయీ, యేదీ యింకోసారి—

గురు : నీకోసమె దారిలోన నిలిచియుంటి సుందరుడా
హృదయవీణతంత్రులపై గదిసె ధూళి సుందరుడా
కుసుమమ్ములులేక మాలగ్రుచ్చుటెట్లు సుందరుడా
తీగలపై దుఃఖగీతి మ్రోగునదే సుందరుడా
దూరమ్ముననుండి యంధకారములో వినగలవది
దినములొక్కటొకటె కడచిపోవునోయి సుందరుడా
యేపిపాస జనియించెనొ హృదయము తపియించిపోవు
ఏమిసేయనోపుదునిక నీశూన్యపథమ్మునందు
కావిరంగు తెరచాపల నావయెపుడు తిరిగివచ్చు
చేరుకొన్నదో సుధాబ్ధితీరమ్మును సుందరుడా !

[భృత్యుడు ప్రవేశిస్తాడు]

భృత్యుడు : వొక బాబొచ్చారు.

విపిన్ : బాబా ! యెలాంటి బాబురా ?

భృత్యుడు : ముసలాయన.

విపిన్ : బట్టతలుందా ?

భృత్యుడు : వుంది.

విపిన్ : (తంబురా పెట్టేసి) తీసుకురా. వెంటనే తీసుకురా. వారేయ్ ! వారేయ్ ! తమాకిచ్చివెళ్ళు. పనిమని షెక్కడికెళ్ళాడు ? పంకాలాగమని చెప్పరేయ్ ! చూడు. చప్పునపోయి కాసిని కిళ్లీలు కొనుక్కురా. ఆలస్యం చెయ్యకు. అన్నట్లు వో అర్థ శేరు—ఐస్‌కూడా తీసుకురా. తెలిసిందా.

[భృత్యుడు వెళ్ళిపోతాడు]

(అడుగుల సవ్వడి విని) రసిక్‌బాబూ ! రండి.

[వనమాలి ప్రవేశిస్తాడు]

విపిన్ : రసిక్‌బాబూ !— అరె ! వనమాలి !

వృద్ధుడు : చిత్తం. నాపేరు శ్రీ వనమాలి భట్టాచార్య.

విపిన్ : ఆ పరిచయం అనవసరం. నేను కొంచెం ముఖ్యమైన పనిలో వున్నాను.

వన : పిల్లల్నిద్దర్నీ యిహ ఆపటానికి వీల్లేదు సంబంధాలుకూడా చాలా వొస్తున్నాయి.

విపిన్ : విని చాలా సంతోషిస్తున్నా. యిచ్చెయ్యండి. యిచ్చే సెయ్యండి.

వన : కాని మీదే చాలా యోగ్యమైన సంబంధం.

విపిన్ : చూడండి వనమాలిబాబూ! యిప్పటికీ మీకు నన్ను గురించి పూర్తిగా తెలియదు. వొకసారి తెలిసిందంటే నా యోగ్యతగురించి పెద్దసందేహ మేర్పడుతుంది.

వన : అయితే వెళతాను నేను. మీరేదో తొందరలో వున్నారు. మరోమారెప్పుడైనా వొస్తా.

విపిన్ : (తంబురా తీసుకుని) సరిగమా, రిగమపా, గమపదా.

[శ్రీశ్ ప్రవేశిస్తాడు]

శ్రీశ్ : యేమిటోయ్ విపిన్! యేమిటిది? కుస్తీ విడిచిపెట్టి సంగీతం మొదలెట్టావా? అరె గురుదాసా!

విపిన్ : ఉస్తాద్‌జీ! యివాల్టికి సెలవు. యేంచెయ్యను చెప్పు. సంగీతం నేర్చుకోక పోతే నీ సన్యాసిదళంలో ప్రవేశం దొరకదు. గురుదాస్‌జీని గురువుగా స్వీకరించాను. ఆయనదగ్గిర నవీన సన్యాసవ్రతదీక్ష తీసుకున్నాను.

శ్రీశ్ : అదెలాంటిది?

విపిన్ : రసం నిండినప్పుడే త్యాగం సులభమవుతుంది. మేఘం నీటితో నిండినప్పుడే వర్షిస్తూంటుంది.

శ్రీశ్ : నీ కొత్త ఫిలాసఫీ అలావుంచు. బ్రహ్మచారి సమితికి రానీయిస్తానన్నది మొదలు పెట్టావా?

విపిన్ : లేదు భాయీ! అది యింకా మొదలుపెట్టనేలేకపోయాను. నువు రాస్తున్నది పూర్తయిందాయేం?

శ్రీశ్ : ఉహూఁ. నేనూ మొదలుపెట్టలేదు. (కొంచెంసేపు మెదలకుండా వూరుకుని) కాదు. భాయీ! చాలా అసందర్భంగా వుంది. క్రమంగా మనం మన సంకల్పం నుంచి దూరంగా పోతున్నట్లున్నాం.

విపిన్ : చాలా సంకల్పాలు కప్పపిల్లల తోకల్లాంటివి. కప్పపిల్లలు పెరుగుతున్నకొద్దీ వాటంతటవే అంతరించిపోతూవుంటాయి. కాని వొవేళ తోక అలాగే వుంటుందనుకో కప్ప చిక్కు శల్యమైపోతుంది. అదెలా వుంటుంది! యేదో సమయంలో సంకల్పించాం గనక దానికోసం యెండి చావాలిసిందే అంటే—నే నొప్పుకోను.

శ్రీశ్ : నాకర్థమైంది. యెన్నో సంకల్పాలున్నాయి. వాటికోసం శుష్కించి మరణించటంకూడా మేలే. కాయలుకాయని చెట్టులాగా మనకు ఆకుల్లోనూ కొమ్మల్లోనూ రోజురోజుకీ అపరిమితంగా రసప్రసారంమాత్రం జరుగుతోంది. దాంతోపాటు సాఫల్యాకాంక్ష రోజురోజుకీ దూరమయిపోతోంది. నేను చాలా పొరపాటుచేశాను విపిన్ : మహత్తరమైన కార్యాలన్నిటికీ తపస్సు కావాలి. సమస్తభోగాల్నీ తనంతటతాను వొదులుకోనిదే— అన్నివైపులనించి మనస్సును వెనక్కిలాగుతూ రాకపోతే—యే మహత్కార్యంమీదా మనస్సును పూర్తిగా నిలపలేం. యిహనించి రసచర్చను పూర్తిగా పరిత్యజించి, కఠినమైన పనుల్లో నిమగ్నుణ్ణవుతానని ప్రతిజ్ఞ పట్టాను.

విపిన్ : నీవన్నది వొప్పుకుంటాను. కాని అన్ని గడ్డిపోచల్నించీ ధాన్యం రాలదు. యెండిపోవాలనుకుంటే కేవలం యెండిచావటమే అవుతుంది. ఫలితమేమీ వుండదు. యే సంకల్పాన్నయితే పెట్టుకున్నామో— ఆ సంకల్పం మనద్వారా సఫలంకాదని— నాకనిపిస్తూనేవుంది కొన్నాళ్లనించీ. అంచేత మన స్వభావానికి సాధ్యమయిన మరోరకమైన మార్గాన్ని దేన్నయినా అనుసరించటమే మేలు.

శ్రీశ్ : యెందుకూ పనికొచ్చే మాటకాదిది. నీతంబురాని వొదిలెయ్ నువ్వు—

విపిన్ : సరే. వొదిలేస్తాను. దానివల్ల ప్రపంచానికేమీ నష్టంరాదు.

శ్రీశ్ : చంద్రబాబు యింటికి మన సమితిని మార్చేసి వెళ్ళిపోదాం.

విపిన్ : మంచిమాటే.

శ్రీశ్ : మనమిద్దరమూ కలిసి రసిక్‌బాబుని కొంచెం నిగ్రహం వహించేట్లుచేద్దాం.

విపిన్ : అతనొక్కడూ మన యిద్దర్నీ నిగ్రహంలేనివాళ్లనుగా చేయలేడు.

గురు : నిగ్రహం చర్చగనక ప్రారంభించేట్లయితే—యిహ నా అవసరం యేమీవుండదు.

విపిన్ : అవసరం మరింత యెక్కువ. యెండ తీక్ష్ణమైనకొద్దీ నీటిఅవసరం యెక్కువవుతూవ్వుంటుంది. యీ దుస్సమయంలో నువ్వు నన్నొదిలెయ్యకు. పొద్దున సాయింత్రం దర్శనమిస్తూవుండు. ఆ పాట యీలోగానే గనక తయారైతే యివాళ సాయంత్రమే —యేమిటి యేమంటావ్ ?

గురు : సరే. అలాగే.

[వెళ్ళిపోతాడు]

[భృత్యుడు ప్రవేశిస్తాడు]

భృత్యుడు : వొక ముసలిబాబొచ్చారు.

విపిన్ : ముసలిబాబా! వేధించేసేస్తున్నాడే. వనమాలి మళ్లీ వొచ్చాడు కాబోలు.

శ్రీశ్ : వనమాలేనా! కాసేపటిక్రితమే నాదగ్గిరికి వొచ్చాడతడు.

విపిన్ : రేయ్! ముసలివాణ్ణి పంపించేసెయ్.

శ్రీశ్ : నువ్వు పంపించేస్తే మళ్లీ నా నెత్తిమీదికొచ్చిపడతాడు. అంతకంటె పిలుచుకు రానియ్. మనమిద్దరం కలిసే సాగనంపుదాం. (భృత్యుడితో) ముసలివాణ్ణి తీసుకురా.

[భృత్యుడు వెళ్ళిపోతాడు]

[రసిక్ ప్రవేశిస్తాడు]

విపిన్ : యిదేమిటి? యితడు వనమాలికాడు. రసిక్‌బాబు.

రసిక్ : చిత్తం. అవును. అద్భుతమైన గ్రహణశక్తి మీది. నేను వనమాలినికాను—

"ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ"—

శ్రీశ్ : వొద్దు రసిక్‌బాబూ! అలాంటివన్నీ వొద్దు. రసపదాలాపాలన్నీ కట్టిపెట్టాం.

రసిక్ : అమ్మయ్య బ్రతికించారు.

శ్రీశ్ : తక్కిన అన్నిరకాల ఆలోచనల్ని పరిత్యజించి, యికనించి యేకాగ్రతతో బ్రహ్మచారి సమితి కార్యకలాపాలు చేపడతాం.

రసిక్ : నా అభీష్టంకూడా అదే.

శ్రీశ్ : వనమాలి అనే వొక వృద్ధుడు "కుమార్‌టులీ ' నీలమాధవచౌధురీగారి యిద్దరి అమ్మాయిల సంబంధాలనూ తీసుకొచ్చిపడ్డాడు మాకోసం. మేమతణ్ణి ముక్తసరిగా పంపించేశాం. యీ ప్రసంగాలన్నీ మాకు అసంగతంగా తోస్తున్నాయి.

రసిక్ : నాదగ్గిరకూడా అంతే. వనమాలి యిద్దరికన్యలు — లేదా అంతకంటె యెక్కువ మంది కన్యల సంబంధాలనుగాని నాదగ్గిరకి కనక తీసుకొచ్చేట్లయితే - నిష్ఫలుడై తిరిగి వెళ్ళాల్సివస్తుందనుకుంటా.

విపిన్ : రసిక్‌బాబూ! తమరు కొంచెం ఫలహారం తీసుకుపోవాలి.

రసిక్ : వొద్దు మహాశయా ! యివాళొద్దు. మీతో వొకటిరెండు ముఖ్యమైన సంగతులు మాట్లాడాలి. కాని కఠోరప్రతిజ్ఞకు బద్ధులైనారని వినటంతో చెప్పటానికి సాహసించలేకపోతున్నా.

విపిన్ : ఆత్రంగా, అహఁహఁ. అలా అని అలాటి సంగతులుంటే మాట్లాడకుండా వూరుకోవటమెందుకు ?

శ్రీశ్ : మేం మీరనుకున్నంత భయంకరులం కాము. మాట్లాడాల్సింది నాతో ప్రత్యేకంగానా ?

విపిన్ : అహఁ. కాదు. ఆమధ్య నాతోనే వొకటిరెండు మాట్లాడాల్సిన సంగతులున్నాయని అన్నారు రసిక్‌బాబు.

రసిక్ : వొద్దు మానేస్తాను పోనీ—

శ్రీశ్ : చెప్పారగా – యివాళ రాత్రి 'గోల్‌దీఘి' పక్క—

రసిక్ : వొద్దు శ్రీశ్‌బాబూ ! క్షమించండి.

శ్రీశ్ : విపిన్ ! నువ్వు కాస్త ఆ గదిలోకెళ్లరాదూ ? బహుశా నీయెదట రసిక్‌బాబు —

రసిక్ : అహఁహఁ. అవసరంలేదు—

విపిన్ : అంతకంటె రసిక్‌బాబూ ! మూడో అంతస్థు గదిలోకి పదండి. శ్రీశ్ కాసేపు యిక్కడే కనిపెట్టుకుంటాడు.

రసిక్ : వొద్దు. మీరిద్దరూ కూర్చోండి నేనే లేస్తాను.

విపిన్ : అదెలా కుదురుతుంది ? కొంచెం తిని వెళ్లాలి.

శ్రీశ్ : అహఁ. యేమయినాసరే మిమ్మల్ని విడిచిపెట్టను. అలా వీల్లేదు.

రసిక్ : అయితే అసలు విషయం చెప్పేస్తాను. నృపబాల, నీరబాలల సంగతి మీరిదివరకే విన్నారు —

శ్రీశ్ : వినకేం. ఆఁ...నృపబాలగురించి యేదైనా—

విపిన్ : నీరబాలనిగురించి ముఖ్యమైన సంగతేమయినా—

రసిక్ : వాళ్ళిద్దర్నిగురించీ పెద్దవిచారం వొచ్చిపడింది.

యిద్దరూ : అనారోగ్యం కాదుగదా ?

రసిక్ : అంతకు మించినది. వారి వివాహవిషయంలో—

శ్రీశ్ : యేమిటి అన్నారు రసిక్‌బాబూ ! వివాహప్రసక్తి యేమీ విననేలేదే.

రసిక్ : యేమీ వినలేదు. కాని హఠాత్తుగా వాళ్ల అమ్మ కాశీనించి వొచ్చి, అకాల కూష్మాండాల్లాంటి వాళ్లకిద్దరికి వాళ్లనిచ్చి వివాహాలుచెయ్యటానికి నిశ్చయించింది.

విపిన్ : అలా యేమయినాసరే జరగటానికి వీల్లేదు రసిక్‌బాబూ !

రసిక్ : మహాశయా ! ప్రపంచంలో అప్రియమైన సంఘటనలకే అవకాశాలెక్కువ. పూలమొక్కలకంటె కలుపుమొక్కలు మొలవటమే యెక్కువ.

విపిన్ : కాని ఆ గడ్డిమొక్కలను పెరికిపారెయ్యక తప్పదు.

శ్రీశ్ : పూలమొక్కలను నాటకతప్పదు.

రసిక్ : అది నిజమే. కాని చేసేవారెవరు మహాశయా !

శ్రీశ్ : మేం చేస్తాం. యేమంటావ్ విపిన్.

విపిన్ : తప్పకుండా.

రసిక్ : కాని యేంచేస్తారు ?

విపిన్ : మీరుకనక చెప్పేట్లయితే ఆ యువకుల్నిద్దర్నీ దారిలోనే—

రసిక్ : అర్థమయింది. ఆ మాట తలుచుకుంటేనే వొళ్ళు పులకరిస్తున్నది. కాని బ్రహ్మదేవుడి వరంవల్ల అపాత్రుల సంఖ్య అనంతం—యిద్దరు పోతే పదిమందొస్తారు మళ్లీ.

విపిన్ : వీళ్లిద్దర్నీ బలంతోనూ వంచనతోనూ కొన్నాళ్ళపాటు మధ్యపెట్టివుంచితే—ఆలోచించుకోటానికి వ్యవధి లభిస్తుంది.

రసిక్ : ఆలోచించుకునే వ్యవధి తగ్గిపోతోంది. యీ శుక్రవారంనాడు వాళ్లు పిల్లల్ని చూడటానికొస్తున్నారు.

విపిన్ : యీ శుక్రవారమా ?

శ్రీశ్ : అంటే యెల్లుండి !

రసిక్ : చిత్తం. యెల్లుండి అన్నది నిజమేనండి ! శుక్రవారాన్ని మధ్యలో ఆపి మాయ పుచ్చటానికి వీల్లేదు.

శ్రీశ్ : సరే. నాకో ప్లాను తట్టింది బుర్రలోకి.

రసిక్ : యేమిటో చెప్పండి.

శ్రీశ్ : ఆ కుర్రవాళ్లనిద్దర్నీ యింట్లో యెవరయినా యెరుగుదురా ?

రసిక్ : యెవరూ యెరగరు.

శ్రీశ్ : వాళ్ళు యిల్లెరుగుదురా ?

రసిక్ : అహఁ. అదీలేదు.

శ్రీశ్ : అలా అయేట్లయితే విపిన్ ! వాళ్లనారోజు యెలాగయినా అటకాయించుంచితే నేను వాళ్లపేరుతో నృపబాలను—

విపిన్ : నేను తెలుసుగా భాయీ ! నాకెలాంటి యుక్తులూ తోచవు. నువ్వుకనక తలచు కుంటే యుక్తితో ఆ కుర్రవాళ్లనిద్దర్నీ అటకాయించుంచగలవు. పోనీ నేనే వాళ్ళ పేరుపెట్టుకుని వెళ్ళి నీరబాలను—

రసిక్ : కాని మహాశయా ! యీ సందర్భంలో గౌరవవాచకంగా బహువచనం చెల్లదు. వొచ్చేవాళ్లేమో యిద్దరు కుర్రవాళ్లు మీలో వొకర్ని యిద్దర్నిగా చలామణీచెయ్యటం కష్టమవుతుంది.

శ్రీశ్ : అవునదీ నిజమే.

విపిన్ : అవును. ఆ మాట మరిచిపోయాను.

శ్రీశ్ : అలా అయితే మేమిద్దరం వెళ్ళాల్సివుంటుంది. కాని—

రసిక్ : వాళ్లనిద్దర్నీ తప్పుదారిని పట్టించటానికి నేనొక్కణ్ణే చాలు. కాని మీరు—

విపిన్ : మమ్మల్నిగురించి దిగులుపెట్టుకోకండి రసిక్‌బాబూ !

శ్రీశ్ : మేమన్నింటికీ సిద్ధంగా వున్నాం.

రసిక్ : మీరు మహనీయవ్యక్తులు. యిలాంటి త్యాగసంసిద్ధత—

శ్రీశ్ : బాగుంది. యిందులో త్యాగమేమీ లేదు.

విపిన్ : యిది ఆనందకరమైన విషయం—

రసిక్ : అహఁహఁ. అయినా తమ వ్యూహంలో తామే చిక్కుకుంటారేమో అన్న ఆశంక కలగొచ్చు మనస్సుకి.

శ్రీశ్ : కాదు మహాశయా! యెలాంటి భయమూ లేదు.

విపిన్ : మాకేది సంభవించినా దాంతోనే సంతృప్తిపడతాం.

రసిక్ : యిది మీలోవున్న మహత్వం. కాని మిమ్మల్ని కాపాడటం మా కర్తవ్యం. కనక నేను మీకు మాటిస్తున్నాను. యీ శుక్రవారం వొక్కరోజూ యెలాగో దాటించండి. ఆతర్వాత యిహ యెప్పుడూ మీ కసంతుష్టి కలిగించను.

శ్రీశ్ : అసంతుష్టి అన్నమాట విని చాలా విచారిస్తున్నాను రసిక్‌బాబూ!

రసిక్ : సరే. అలాగే చేస్తాను.

విపిన్ : మేము కేవలం మా స్వేచ్ఛకోసమే తపనపడుతున్నామా? మమ్మల్నింత స్వార్థపరుల్నిగా భావిస్తున్నారా?

రసిక్ : క్షమించండి. పొరపాటు అభిప్రాయం.

శ్రీశ్ : మీరెన్నయినా చెప్పండి. చటుక్కున మంచి వరుడు దొరకటం చాలా కష్టం.

రసిక్ : అందుకనేగా యిన్నాళ్ళూ కనిపెట్టుకుండి చివరికీ విపత్తులో పడటం. అసలు వివాహప్రసక్తి అనేదే మీకు చాలా అప్రియం అయినా చూడండి, మీరిద్దరూ కూడా—

విపిన్ : దాన్నిగురించి మీరేమీ సంకోచం పెట్టుకోకండి.

శ్రీశ్ : మీరయినా మరెవరిదగ్గిరికీ వెళ్ళకుండా మాదగ్గిరి కొచ్చారు. అందుకు హృదయ పూర్వక ధన్యవాదాలు తెలుపుతున్నా.

రసిక్ : నేనుమాత్రం యింక మీకు ధన్యవాదాలు తెల్పను. ఆ కన్యలిద్దరి ఆజన్మాంత కృతజ్ఞతలు మిమ్మల్ని గౌరవిస్తాయి.

విపిన్ : రేయ్! పంకా లాగు.

శ్రీశ్ : రసిక్‌బాబుకోసం—విపిన్! తెప్పిస్తున్నానని చెప్పావ్—

విపిన్ : వొచ్చేస్తుంది! యీలోగా వొక గ్లాసు ఐసువేసిన మంచినీళ్ళు తాగండి.

శ్రీశ్ : మంచినీళ్ళెందుకు? 'లెమనేడ్' తెప్పించరాదూ? (జేబులోంచి రేకుపెట్టె వొకటి పైకితీసి` యిదిగో తీసుకోండి రసిక్‌బాబూ! తాంబూలం వేసుకోండి.

విపిన్ : అటువైపు గాలివేస్తోందా? యీ బాలీసు తీసుకోరాదూ?

శ్రీశ్ : సరేకాని రసిక్‌బాబూ ! నృపబాల బహుశా చాలా దిగులుపడివుంటుందనుకుంటా.

విపిన్ : నీరబాలకూడా తప్పకుండా బాగా—

రసిక్ : అది యింకా చెప్పటం—

శ్రీశ్ : నృపబాల బహుశా యేడుస్తూవుండివుంటుందేమో !

విపిన్ : సరేకాని నీరబాల తన తల్లికి కాస్త బాగా యెందుకు నచ్చజెప్పలేదు ?—

రసిక్ : (స్వగతం) అదుగో ప్రారంభమయింది. నాకు లెమనేడ్ అవసరంలేదు. (ప్రకాశంగా) క్షమించండి. నేనిప్పుడే బయల్దేరాలి.

శ్రీశ్ : యేమన్నారు ?

విపిన్ : అదెలా వీలవుతుంది ?

రసిక్ : ఆ కుర్రవాళ్ళనిద్దర్నీ తప్పు అడ్రస్ యిచ్చి పంపించాలి. లేకపోతే—

శ్రీశ్ : అర్థమయింది. అయితే యిప్పుడే వెళ్ళండి.

విపిన్ : అలా అయితే యింక ఆలస్యం చెయ్యకండి.

## దృశ్యం 3

### చంద్రబాబు యిల్లు

[నిర్మల కిటికీదగ్గిర కూచునివుంటుంది. చంద్రబాబు ప్రవేశిస్తాడు]

చంద్ర : (స్వగతం) పాపం ! నిర్మల చాలా కఠినమైన దీక్ష స్వీకరించింది. నేను గమనిస్తూనే వున్నా. ఆమె కొన్నాళ్ళనించీ చింతానిమగ్నురాలై వుంటోంది. సహజంగా స్త్రీ... మనస్సు యింత భారాన్ని సహించగలుగుతుందా ? (ప్రకాశంగా) నిర్మలా !

నిర్మల : (గతుక్కుమని) యేమిటి మామయ్యా !

చంద్ర : ఆ రచననుగురించి ఆలోచిస్తున్నావనుకుంటా బహుశా. యెక్కువగా ఆలోచించకుండా, వొకటి రెండు రోజులు మనస్సుకు విశ్రాంతినిస్తే, రచన వీలుగా వుంటుంది —అని తోస్తుంది నాకు.

నిర్మల : (లజ్జితురాలై) నేను సరీగ్గా ఆలోచించనేలేదు మామయ్యా ! నేను యీపాటికి ఆ రచన ప్రారంభించటం భావ్యంగా వుండేది. కాని యీమధ్య కొన్నాళ్ళనించీ యెండలు తగ్గి, దక్షిణపుగాలి వీచటం ప్రారంభమయింది. యేంచేసినా మనస్సును ఏకాగ్రంగా నిలపలేకపోతున్నాను యేం బాగాలేదు. నేనివాళ యేమయినా సరే—

చంద్ర : వొద్దు వొద్దు. అంత శీఘ్రంగా ప్రయత్నించకు. యింట్లో నీకు తోడెవరూ లేరు. వొక్కదానివీ పనులన్నీ చేసుకోటం నీకు అలసటగా వుందని అనిపిస్తోంది నాకు అంచేత వొకరిద్దరి స్నేహం సహాయం లేకపోతే—

నిర్మల : అబలాకాంతబాబు నాకు కొంత సహాయంచేస్తానని చెప్పారు. నేను వారికి రోగి శుశ్రూషకి సంబంధించిన — ఆ యింగ్లీషు పుస్తకం యిచ్చాను. వారు వొక అధ్యాయం యివాళ రాసిపంపుతామన్నారు— బహుశా అది యిప్పుడే రావొచ్చు. అందుకే నేను కనిపెట్టుకుని కూర్చున్నాను.

చంద్ర : ఆ కుర్రవాడు చాలా మంచివాడు.

నిర్మల : చాలా మంచివాడు —ముచ్చటైనవాడు.

చంద్ర : అంత కృషి, అంత కార్యతత్పరత—

నిర్మల : వాటికితోడు చక్కని ఆ వినమ్రత—

చంద్ర : అతడి ప్రసంగంలో కన్పించిన వుత్సాహాన్ని చూసి ఆశ్చర్యపోయాను.

నిర్మల : అదీకాక వారిని చూడగానే వారి మనస్సులో మాధుర్యం ఆ ముఖంలో— వైఖరిలో యెంత స్పష్టంగా వ్యక్తమవుతూవుంటుంది !

చంద్ర : యింత స్వల్పకాలంలోనే—యెవరికైనా —వొకరిమీద వొకరికి యింత గభీరమైన స్నేహం యేర్పడుతుంది అని నేను మనస్సులో కూడా అనుకోలేదు యెన్నడూ.. ఆ కుర్రవాణ్ణి దగ్గిరపెట్టుకుని, చదువుసంధ్యల్లోనూ—పనుల్లోనూ సహాయం చెయ్యాలని నాకు యెంతో కోరిగ్గావుంది.

నిర్మల : అలా అయితే నాకూ్కడా చాలా అనుకూలంగా వుంటుంది. యెన్నో పనులు చెయ్యగలుగుతాను ..సరే...ఆ ప్రస్తావన వొకసారి తీసుకొచ్చిచూడరాదూ ? అడుగో పనిమనిషి వొస్తున్నాడు. వారు బహుశా ఆ రచన పంపించివుంటారు. రామదాస్ ! వుత్తరాలున్నాయా ? యిటు తీసుకునిరా.

[పనిమనిషి ప్రవేశిస్తాడు. చంద్రబాబు చేతికిస్తాడు—
ఆ వుత్తరాలన్నీ...]

మామయ్యా : ఆ వ్యాసాన్ని తప్పకుండా పంపించుంటారు. దాన్ని నాకియ్.

చంద్ర: కాదు — యిది నా వుత్తరం.

నిర్మల: మీ వుత్తరమా! అబలాకాంతబాబు బహుశా మీకే రాశారనుకుంటా. యేం రాశారు?

చంద్ర: కాదు. యిది పూర్ణ రాసిన వుత్తరం.

నిర్మల: పూర్ణబాబు వుత్తరమా? ఓ!

చంద్ర: పూర్ణ రాసినది — "గురుదేవా! మీ చరిత్ర మహత్తరమైనది. మీ మనోబలం అసామాన్యం. తమవంటి దృఢస్వభావులయిన వ్యక్తులే మానవుల దుర్బలతను క్షమాదృష్టితో చూడగలరు అన్న భావంతోనే నేడు మీకు యీ వుత్తరాన్ని రాయటానికి సాహసించాను."

నిర్మల: యేమయింది? పూర్ణబాబు బ్రహ్మచారి సమితి వొదిలేస్తారనుకుంటా బహుశా. అందుకే యింత ఉపోద్ఘాతం మొదలెట్టారు. బాగా గమనించిచూస్తే పూర్ణబాబు యిటీవల బ్రహ్మచారి సమితి పనియేమీ చేస్తున్నట్లులేదు.

చంద్ర: "గురుదేవా! తమరు మా ముందువుంచిన ఆదర్శం మహోన్నతమైనది. మా మస్తిష్కాల్లో నాటిన భావాలు చాలా బరువైనవి. ఆ ఆదర్శమ్మీదకాని, ఆ భావాలమీదకాని వొక్కక్షణంకూడా భక్తి సన్నగిలలేదు యెప్పుడూ. కాని మధ్యమధ్య నా సామర్థ్యవిహీనత నాకు తెలిసివొస్తూన్న సంగతిని తమ చరణ సన్నిధిని సవినయంగా అంగీకరిస్తున్నాను."

నిర్మల: మహత్తరమైన కార్యాలన్నిటిలోనూ మానవులు మధ్యమధ్య తమ అసమర్థతను తెలుసుకుని హతాశులవుతూవుంటారనిపిస్తుంది నాకు. అలిసిపోయిన మనస్సు వొక్కొక్కప్పుడు బెదిరిపోతూవుంటుంది. కాని అది యెల్లప్పుడూ వుంటుందా?

చంద్ర: సమితినించి యింటికొచ్చి, పనియేదయినా ప్రారంభించబోతే— చటుక్కున నేను కేవలం ఏకాకిననే భావం కలిగి వుత్సాహమంతా ఆశ్రయవిహీనమైన లతలాగా చుట్టచుట్టుకుని నేలపాలవుతున్నట్లుండేది" నిర్మలా! మనం సరిగ్గా యీ మాటే అనుకుంటున్నాం.

నిర్మల: పూర్ణబాబు రాసిందంతా యదార్థమే. మనిషి తోడులేనిదే కేవలం సంకల్ప మాత్రంతో వుత్సాహాన్ని రేకెత్తించుకుని నిలుపుకోటం కష్టం.

చంద్ర: "నా అవినయాన్ని మన్నించండి. కాని యెంతో ఆలోచించి—బ్రహ్మచర్య దీక్ష సామాన్యుల కనువైనదికాదనీ, అది బలాన్ని చేకూర్చేదికాకపోగా, బలాన్ని హరించేదీ అనే స్థిరనిర్ణయానికొచ్చాను. స్త్రీపురుషులు ఒకరికొకరికి కుడిబుజాల

పంటివారు. వారు కలిసిమెలిసివుంటేనే ప్రపంచంలో సర్వకార్యాలకూ సంపూర్ణంగా వుపయోగపడగలుగుతారు!'' నీకేమనిపిస్తుంది నిర్మలా? (నిర్మల మాట్లాడదు) అక్షయబాబుకూడా ఆనాడు యీ విషయంమీదనే చర్చించాడు నాతో. అతడి మాటలకెన్నిటికో సమాధానం చెప్పలేకపోయాను.

నిర్మల: అయితే అవొచ్చు. ఆ మాటల్లో చాలావరకు యధార్థం వుండివుంటుందనుకుంటా.

చంద్ర: ''గృహస్థసంతానానికి సన్యాసవ్రతదీక్ష యియ్యటం మాని, గృహస్థాశ్రమాన్ని వున్నతాదర్శాలతో సంఘటితపరచటమే నా వుద్దేశంలో వుత్తమ కర్తవ్యం.''

నిర్మల: యీ సంగతిమాత్రం పూర్ణబాబు చాలా బాగా చెప్పారు.

చంద్ర: నేనుకూడా కొన్నాళ్ళనించీ బ్రహ్మచర్యవ్రతాన్నవలంబించే నియమాన్ని తీసేయాలనే అనుకుంటున్నాను మనస్సులో.

నిర్మల: అలా తీసెయ్యటం అనుచితంకాదని నాకూ తోస్తోంది. యేమంటావ్ మామయ్యా! యితరులెవరైనా అభ్యంతరం చెబుతారా? అఖిలాకాంత్‌బాబు, శ్రీశ్‌బాబు —

చంద్ర: అభ్యంతరం చెప్పటానికి తగిన కారణమేమీ లేదు.

నిర్మల: అయినా వోసారి అఖిలాకాంత్‌బాబు అభిప్రాయాన్ని తెలుసుకునిచూడటం భావ్యం.

చంద్ర: అభిప్రాయాన్ని తెలుసుకోవాల్సిందే (ఉత్తరం చదవటం కొనసాగిస్తాడు) ''యింతవరకూ రాసినదయినా సులభంగానే రాశా. యిప్పుడిహ అసలు చెప్పదలచుకున్నది రాయటానికి కలం సాగటంలేదు.''

నిర్మల: మామయ్యా! పూర్ణబాబు బహుశా రహస్యవిషయమేదైనా రాశారేమో! నువ్వు బిగ్గరగా చదువుతావ్ దేనికి?

చంద్ర: సరీగ్గా చెప్పావ్.

[తనలోతాను చదువుకుంటాడు]

యెంత ఆశ్చర్యం! నేనన్ని విషయాల్లోనూ అంధుణ్ణే. యిన్నాళ్ళూ నేనేమీ అర్థం చేసుకోలేకపోయాను. నిర్మలా! పూర్ణబాబు ప్రవర్తన యెప్పుడయినా నీకు —

నిర్మల: అవును. పూర్ణబాబు ప్రవర్తన నాకు అప్పుడప్పుడు కేవలం అమాయకుడి ప్రవర్తనలా కన్పిస్తుండేది.

చంద్ర: పూర్ణబాబు చాలా బుద్ధిమంతుడు. అయితే నీకు విడమరిచే చెబుతాను. పూర్ణ బాబు వివాహప్రస్తావన తీసుకొచ్చాడు.

నిర్మల: నువ్వు ఆయన సంరక్షకుడివేమీకాదు. నీదగ్గిర ప్రస్తావన—

చంద్ర: నేను నీ సంరక్షకుణ్ణిగదా. యిది చదివిచూడు.

నిర్మల: (వుత్తరం చదివి జేవురించిన ముఖంతో) యిది జరగటానికి వీల్లేదు.

చంద్ర: నేనతడి కేమని చెప్పను?

నిర్మల: యేమయినా సరే జరగదని చెప్పు.

చంద్ర: యెందుకని నిర్మలా! బ్రహ్మచర్యవ్రతపాలన నియమాన్ని సమితినించి యెత్తేయటానికి నీకేమీ అభ్యంతరం లేదని నువ్వే చెప్పావుగా.

నిర్మల: అలా అని యెవరా ప్రస్తావన తీసుకొస్తే వారినే—

చంద్ర: పూర్ణబాబు అలాంటివాడిలాంటివాడు కాడు. అంత మంచి కుర్రవాడు—

నిర్మల: మామయ్యా నీవిలాంటి విషయాలేమీ అర్థంచేసుకోలేవు. నీకు అర్థమయ్యేట్లు చెయ్యనూలేను. నాకు పనులున్నాయి—

[వెళ్ళబోతుంది]

మామయ్యా నీ జేబులోదేమిటది పైకి పొడుచుకొచ్చింది?

చంద్ర: (గతుక్కుమని లేచి) ఆఁ. ఆఁ. మరిచిపోయాను. నౌకరు యివాళ పొద్దున్నే నీకిమ్మని యీ కాగితాన్ని నాకిచ్చివెళ్ళాడు.

నిర్మల: (గబగబా ఆ కాగితాన్ని తీసుకుని) చూడు మామయ్యా యెంత అన్యాయం! అబలాకాంతబాబు వ్యాసం పొద్దున్నే వొచ్చింది. నాకివ్వలేదు. ఆయన మరిచి పోయారేమో అనుకున్నా యింకా నేను. చాలా అన్యాయం.

చంద్ర: అన్యాయమయింది నిజమే. కాని యింతకంటె పెద్ద అన్యాయం, పొరపాట్లు నేను ప్రతిరోజూ చేస్తూనేవున్నాను ఫేనీ—నువ్వే ప్రతిసారీ క్షమిస్తూ చొరవ యిచ్చావ్.

నిర్మల: కాదు. అంత అన్యాయం కాదు. నేనే అబలాకాంతబాబుపట్ల మనస్సులో అన్యాయం చేశాను. పైగా అనుకున్నాను—యిదుగో రసిక్‌బాబు వొస్తున్నారు. రండి, రసిక్‌బాబూ! మామయ్య యిక్కడే వున్నారు.

[రసిక్ ప్రవేశిస్తాడు]

చంద్ర : యిదుగో రసిక్‌బాబు రావటం మంచిదే అయింది.

రసిక్ : నే రావటంవల్లనే కనక మంచిదయితే, మీకు మంచి అనేది చాలా సులభం. యెప్పుడు చెబితే అప్పుడొస్తా. పిలవకపోయినా రావటానికి అంగీకరిస్తున్నాను.

చంద్ర : మన సమితిలోనించి బ్రహ్మచర్యవ్రతనియమాన్ని యెత్తివేయాలనుకుంటున్నాం మేము. మీరేం సలహా యిస్తారు ?

రసిక్ : నేను పూర్తిగా నిస్స్వార్థభావంతోనే సలహా యివ్వగలను. యెంచేతంటే మీరు యీ నియమాన్ని వుంచండి, యెత్తివేయండి—నాకు రెండూ సమానమే. కాని నా సలహామాత్రం యెత్తివేయమనే. లేకపోతే యెప్పుడో వొకరోజున దానంతటదే యెగిరిపోతుంది. మా వీధిలో తాగుబోతు రామహరి వీధిమధ్యకొచ్చి నిలబడి, అందర్నీ పిలిచి 'అయ్యా, బాబుల్లారా నేనిక్కడే పడటానికి నిర్ణయించుకున్నాను' అన్నాడు. నిర్ణయించుకోకపోయినా పడతాడతడు. అంచేత నిర్ణయించుకోవటమే అతడికి మంచిదయింది.

చంద్ర : సరీగ్గా చెప్పారు రసిక్‌బాబూ ! బలప్రభావంవల్ల వొచ్చేదాన్ని యెప్పుడూ తన బలాన్ని బయటపెట్టుకోనియ్యకుండానే రానివ్వటం మంచిది. వొచ్చే ఆదివారం లోగానే యీ ప్రస్తావన అందరిముందు తీసుకువొద్దామనుకుంటున్నా.

రసిక్ : సరే. శుక్రవారం సాయింత్రం మీరు మా యింటికి రండి. నేనీ సంగతి అందరికీ చెప్పి తీసుకొస్తాను.

చంద్ర : రసిక్‌బాబూ ! మీకు గనక తీరికవుంటే మనదేశంతో గోజాతి వున్నతిని గురించిన ప్రస్తావన మీరు—

రసిక్ : విషయం చెవిని పడటంతోనే చాలా ఔత్సుక్యాన్ని కలిగించింది. కాని తీరిక మాత్రం అంతగా—

నిర్మల : అహాం. రసిక్‌బాబూ ! మీరు ఆ గదిలోకి పదండి. మీతో చెప్పాల్సిన సంగతులు చాలా వున్నాయి. మామయ్యా నీ రాత పూర్తికానియ్. మేముంటే విఘాతమవుతుంది.

రసిక్ : అయితే పదండి.

నిర్మల: (వెళుతూ వెళుతూ) అబలాకాంతబాబు నాకు తాము రాసినదాన్ని పంపించారు. నా ప్రార్థనను వారు మనస్సులో గుర్తుంచుకున్నందుకు—మీరు వారికి నా ధన్యవాదాలు తెలియజెయ్యండి.

రసిక్: ధన్యవాదాలు పొందకపోయినా మీ ప్రార్థనను మన్నించి కృతార్థుడయాడు.

## దృశ్యం ౪

## అక్షయుడి యిల్లు

[జగత్తారిణి, పురబాల, అక్షయ్]

జగ: నాయనా! అక్షయ్. చూడు యీ పిల్లలతో యేంచెయ్యాను నేను? నృప యేడుస్తూ కూచుంది. నీర కోపంతో చిరచిరలాడుతోంది. తానేమయినా సరే యెదటికి రానంటుందది. గౌరవకుటుంబాల్లో కుర్రవాళ్ళు యిప్పుడే రాబోతున్నారు. వాళ్ళని హ యిప్పుడు యేంచెప్పి వెనక్కి పంపను? నువ్వే బాబూ వీళ్ళకి చదువులు నేర్పి దొరసానుల్నిగా తయారుచేశావ్. ఇప్పుడిహ నువ్వే వాళ్ళని సమాధానపరచు.

[వెళిపోతుంది]

పుర: నిజమే. నేను వాళ్ళధోరణిచూసి తెల్లబోయాను. యేమనుకుంటున్నారో యేమో వాళ్ళు—

అక్షయ్: బహూశా నన్నుతప్ప యింకెవరన్నా యిష్టపడరనుకుంటా. నీ చెల్లెళ్ళేకాదు మరి! వాళ్ళ యిష్టానిష్టాలన్నీ అచ్చగా నీమాదిరే.

పుర: వేళాకోళాలు కట్టిపెడుదురూ. వేళాకోళాలకిది సమయంకాదు. వాళ్ళకి కాస్త నచ్చచెపుతారా లేదా చెప్పండి. మీరు చెపితేకాని వినరు వాళ్ళు.

అక్షయ్: యెంత విధేయత! వీళ్ళనే భగినీపతివ్రతలయిన మరదళ్ళు అంటారు. సరే వోసారి నాదగ్గరికి పంపించు. చూస్తాను.

[పురబాల వెళిపోతుంది]

[నృపబాల, నీరబాల ప్రవేశిస్తారు]

నీర: ముఖర్జీగారూ! యేమయినా సరే యిది జరగటానికి వీల్లేదు.

నృప : ముఖర్జీగారూ ! మీ కాళ్ళురెండూ పట్టుకుంటాం. మమ్మల్ని యెవళ్ళుపడితే వాళ్ళ యెదటికిలా తీసుకుపోకండి.

అక్షయ్ : పురిశిక్షపడ్డాక వొక వ్యక్తి—నన్నంత మరీ పైకెక్కించకండి. నాకు తల తిరిగే జబ్బుంది అన్నాడట. మీసంగతీ సరిగ్గా అలాగే వుంది. పెళ్ళిచేసుకో బోతున్నప్పుడు యెదటికి రావటానికి సిగ్గుపడితే యెలా కుదురుతుంది ?

నీర : ఎవరు చెప్పారు—మేం పెళ్ళిచేసుకోబోతున్నామని !

అక్షయ్ : ఆహా ! యెంత సంతోషవార్త ! కాని హృదయం దుర్బలమైనది. అదృష్టం బలీయమైనది. వొకవేళ దైవాత్తూ ప్రతిజ్ఞను భంగంచేసుకోవాలిసొస్తే—

నీర : అహా ! భంగంకాదు.

అక్షయ్ : కాదుగద ! అయితే యిహ నిర్భయంగా రండి. యువకుల్నిద్దరినీ చూపులతో భస్మప్రాయుల్నిచేసి వొదిలెయ్యండి. అభాగ్యుల్ని తిరిగీ యింటికిచేరి చావనీయండి.

నీర : నిష్కారణంగా జీవహత్యచెయ్యటంలో మాకంత వుత్సాహంలేదు.

అక్షయ్ : జీవులమీద యెంత దయ ! కాని యింత సామాన్యవిషయంకోసం గృహ విచ్ఛిత్తి చేసుకోవాల్సిన అవసరమేముంది ? మీ అమ్మ, అక్క గట్టిగా పట్టుబట్టి నప్పుడు—గౌరవకుటుంబాల్లో కుర్రాళ్ళిద్దరు దారిఖర్చులు దండగపెట్టుకొని యెటూ వొచ్చినప్పుడు—వొక్కసారి వో అయిదు నిమిషాలు యెదటికొచ్చి కన్పించండి. తర్వాత నేనున్నాను. మీకిష్టంలేకపోతే యేమయినా సరే పెళ్ళిళ్ళు చేయనీయను.

నీర : యేమయినా సరేనా ?

అక్షయ్ : ఆఁ. యేమయినా సరే చేయనీయను.

[పురబాల ప్రవేశిస్తుంది]

పుర : రండి. మిమ్మల్ని కాస్త ముస్తాబుచేస్తా.

నీర : మేము ముస్తాబుచేసుకోము.

పుర : గొప్పకుటుంబంలో కుర్రవాళ్ళయెదటి కిలాగే వెడతారా ? సిగ్గెయ్యదూ ?

నీర : సిగ్గెయ్యకేం అక్కా ? కాని ముస్తాబుచేసుకుని వెడితే మరీ సిగ్గేస్తుంది...

అక్షయ్ : పార్వతి తపస్వినీవేషంతో మహాదేవుడి మనస్సు హరించింది. శకుంతల దుష్యంతుడి మనస్సుని హరించినప్పుడు ఆమె వొంటిమీద నారచీరమాత్రమే

వుంది. అదికూడా వొంటికి బాగా అతుక్కుపోయుంది అన్నాడు కాళిదాసు. నీ చెల్లెళ్ళు అవన్నీ చదివి పెద్దవాళ్ళయినారు. అలంకారాలేవీ వారికిష్టంలేదు.

పుర : అవన్నీ సత్యయుగంలో కథలు...కలికాలంలో దుష్యంతమహారాజులు--- అలంకరణచూసే ముగ్ధులవుతారు.

అక్షయ్ : యెలా ?

పుర : మీలాగా. మీరు నన్ను చూడటానికొచ్చినప్పుడు అమ్మ నన్ను అలంకిరించి పంపలేదూ ?

అక్షయ్ : అప్పుడు నేననుకున్నాను – అలంకరణక్కూడా యీమె అలంకారమయిందంటే ఆ సౌందర్యం యెంత శోభగా వుంటుంది—అనుకున్నాను మనస్సులో.

పుర : సరేకాని, యిహ ఆపండి. నీరూ, రా.

నీర : వొద్దక్కా !

పుర : సరే. అలంకరించుకోవొద్దులేకాని తలైనా దువ్వుకోక తప్పదు.

అక్షయ్ : అలరులు ముడువక శిథిలమూర్ధజము లందముగా ముడివేయుము సకియా !
కాటుకపూయని సజలనయనముల గట్టిగతట్టుము హృదయద్వారము
పైటచెరగుతో మరణజాలమును పథికచరణముల బంధము వేయుము
వాదము సేయక మనోభీష్టమును పదిలముగా సాధింపుము సకియా !

పుర : మీరు మళ్ళీ పాటలు మొదలెట్టారూ ? నేనేం చేసేది చెప్పండి. వాళ్ళొచ్చే వేళయింది. ఇంకా ఫలహారాలు తయారుచెయ్యటం అలాగే వుండిపోయింది.

[నృపబాల, నీరబాలను తీసుకుని వెళిపోతుంది]

[రసిక్ ప్రవేశిస్తాడు...]

అక్షయ్ : పితామహా ! భీష్మా ! యుద్ధానికి సర్వమూ సన్నద్ధమేనా ?

రసిక్ : సర్వమూ...వీరపురుషులిద్దరూ విచ్చేశారు.

అక్షయ్ : ఇప్పుడిహ దివ్యాస్త్రాలు రెండూ సన్నద్ధం అవటానికి వెళ్ళాయి. మీవేమో సేనాధిపతిభారాన్ని స్వీకరించు. నేను కొంచెం చాటునవుందా మనుకుంటున్నాను

రసిక్ : నేనూ మొదట కొంచెం చాటునే వుంటాను.

[రసిక్—అక్షయ్ వెళిపోతారు]

[శ్రీశ్, విపిన్ ప్రవేశిస్తారు]

శ్రీశ్ : విపిన్ ! నువ్వీమధ్య సంగీతవిద్యమీద గావుకేకల దోపిడీజరపడం ప్రారంభించావ్ ! ఏమయినా ఆర్జించగలిగావా ?

విపిన్ : యేమీలేదు. సంగీతవిద్యకు వాకిట్లో సప్తస్వరాలు అనవరతం పహరా యిస్తూంటాయి. అక్కడ నాకు చొరబడటానికి అస్కారం వుందా ? కాని యీ ప్రశ్న యెందుకుదయించింది నీ మనస్సులో ?

శ్రీశ్ : యిటీవల మధ్యమధ్య కవితకు స్వరకల్పన చేయాలని అనిపిస్తోంది. ఆరోజున పుస్తకంలో చదివాను—

ఎందుకోయీ జలధితీరమున దినమెల్ల
యిసుకతో నూరకే యాటలాడేవు ?
పమయమ్ము మించిపోవకముసుపె నీ ఆట
చాలించి దూకుమీ సాగరమ్మందు
కడలిలోతులు వెదకి చిక్కినవి చేపట్టి
నవ్వేదో యేడ్చేదో నడచిపొమ్మిలుజేర.

దీనికి స్వరం తెలిసినట్లే వుంటుంది మనస్సుకి. కాని పాడే సత్తాలేదు.

విపిన్ : యిది అంత అధ్వాన్నంగా యేంలేదోయ్ ! నీ కవి బాగానే రాస్తాడు... అవునోయ్. ఆతర్వాత యింకేమీ లేదూ ? యెటూ ప్రారంభించావు కనక పూర్తిచెయ్.

శ్రీశ్ :
ఏతలంపున వచ్చి యీ మార్గమధ్యమున
యెవరు కూర్చొనినారొ యేనెరుంగజాల
ఈ పూవుపొదరింట పిపిల్లగాలిలో
నా యెదద నిర్లిప్తమైయున్న దీనాడు.
పోవలయునేని ఆ పొదరిల్లు చేరగా
జాగుసేయక నీవు సాగిపొమ్మింక.

విపిన్ : బలే భేషుగ్గావుంది. కాని శ్రీశ్. షెల్ఫ్దగ్గిరేమిటి వెతుకుతూ తిరుగుతావ్ నువ్వు ?

శ్రీశ్ : ఆరోజున పేరు రాటున్న పుస్తకం చూశానే—అది—

విపిన్ : వొద్దు సోదరా ! యివాళ అవేమీ వొద్దు.

శ్రీశ్ : యేవేమీ వొద్దు ?

విపిన్ : వాళ్ళనుగురించి యెలాంటి

శ్రీశ్ : బాగుంది విపిన్ వాళ్ళనిగురించి అలాంటి ఆలోచనేమయినా చేయటంవల్ల—

విపిన్ : కోపం తెచ్చుకోకు సోదరా! నేను నానంగతే చెబుతున్నాను. నేనీయింట్లోనే అనేకపర్యాయాలు రసిక్‌బాబుతో వాళ్ళనుగురించి యెలా మాట్లాదానో—అలా యిప్పు డొక్కమాట మాట్లాడటానికికూడా మనస్సులో సంకోచం కలుగుతోంది. గ్రహించావా?

శ్రీశ్ : గ్రహించకేం? నేనోసారి పుస్తకం తెరిచిచూడాలనిమాత్రమే అనుకున్నాను. వొక్కమాటకూడా వుచ్చరించదలుచుకోలా.

విపిన్ : వొద్దు. యివాళ అదికూడా వొద్దు. యివాళ వాళ్ళు మనయెదటి కొస్తారు. యివాళ మనం వాళ్ళకి యోగ్యులుగా వుండగలగాలి.

శ్రీశ్ : విపిన్! నీతో—

విపిన్ : వొద్దు భాయీ! నాతో వాదించొద్దు. నే నోడిపోయాను. కాని పుస్తకం మాత్రం పెట్టెయ్.

[రసిక్ ప్రవేశిస్తాడు]

రసిక్ : అరె! మీరొచ్చి వొంటరిగా కూర్చున్నారే. యేమీ అనుకోరుగద.

శ్రీశ్ : యేమీ అనుకోం. యీ గది మాతో సాదరంగా పలకరించి మాట్లాడింది.

రసిక్ : మీ కెంత కష్టం కలిగించటమయింది?

శ్రీశ్ : కష్టమెక్కడ కల్గించగలిగారు! వొక్క నిజమైన కష్టాన్ని పైనవేసుకునే సదవకాశం కలిగిస్తే కృతార్థులమవుతాం.

రసిక్ : యేమయినా కానీ—కొంచంసేపట్లోనే అంతా పూర్తయిపోతుంది. అదీ మంచిదే. ఆతర్వాత యిహ మీరు స్వతంత్రులు. ఆలోచించిచూడండి. యిది నిజమైన తతంగమేకనక అయితే 'పరిణామే బంధనభయం'...వివాహమనేది మధురపదార్థభోజనంతోనే ప్రారంభమవుతుంది. కాని అన్నిసమయాల్లోనూ మధురంగా పరిసమాప్తమవదు. సరే. మీరివాళ దిగులుగా యిలా మాట్లాడకుండా కూర్చున్నారెందుకు చెప్పండి. నే చెబుతున్నాను. మీకేం భయంలేదు. మీరు వనవిహంగాలు. రెండు 'సందేష్'లు తినేసేసి, మళ్ళీ వనంలో కెగిరిపోవచ్చు. యెవరూ మిమ్మల్ని బంధించరు. ''నాత్రవ్యాధశరాః పతంతి పరితోనైవాత్ర దావానలః''—దావానలానికి మారుగా లేతకొమ్మరిసీళ్ళు లభిస్తాయి.

శ్రీశ్ : మా ఆలోచన అదికాదు రసిక్‌బాబూ! మేమాలోచిస్తున్నది మావల్ల జరుగుతున్న వుపకారం యెంతా అని! భవిష్యత్తులో భయాన్ని పూర్తిగా పోగొట్టలేక పోతున్నాం కదా!

రసిక్ : యెంత మాట! మీరు చేస్తున్నదాంతో యిద్దరు అబలల్ని చిరకృతజ్ఞతాపాశంతో బంధించేస్తున్నారు. కాని మీరుమాత్రం యెలాంటి పాశాలతోనూ బద్ధులుకావటం లేదు...

జగ : (నేపథ్యంలో—మెల్లగా) నృపా! యెంత పసిపిల్లచేష్టలు చేస్తున్నావే! చప్పున కళ్ళనీళ్ళు తుడుచుకుని ఆ గదిలోకెళ్లు. నా తల్లివికదూ! యేడ్చియేడ్చి కళ్లెర్రబడేట్లుచేసుకుంటే ముఖంలో కళ యెలావుంటుందో ఆలోచించుకో...నీరా. వెళ్లు. మీతో యిహ నే వేగలేను బాబూ! గొప్పింటి బిడ్డల్ని యెంతసేపని ఆపివుంచను? యేమనుకుంటారు వాళ్ళు?

శ్రీశ్ : అదిగో విన్నారా రసిక్‌బాబూ! యిది దుస్సహం. యింతకంటె రాజపుత్రుల కన్యాహత్యలే మేలు.

విపిన్ : రసిక్‌బాబూ! వీరిని యీ సంకటపరిస్థితినుంచి సంపూర్ణంగా కాపాడటానికి మీరు మమ్మల్ని యేంచెయ్యమన్నాసరే చెయ్యటానికి సిద్ధంగా వున్నాం.

రసిక్ : యేమీ అక్కర్లేదు. మీకింతకన్న యెక్కువ కష్టానివ్వను. ఈ వొక్కరోజు మాత్రం దాటించివెళ్లండి. ఆతర్వాత మీరేమీ ఆలోచించక్కర్లలేదు.

శ్రీశ్ : ఆలోచించక్కర్లేదా? యేమంటున్నారు రసిక్‌బాబూ? మేమేం పాషాణాలమా? యివాళనుంచి మేము వీరినిగురించి యెక్కువగా ఆలోచించటానికి అధికారాన్ని పొందుతాం.

విపిన్ : యీ సంఘటన జరిగింతర్వాత మేంగనక వీరివిషయంలో వుదాసీనులమయితే కాపురుషులమవుతాం.

శ్రీశ్ : యికనించి వీరినిగురించి ఆలోచించటం మాకు గర్వకారణం. గౌరవప్రదమైన విషయం.

రసిక్ : అయితే మంచిది. ఆలోచించండి. కాని బహుశా ఆలోచించటంతప్ప యింకే విధమైన కష్టమూ పడక్కర్లేదనుకుంటా.

శ్రీశ్ : సరే, రసిక్‌బాబూ! మమ్మల్ని కష్టపడనీయటానికి మీకెందుకింత అభ్యంతరం?

విపిన్ : వీరికోసం మేముకనక యేదయినా కష్టాన్ని యెదుర్కోవాలిసొస్తే, దాన్ని మేం గౌరవంగా భావిస్తాం.

శ్రీశ్ : రెండు రోజుల్నించి, యెక్కువ కష్టపడనక్కర్లేదని మీరు మాటిమాటికీ మమ్మల్ని వోదారుస్తూండటం మాకు చాలా విచారంగా వుంది రసిక్‌బాబూ !

రసిక్ : నన్ను క్షమించండి ! నేనిహ యెప్పుడూ యింత అవివేకమయిన పని చెయ్యను. మీరు కష్టాన్ని పైనేసుకోండి.

శ్రీశ్ : మీరేమిటింకా యిప్పటికీ మమ్మల్ని అర్థంచేసుకోలేదు.

రసిక్ : అర్థంచేసుకోకేం ? మీరు దాన్నిగురించి విచారమేమీ పెట్టుకోకండి.

[నృపబాల, నీరబాలలు ప్రవేశిస్తారు]

శ్రీశ్ : (నమస్కరించి) రసిక్‌బాబూ మీరు వీరిని అడగండి—మమ్మల్ని క్షమించారేమో ?

విపిన్ : మేమే పొరపాటువల్లనయినా సరే వారు సిగ్గుపడటానికీ, భయపడటానికీ కారకులం గనకయితే—మాకంతకంటె బాధాకరమయిన విషయం మరోటి వుండబోదు. అందుకని వీరు క్షమించకపోయేట్లయితే—

రసిక్ : యెంతమాట ! క్షమాభిక్ష కోరి అపరాధినుల అపరాధాన్ని మరింత హెచ్చు చేయకండి. వీరు అల్పవయస్కులు. గౌరవనీయులైన అతిథులతో యెలా సంభాషించటం సముచితమో హఠాత్తుగా మరిచిపోయి, తలవంచుకు నిలబడటాన్ని—మీపట్ల అయిష్టంగా భావించి, మరింత సిగ్గుపడేట్లు చేయకండి. నృపా ! నీరా ! యేమంటారమ్మా ? యింకా యిప్పటికీ మీకంట తడి ఆరకపోయినట్లయితే—మీరిలా పెడమొగం పెట్టరన్నసంగతి యెలా తెలుసుకొనేది !

[నృప, నీర సిగ్గుతో మాట్లాడక వూరుకుంటారు]

అహా. కొంచెం చాటుకి తీసుకెళ్ళి అడగటం అవసరం.

(జనాంతికంగా) పెద్దమనుషులతో యిప్పుడేమని చెప్పమంటారో చెప్పండమ్మా ? మీరు వీలయినంత త్వరలో యిక్కణ్ణుంచి వెళ్ళిపొండి—అని చెప్పనా ?

నీర : (మెల్లగా) నీ వాగుడుకేమీ అర్థంలేదు. మేమలా అన్నామా ? వీరొచ్చారని మాకేమయినా తెలుసా ?

రసిక్ : (శ్రీశ్, విపినులతో) వీరేమంటున్నారంటే—

నా కర్మమెట్లున్నదోగాని నేనెరుగ
సూర్యాతపమ్మనుచు చూచి భయపడబోను
చంద్రాతపమ్మనుచు సహియింతుగాని.

దీనిమీద మీరింకా చెప్పాలిసిందేదయినా వుందా ?

నీర : (జనాంతికంగా) ఆం. రసిక్‌దాదా ! నువ్వనేదేమిటి ? ఆ మాట మేమెప్పుడన్నాం ?

రసిక్ : (శ్రీశ్, విపినులతో) వీరి మనోభావాన్ని నేను పూర్తిగా వ్యక్తంచెయ్యలేక పోతున్నందుకు వీరు నన్ను దూషిస్తున్నారు.

నీర : (జనాంతికంగా) నువ్విలా కనక చేసేట్లయితే మేమిక్కణ్ణుంచి వెళిపోతాం.

రసిక్ : 'సఖి. న యుక్తం అకృతసత్కారం అతిథివిశేషం ఉజ్ఝిత్వా స్వచ్ఛందతో గమనమ్.'

(శ్రీశ్, విపినులతో) వీరేమంటున్నారంటే—తమ యధార్థమైన మనోభావాన్ని మీకుకనక పూర్తిగా వ్యక్తమయేట్లు చెప్పేట్లయితే లజ్జతో యీ గదిలోంచి పారి పోతామంటున్నారు.

[నృపబాల, నీరబాల బయలుదేరబోతారు]

శ్రీశ్ : రసిక్‌బాబు అపరాధాన్ని మీరెందుకిలా కప్పిపుచ్చుతారు ? మేమే ప్రగల్భాలూ పలకలేదే !

[నృపబాల, నీరబాలలకు 'నయయౌ నతస్థౌ' అన్న భావం]

విపిన్ : (నీరబాల నుద్దేశించి) పూర్వంచేసిన అపరాధమేదయినా కనక వున్నట్లయితే— దానికి క్షమాపణకోరుకునే అవకాశాన్నివ్వరా ?

రసిక్ : (జనాంతికంగా) యీ క్షమాపణకోరుకోటానికి పాపం చాలారోజుల్నుంచీ, సదవకాశంకోసం యెదురుచూస్తూవున్నారు.

నీర : (జనాంతికంగా) అపరాధమేం జరిగింది- క్షమాపణకోరటానికి ?

రసిక్ : (విపినుడితో) వీరేమంటున్నారంటే— మీ అపరాధం చాలా మనోహరమైనది— దాన్ని అసలు అపరాధంగానే గుర్తించలేదు. కాని నేనుకనక ఆ పుస్తకాన్ని దొంగిలించేందుకు కొంచెం సాహసించివున్నట్లయితే— అప్పుడది అపరాధమయేది ! న్యాయశాస్త్రంలో ప్రత్యేక విభాగంలో అలా రాసివుంది.

విపిన్ : ఈర్ష్యపడకండి రసిక్‌బాబూ ! తమకెప్పుడూ అపరాధం చేసేందుకు అవకాశాలు లభిస్తాయి. అందుకు తగినశిక్ష అనుభవించి, కృతార్థులవండి. నేను అదృష్టలేశం

వల్ల వొక అపరాధాన్నిచేసే అవకాశాన్ని పొందగలిగాను. కాని నా ఖర్మం దండింపతగినవాళ్లలో చేరలేకపోయాను. క్షమాపణపొందే యోగ్యతనయినా పొందలేకపోయాను.

రసిక్ : విపిన్‌బాబూ ! అంత మరీ నిరాశపడకండి. దండన అనేక సమయాల్లో ఆలస్యంగా వొస్తుంది. కాని తప్పకుండా వొస్తుంది. చటుక్కున విముక్తిపొందలేకపోతేపోవొచ్చు.

[భృత్యుడు ప్రవేశిస్తాడు]

భృత్యుడు : ఫలహారాలు సిద్ధం.

[నృపబాల, నీరబాల వెళిపోతారు]

శ్రీశ్ : మేమేం క్షామప్రదేశంనుంచి వచ్చామా రసిక్‌బాబూ ? ఫలహారాలకోసం యింత తొందరెందుకు ?

రసిక్ : మధురేణ సమాపయేత్.

శ్రీశ్ : (నిట్టూర్పు విడిచి) కాని సమాప్తం మధురంగా లేదు.

(జనాంతికంగా—విపినుడితో) కాని విపిన్ వీరినిమాత్రం వంచించి పారిపోలేము.

విపిన్ : (జనాంతికంగా) అలాకనక చేస్తే మనం పాషండులం.

శ్రీశ్ : యిప్పుడేమిటి మన కర్తవ్యం ?

విపిన్ : అదింకా అడగాలా ?

రసిక్ : మీరుచూస్తే భయపడ్డట్టు కన్పిస్తున్నారు. యేం భయంలేదు. చివరికి యెలాగయినా సరే, నేను మిమ్మల్ని వుద్ధరించితీరుతాను.

[శ్రీశ్, విపిన్ ఫలహారాలు చెయ్యటం మొదలెడతారు]

[మరొకవైపున అక్షయ్, జగత్తారిణి ప్రవేశిస్తారు]

జగ : చూశావుగా బాబూ ! యెలాంటి కుర్రవాళ్లో యిద్దరూ ?

అక్షయ్ : అత్తగారూ ! మీ యెన్నిక ప్రశస్తమైనదన్నమాట అంగీకరించకుండా వుండలేను.

జగ : పిల్లల తీరు చూశావుగా బాబూ ! యిప్పుడిహ ఆ యేడుపులవీ యెక్కడ మాయమయిపోయాయో తెలియదు.

అక్షయ్: అదే వాళ్ళలోవున్న దోషం. కాని అత్తగారూ! మీరు స్వయంగా వెళ్ళి, కుర్రవాళ్ళనుచూసి ఆశీర్వదించాలి.

జగ: అది బాగుంటుందా అక్షయ్? అలాచేస్తే వాళ్ళిష్టపడతారా?

అక్షయ్: తప్పకుండా. యిహ మీరు స్వయంగా వెళ్ళి ఆశీర్వాదంచేయగానే నిశ్చయాలు జరిగిపోతాయి.

జగ: మంచిదయితే మీరు చెపితే వెడతాను. నేను వారి తల్లిలాంటిదాన్ని. నాకు సిగ్గెందుకు?

[పురబాల ప్రవేశిస్తుంది]

జగ: యింకేం చెప్పను పురో? చందమామల్లాంటి కుర్రాళ్ళు.

పుర: నాకు తెలుసు. నృప—నీరల అదృష్టాలకి కురూపులొస్తారా?

అక్షయ్: వాళ్ళ పెద్దక్క అదృష్టమే అచ్చింది. యేముంది?

పుర: సరే, ఆగండిహ. వెళ్ళండి. వాళ్లతో కొంచెం మాట్లాడండి. కాని శైల యెక్కడి కెళ్ళింది?

అక్షయ్: శైల సంతోషంతో తలుపులేసుకుని పూజలో పోయికూర్చుంది. (శ్రీశ్, విపినుల దగ్గిరికివచ్చి) యేమిటి సంగతి రసిక్‌దా! యీమధ్య బాగా ఫలహారాలు పెడుతున్నట్లు కన్పిస్తోందే! రోజూ రెండుపూటలా చూసేవాణ్ణి హఠాత్తుగా మరిచి పోయావా?

రసిక్: వీరి నాదరించట మదోకొత్త. విస్తట్లో యేదిపెడితే దాంతోనే సంతోషిస్తారు. నీ ఆదరణ పాతబడిపోయింది. నిన్ను కొత్తగా సంతోషపెట్టగలగటం అంత సులభంకాదు భాయీ!

అక్షయ్: కాని యివాళ చేసిన తీపివస్తువులనూ కుటుంబంలోవున్న అనాస్వాదితమధువునూ యావత్తూ యెగరగొట్టుకుపోవటానికి అపరిచితులయిన యువకు లిద్దరొస్తారని విన్నాను. వీళ్ళు వాళ్ళ వాటాలోనించే తీసుకుంటున్నారా యేమి? రసిక్‌దా! పొరపాటుపడలేదుకదా!

రసిక్: పొరపాట్లకేగా ప్రసిద్ధి నేను! తన రసిక్‌బాబాయ్ యెక్కడ చెయ్యిపెడితే అక్కడేదో పొరపాటు జరక్కమానదని నీ అత్తగారికి తెలుసు.

అక్షయ్: యేమిటి నువ్వనేది రసిక్‌దా? యేంచేశావ్? ఆ కుర్రవాళ్ళనిద్దర్నీ యెక్కడికి పంపావ్?

రసిక్ : పొరపాటుగా వాళ్ళకి తప్పు అడ్రస్ యిచ్చాను.

అక్షయ్ : పాపం వాళ్లగతి యేమవుతుంది ?

రసిక్ : పెద్ద అనిష్టమేమీ జరగదు. వాళ్లీపాటికి కుమార్టులి నీలమాధవచౌధురి గారింట్లో ఫలహారాలు పూర్తిచేస్తుంటారు. వనమాలి భట్టాచార్య వారి యోగక్షేమ భారాన్ని పైన వేసుకున్నాడు.

అక్షయ్ : అయితే తెలిసింది. తీపి వస్తువులు అందరి విస్తళ్లలోనూ పడ్డాయి. కాని, నీ ఫలహారం కొంచెం కటువవుతుంది. యిప్పుడైనా పొరపాటు సరిదిద్దుకో. విపిన్‌బాబూ ! శ్రీశ్‌బాబూ ! మీరేమీ అనుకోకండి. యిందులో కొంచెం సాంసారిక రహస్యం వుంది.

శ్రీశ్ : సరళస్వభావుడైన రసిక్‌బాబు ఆ రహస్యాన్ని మాముందు బయటపెట్టారు. మమ్మల్ని మోసపుచ్చి తీసుకురాలేదు.

విపిన్ : యీ మిఠాయిపళ్ళాన్ని మేము అనధికారంగా ఆక్రమించలేదు. చివరివరకూ దాన్ని రుజువుచేసుకోటానికి సిద్ధంగా వున్నాం.

అక్షయ్ : యేమిటి విపిన్‌బాబూ ! అయితే బ్రహ్మచారి సమితిని - శాశ్వతంగా——

రసిక్ : లేదు. లేదు. నువ్వు భ్రమపడుతున్నావ్ అక్షయ్ !

అక్షయ్ : మళ్లీ భ్రమా ? యివాళేమిటి అందరూ భ్రమపడేరోజులాగుందే !

భ్రమతోడ దినమెల్ల భ్రాంతిమయమైపోయె
భ్రాంతవాయువులోలయ భ్రమయనెడు పూదీవ
పూలమంజరులతో పుష్పమయమవుగాక
భ్రాంతిసాగరపరివ్యాప్తముగ నానంద
వీచికలు తీరాల వెల్లివిరియునుగాక.

రసిక్ : యిదేమిటి ? జగత్తారిణి వస్తోందే ?

అక్షయ్ : వస్తావని అనుకున్నదేగా ! వారు 'కుమార్టులి' అడ్రస్‌కి వెళ్లరు.

[జగత్తారిణి ప్రవేశిస్తుంది. శ్రీశ్, విపిన్ సాష్టాంగ నమస్కారాలు చేస్తారు. యిద్దరికీ చెరొక మొహరీయిచ్చి జగత్తారిణి ఆశీర్వదిస్తుంది. జనాంతికంగా అక్షయ్‌తో జగత్తారిణి మాట్లాడుతుంది]

అక్షయ్ : మీరివాళ సంతృప్తిగా తినలేదనీ——అన్నీ అలాగే వొదిలేశారనీ అంటున్నారామె.

శ్రీశ్ : మేము రెండుసార్లు అడిగి పెట్టించుకొని తిన్నాం.

విపిన్ : విస్తట్లో మిగిలిపోయింది మూడో కిస్తీ.

శ్రీశ్ : దాన్ని అలా పడివుండనీయకపోతే—మేము పడివుండాల్సొస్తుంది.

జగ : (జనాంతికంగా) అయితే నువ్వు వాళ్లను కూచోబెట్టి మాట్లాడుతూండు బాబూ! నేనొస్తాను.

[వెళిపోతుంది]

రసిక్ : అహఁ. యిది చాలా అసందర్భమయింది.

అక్షయ్ : యేం జరిగింది?

రసిక్ : ఫలహారంమాత్రం చేసివెళ్ళిపోవచ్చునని—వివాహభయమేమీ వుండదనీ—మరీమరీ వారికి నచ్చచెప్పి తీసుకొచ్చాను. కాని—

శ్రీశ్ : అందులో యింక 'కాని'కి తావెక్కడుంది రసిక్‌బాబూ! మీరంత విచార పడటం దేనికి?

రసిక్ : అదేమిటి శ్రీశ్‌బాబూ! నేను మీకు మాటయిచ్చినతర్వాత—

విపిన్ : అది సరే. యిప్పుడేమంత మహావిపత్తులో పడేశారు మమ్మల్ని?

శ్రీశ్ : మేము కుమార్తెలిద్దరికీ యోగ్యులం కావాలని ఆమె మమ్మల్ని ఆశీర్వదించారు.

రసిక్ : కాదు. కాదు. విపిన్‌బాబూ! యిదేమీ ప్రయోజనకరమైన మాటకాదని మీరు తప్పనిసరిగా యేదో మర్యాదకొద్దీ -

విపిన్ : రసిక్‌బాబూ! మమ్మల్నిగురించి 'తప్పనిసరిగా' అంటూ అనుచితంగా ఆలోచించకండి.

రసిక్ : తప్పనిసరి కాకపోతే యేమిటండీ? అలా యేమయినాసరే కావటానికి వీల్లేదు. అంతగా అయితే నేనా కుర్రాళ్ళనిద్దర్నీ వనమాలి గుప్పిట్లోంచి వొదిలించి—కుమార్‌టులీనుంచి యిప్పుడయినా తీసుకురాగలను—

శ్రీశ్ : మేము తమయెడల యేమపరాధం చేశాం రసిక్‌బాబూ!

రసిక్ : కాదు. కాదు. యిది అపరాధమని కాదు. మీరు పెద్దమనుషులు. బ్రహ్మచర్యదీక్ష నవలంబించారు. నా ప్రార్థనమూలంగా పరోపకారంచేదామని వచ్చి—చివరకు.

విపిన్ : చివరకు మాకు మేం వుపకారం చేసుకోవటాన్ని మీరు సహించలేకుండా వున్నారు. యెంత శ్రేయోభిలాషులైన మిత్రులూ !

శ్రీశ్ : మేము దేన్ని సౌభాగ్యంగా భావించామో దాన్నుంచి మమ్మల్ని విడదీయాలని ప్రయత్నిస్తారెందుకు మీరు ?

రసిక్ : చివరకు నన్ను తప్పుపట్టొద్దు.

విపిన్ : తప్పకుండా పడతాం—మీకు స్థిరమనస్కులై శుభకార్యంలో సహాయపడక పోతే—

రసిక్ : నేనిప్పటికీ హెచ్చరిస్తున్నా.

గతం తద్గాంభీర్యం తటమపి చితం జాలికశతై :
సఖే హంసోత్తిష్ఠ త్వరితమముతోగచ్ఛ సరసః

శ్రీశ్ : యేమీకాదు. మీరెంత సంస్కృత శ్లోకాలు దంచినా హంసలు యేమయినాసరే యిక్కణ్ణించి కదలవు.

రసిక్ : చోటు చెడ్డది నిజమేకాని, కదిలే అవకాశంలేదు. నేను కదలకుండా కూచున్నాను. అహహా !

అయి కురంగ ! తపోవన విభ్రమాత్
ఉపగతాసి కిరాతపురీమిమాం.

[భృత్యుడు ప్రవేశిస్తాడు]

భృత్యుడు : చంద్రబాబొచ్చారు.

అక్షయ్ : యిక్కడికే వెంటబెట్టుకుని తీసుకురా.

[భృత్యుడు వెళిపోతాడు]

రసిక్ : ఏకంగా చోరుల్నిద్దర్నీ సబ్ యిన్‌స్పెక్టర్ చేతి కప్పగించండి.

[చంద్రబాబు ప్రవేశిస్తాడు]

చంద్ర : యేమిటి మీరందరూ యిలా వచ్చేశారు ? పూర్ణబాబుకూడా కన్పిస్తున్నారు.

అక్షయ్ : చిత్తం. నేను పూర్ణనుకాను. అయితే అక్షయ్ణి.

చంద్ర : అక్షయ్‌బాబూ ! మీరుండటం మంచిదే. మీ అవసరంకూడా వుంది.

అక్షయ్ : నాలాంటి అనవసరమైన వ్యక్తిని యే అవసరానికి వుపయోగిస్తే దాన్నే నిర్వ ర్తిస్తాను. యేంచెయ్యాలో చెప్పండి.

చంద్ర : నే నాలోచించి చూశాను. మన సమితిలో బ్రహ్మచర్యవ్రత నియమాన్ని యెత్తి వెయ్యకపోతే—సమితివి చాలా సంకుచితపరచటమవుతోంది. శ్రీశ్ బాబుకి, విపిన్ బాబుకి యీ విషయాన్ని బాగా నచ్చచెప్పాలి.

అక్షయ్ : చాలా కష్టమైన పని. నావల్ల అవుతుందో కాదో సందేహం.

చంద్ర : వొకసారి యేదో ఆశయాన్ని మంచిదిగా భావించి స్వీకరించాం కదా అని, దాన్ని యిహ విడిచిపెట్టలేకపోవటం సముచితం కాదు. ఆశయంకంటె విచక్షణా శక్తి ముఖ్యమైనది. శ్రీశ్ బాబూ, విపిన్ బాబూ—

శ్రీశ్ : మాకాట్టే చెప్పటం అనవసరం.

చంద్ర : యెందుకని? మీరు సహేతుకమైనదాన్నికూడా చెవిని పట్టించుకోరా?

విపిన్ : మేము మీ ఆశయానికి అనుగుణంగానే—

చంద్ర : నా ఆశయం వొకప్పుడు భ్రాంతిమూలకమైనది అన్నమాట వొప్పుకుంటు న్నాను. మీ ఆశయం యిప్పటికీ యింకా అదేనా?

రసిక్ : యిదుగో పూర్ణబాబొస్తున్నారు...రండి రండి.

[పూర్ణ ప్రవేశిస్తాడు]

చంద్ర : పూర్ణబాబూ! మీ సూచనప్రకారం మన సమితినుంచి బ్రహ్మచర్యవ్రత నియ మాన్ని యెత్తివేయటానికే మన మిక్కడ సమావేశమయినాం. కాని శ్రీశ్ బాబు, విపిన్ బాబు దృఢప్రతిజ్ఞాబద్ధులైవున్నారు. యిప్పుడు వారికి నచ్చజెప్పగలిగితే—

రసిక్ : వారికి నచ్చజెప్పటంలో నేను పొరపాటుచేయలేదు చంద్రబాబూ!

చంద్ర : మీలాంటి వక్త కనక ఫలితం పొందలేకపోయారంటే—

రసిక్ : ఫలితాన్ని పొందాను—'ఫలేన పరిచీయతే'

చంద్ర : మీరంటున్నదేమిటో సరిగ్గా అర్థం చేసుకోలేకపోతున్నాను.

అక్షయ్ : యిదుగో రసిక్ దా! చంద్రబాబుకి బాగా స్పష్టంగా బోధపడేట్లు చెప్పటం అవసరం. నేను రెండు ప్రత్యక్ష ప్రమాణాలను యిప్పుడే తీసుకొచ్చి హాజరు పరుస్తాను.

శ్రీశ్ : పూర్ణబాబూ ! బాగా వున్నారుకదా !

పూర్ణ : ఆఁ...

విపిన్ : మీరు కొంచెం చిక్కినట్లు కన్పిస్తున్నారు.

పూర్ణ : అహఁ. యేం లేదు.

శ్రీశ్ : మీపరీక్ష కింక వ్యవధి లేదుగా !

పూర్ణ : లేదు.

[నృపబాల, నీరబాలను తీసుకుని అక్షయ్ ప్రవేశిస్తాడు]

అక్షయ్ : (నృపబాల—నీరబాలతో) వీరు చంద్రబాబు. మీకు గురుతుల్యులు. వీరికి నమస్కరించండి.

[నృప—నీర నమస్కరిస్తారు]

చంద్రబాబూ ! నూతన నియమానుసారం వీరిద్దరూ మీ సమితిలో సభ్యులవుతారు.

చంద్ర : చాలా సంతోషం. వీరెవరు ?

అక్షయ్ : నాకు వీరితోవున్న సంబంధం ఘనిష్ఠమైనది. వీరిద్దరూ నా మరదళ్ళు శ్రీశ్ బాబు, విపిన్‌బాబులతో వీరి సంబంధం శుభముహూర్తంలో మరింత ఘనిష్ఠం కాబోతుంది. వీరికేసి చూడండి. యీ యువకు లిద్దరి అభిప్రాయాలలో పరివర్తన రానటం కేవలం రసికబాబు వాక్చాతుర్యంవల్లకాదని తెలిసిపోతుంది.

చంద్ర : చాలా ఆనందదాయకమైన విషయం.

పూర్ణ : శ్రీశ్‌బాబూ ! చాలా సంతోషం. విపిన్‌బాబూ మీరు గొప్ప అదృష్టవంతులు. అబలాకాంతబాబు అదృష్టంకూడా పండిందనే ఆశిస్తాను. వారికీ వాక—

[నిర్మల ప్రవేశిస్తుంది]

చంద్ర : నిర్మలా, వింటే ఆనందిస్తావ్. శ్రీశ్‌బాబు, విపిన్‌బాబులతో వీరి వివాహ సంబంధాలు నిశ్చయమయినాయి. అయితే బ్రహ్మచర్యవ్రత నియమాన్ని యెత్తి వేయాలన్న ప్రస్తావన తీసుకురావటమే అనవసరం.

నిర్మల : కాని అబలాకాంతబాబు అభిప్రాయాన్ని తీసుకోవటం జరగలేదు. వారిక్కడ కనపడరే !

చంద్ర: సరైన మాట! యిది నేను మరచేపోయాను. వారివాళ యింతవరకూ రానే లేదెందుకని?

రసిక్: కాని విచారించకండి. వారిలో పరివర్తనచూసి మీరు మరింత ఆశ్చర్యపడతారు.

అక్షయ్: చంద్రబాబూ! యీసారి నన్నుకూడా మీదళంలో చేర్చుకోండి. సమితి యింత ఆకర్షణీయమైపోయినప్పుడు, యిహ నన్ను విడిగా వుంచలేరు.

చంద్ర: మిమ్మల్ని పొందటం—మా అదృష్టం.

అక్షయ్: నాతోపాటు మరోవ్యక్తి కూడా సభలో చేరుతారు. యివాళ సమావేశానికి వారిని యెంత ప్రయత్నించినా తీసుకురాలేకపోయాను. వారిప్పుడంత సులభంగా రారు. వాసగృహంలో పూర్వపు బ్రహ్మచారి సభ్యుడికి సాధ్యమయినరీతిగా తిలోదకాలిచ్చి ఆతర్వాత కన్పిస్తారు. ఇహ మిగిలిన చివరి సభ్యులుకనక వస్తే—మన బ్రహ్మచారి సమితి సమావేశం పూర్తిగా సమాప్త మవుతుంది.

[శైలబాల ప్రవేశిస్తుంది]

శైల: (చంద్రబాబుకి నమస్కరించి) నన్ను క్షమించండి.

శ్రీశ్: యిదేమిటి? అబలాకాంతబాబు—

అక్షయ్: మీరు ఆశయాన్ని మార్చుకున్నారు. యీమె వేషాన్నిమాత్రం మార్చుకున్నది.

రసిక్: శైలజ—భవాని—యిన్నాళ్ళూ కిరాతవేషం ధరించివుంది. యివాళ యీమె మళ్లీ తపస్విని వేషం స్వీకరించింది.

చంద్ర: నిర్మలా! నాకేమీ అర్థం కావటంలేదు.

నిర్మల: అన్యాయం! చాలా అన్యాయం! అబలాకాంతబాబు—

అక్షయ్: నిర్మలాదేవి సరియైన మాటన్నారు. అన్యాయం! కాని అది విధాత చేసిన అన్యాయం. యీమె అబలాకాంతబాబు అయివుంటేనే బావుండేది. కాని విధాత యీమెను విధవను చేసి యే శుభాన్ని సాధించాడో—ఆ రహస్యం మన కగోచరం.

శైల: (నిర్మలతో) నే నన్యాయం చేశాను. ఆ అన్యాయానికి ప్రతీకారం నావల్ల జరుగుతుందా? రేపు అన్నీ పరిష్కృతమయిపోగలవని ఆశిస్తాను.

పూర్ణ : (నిర్మలదగ్గిరికొచ్చి) ఈ సందర్భంలో మిమ్మల్ని క్షమాపణ కోరుకుంటున్నాను. చంద్రబాబు వృత్తాంతంలో నేను వ్యక్తంచేసిన ఆసక్తి చూడండి—దాన్ని నేనలా వ్యక్తం చెయ్యటం అనుచితమే. నావంటి అయోగ్యుడు—

చంద్ర : యేమీకాదు పూర్ణబాబూ! మీ యోగ్యతను నిర్మల కనక గ్రహించలేకపోయే ట్లయితే నిర్మలకు విచక్షణాశక్తి శూన్యం అన్నమాట!

[నిర్మల తలవంచుకుని, మాట్లాడకుండా వెళిపోతుంది]

రసిక్ : పూర్ణతో—జనాంతికంగా) భయం లేదు పూర్ణబాబూ! మీ దరఖాస్తు మంజూ రయింది. ప్రజాపతి కోర్టులో డిక్రీ పొందారు. రేపు వుదయమే దాన్ని జారీచేయ టానికొస్తారు.

శ్రీశ్ : శైలబాలతో) భలే టోకరా యిచ్చారు.

విపిన్ : సంబంధానికి ముందే పరిహాసం పట్టించారు.

శైల : శైలా అని తర్వాత తప్పించుకోలేరు.

విపిన్ : తప్పించుకోవాలని కోరను.

రసిక్ : యింతటితో నాటకం పూర్తి అయింది. యిక్కడే భరతవాక్యం పలుకుదాం.

"సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణిపశ్యతు
సర్వః కామా నవాప్నోతు సర్వః సర్వత్ర నందతు."

# అనుబంధము

## తెలుగు లిపిలో కొన్ని బెంగాలీ గేయములు

### విసర్జన

ఆమి ఏకలా చలేఛి ఏభవే
ఆమాయ్ పథేర్ సన్ధాన్ కే కబే?
భయ నేఇ భయ నేఇ యాఓ ఆపన మనేఇ
యెమన ఏకలా మధుప ధేయే యాయ్
వేబల్ ఫులేర్ సౌరభే -

... ... ...

ఉలజ్గనీ నాచే రణరజ్గే।
ఆమరా నృత్య కరి సజ్గే।
దశదిక్ ఆంధార్ కరే మాతిల్ దిక్ బసనా.
జ్వలే బహ్నిశిఖా రాజా రసనా.
దేఖే మరిబారే ధాఇఛే పతజ్గే।
కాలో కేశ్ ఉడిల ఆకాశే
రబి సోమ లుకాలో తరాసే
రాజా రక్తధారా ఝరే కాలో అజ్గే
త్రిభువన వాంపే భురుభజ్గే।

... ... ...

ఓగో పురబాసీ
ఆమి ద్వారే దాండాయే ఆఛి ఉపబాసీ
హేరి తేఛి సుఖమేలా ఘరే ఘరే కత ఖేలా
శునితేఛి సారాబేలా సుమధుర బాంశి.

... ... ...

### బ్రహ్మచారి సమితి

యే పథిక్ పథేర్ భూలే
ఎల మోర్ ప్రాణేర్ కూలే
పాఛే తార్ భూల్ భేజే జాయ్
చలే జాయ్ కోన్ ఊజానే
ఆంఖి మోర్ ఘూమ్ నా జానే—

... ... ...

ఆమి కేవల్ ఫూల్ జోగాబ
తోమార్ దుటి రాజా హాతే,
బుద్ధి ఆమార్ ఖేలే నాకో
పాహారా బా మన్త్రిణాతే—

... ... ...

స్వర్గే తోమాయ్ నియే యాబే ఉడియే
పిఛే పిఛే ఆమి చలిబ ఖూంటియే
ఇచ్ఛా హాబే టివిర్ దగా ధరే
విష్ణుదూతేర్ మాథాటా దిఈ ఓడియే—

... ... ...

బార్ష్యేయ శకటే చడి నారీచూడామణి
పురబాలా చలి యబేగేలా కాశీధామే
దికాలే, కిహే హే దేబీ అమృతభాషిణీ
కోన్ బరాఙ్గనే బరి బరమాల్యదానే
యాపిలా బిచ్ఛేదమాష క్యాలిత్రయాశాకీ
శ్రీ అక్షయ- -

... ... ...

ఓగో, తోరా వే యాబి పారే
ఆమి తరీ నియే బషే ఆఛి నదీ-కినారే
ఓ పారేతే ఉపబనే కతఖేలా కతజనే,
ఏ పారేతే ధూ ధూ మరు బారి బినా రే
ఎ ఈ బేలా ఆఛే, ఆయ్ కే యాబి
మిఛే కెన కాటే కాల్ కత కీ భాబి
సూర్య పాటే యాబే నేమే, సుబాతాష్ యాబేథేమే,
ఖేయా బన్ధ హయే యాబే సన్ధ్యా-అంధారే—

... ... ...

చలేఛే ఛుటియా పలాతకా హియా
బేగే బహే శిరా ధమనీ
హాయ్ హాయ్ హాయ్ ధరిబారే తాయ్
పిఛే పిఛే ధాయ్ రమణీ
బాయు బేగభరే ఉడే అఞ్చల్
లటపట బేణీ దులే చఞ్చల్
ఎ కీ రే రఙ్గ్ ఆకుల అఙ్గ్
ఛుటే కురఙ్గగమనీ—

... ... ...

ఓ ఆమార్ ధ్యానేర్ ఇ ధన్
తోమార్ హృదయే దోలాయ్ యే హాషి రోదన్
ఆషే బసన్త, ఫోటే బకుల్
కుఞ్జే పూర్ణిమా చాంద్ హేషే ఆకుల్
తారా తోమాయ్ ఖూంజే నా పాయ్—

ప్రాణేర్ మాఝే అథ గోపన స్వపన

... ... ...

కుఞ్జ కుటీరేర్ స్నిగ్ధ అలిన్దేర్ పర్
కాలిన్ది కమలగన్ధ్ ఛుటిబే సున్దర్ :
లీనా ఏబే మదిరాక్షీ తబ అఙ్కతలే,
బహిబే బాసన్తీబాష్ బ్యాకుల్ ఉన్మనే :
తాహారే కరిబ షేబా, కబే హాబే హాయ్
కిశలయ-పాఖాఖాని దోలాఇబి గాయ్ :—

... ... ...

ఓరే సాబధాన పథిక్, బారేక్
పథ్ భూలే మర్ ఫిరే।
ఖోలా అంఖి దుటో అన్ధకరే గో
ఆకుల్ అంఖిర్ నీరే।
హే ఖోలా పథేర్ ప్రాన్తే రయేఛే
హారామో హియార్ కుఞ్జ।
ఝరే పడే ఆఛే వాంటాతరు తలే
రక్త కుసుమ్ పుఞ్జ।
షేథా దుఈబేలా భాఙా-గడా ఖేలా
అకూల్ సిన్ధుతీరే।—

... ... ...

ఆ పనార్ ఓ గాన్‌టా మనే ఆసే
తర ఆమార్ హతాత్ ఓ బే యాడ్
కోన్ పాఖారే కోన్ పాషాణేర్ ఘాయ్,
నవీన్ తరీ నతున్ చ
దిఇని పాడి అగాధ్ జలే
బాహి తారే ఖేలార్ ఛలే కినార్ కినారాయ్
తరీ ఆమార్ హతాత్ ఓచే యాడ్
భేసే ఛిల స్రోతేర్ ధరే
ఏకా ఛిలేమ్ కర్ణ ధరే
లేగే ఛిల పాలేర్ పరే మధుర మృదు బాయ్
సుఖే ఛిలేమ్ ఆపన్ మనే
మేఘ్ ఛిలనా గగన్ కోణే
లాగబే తరీ కుసుమ్‌బనే, ఛిలేమ్ సే ఆశాయ్
తరీ ఆమార్ హతాత్ ఓచే యాడ్।

... ... ...

అలకే కుసుమ్ నా దియో
శుధూ శిథిల కబర బాంధియో ।
కాజలబిహీన సజల నయనే
హృదయ దుయారే ఘా దియో ।
అకుల్ ఆంచలే పథికచరణే
మరణేర్ ఫాంద్ ఫాందియో
నా కరియా బాద్ మనే యాహా సాద్
నిదయా నీరచే సాధియో ।—

... ... ...

నాహి జాని మనే కీ బాసియా
పథే బసే అఛే కే ఆసియా
యేఫులేర్ బాసే అలస బాతాసే
హృదయ దితేఛే ఉదాసియా
యేతే హాయ యది చలో నిరవధి
సేఇ ఫులబన్ తలాశియా—

... ... ...

సే గామ్భీర్య గేల కొథా, నదీతట హేరో హోథా
జాలికేరా జాలే ఫేలే ఘిరే—
సఖే హంస ఓఠో ఓఠో సమయ థాకితే ఛోటో
హేథా హతే మానసేర్ తీరే —

సూచన :— వంగభాషలో పదాది హల్లుమీది 'అ' కారాన్ని 'ఒ' కారంగా ఉచ్చరించాలి. అలాగే 'వ' కారాన్ని 'బ' కారంగానూ, సామాన్యంగా 'య' కారాన్ని 'జ' కారంగానూ ఉచ్చరించటం సంప్రదాయం. ఉదాహరణకు — రవీన్ద్ర — అని వ్రాస్తారు కాని చదివేటప్పుడు 'రొబీన్ద్ర' అని ఉచ్చరిస్తారు. 'యాయ్' అని వ్రాస్తారు 'జాయ్' అని ఉచ్చరిస్తారు.